# గుర్తుంచుకోండి, పోషణనిచ్చే సమపాళ్ళలోని ఆహారాన్నివ్వకపోతే జరిగేదిది-మీ పాప విటమిన్, మినరల్ వీటి లోపానికి గురికావచ్చు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

విటమిన్‌లు, మినరల్స్ సమపాళ్ళలో ఉన్నట్లయితే పోషక పదా...ను హరించుకొనడంలో తోడ్పడతాయని మీకు తెలు... ఇది, మీ పాపాయి కొరతకు గురి కాకుండా చూస్తుంది.

మీ డాక్టర్‌ని అడగండి. ఈ విటమిన్‌లనూ, మినరల్స్‌నూ పొందేందుకు పోషణ రూపేణా సమతూకంలోని ఆహారమే ఉత్తమ మార్గమని మీ డాక్టర్ చెబుతారు. అటువంటి సమతూకమైన పోషకాహారంలో ప్రొటీన్లూ, కార్బోహైడ్రేట్లూ, కొవ్వుపదార్థాలు, ఇనుము, కాల్షియం కూడ సరైన పాళ్ళల్లో ఉంటాయి-ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు, ప్రతి రోజు క్రమం తప్పకుండా రోజు రోజూ లభించాలి.

చాలా మంది తల్లులకు మామూలుగా పారంపర్యంగా యిచ్చే ఆహా...ంతో యిలా సమతూక ఆహారం యివ్వడం సాధ్యం కాని ...

...రిష్కారం ?

...్, ఇది పాపాయిలకు యిచ్చేందుకు పోషణ రూపేణా ...కమైన ఘన ఆహారం. వారికి నాలుగు నెలల నుంచి ...ందుకు. ఎందు కంటే, పిల్లలకు ఆ వయసు నుంచి పాలు ...ే చాలవు.

...ాక్ ఎ.డి.సి.బి కాంప్లెక్స్ మరియు 'ఇ' విటమిన్లతో ...కం చేయబడింది. దీనిలో ప్రొటీన్లూ, కొవ్వ...ూ, కార్బోహైడ్రేట్లూ, ఇనుము, కాల్షియం కూడా ...-అన్నీ మంచి సమపాళ్ళలో. దాని రుచి పిల్లలకు ...ిష్టం.

... పోషణ నిచ్చే సమతూకంలోని సెరిలాక్ సమకూర్చే ...న్నింటిని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 ...రాగానే వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ ... అదనపు ప్రయోజనాన్ని పాపాయికి సమకూర్చుంది.

...క మీద యివ్వబడిన సూచనలను దయచేసి పాటించండి.

---

ఉచితం సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి : సెరిలాక్, పోస్ట్ బ్యాగ్ నం. 21, న్యూ ఢిల్లీ-110 029

---

నెస్లె వారి నాణ్యమైన ఉత్పాదన




మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

Mudra:D:NES:0019:TEL

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------ కూపన్ ------------

**అక్టోబర్ చతుర నవల 'క్షమ'**

సమీక్షకుని పేరు : ..............................................

చిరునామా : ..............................................

..............................................

..............................................

..............................................

# చమత్కార కతలు

## నర్సాపూర్ కుర్చీ

జంబునాథంకు గత పదేళ్ళుగా ఒక తీరని కోరిక అలాగే మిగిలిపోయింది. అది మరీ తీర్చుకోలేని గొంతెమ్మ కోరికేం కాదు. జంబు ఓ మధ్యతరగతి ఉద్యోగి. కొంచెం కష్టపడితే ఆ కోరిక సులువుగానే తీరుతుంది కూడాను.

కానీ, జంబుకీ పొదుపుకీ చాలా పెద్దలింకు ఉంది. ''పొదుపు చేయండోచ్!'' అంటూ ఎలుగెత్తి నేషనల్ సేవింగ్స్‌వారి ద్వారా ఘోషపెట్టే ప్రభుత్వ ప్రచారానికి తగిన విధేయుణ్ణి చూపించమంటే ఇదిగో, ఈ జంబునాథాన్నే చూపించి, ప్రైజుకొట్టేయొచ్చు.

ఏతావాతా తేలిందేమంటే జంబునాథం బహుపొదుపరి! డబ్బు తప్పనిసరైతే తప్ప ఖర్చుపెట్టే ప్రశ్నేలేదు. పోనీ అంటే, పూర్వకాలంలో రెక్కలు కట్టుకుని ఎగిరివచ్చి, వరాలను గుప్పించే దేవుళ్లూ, గంధర్వ కన్యలూ ఈ కలికాలంలో లేరు గదా ఖర్మ! మరి జంబు ఆకాంక్ష తీరేదెలా? ఇంతకీ మన హీరోగారి కోరిక ఏమిటంటే మరీ పెద్దదేం కాదు. జంబుకి ఊహ తెలిసినప్పటినుండీ 'నర్సాపూర్‌కుర్చీ' తన స్వాధీనంలో ఉండాలని ఒకటే తపన.

చిన్నప్పుడు వాళ్లింట్లో ఆ పల్లెలో ఒక 'నర్సాపూర్ కుర్చీ' ఉండేది. దానిని వసారాలో వేయించుకుని తన తండ్రి మాత్రమే అందులోకూర్చుని కరణీకం చేసేవాడు. పిల్లలూ, ఇంకెవరైనా కూర్చుంటే, తల్లి బ్రహ్మప్రళయాన్ని సృష్టించేది. అడపాదడపా తండ్రిలేనప్పుడు దొంగచాటుగా అందులో కూర్చుని, ఏదో విక్రమార్కుని సింహాసనంలో కూర్చున్నంత ఆనందాన్ని, అనుభూతిని ఆస్వాదించేవాడు మన చిట్టిపొట్టిబాల జంబునాథం. పెద్దయిన తర్వాత తండ్రిపోయాక చేసిన పంపకాలలో ఆ నర్సాపూర్ కుర్చీ అన్నగారికి హక్కు భుక్తమైపోయింది, పెద్దవాడు గనుక. ''నువ్వు బస్తీలో ఉద్యోగం చేస్తున్నావు గదా! ఈ కాలపు ఫ్యాషన్‌లకు తగ్గట్టుగా ఫర్నిచర్లూ, సోఫాలూ కొనుక్కో!'' అనేది పెద్దల సలహా!

ఆ విధంగా జంబు కోరిక నెరవేరలేదు.

★ ★ ★

అయితే ఈమధ్య అనుకోకుండా అతని చిన్ననాటి స్నేహితుడు నాగప్ప తటస్థపడ్డాడు. అతను బాగా చెయ్యి తిరిగిన వడ్రంగి.

అతన్ని చూడగానే తన 'మధుర వాంఛ'కు చిత్రిక పట్టడం మొదలుపెట్టాడు జంబునాథం.

జంబు చెప్పిన ఐడియా ప్రకారం నాగప్ప, కుర్చీని అద్భుతంగా తయారుచేశాడు. అతనికీ సరిగ్గా తెలియదు.

మొత్తం మీద డబ్బు బాగా వదిలినా 'నర్సాపూర్‌కుర్చీ'ని మించిన కుర్చీ తయారై వచ్చింది.

దిగ్విజయాన్ని సాధించిన సామ్రాట్టులా మహదానందంతో ఓ చిన్న లారీలో స్వగ్రామం నుండి దిగాడు జంబునాథం ఓ సుదినాన. భార్య ఆశ్చర్యపోతూ, తొంగిచూసింది.

షాజహాన్ మయూర సింహాసనమంత పెద్ద కుర్చీని నలుగురు కూలీలు మోసుకొచ్చి ముందుగదిలో పెట్టారు. జంబు అయిదు రూపాయలు ఇవ్వబోతే, ''ఇంత బరువును తెచ్చాంబాబూ! మా కష్టానికి కిట్టదు'' అంటూ పది రూపాయలు వసూలు చేసి దణ్ణాలు పెట్టేసి, వెళ్లిపోయారు.

విజయగర్వంతో కాలర్ ఎగరేస్తూ, భార్య వైపు చూశాడు జంబు.

కానీ, శ్రీమతి ముఖారవిందంలో జంబు ఆశించిన ఫీలింగ్స్ కనపడలేదు.

''మనం ఉండే ఈ ఒకటిన్నర గది అద్దె కొంపలో ఇంత పెద్ద కుర్చీని పెట్టుకునేందుకు చోటేదీ? నా నెత్తిన పెట్టండి, సరిపోతుంది!''

---

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: శివసత్యమూర్తి



అంది ఆవిడ ధుమధుమలాడుతూ.

నిజమే! తనా సంగతే ఆలోచించలేదు. ఇప్పుడీ కుర్చీ పక్కన ఒక సన్నటి మనిషి నడవగలిగే స్థలమే మిగిలి ఉంది ఆ ఉన్న ఒక్క ముందు గదిలోనూ.

★ ★ ★

తర్వాత మూడు నెలలలా ఇబ్బందిగా గడిచిపోయాయి. ఓసారి జంబు క్యాంపుకెళ్లి వారం తర్వాత వచ్చేసరికి గృహాంగణంలో రెండు స్టూళ్లూ ఒక టీపాయ్ దర్శనమిచ్చాయి. తేరుకుని చూసేసరికి అవి నర్సాపూర్ కుర్చీ రూపాంతరాలేనని ఇట్టే అర్థం అయిపోయింది.

జంబు శ్రీమతి పాపం చాలా కష్టపడి వడ్రంగి దగ్గర కూర్చుని మరీ చేయించిందట. నర్సాపూర్ కుర్చీ రూపుమార్చుకుని ఎత్తిన ఈ మూడు కొత్త అవతారాలను దర్శిస్తూ "ఇప్పుడు గదినిండుగా ఉంది గదండీ" అనే భార్య మాటలకు ఖిన్నుడవుతూ నిలువునా నిలబడిపోయాడు జంబునాథం !!!

– పి. కుసుమకుమారి

## టోపీ

శంకర్రావు చిరకాలంగా తిరుపతి వెళ్లిరావాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు. చివరకు ప్రభుత్వంవారిచ్చే ఎల్టీసీ పుణ్యమా అని కుటుంబసమేతంగా బయల్దేరి తిరుపతి వెళ్లి మొక్కుతీర్చుకున్నాడు.

తిరుగు ప్రయాణానికిముందు అతని భార్య పార్వతి పిల్లలిద్దరూ సరదా పడుతున్నారని ఫెల్ట్ హేట్స్ కొనిపించింది. వాళ్లతోబాటు తనూ ఓ టోపీ కొనుక్కున్నాడు శంకరం, ఏడు కొండలవాడికి సమర్పించుకోవటంతో తల మరీ బోడిగా వుందని!

అయితే ఆ టోపీ బాగా బిగుతుగా వుండటంతో గాలి ఆడక గుండుమీద చెమటలుపట్టి ఇబ్బందిగా అనిపించి దాన్ని తీసి ఒళ్లో పెట్టుకున్నాడు.

బస్ ప్రయాణం ఆహ్లాదకరంగానే వుంది. కిటికీలోనుంచి వచ్చే చల్లటి గాలి జుట్టులేని నెత్తిమీద హాయిగా తగుల్తుంటే ఆనందంగా నిద్రలోకి జారిపోయాడు శంకరం.

అకస్మాత్తుగా బస్ ఆగిపోవటం, బస్‌లో జనం హాహాకారాలు చెయ్యటం వినిపించి నిద్రనుంచి చటుక్కున మేల్కొన్నాడు శంకరం. పార్వతి, పిల్లలు అప్పటికే గాఢంగా నిద్రపోతూ వున్నారు. ఏం జరుగుతున్నదో అర్థంచేసుకోవటానికి రెండు నిమిషాలు పట్టింది శంకరానికి.

బస్‌లో తుపాకీలు చేత ధరించిన ఇద్దరు జమాజెట్టీల్లాంటి మనుషులు నించుని వున్నారు. కింద మరో ఇద్దరున్నారు కాపలాకాస్తూ.

"కదిల్తే కాల్చేస్తాం! ఎవ్వరైనా సీట్లోంచి లేవటంగాని, కదలటంగాని చేశారంటే నిర్దాక్షిణ్యంగా చంపేస్తాం" అంటున్నారు వాళ్లు.

శంకరానికి పరిస్థితి అర్థమైపోయింది. బందిపోట్లు, దారిదోపిడి!

వాచీ చూసుకున్నాడు. అర్థరాత్రి రెండు గంటల పదినిమిషాలు. అందరు గాఢనిద్రలో మునిగిన సమయం! బస్ రోడ్ పక్కగా ఆపి ఉంది. చుట్టూ చెట్లు, పుట్టలు, గుట్టలు. చిమ్మచీకటి! రోడ్‌మీద ఎక్కడా వాహనాలు తిరుగుతున్న జాడ లేదు. నిర్మానుష్యమైన ప్రదేశం!

అప్పటికే బస్‌లోని వారందరూ భయంతో ఆందోళనతో బిగుసుకుపోయున్నారు. కొందరు దుఃఖిస్తుంటే మరికొందరు నిర్వికారంగా కూచుని వున్నారు.

డ్రైవర్‌కి ఒకడు తుపాకీ గురిపెట్టి నిల్చున్నా






డు. కండక్టర్ చేతులెత్తేశాడు. అతని క్యాష్‌బాగ్ తుపాకీ బారెల్‌కి తగిలించివున్నది. భయంతో వణికిపోతున్నాడు.

ఓ బందిపోటు పెద్ద గోతాంలాంటి సంచీ తీసుకుని ప్రతి సీటు దగ్గర ఆగుతున్నాడు. కళ్లతోనే శాసిస్తున్నాడు. మగవాళ్లు అందరూ మనీపర్సులు, ఉంగరాలు, ఆడవాళ్లు గొలుసులు, గాజులు భయంభయంగా సంచీలో వేస్తున్నారు, మారుమాట్లాడకుండా.

ఆ బందిపోటు వీళ్ల దగ్గిర యింక ఏమీ లేవని నిర్ధారించుకున్న తర్వాత మరో సీటు దగ్గరకు వెళ్తున్నాడు. అతనికి తోడుగా మరో బందిపోటు పక్కనే తుపాకీ పట్టుకుని నడుస్తున్నాడు.

శంకరానిది లాస్ట్ సీటుకి ముందు సీటు! భార్య మెడలో నల్లపూసలు కూర్చిన బంగారు తాడు, భారతీ చెయిన్, కూతురు మెడలో ఓ చెయిను, భార్య చేతులకి నాలుగు బంగారు గాజులు, కొడుకులిద్దరి చేతులకు బంగారు చెయిన్ వాచీలు మొత్తం పది పన్నెండు కాసులకు తక్కువ కాకుండా వుంది బంగారం. ప్రయాణాల్లో బంగారు నగలెందుకని ఎన్నోసార్లు మందలించాడు భార్యని. కాని, పార్వతి వినదు. ఈసారీ వున్న నగలన్నీ వేసుకుని బయల్దేరింది. ఇంట్లో తాము లేని సమయం కనిపెట్టి దొంగలు దోచుకుపోతారని ఆమె భయం! ఇంట్లో దొంగలు పడటం మాటేమోగాని, దారిదోపిడిలో అన్నీ పోయేలా వున్నాయి.

దొంగలు ముందుకు వస్తున్నారు. ఇక మూడు వరసల సీట్లు మాత్రమే వున్నాయి తమ ముందు.

శంకరం మెదడులో మెరుపులు మెరిశాయి.

అంతే! తక్షణం తన ఆలోచన ఆచరణలో పెట్టేశాడు. నిద్రమత్తులో ఉన్న భార్యకి వెంటనే అర్థంకాలేదుగానీ అర్థం అయిన మరుక్షణం మెరుపువేగంతో భర్తకి సహకరించింది.

దొంగలు శంకరం సీటు దగ్గరకొచ్చి నిద్ర నటిస్తున్న అతన్ని కుదిపి "ఊఁ! పడెయ్యి" అన్నారు. శంకరం కళ్లు నులుముకుని తన వాచీ, కొంత కేష్ తీసి వాళ్ల సంచీలో పడేశాడు.

దొంగలు అసంతృప్తిగా చూశారు.

"బంగారు నగలేమీ లేవా?" అనడిగారు అనుమానంగా.

శంకరం గొంతు పెగుల్చుకుని, "లేవు సార్! కావాలంటే మమ్మల్ని పరీక్షించుకోండి!" అన్నాడు ఏడుపుమొహంతో.

దొంగలు శంకరంని, అతని భార్యని, పిల్లల్ని వాళ్ల సూట్‌కేసుల్ని బాగ్‌లని చెక్‌చేసుకుని ఏమీ లేవని సంతృప్తిపడి, తర్వాత సీటుకి వెళ్లి పని పూర్తి చేసుకున్నారు. ఓసారి టార్చ్‌లైట్లు ఫోకస్‌చేసి, ఏమైనా వస్తువులు సీట్లకింద దాచారేమోనని చూసుకుని, మెరుపువేగంతో బస్ దిగి చీకట్లో మాయమైపోయారు.

బస్ తిరిగి బయల్దేరింది. అందరు దుఃఖంతో విలపిస్తుంటే శంకరంమాత్రం హాయిగా నిద్రకుపక్రమించాడు, నెత్తిమీదున్న టోపీ తడుముకుంటూ. అందులో దాచిన భార్యాపిల్లల బంగారు వస్తువులు అతని చేతికి తగిలాయి, గలగలలాడ్తూ.

–బొమ్మిడి అచ్చారావు

# చతుర ప్రపంచం

## అలిపోరు తప్పని అబ్రహాంలింకన్

ఒకప్పటి అమెరికా ప్రెసిడెంట్ అబ్రహాంలింకన్‌కి పెళ్లంటే తగని భయం. మొదటినించీ కూడా పెళ్లిని మృత్యువుతో సమానంగా భావించేవాడాయన. దానికి కారణం పెళ్లి చేసు




కొని నరకాన్ని అనుభవిస్తున్న అతని మిత్రులే కావచ్చు. "పెళ్లి తర్వాత జీవితం పరిసమాప్తమైనట్లే... అందుకే నేను పెళ్లి చేసుకోదల్చులేదు..." అని తన ఆప్తమిత్రుడైన ఒకానొక లాయర్‌కి ఉత్తరం రాశాడు లింకన్. కాని ఆ తర్వాత రెండేళ్లకే మేరీ టాట్‌తో అతని వివాహం జరిగిపోయింది. ఇంకాసేపట్లో పెళ్లి జరుగుతుందనగా- 1841 జనవరి 1న ఆ పెళ్లి తప్పించుకునేందుకు ఆత్మహత్యకు సైతం ప్రయత్నించాడతను. మిత్రులెవరో చూసి రక్షించడంతో గండం గట్టెక్కింది.

కాని వైవాహిక జీవితం అతను భయపడ్డట్లే తయారైంది. మేరీ టాట్ అతన్ని అనుక్షణం రాచిరంపాన పెట్టేది. భర్తతో పోట్లాడుతూ కోపం పట్టలేక వేడివేడి కాఫీని అతని ముఖాన విసిరికొట్టేదామె. తనేమో నవనాగరిక యువతి కాగా, అతను మాత్రం అతి నిరాడంబరంగా జీవించే పల్లెటూరి గబ్బిలాయి కావడమే ఆమె అసంతృప్తికి అసలు కారణం. కాని లింకన్ మాత్రం రాక్షసిలాంటి మేరీ టాట్‌తో 23 ఏళ్లపాటు చాలా ఓర్పుతో కాపురం చేశాడు. అమెరికా ప్రెసిడెంట్ హోదాలో ఉంటూ, అనుక్షణం ఎన్నో వత్తిడులకు లోనవుతూ కూడా ఇంతింత కాని తన 'ఇంటిపోరు'ని ఆ మహానుభావుడు ఎలా తట్టుకొన్నాడో! అయితే లింకన్ మరణానంతరం మేరీ దాదాపు పిచ్చిదే అయిపోయింది. ఆమె శేషజీవితమంతా పిచ్చాసుపత్రిలోనే గడిచిపోయింది.

## 'అవినీతి' యాత్ర

ఉత్తరదేశయాత్రలు, దక్షిణదేశయాత్రలు, విదేశీయాత్రలు, విహారయాత్రలు, ప్రాచ్యదేశాలయాత్రలు, సంపూర్ణతీర్థయాత్రలు... మొదలైన యాత్రల గురించి మనందరం ఎప్పుడో అప్పుడు వినేవుంటాం. అయితే 'అవినీతి యాత్ర' పేర గ్రాస్ నేషనల్ ప్రొడక్ట్ ట్రావెల్ ఏజెన్స్‌వారు అమెరికాలో ఇటీవల ఓ సరికొత్త యాత్రను ప్రవేశపెట్టారు.

'అమెరికాలో ఎన్నోరకాల కుంభకోణాలు జరిగాయి. ఎందరో పెద్దమనుషులు వాటిలో ఇరుక్కుని పరాభవాల పాలయ్యారు. పదవులు పోగొట్టుకున్నారు. వాటర్‌గేట్ కుంభకోణంలో ఇరుక్కుని తన పదవిని కోల్పోయాడు నాటి అమెరికన్ అధ్యక్షుడు నిక్సన్. ఆ తతంగం అంతా ఎక్కడెక్కడ జరిగిందో చూపుతూ ఆదివారాలన్నీ పూసగుచ్చినట్లు చెబుతాడు 'అవినీతి యాత్ర' గైడు. గారీహార్ట్ అనే పెద్దమనిషి అమెరికా అధ్యక్షపదవికి పోటీ చేయాలనుకున్నాడు. కానీ ఆయనగారికి డొన్నా అనే మోడల్ గాళ్‌తో గల అక్రమసంబంధం బయటపడి ఆ ప్రయత్నం బెడిసికొట్టింది. డొన్నా-గారీహార్ట్ ప్రేమాయణం నడిపిన స్థలాలన్నీ 'అవినీతి యా




త్ర'లో పొందుపరిచారు.

ఆలివర్‌నార్త్ అనే అమెరికన్ ఉన్నతాధికారి ఆయుధాల సరఫరా విషయమై ఇరాన్‌తో రహస్యంగా బేరసారాలు సాగించాడు. తద్వారా వచ్చిన డబ్బును నికరాగువాలోని అమెరికన్ భక్తబృందాలకు పంచిపెట్టాడు. తర్వాత విచారణలో నిజాలన్నీ బయటపడడంతో అతని ఉద్యోగం ఊడింది. ఈ యాత్రలో ఆలివర్ ఇంటిని, ఆయుధ కర్మాగారాల్ని అన్నీ వివ



రంగా చూపిస్తారు గైడ్సు. అలాగే నేరస్తులు ఏయే న్యాయస్థానాలలో విచారింపబడ్డారో కూడా వారు చూపిస్తారు. ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే! ఇలాంటి కుంభకోణాల జాబితాతో ఉంటుంది 'అవినీతి యాత్ర'. దీనికి రుసుము 300 రూపాయలు మాత్రమే. మొదట్లో ఈ యాత్రలకు అంతగా ఆదరణ లభించకపోయినా తర్వాత తర్వాత బాగా పుంజుకుంది. ఇప్పుడు కనీసం ఆరునెలలు ముందుగా రిజర్వ్ చేయించుకుంటేనే తప్ప వీలులేని పరిస్థితి వుంది.

ప్రస్తుతం ఈ తరహాయాత్రల్ని రోమ్, ఫ్రాన్స్ దేశాలు కూడా ప్రారంభించాలనుకుంటున్నాయి. అడుగడుగునా అవినీతితో కుళ్లిపోయిన మనదేశంలో కూడా వీటిని ప్రవేశపెట్టవచ్చు. కానీ మన అసంఖ్యాక కుంభకోణాల చరిత్రవల్ల ఒక్కసారి యాత్ర పూర్తికావడానికి ఎన్నేళ్లు పడుతుందోగదా!

## ఇల్లు ఊడ్చేయంత్రం

ఇల్లు ఊడ్వలేదనో, ఊడిపోయిన చొక్కాగుండీలు కుట్టలేదనో పెళ్లానికి విడాకులిచ్చే పతిదేవులు పాశ్చాత్యదేశాలలో కోకొల్లలు. ఆఫీసుకు వెళ్లేప్పుడు ముద్దుపెట్టలేదనో, నిద్రలో గురకపెడుతున్నాడనో మొగుడుగారికి ఉద్వాసన పలికే సతీమణులూ అక్కడ ఎక్కువే. అల్ప విష



యాలకే కోర్టుకెక్కి పండంటి సంసారాల్ని భగ్నం చేసుకునే సంస్కృతి ఆయాదేశాల్లో పరిఢవిల్లుతున్నదన్న విషయం మనకు తెలియందికాదు.

అలాంటి వారికోసం వరప్రసాదంలా విచ్చేసింది 'స్వీపీ'. 'స్వీపీ'రాకతో ముఖ్యంగా ఇంటి శుభ్రత విషయాల్లో విడాకులుపుచ్చుకునే వారి సంఖ్య గణనీయంగా తగ్గిపోయింది. స్వీపీ అనేది జపాన్‌వారు తయారుచేసిన ఓ రోబోట్. ముందుగా సెట్ చేసిన టైమ్‌కి దానంతట అదే లేచి ఇల్లంతా ఊడుస్తుంది. మూలమూలల దాగివున్న సాలెగూళ్లను తొలగించి ఇంటిని అద్దంలా తయారుచేస్తుంది. పనికిరాని చెత్తనంతా తీసుకుపోయి దూరంగా పారేస్తుంది. రిమోట్ కంట్రోలుతో పనిచేసే ఈ రోబట్ కేవలం ముప్పై నిముషాల్లో ఆరు పెద్ద గదులున్న ఇంటిని చక్కగా శుభ్రం చేసేస్తుంది. మీరూ కొనేద్దామనుకుంటున్నారుగదూ? జస్ట్‌మినిట్... దీన్ని వెల కేవలం ఒక కోటీ పదిహేను లక్షల రూపాయలేనట....!

చతుర

సంపుటి : 14 సంచిక : 9 అక్టోబర్ 1991

''పతిదేవుని మురిపించే వలపులవీణా- జీవితమే పండించే నవ్వుల వాన'' అన్న కవి వాక్యాల్ని నిజంచేస్తూ అతని జీవితంలో వెన్నెలైకురిసి అంతలోనే కనుమరుగైందామె! బంధుమిత్రుల వత్తిడికి తలవంచి తన సంసార రథాన్ని నడిపేటందుకు మరో మగువకు అవకాశమిచ్చాడతను. కానీ అతని ఔన్నత్యాన్నీ, గాంభీర్యాన్నీ అర్థంచేసుకోలేని ఆ దుందుడుకు స్వభావిని ముళ్ళబాటవైపే వారిని నడిపించింది.

ముత్యాల్లాంటి ముగ్గురు పిల్లల్నీ దైవం లాంటి భర్తనీ అవమానాలకి గురిచేస్తూ ఆమె తీసుకున్న నిర్ణయం ఏమిటి?

తన వాళ్ళని రంపపుకోతకి గురిచేసి ఆమె ఏం పొందగలిగింది? బదులుగా ఏం కోల్పోయింది? మానని గాయాలు రేపిన ఆమెపట్ల అతను వ్యవహరించిన తీరు ఎలాంటిది?

మహోన్నతమైన మానవత్వపు విలువలకూ, వ్యక్తుల బలహీనతలకూ, స్వార్థాలకూ దర్పణం పడుతూ, చక్కని చిక్కని కథా కథనంతో **తనికెళ్ళ కళ్యాణి** ఆసక్తికరంగా మలచిన **'క్షమ'** ఈనెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

# క్షమ

— తనికెళ్ళ కళ్యాణి

గేటు తోసుకొని లోపలికి వస్తున్న సుందరి ఒక్కసారిగా తోట మధ్యలోనే ఆగిపోయింది. ఏదో సంకోచం... చెప్పలేని భయం ఆమెను లోపలకు వెళ్లనివ్వడంలేదు. ఒక్కసారి ఆమె చూపులు తోటంతా పరిశీలించాయి.

అదే తోట! అదే సిమ్మెంట్ బెంచి. తోటలోని కళంతా రామారావుగారి వల్లనే వచ్చిందేమో! తోటను ఆయన పెంచిన తీరు అటువంటిది.

ఎప్పుడైతే ఆయన ఆలోచన వచ్చిందో ఒక్కసారి అడుగులు కూడతీసుకొని యింటివైపు నడిచింది. సన్నజాజి, నైట్‌క్వీన్ పరిమళాలు గుప్పుమంటున్నాయి.

గేటు చప్పుడుకి యివతలకు వచ్చిన మాధవి... ఆమెను చూచి నిశ్చేష్టురాలైంది. ఇన్ని సంవత్సరాల తరువాత ఊహించని సుందరి రాక మాధవిని కర్తవ్య విమూఢురాలిని చేసింది. ఆమెను ఎలా ఆహ్వానించాలో ఆమెకు అర్థంకాలేదు. ఇప్పటి పరిస్థితిలో. ఆమెరాక అగ్నికి ఆజ్యం పోసినట్లవుతుందేమో! అలా అని ఆమెను లోనికి రానివ్వకుండా నిరోధించే కుసంస్కారం తనకులేదు.

సాలోచనగా చూస్తోంది మాధవి.

లోపలనుండి వస్తున్న రఘు మాధవిని ఆ స్థితిలో ఆశ్చర్యంగా చూశాడు. "ఏం మధూ! ఎందుకలాగ బొమ్మలా నిలబడిపోయావు? ఏమిటి నిన్నంతలా నిలబెట్టిన వింత?" అంటూ ఇవతలికి వచ్చాడు.

ఎదురుగా ఉన్న సుందరిని చూచి అతనిలో ఆవేశం కట్టలు తెంచుకొంది "మళ్లీ ఏ మొహం పెట్టుకొని యిక్కడకు వచ్చారు? మిమ్మల్ని రమ్మని ఎవరు పిలిచారు? మమ్మల్ని ఈ మాత్రమైనా బతకనివ్వరా? ఇంకా ఏ అవమానాల్ని మాకు కల్గించాలని మళ్లీ ఈ ఇంట్లో అడుగుపెడుతున్నారు? మీరు సృష్టించిన కల్లోలం మమ్మల్ని ఎలా కృంగతీసిందో మీకు తెలియదు. వెళ్లండి... వెళ్లి పొండి... ఈ పరిసరాలకు దూరంగా పొండి" గొంతు పగిలేలా అరుస్తున్న రఘుని గట్టిగా పట్టుకొని ఆపింది మాధవి.

శాంత, పావని, సుమ అన్నగారి అరుపులకు గాబరాగా బయటకు వచ్చారు. ఎదురుగా ఉన్న తల్లిని చూచి చేష్టలు ఉడిగి నిలిచిపోయారు. గట్టిగా మాట్లాడటానికి సందేహించే అన్నగారి అరుపులకన్నా... ఎదురుగా ఉన్న తల్లి ఆగమనం మరింత ఆశ్చర్యపడేటట్లు చేసింది వారిని.

"అమ్మా! శాంతా, పావనీ, పాపా, రండమ్మా... అలా దూరంగా నిలబడిపోకండి. రండి... వచ్చి... నన్ను 'అమ్మా' అని ఒక్కసారి పిలవండి. ఇన్నాళ్లకు మళ్లీ మిమ్మల్ని చూడగలిగాను. ఒక్కసారి నా దగ్గరకు రండి" అంటూ ఒక్క ఉరుకున పిల్లల దగ్గరికి వచ్చింది సుందరి.

దగ్గరగా వచ్చిన తల్లివైపు చూస్తూ... ఏం చేయాలో తెలియనట్లు ఆగిపోయారు పిల్లలు.

"అమ్మా! శాంత! ఎంత పెద్దదానివయ్యావమ్మా... మిమ్మల్ని చూడాలని ఎంత తపించిపోయానో... అలా సందేహించకండమ్మా, ఒక్కసారి దగ్గరగారండమ్మా" అంటూ చేతులు చాపింది కన్నీళ్లతో.

"అత్తయ్యా! ముందు మీరు లోనికి పదండి బయట అందరూ చూస్తున్నారు" అంటూ ఆమెను సమీపించి లోనికి నడిపించింది మాధవి.

అంతలో రఘు ఆమెకు అడ్డునిలచి "వీల్లేదు మధూ... ఈమెని ఇంట్లోనికి తీసుకురావద్దు. ఈమె వల్లేకదూ కుటుంబం వీధినపడి నవ్వుల పాలైంది. ఈమెవల్లే కదా నాన్నగారు అల్లరిపాలైంది. ఈమె నీడకూడా ఈ యింటి మీద పడనీయవద్దు. దయచేసి వెళ్లిపొమ్మని చెప్పు" అని ఆవేశంగా అన్నాడు.

"రఘూ యింటికి వచ్చిన అతిథిని వెళ్లిపొమ్మనడం ధర్మమా!? మామయ్య మనకు నేర్పిన సంస్కారం యిదేనా? ఆలోచించు- మామయ్యకు ఈమెకు గల బంధాన్ని మనం తెంచేయగలమా! ఆయనకీచివరిదశలో మనం అశాంతి కల్గించవచ్చా? అన్ని విషయాలూ తర్వాత ఆలోచించుకోవచ్చు, ముందు ప్రక్కకు పద" అంటూ రఘును ప్రక్కకి జరిపి సుందరిని పొదివి పట్టుకొని గదిలోనికి తీసుకు వచ్చింది మాధవి.

శాంత అన్నగారి చేయిపట్టుకొని లోనికి తీసుకువచ్చింది.




ప్రక్కనే వంటగదిలో పనిలో ఉన్న సుమతి ఏమిటా గలాభాని మధ్యగదిలోకి వచ్చింది. ఆమెకు వచ్చిందెవరో... ఏమిటో బోధపడలేదు.

పట్టెమంచం మీద పడుకొన్న రామారావు గారి వద్దకు సుందరిని తీసుకు వచ్చి మాధవి- "ఉండండి యిప్పుడే వస్తాను... మీకు మంచినీళ్ళు తీసుకొని వస్తాను" అంటూ వంటగది వైపు నడిచింది.

ఎదురుగా ఉన్న రామారావుగారిని ఆపుకోలేని మనస్సుతో అశ్రుతగా చూసింది సుందరి. "ఈయన నా భర్తేనా ఎంతగా చిక్కి శల్యం అయిపోయారు! అయినా ఆ మొహంలో కళ తరగలేదు. వళ్ళు తెలియనిస్థితిలో పడుకొని ఉన్నప్పటికీ ఆ నుదుటి పై ముడతలు వీడలేదు. ఆయన యిలా అవటానికి తనే కారణం: ఆయన జీవితాన్ని చిందరవందర చేయడానికేనా తను ఆయన జీవితభాగస్వామిని అయ్యింది.

ఆలోచనలతో దుఃఖాన్ని ఆపుకోలేక రోదిస్తోంది సుందరి.

మాధవి మంచి నీళ్ళు తెచ్చి ఆమె చేత త్రాగించింది. "మామయ్య పడుకొన్నారు. మాత్రలు వేశాము. మీరు కొంత మనస్సుని చిక్కబట్టుకోండి. ముందు కూర్చోండి" అంటూ ఆమెను అనునయించింది.

పావని వంట యింటిలో వదినగార్కి ఆమె రాకను గురించి చెప్తోంది. సుమతి విస్మయంగా వింటోంది. రఘుకు మాత్రం ఏంచేయాలో తోచటంలేదు. తోటలో సిమ్మెంటు బెంచీపై కూలబడిపోయాడు. మాధవి చూపిన నిగ్రహం, విచక్షణ తను ఎందుకు చూపలేకపోయాడు! మాధవి, తను కలసి ఒక చోట పెరిగినవారే. తనకన్నా చిన్నదైనా సమయస్ఫూర్తిగా సమస్యలను పరిష్కరిస్తోంది. ప్రేమగా ఆదరించిన నాన్నగారిని మోసగించి వెళ్ళిపోయిన ఆమె మరల రావటం తనను విచక్షణారహితుని చేసిందా?!

అసహనంగా నుదుటిపై చేతితో రుద్దుకొన్నాడు రఘు. ఆలోచనా తరంగాలతో గతంలోకి పరుగులు తీసింది మనసు.

★ ★ ★

పెళ్ళై ఏడు సంవత్సరాలు దాటినా తమకు పిల్లలు పుట్టలేదని రామారావుగారితో పోరుపెట్టి, రఘును దత్తత చేసుకొంది పార్వతి. అక్కడికీ రామారావుగారు ఎంతో నచ్చచెప్పి చూశారు. తమకేమైనా వయసు మళ్ళిందా... అప్పుడే ఎందుకు తొందరని. కానీ బలీయమైన ఆమె కోర్కె... పార్వతివల్ల ఆయనకుగల అమితమైన ప్రేమవల్ల రఘును దత్తత చేసుకోక తప్పలేదు.

ఎప్పుడూ నోరు తెరిచి ఏమీ అడుగని పార్వతి తన స్నేహితురాలు లక్ష్మి అధిక సంతానంతోను, పేదరికంతోను బాధపడుతోందనీ వాళ్ళబ్బాయి రఘును పెంచుకొంటే వాళ్ళకు కొంత భారం తగ్గుతుంది, తమకు పిల్లలులేని లోటూ తీరుతుందనీ, ఆలోచించి... కోరితే రామారావుగారు కాదనలేక పోయారు.

మొదట్లో రఘుకు ఆ ఇల్లు పరిసరాలు జంకు కలిగించాయి. అయినా పార్వతి చూపిన ప్రేమ, ఆలనా పాలనలు ఆ పరిసరాలను ఇష్టపడేలా చేశాయి. పార్వతినే "అమ్మా!" అని పిలిచేలా చేశాయి. ఆ పిలుపుకోసం తపించిపోయే ఆమె మైమరచిపోయేది.

రఘును మంచి స్కూల్లో చేర్పించారు. అతను స్కూలుకు వెళ్ళి... వస్తొంటే మురిసిపోయేది పార్వతి. యూనిఫారంలో ఉన్న రఘు దొరబాబులా ఉన్నాడని పొంగిపోయేది.

రామారావుగారి పినతండ్రి కూతురు నర్మద భర్తకు ఇక్కడికే ట్రాన్స్‌ఫర్ అయి రావటంతో రామారావుగారికి నా అనే బంధువులు తోడయ్యారు. నర్మద భర్త పోలీస్ ఇనస్పెక్టరైనా... డబ్బున్న వాడైనా రవ్వంత గర్వం లేనివాడు. నర్మద కూడా దూరమైన తమ బంధుత్వంపై గల మక్కువతో... ఈ విధంగా దగ్గరయ్యామన్న ఆనందంతో అన్నగారిని అల్లుకుపోయింది.

నర్మదకు నగలన్నా చీరలన్నా తగనిపిచ్చి. ఎప్పుడూ భర్తను సాధించి బోలెడు ఖర్చుపెట్టి అన్నీ కొనిపించేది. ఏది కొనుక్కున్నా ముందు అన్నగారికి చూపేది.

"సాధించి కొనిపించుకోవటం ఏం బాగుంటుందమ్మా!" అని సున్నితంగా మందలించేవారు రామారావుగారు.

"ఆ(... నీకేం తెలియదన్నయ్యా! అంతగా పోరకపోతే ఆయన కొంటారా! అయినా మాకేంలోటు? ఖర్చులేకుండా సరదా ఎలా తీరుతుంది చెప్పు?" అనేది నర్మద.

నర్మదను చూచిన తర్వాత పార్వతి సుగుణాలు మరీ కొట్టొచ్చినట్లు తెలిసేవి ఆయనకు. కేవలం తను బజారునుండి తెచ్చే పూలే ఆమె కోటి వరహాలుగా భావించేది. తమ తోటలో రకరకాల పూలచెట్లు వేసేది. తోటను ఎంతో అందంగా తీర్చిదిద్దేది. పూల చెట్లు, పళ్లచెట్లు, కాయగూరల పాదులు వేరువేరుగా వేసి తోటను శోభాయమానంగా పెంచేవారు. వేసవిలో విరజాజులు, మల్లెలు విపరీతంగా పూసేవి. ఆయన కూడా ఆమెతో కబుర్లు చెపుతూ తోటవనిలో సాయంచేసేవారు.

"పార్వతీ... నీవు ఎప్పుడూ ఏమీ అడగవు. నీకేమీ కోరికలుండవా?" అని అడిగేవారు ఆసక్తిగా.

"నాకేం కోరికలండీ!? దేవుడిలాంటి భర్త మీరు... చక్కటి బిడ్డ రఘు ఉండగా నాకేమిటి లోటు! చెప్పండి" అనేది ఆమె.

"అది కాదు పార్వతీ! చీరలూ... నగలూ వద్దా? నర్మదని చూడు, సంవత్సరానికో నగ... ఎప్పుడు వడితే అప్పుడు కొత్తచీరలు కొనుక్కొంటోంది" అనే వారు.

"బావుంది మీబావగారికి జీతం ఎక్కువ. పైగా ఆస్తి ఉంది. ఆమెతో నాకు సాటా!? అయినా మీరు మాత్రం నాకేమిలోటు చేశారు?" అనేది.

తండ్రి ఇచ్చిన పొలంమీద వచ్చిన డబ్బు ఆమెకివ్వబోతే... తీసుకోకుండా రామారావుగారికే ఇచ్చేసేది.

చిన్నారి రఘుకు తల్లంటే ఎనలేని ప్రేమ. కూరలో, పూలో ఇచ్చి రమ్మని తల్లి చెప్తే



అప్పుడప్పుడునర్మద అత్త వాళ్ల ఇంటికి వెళ్లేవాడు. వాళ్ల ఇల్లు ఎంత పెద్దదైనా... చిందరవందరగా ఉండేది. ఎక్కడి వస్తువులు అక్కడ ఉండేవికావు. అసలు కొన్ని సార్లు తను వెళ్లే సమయానికి ఆమె నిద్రనుండి లేచేది కూడా కాదు. ఆమెకు ఇంటిని తీర్చిదిద్దుకోవటంలో శ్రద్ధలేదు. తల్లి ఇమ్మన్నది... ఇచ్చేసి ముళ్లమీదున్నట్లుండి వచ్చేసేవాడు.

"అమ్మా! అత్త ఎప్పుడూ నీలాగ ప్రొద్దుటే లేవదేం? వాళ్ల ఇల్లు అలా ఉంటుందేమిటి?" అని ప్రశ్నల వర్షం కురిపించేవాడు.

"తప్పు నాన్నా! ఇతరులను విమర్శించకూడదు" అని చెప్పేది పార్వతి.

రఘుకు తల్లిని చూస్తే ఎంతో గర్వంగా ఉండేది. ఆమె ఎప్పుడూ ఆలస్యంగా నిద్ర లేచి ఎరుగదు. శుచి, శుభ్రత, ఆచారం, ప్రేమ, అనురాగం, లాలిత్యం, సహనం ఆమెకు పెట్టని ఆభరణాలు, రామారావుగారు తెచ్చే కొద్దిపాటి జీతంతో పొందికగా ఇల్లును నడిపే నేర్పు ఆమెది. ఏనాడూ ఆమెలో అసంతృప్తి కనిపించేది కాదు. సినిమాలకుగాని, మరే కార్యక్రమాలకుగాని తాము ముగ్గురు కలిసి వెళ్లవల్సిందే. రామారావుగారు కూడా స్కూలు... ఇల్లే తమ ప్రపంచంగా భావించేవారు గాని ఇతర అనవసరమైన వ్యాపకాలు లేకుండా ఉండేవారు. పొదుపుగా... వొద్దికగా జీవించే వాళ్లతీరు... ఇరుగు పొరుగులను ఆకర్షించేది... వారిపై గౌరవ భావాన్ని పెంచేది.

నర్మద నెల తప్పిందన్న వార్త వారికెంతో ఆనందాన్ని కలిగించింది. తమకున్నంతలో నర్మదకు పిండివంటలూ... అవీ చేసి పంపేవారు. రామారావుగారు రోజూ వెళ్లి చెల్లెల్ని చూసి వచ్చేవారు.

నర్మద పురిటికి వెళ్లి వచ్చేవరకు ఎలా గడిపారోగాని... చిన్నారి పాపతో ఆమె రాక వారికెంతో ఉత్సాహాన్నిచ్చింది. "మా రఘుబాబుకు భార్య పుట్టిందని" పార్వతి ఎంతో మురిసిపోయేది. ఆ పాపకు 'మాధవి' అని పేరు పెట్టారు. పార్వతి బలవంతం వలన రామారావుగారు ఆ చిన్నారి పాపకు బంగారు గాజులు చేయించి తొడిగారు.

లేత గులాబి పువ్వురంగుతో సన్నగా, నాజూకుగా ఉన్న ఆ పాపంటే రామారావుగారికి పంచప్రాణాలు. మాధవిపట్ల రామారావుగారు చూపిస్తోన్న వాత్సల్యానికి పార్వతి ఆశ్చర్యపోయేది. చిన్నారి మాధవి అంటే రఘుకు కూడా చాలా యిష్టం. అత్త ఇంటికి వెళ్లడానికి విముఖత చూపించే రఘు ఇప్పుడు ఎంతో సుముఖంగా ఉంటున్నాడు. మాధవి కోసం అక్కడకు పరుగులు తీస్తున్నాడు. స్కూలులేని సమయంలో ఎక్కువగా మాధవితోనే ఆడుకోవటంతో ఆగక ఒక్కోసారి బుడిబుడి అడుగులు వేస్తోన్న మాధవిని తనతో తమఇంటికి తీసుకొని వచ్చేస్తున్నాడు.

ఆ పిల్లకు మామయ్య అంటే చెప్పలేని ఉత్సాహం. ఆయన ఎత్తుకొని తోటలో తిప్పుతుంటే ఎన్నో కబుర్లు చెప్పేది. ఒక్కోసారి మాధవి భోజనం, నిద్ర పార్వతి దగ్గరే సాగేది. నర్మద అప్పుడప్పుడు గేలిపెట్టేది "దీనికి మీ గారాబం ఎక్కువైపోతోందని"

మాధవి తర్వాత సంవత్సరానికల్లా నర్మద మళ్లీ కడుపుతో ఉండటంతో ఆమెకు విశ్రాంతిగా ఉంటుందని మాధవిని ఎక్కువగా తమదగ్గరే ఉంచుకొనేవారు రామారావుగారు. రఘు, మాధవిల బాల్యం పార్వతి, రామారావుగార్ల ముద్దు మురిపాలతో ఎంతో ఆనందంగా గడచిపోయింది.

నర్మదకు మాధవి తర్వాత రాజా, సుధ కలిగారు. గాని రఘుకు మాధవితోనే ఆటలు, కబుర్లు. పండగలొచ్చాయంటే అందరూ ఆనందంగా రామారావుగారింట్లో గడపవల్సిందే. నవ్వులతో, తుళ్లింతలతో ఎప్పుడూ ఆ ఇల్లు ఆనంద నిలయంలా ఉండేది.

అనారోగ్యం అంటే ఎరుగని పార్వతికి జ్వరం, వాంతులు పట్టుకోవటంతో అందరూ చాలా ఆందోళన చెందారు. రెండు రోజులకే ఆమె చిక్కి శల్యమైపోయింది. ఎన్ని మందులు వాడినప్పటికీ ఆమె కోలుకోకపోవటంతో హాస్పిటల్లో ఆమెను చేర్చారు.

జ్వర తీవ్రతతో ఆమె పరాకు మాటలు మాట్లాడేది. మధ్యమధ్యలో "నేను ఎక్కడ ఉన్నాను! మీరు నాప్రక్కనే ఉన్నారా!! నన్ను విడచి ఎక్కడికీ వెళ్లకండి" అనేది.

"ఏమండీ! మీరు రఘును విడిచిపెట్ట

కండి. వాణ్ణి జాగ్రత్తగా చూచుకోండి'' అంటూ ఏడుస్తూ మగతలోకి జారిపోయేది. ఆమె ఆ జ్వరంలోనుండి తేరుకోకుండానే రామారావు గారి జీవితంలో శాశ్వతమైన చీకటి మిగిల్చి అంతిమ శ్వాస విడిచింది.

ఆమె మరణం రామారావుగార్ని పెద్ద దెబ్బ తీసింది. ఇంటినిండా...మనస్సు నిండా ఆవిడ జ్ఞాపకాలే. ''తన వెలుగులో మన ఆనందాన్ని సహించలేక వెన్నెల నిన్ను తనలో కలుపు కొంది పార్వతీ! భూమాతకన్నా ఓర్పుగల నిన్ను చూచి ఆ భగవంతునికి కన్నుకుట్టింది. ఎందుకు నా కింత శిక్ష విధించావు? నా చెయి పట్టుకొని నా జీవితాన్ని నడిపించావు. ఏం పాపం చేశానని నన్నిలాఅనాథనుచేసి వెళ్లిపో యావు నేనెలా బతికేది'' అని కుమిలికుమిలి ఏడ్చేవారు.

నిద్రాహారాలుమాని దుఃఖిస్తున్న రామారా వుగార్ని ఎలా ఓదార్చాలో నర్మదకు గాని, ఆమె భర్తకుగాని పాలుపోలేదు. రఘుకు ఆయన దగ్గరకు వెళ్లాలంటేనే భయంవేసింది. తల్లి మరణంతో అతని జీవితంలో నైరాశ్యం ఏర్ప డింది. నిర్లిప్తంగా ఓ మూల కూర్చొని రోదించే వాడు. ధారాపాతంగా కళ్లు వర్షించేవి. ఆ తండ్రీ కొడుకులను ఎలా సముదాయించాలో ఎవ్వరికీ అంతుచిక్కటంలేదు.

గోరు చుట్టుమీద రోకలి పోటులా నర్మద భర్తకు విజయవాడ ట్రాన్స్‌ఫర్ అవటంతో అందరికీ మతిపోయింది. తాము వెళ్లిపోతే వాళ్లను సాంత్వనపర్చేవారే ఉండరే! ఏంచే యాలో నర్మదకు పాలుపోలేదు.

చివరకు భర్త సూచన ప్రకారం ఆయన ఒక్కరినే బెజవాడ పంపటం... రామారావుగా రు తేరుకొనే వరకు పిల్లలతోసహా నర్మద రాజమండ్రిలోనే ఉండటానికి నిర్ణయం జరి గింది.

నర్మద తల్లిదండ్రులు వచ్చి రామారావుగా రిని పలుకరించి వెళ్లిపోయారు. అన్న కొడుకు ను చిన్నప్పటినుండీ దూరం చేసుకొన్నందుకు అప్పుడప్పుడూ వాళ్లు బాధపడేవారు. ఇప్పుడు నర్మదవల్ల దగ్గరైనందుకు ఆనందపడ్డా అతని కివచ్చిన ఈ ఆపదవారిని ఎంతో బాధించింది.

రామారావు గ్రేడ్ వన్ తెలుగు పండితుడు. పాఠశాలలో ఆయనకు మంచి పేరుంది. సాధా రణంగా పాఠశాలల్లో ఇంగ్లీషు, లెక్కల టీచ ర్లకు ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. తెలుగు ఆడుతూ...పాడుతూ... నేర్చుకోవచ్చునే చులకన భావం విద్యార్థులకు ఉంటుంది. కానీ రామా రావుగారి బోధనాపటిమ ఎంతో విశిష్టతకలది. పద్యభాగాల్ని రాగయుక్తంగా చదువుతూ భావాన్ని బోధించేవారు. గద్యభాగాల్ని సంద ర్భోచిత ఉపమాన కథలతో ఆసక్తికలిగేటట్లు చెప్పేవారు. రామారావుగార్ని విద్యార్థులంతా ఆరాధనాభావంతో చూసేవారు. ఆయన మెప్పుకోసం ఎక్కువ మార్కులు తెచ్చుకోవా లని పట్టుదలతో కృషిచేసేవారు. ఇతర టీచ ర్లు కూడా ఆయన్ని ఎప్పుడూ ఖాళీగా చూసేవా రు కారు. లీజరు టైములో కూడా కాంపోజిషన్ పుస్తకాలు దిద్దటమో...పిల్లల వర్క్ పుస్తకాల ను దిద్దటమో... భారత, భాగవతాది పుస్తకా లనో చదవుకోవటమో చేసేవారు. ఏ ఇద్దరు టీచర్లు కలిసినా పెరిగిన డి.ఎ. గురించో... రాజకీయాల గురించో మాట్లాడుకొంటుంటారు. కాని ఆయనకి ఆ విషయాలే పట్టవు. ఆయన ను చూస్తే మూర్తీభవించిన సరస్వతీదేవి అంశలా అనిపిస్తుంది ఎటువంటి వారికైనా

ఉపాధ్యాయులందరిలోకి ఆయనకు చక్ర ధరం,... మధుసూదనం సన్నిహితులయ్యారు. చక్రధరంగారు లెక్కల అసిస్టెంటు... మధు సూదనంగారు బి.ఇడి. సైన్సు అసిస్టెంటు. అయినా తెలుగు భాషపట్ల వారికి గల ప్రీతి, ప్రవేశం వాళ్ల ముగ్గురునీ ఒక్కటిగా చేసింది.

చక్రధరంగారికి ఉద్యోగం చేయాల్సిన అవ సరంలేదు. రెండు మూడు తరాలకు సరిపడా తాత తండ్రులు సంపాదించిన ఆస్తిపాస్తులు న్నాయి. అయినా ఖాళీగా కూర్చోటం ఇష్టంలే క...ఉద్యోగం పురుషలక్షణమని భావించి... చే స్తున్నారు. ఆయన సాహిత్యాభిలాషి. ''సాహితీ లహరి'' అని ఓ సాంస్కృతిక సంస్థను ఆయనే స్థాపించి నడిపిస్తున్నారు. తరచూ కవి పండి తులను పిలిపించి...సాహిత్య ప్రసంగాలు సన్మానాలు చేయిస్తూ, సందడిగా గడపనిదే ఆయనకు తోచదు. పట్టణంలోని ప్రముఖుల్ని చాలా మందిని సభ్యులుగా ఆ సంస్థలో చే ర్పించారు. మిత్రులిద్దరినీ కూడా అందులో

నభ్యుల్ని చేశారు.

ఎంత పెద్ద కార్యక్రమం తలపెట్టినా... ఎవ్వరినీ డబ్బులకోసం ఒత్తిడి చేసేవారు కారు. ఎవరికి తోచింది వారివ్వగా మిగిలినది తాను భరించేవారు. అంతే కాకుండా పేద విద్యార్థులకు ఆర్థికంగా కూడా నహాయపడేవారు. చక్రధరంగారి చర్యలు ఆయన భార్య వర్ధనికి నచ్చేవికావు. ఆయన ఏ కార్యం తలపెట్టినా... ఏ నహాయం చేసినా "మీరు ఇలా దానధర్మాలు చేనుకొంటూపోతే... మనకు చివరకు చిప్ప పుచ్చుకోవల్సిన వరిస్థితి వస్తుంది" అంటూ గొణిగేది.

"చూడు వర్ధనీ... ఈ సిరిసంపదలు శాశ్వతం కాదు. మీ తాత తండ్రులుగాని... మా తాత తండ్రులుగాని పోతూ పోతూ ఏమైనా పట్టుకుపోయారా! చివరకు మనం మాత్రం ఏమైనా తీసుకుపోగలమా! మనిషి సంపాదించిన కీర్తిప్రతిష్టలే శాశ్వతం. వాటి నముపార్జనే మన జీవితలక్ష్యం కావాలి" అంటూ లెక్చరిచ్చేవారు.

"మనిషి సామర్థ్యానికి ఈ లోకంలో కొలబద్ద ఒక్క డబ్బు మాత్రమే. అందులోను మనకు ముగ్గురాడపిల్లలాయే" అని ఆవిడ వాపోయేది.

"మనిషి సామర్థ్యం తెలియాలంటే ఒక్క డబ్బే కాదు. పేరు ప్రతిష్టలు కూడా సంపాదించుకోవాలి డబ్బు తాత్కాలిక సామర్థ్యాన్నే తెలియజేస్తోంది. పేరు ప్రతిష్టలు శాశ్వతమైన సామర్థ్యాన్ని కీర్తిని తెచ్చిపెడతాయి. అందుకే వాటిని సంపాసించుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. ఇంక ఆడపిల్లలంటావా!? వారిని నీవే కన్నావు. ఏం చేయను. నీ శక్తి ముందు నేనోడిపోయాను" అని వేళాకోళం చేసేవారు.

"అయినా నా తల్లులకేంలోటు? వాళ్లు హాయిగా చదువుకొంటున్నారు. దర్జాగా పెళ్లిళ్లు చేస్తాను. ఇప్పటినుండీ నీకెందుకాభయం" అనేవారు చివరికి.

వాళ్ల పెద్దమ్మాయి "ఝాన్సీ" నిజంగా ధైర్యంలో ఝాన్సీయే. ఒకసారి ఆ అమ్మాయి వాళ్ల అమ్మమ్మగారిని రైలు ఎక్కించటానికి స్టేషనుకు వెళ్లింది. వాళ్లమ్మమ్మగారి ఊరిలో పాసింజరు రైళ్లు తప్ప ఆగవు. అందులో ఆ రోజు జనం రద్దీ ఎక్కువగా ఉంది. ఆ ట్రైను ఎక్కలేకపోతే మళ్లీ రాత్రి వరకూ ట్రైను లేదు.

ట్రైను వచ్చిన వెంటనే ఝాన్సీ నరానరి గార్డు కంపార్టుమెంటు వద్దకువెళ్లింది. "మీకు అంత ఖాళీ పెట్టెందుకండీ? బండంతా ఒకటే రద్దీగాఉంది. మా అమ్మమ్మను మీ పెట్టెలో ఎక్కనివ్వండి. మా తాతగారికి అసలే బాగుండ లేదట" అంటూ గార్డును జబర్దస్తీగా అడిగింది. ఆమె మాటలకు ముచ్చటపడి గార్డు మునలమ్మని తన పెట్టెలో ఎక్కనిచ్చాడు.

రైలు బయలుదేరుతున్నా ఎక్కలేని మరో నలుగురిని- "గార్డుగారు మంచివాడే. ఏమీ అనరు మీరెక్కండని" వాళ్లను కూడా సిఫార్సు చేసి ఎక్కించేసింది. ఈ విషయం తెలిసిన పరిచయస్తులంతా "మీ ఝాన్సీ నిజంగా ఝాన్సీరాణేనండి" అని చక్రధరంగారివద్ద పొగిడారు.

మరోసారి పాఠం సరిగ్గా చెప్పని టీచరుపై డి.ఇ.ఒ. వచ్చినపుడు కంప్లైంటు యిచ్చి చీవాట్లు పడేటట్టు చేసింది.

"చూడండీ... ఇది ఇప్పటినుండే ఇలా అందరికి కన్నెర్ర అయితే దీని జీవితం ఎలా నడుస్తుంది? మీరైనా కొంచెం భయం చెప్పండి" అని వర్ధనమ్మ అంటే. "ఏం నాన్నా... నిజం నిర్భయంగా చెప్పటం తప్పా? అక్కడికీ ఆ టీచరు గురించి హెడ్‌మిస్ట్రెస్‌తో చెప్తే ఆమె ఎప్పుడూ పట్టించుకోలేదు. ఆ టీచరు గార్నేమైనా అంటే రోజూ ఇచ్చే టిఫిన్లు ఇహ ఇవ్వదనో... తరుచూ తీసుకువెళ్లే సినిమాల ఛాన్సు పోతుందనో ఆమె భయం. అందుకే ఆమెనేమీ మందలించలేదు. ఈ బాధ పడలేక నేను ఇనస్పెక్టరుగార్కి కంప్లైంటు చేశాను. తప్పా?" అని అడిగేది.

"లేదమ్మా... అన్యాయాన్ని ఎదుర్కోవటంలో తప్పులేదు. అందరూ మనకెందుకులే అని వదిలేస్తే ఎలా!? అమ్మ ఏదో ఛాదస్తంతో మాట్లాడుతోంది. నీవేమి పట్టించుకోకు" అని ఆమె మాటలకు మురిసిపోతూ చెప్పేవారు. వాళ్లిద్దరి ధోరణికీ ఏంచేయాలో తోచక బుర్ర బద్దలయ్యేది వర్ధనమ్మకు.

తనకు పుట్టిన ముగ్గురూ ఆడపిల్లలేనన్న

విచారం చక్రధరంగారికి ఏకోశానా లేదు. ఆఖరి పిల్లలిద్దరూ తల్లి అభీష్టం ప్రకారం పెరిగితే ఝాన్సీ మాత్రం తనతోపాటు సభలు, సమావేశాలలో పాల్గొంటూ పదిమందితో ధైర్యంగా మాట్లాడుతూ, స్వేచ్ఛగా ఉంటూ మగ పిల్లలు లేనిలోటు తీరుస్తోంది.

ఇంకా మధుసూదనంగారు నిదానమైన మనిషి. స్నేహానికి ప్రాణం పెట్టేవారు. తెలుగు భాషపైగల మక్కువతో చక్రధరంగారి ప్రవంతిలో ఎక్కువ శ్రమపడేవారు. ఆయనకు తండ్రివల్ల కాస్త పొలం ఆస్తి సంక్రమించింది. పైరాబడులకోసం ఆరాటం లేదు. పైగా ఉన్నది ఒక కొడుకు, ఒక కూతురు... భార్య సరస్వతి కష్టసుఖాలు తెల్సిన మనిషవ్వటంవల్ల వాళ్ల సంసారం ఒడిదుడుకులు లేకుండా సాఫీగా సాగిపోతోంది.

రామారావుగారికి వచ్చిన కష్టానికి వాళ్లెంతో బాధపడ్డారు. ఎలా ఆయనను మామూలు మనిషిని చేయటమా అని వాళ్ల ఆలోచన. రామారావుగారి ప్రవర్తన, రూపం, మాటతీరు వాళ్లని ఆయనపై లగ్నమనస్కులను చేసింది. వారిద్దరూ ఆదివారాలు రామారావుగారింటివద్దే గడిపేవారు. వాళ్లను చూడగానే పార్వతి వాళ్లకు కాఫీ, టిఫిన్లు చేసేది. గదిలో చక్కగా చాపలు పరచి వక్కపొడి భరిణి ఉంచేది. ఇంక సాహిత్యగోష్ఠిలో తలమునకలుగా మునిగిపోయేవారాముగ్గురూ. రామారావుగార్కి తిక్కన, పోతన అంటే ఎంతోయిష్టం. చక్రధరంగారు ఏదోవిధంగా విషయం కదిపి ఊరుకొనేవారు. ఇంక ఆయన ఆ కవుల కవిత్వంలోని మాధుర్యంగూర్చి, శబ్దప్రయోగాలగూర్చి, ఎంతో లోతుగా వివరించేవారు. వాళ్ల పేర్లను విన్నంతలోనే నీలిమబ్బునుచూచి పరవశించిపోయి, పురివిప్పి నాట్యమాడిన మయూరిలా... ఆయన ఎంతో పులకిత హృదయులై... వారి కవితా వెల్లువలోని పద్యాలను రాగయుక్తంగా ఆలపిస్తూ శ్రోతలను మంత్రముగ్ధులను చేసేవారు. ఎన్ని గంటలైనా వారికి నిమిషాల్లా గడిచిపోయేది. పార్వతి కూడా వంటఇంటిలో గోడవారగా కూర్చొని... ఈ చర్చలన్నీ వింటూ పరవశించిపోయేది. ఇంతటి జ్ఞానియైన భర్తను తలచుకొని గర్వించేది.

చక్రధరంగారు ఎప్పుడూ అనేవారు "రామారావూ, నీవు చాలా అదృష్టవంతుడివి వోయ్. ఇదే మా ఇళ్లకు స్నేహితుల్ని తీసుకొని వెళ్లి కబుర్లతో, పద్యాలతో కాలం గడిపితే... కాఫీ, టిఫిన్లు మాట దేవుడెరుగు... ఇంట్లో ఉన్న గిన్నెలు, చెంబులు మోగిపోవల్సిందే. మా చెల్లెమ్మ చూడు ఒక్క మాట అంటోందా! ఇంత అణుకువగల భార్య దొరకడం... నీవెంతో పుణ్యం చేసుకొని ఉంటావు"

"ఇదిగో చెల్లెమ్మా! మరీ మీరిద్దరూ ఒకే మాట ఒకే బాటగా ఉండటంవల్ల... ఏ నాలాంటివాడి దృష్టో తగులుతుంది. ఎందుకైనా మంచిది ఓ కేజీ లడ్డూలు దిష్టితీసి పడేయమ్మా!" అని హాస్యమాడేవారు.

"అవునురా... ఆడపిల్లల తండ్రివికదా! ఏదోవిధంగా సంపాదించేద్దామని తపన. చెల్లెమ్మా! లడ్డూలు వద్దు, మరేంవద్దు గానీ, కాస్త ఉప్పు మిరపకాయలు దిష్టితీసి పడేయమ్మా. ఏం రా అవి కూడా పట్టుకుపోతావా!?" అంటూ చురక విసిరేవారు మధుసూదనంగారు.

రఘుకు ఈ వ్యవహారమంతా ఆశ్చర్యంగా... ఆనందంగా ఉండేది. ఏమైనా సరే మాధవి ఆడుకోటానికి పిలిచినా సరే అక్కడినుండి కదిలి వెళ్లేవాడుకాదు. అర్థంకాకపోయినా మాధవి కూడా అక్కడే కూర్చొనేది.

మిత్రునికి వాటిల్లిన కష్టం వారిని కర్తవ్యవిమూఢులను చేసింది. ఈ దుఃఖంనుండి ఆయనను ఎలా తేర్చడమో వారికి అర్థంకావటంలేదు. ఏం మాటాడాలన్నా బెరుకుగానే ఉంది. అసలు పార్వతమ్మను తలుచుకొంటేనే కడుపు చెరువయ్యేది. గంటల తరబడి ఆయననెలా ఓదార్చాలోనని తర్జనభర్జన పడేవారు. కాని రామారావుగార్ని చూచేసరికి ఒక ముక్క కూడా గొంతు పెగిలేదికాదు.

మర్నాడు లాస్టు వర్కింగుడే. ఎలాగైనా మిత్రుని బడికి తీసుకొని వెళ్లాలని మిత్రులిద్దరూ రామారావుగారింటికి వెళ్లారు. ఆయన కిటికీలోనుండి శూన్యంలోకి చూస్తూ నిల్చున్నారు. ఆయన కళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి. ఆ స్థితిలో ఆయన్ని చూసి వాళ్లకు నోట మాటరాలేదు.

చివరకు మధుసూదనంగారే- "ఇలా ఎంత




సేపూ మీరు బాధపడుతూ కూర్చొంటే ఎలా!? పోయినవాళ్లు తిరిగి వస్తారా? మీరే ఇలా ఉంటే రఘు ఏమవ్వాలి? మీచెల్లెలు ఏమవ్వాలి?'' అంటూ కేకలేశారు.

''అమ్మా! నర్మదా! మేము రేపు ఒకసారి స్కూలుకి వెళ్లిరావాలి. పదిగంటలకల్లా మీ అన్నయ్యగార్ని సిద్ధంచేయాలి. నీవైనా కేకలేసి బయటకు పంపకపోతే ఎలా?'' అన్నారు.

నర్మదకు వాళ్లు స్కూలుకి ఎందుకు తీసుకు వెళతామన్నారో అర్థమయింది. ఆ ఒక్కరోజు స్కూలుకి వెళితే మర్నాటినుండి వేసవి శల వులే. తనే ఇన్నాళ్లూ ఈ విషయం అన్నయ్యకు ఎలా తెలియచెయ్యాలా అనుకొంటోంది.

అందుకే సంతోషంగా- ''అలాగేనండీ... మీ రైనా అన్నయ్యకు గట్టిగా చెప్పండి ఇప్పటికీ సరిగ్గా భోజనమైనా చెయ్యటంలేదు. రాత్రిళ్ళు గంటలకొలదీ చీకట్లో కూర్చొని విలపిస్తాడు. వదిన పోయిన బాధ మాకెవ్వరికీ లేదా! ఇలా అయితే ఎలా చెప్పండి'' అంటూ వాపో యింది.

రామారావుగారు మిత్రుని భుజంపై తలవా ల్చి- ''నీకు తెలియదు చక్రధరం. నాకడుపులో ఏదో తెలియని బాధ. నేను ఇదివరలో అనుకొనే వాడిని... భార్య భర్తకంటే ముందుపోతే... భర్త చేతిలో పుణ్యస్త్రీగా పోయే సౌభాగ్యవతి అవు తుంది. సమాజంచేత చీదరింపులు ఉండ వని. కానీ ఇప్పుడు అనుభవపూర్వకంగా తెలు సుకొన్నాను. భార్య పోయిన భర్త జీవచ్ఛవ మని... ఎండిన మ్రోడని, ఈ నరకం పగవానికి కూడా వద్దు.

ఆమె కాలి మువ్వల సవ్వడులు నాలో మెదలుతూనే ఉన్నాయి. ఈ ఇంట్లో ఆ తోటలో ఆమె సంచరిస్తున్నట్లే భ్రమపడిపోతున్నాను. వాస్తవానికి, ఊహకి మధ్య నలిగిపోతున్నాను. ఆమె జ్ఞాపకాలతో బతకలేక... చావురాక నలిగి పోతున్నాను'' అంటూ దుఃఖిస్తూ వెక్కిళ్ళు పెట్టారు.

ఆయన్ని ఊరడించటం ఎవరితరం కావ టంలేదు.

చెల్లెలు, భర్తకు దూరంగా వుండి తన ఆలనాపాలనా చూస్తొంటే మరీ కరిగిపోయారు రామారావుగారు- ''అమ్మా... బావగారు నీవు లేకుండా ఎన్నాళ్లు బాధపడతారు. ఈ బాధ నేను బతికివున్నంతకాలం తీరేదికాదు. నేను రఘును చూసుకొంటాను. నీవు బెజవాడ వెళ్లి పోమ్మా. వాడికి నేను, నాకు వాడు ఎలాగో తప్పదు'' అని పదేపదే చెప్పటంతో ఆయన కేం జవాబు చెప్పాలో నర్మదకేం బోధపడలేదు. దీనికి సాయం కాంతమ్మ బాధ ఒకటి ఎక్కువై పోయింది.

కాంతమ్మకు ముగ్గురూ ఆడపిల్లలే. భర్త వంటలు చేస్తూ బతికేవాడు. చదువుకోకపోవ టంవల్ల అతనికి ఆ వృత్తి తప్పలేదు. వాళ్లకు తిండి, బట్ట సంపాదించు కోవడం గగనమైపో తుంటే ఆడపిల్లల పెళ్లిళ్లు ఎలా చేస్తారు? అప్పడాలు, ఒడియాలు చేసి అమ్మటం. తెలి సినవాళ్లకు పనుల్లో సాయం చేయటం చేసి సంపాదించినా జీవించటం కష్టమైపోతోంది. ఆమెకు నర్మద, పార్వతి పరిచయమే. పార్వతి పోయాక నర్మదను పలకరించటానికి వచ్చింది.

''అమ్మా... నర్మదా పోయినవాళ్లతో మనం పోగలమా. పార్వతమ్మ బంగారు పువ్వులతో పూజచేసుకొంది. అందుకే పుణ్యస్త్రీగా పోయింది. అందరికీ ఆ అదృష్టం కలుగు తుందా? నీవు గుండె రాయిచేసుకొని మీ అన్నయ్యగారిని చూడాలి. అయినా నీవు మాత్రం ఎన్నాళ్లు చూడగలవు? నీ కాపురం నీకుంది. నీ భర్తకా బెజవాడ బదిలీ అయ్యింది. ఆయన్ని వదిలి ఇక్కడ ఉండ లేవు. ఈయన్ని వదిలి అక్కడ వుండలేవు. నా మాటవిని మీ అన్నయ్యగారిని ఒప్పించి మా సుందర్శిలాంటి కష్టసుఖాలు తెలిసిన పిల్లని చూసి ఆయన్ని ఒక ఇంటివాణ్ణి చెయ్యి'' అంటూ పరామర్శ ఒకవైపు, పెళ్లిమాటలు మరొకవైపు చెప్పేసింది.

నర్మదకు కాంతమ్మ మాటలువిని మతిపో యింది. ''లోకంలో యింత స్వార్థపరు లుంటారా?'' అన్పించింది. వదిన, అన్న య్యల అన్యోన్యత తెలిసిన తను అన్నయ్యకు మళ్లీ పెళ్లి చేసుకోమని చెప్పడానికే భయం వేసింది. తనను బెజవాడ వెళ్లిపొమ్మని అన్నగా రు పదేపదే చెప్పటంతో ఆయనతో మరో తీర్మానం చేసింది.



"అన్నయ్యా... ఇంత దుఃఖంలో వున్న నిన్ను ఒంటరిగా వదిలి వెళ్లలేను. మీ బావగారికి ఇబ్బందనేగా నీ బాధ. నీకు సేవలు చేయటం నాకు బరువా? భగవంతుడు ఇచ్చిన అన్నవు నీవు. చిన్నప్పుడే మా నాన్నగారు నీ బాధ్యత వహించి నీ ఆలనా పాలనా చూడనందుకే బాధపడుతున్నాను. ఈవిధంగా ఆ భగవంతుడే మనల్ని కలిపాడు. నీవు, రఘూ నాతో బెజవాడ వచ్చేయండి. ఆ దేవుడు ఇచ్చిందే అందరం కలిసే తిందాం. ఈ పరిసరాలు మారితే నీకూ కొంత దుఃఖోపశమనం అవుతుంది. రఘు చిన్నవాడు. వాడిని ఎలాగో వదిన ధ్యాననుండి మరిపించాలి" అని గట్టిగా పట్టువట్టింది.

నర్మద భర్త కూడా బావగారు తమతో వస్తే గాని వీలుకాదని మొండిపట్టు పట్టాడు. చివరికి వాళ్లతో కొద్దిరోజులు గడపటానికి ప్రయాణం అవ్వక తప్పలేదు రామారావుగారికి.

బెజవాడలో నర్మద భర్త ప్రసాద్ తీసుకొన్న ఇల్లు పెద్దదే. రామారావుగారికి, రఘుకి ఒకగది ప్రత్యేకంగా ఉంచేశారు. మాధవి మాత్రం తల్లి వద్ద పడుకొనేది కాదు. మామయ్యా పక్కలోనే ఆమె పడక. పడుకొనేంతవరకు ఏవో కథలు చెప్పమని వేధించేది. ఆమెవలన ఆయన ఒంటరిగా ఉండటానికిగాని, ఆలోచించటానికి గాని కుదిరేది కాదు.

ఇంక ప్రసాద్ రెండుపూటలూ భోజనం ఆయనతోనే చేసేవాడు. డ్యూటీనుండి రావటమే తడువు "బావగారూ...: నాకు బ్రహ్మాండమైన ఆకలివేస్తోంది. నా కోసమైనా తొందరగా రండి. నేనసలే ఆకలికి ఉండలేను" అని బలవంతంగా భోజనానికి రప్పించేవాడు. నర్మద నవ్వుకొంటూ వారిద్దరికే వడ్డించేది.

"ఏమోయ్ భార్యామణీ... భార్య అభోజనంగా ఉంటే తినమని చెప్పని కఠినాత్ముడని నన్ను గురించి మీ అన్నయ్యగారు అనుకోవాలనా నీ ఉద్దేశం" అంటూ ఆమెను కూడా తమతో భోజనానికి కూర్చోపెట్టేవాడు "ఏమిటో ఇన్నాళ్లూ హాయిగా ఆ హొటల్‌కూడు తిన్నాను. ఇక ఈ వంటతో శుష్కించిపోవాలేమో" అంటూ వెక్కిరించేవాడు.

"చూడన్నయ్యా... ఇలాంటివారికి శుభ్రంగా వండిపెట్టడం తప్పు. ఈరోజూ నుంచీ వారిని మినహాయించి మనమటుక్కే వండుకొందాం" అంటూ ఉడుక్కొంటూ చెప్పేది.

"ఇదిగోనండి బావగారూ... నిజం చెబుతున్నాను. ఈవిడ మరీ ఇంత పనిపాటలురాని బద్ధకస్తురాలని నాకు తెలియదు సుమండీ? పిల్ల నలుపైనా కళగా వుందని మావాళ్లు నా కంటగట్టారు. భార్య పనిమంతురాలైతే భర్త సుఖపడతాడుట" అని కొంటెగా అంటున్న అతన్ని చూస్తే రామారావుగారికి నవ్వు ఆగేది కాదు.

"నేను నల్లగా వున్నానా? చామనఛాయగా ఉన్నంతమాత్రాన నన్ను నలుపంటారా?" అంటూ అలకతో భోజనంనుండి లేవబోయేది.

"అఁ... అఁ... భోజనంనుండి లేవకూడదు. చేతనైతే మాటలతో ఎదుర్కోవాలి" అని ఆమెను ఆపేవాడు ప్రసాదు.

రామారావుగారికి వాళ్ల చిలిపితగాదాల మధ్య మాట్లాడటానికిగాని, మరో ఆలోచనతో బాధపడటానికిగాని వీలయ్యేది కాదు.

"బావగారూ... నేను డ్యూటీకి వెళ్లిన తర్వాత అలా కాలక్షేపం కోసం పిల్లల్ని తీసుకొనిఏ క్రిష్ణానది ఒడ్డుకో వ్యాహ్యాళికి వెళ్లకూడదూ. వాళ్లకు ఆటవిడుపుగా వుంటుంది. మీకూ మనసు ప్రశాంతంగా వుంటుంది" అనేవాడు ప్రసాద్. ఇంటిపని తొందరగా పూర్తిచేసుకొని అప్పుడప్పుడు తను కూడా వాళ్లతో బయలుదేరేది నర్మద. అన్నగార్ని ఎలాగైనా నరే మామూలు మనిషిని చేయాలని ఆమె తపన.

ఒకరోజు రామారావుగారికి అర్ధరాత్రివేళ మెలకువ వచ్చింది. మంచినీళ్లు తాగుదామని నెమ్మదిగా లేచిన ఆయనకు నర్మద వాళ్ల గదిలోనుండి నెమ్మదిగా మాటలు వినవచ్చాయి.

"అన్నయ్యను మనం ఎలాగైనానరే పునర్వివాహానికి సుముఖుణ్ణి చేయాలి. ఎన్నాళ్లు ఒంటరిగా బాధపడతాడు. రఘు ఆలనాపాలనా ఆయన చూడవద్దూ? వాళ్లఅమ్మాయిని వ్వడానికి కాంతమ్మగారు సిద్ధపడ్డారు. కానీ అన్నయ్య వదినల అన్యోన్యతను చూసిన నేను ఆ మాట చెప్పలేకపోతున్నాను. అసలు ఆ




భగవంతుడు ఎంత నిర్దయుడో. అన్నయ్య ఏ పాపం చేసుకొన్నాడో" అంటూ చెప్తోంది ప్రసాద్‌కు. ప్రసాద్ ఆమెను అనునయిస్తున్నాడు.

రామారావుగారు అవాక్కయ్యారు- "నర్మద ఎప్పుడూ సందడిగా తిరిగేది. సుఖంగా, సంతోషంగా ఉండవల్సిన ఈ సమయంలో ఆ దంపతులు పాపం తన గురించే ఆలోచిస్తున్నారు. వీరి రుణం ఏవిధంగా తీర్చుకోగలడతను? అయినా ఎవరో మహాకవి అన్నట్లు దుఃఖాన్ని మనలోనే అణచుకోవాలి. సంతోషాన్ని పది మందితో వంచుకోవాలి. తను కూడా వీళ్ల గురించి ఆలోచించాలికదా! తన దుఃఖంతో ఆమెకు జీవితమంటే భయం కలిగించకూడదు. అసలే నర్మద చిన్నపిల్ల. పార్వతి ఎక్కడికీ వెళ్లిపోలేదు. భౌతికంగా తనకు దూరమైనా మనసులో, తలపుల్లో ఆమె జీవించేవుంది. తనే ఆమె... ఆమే తనుగా జీవించారు. తను బతికున్నంతకాలం ఆమె తనలోనే వుంది, ఉంటుంది. భగవధ్యానంతో శేషజీవితం గడిపి ఆమెను చేరుకోవాలి. ఆమె కోరికమేరకు రఘును ప్రయోజకుడిని చేయాలి. అయినా శ్రీరాముడంతటివాడికే భార్యావియోగం తప్పలేదు. మానవమాత్రుడు తనెంత? భార్యా వియోగంతో రామచంద్రుడు కర్తవ్యాన్ని విస్మరించాడా? తను తన కర్తవ్యాన్ని నెరవేర్చాలి. మనస్సును రాయి చేసుకోవాలి. విషాదాన్ని తనలోనే యిముడ్చుకోవాలి" అని పరివరివిధాల ఆలోచిస్తూ పడుకొని కళ్లు మూసుకొన్నారు రామారావుగారు.

వెచ్చని కన్నీరు. ఆయన ప్రమేయం లేకుండా ఆయన చెక్కిళ్లపై జారిపోడం మొదలెట్టింది.

"గుండె గొంతుకలోన కొట్లాడుతాది. కూకుండనీదురా కూసింతసేపు" అని నండూరివారు ఎంత నిజం చెప్పారు! ఈ గుండె బరువు... ఈ గొంతుక దగ్గుత్తి భరించడం ఎంత కష్టం. "ఎంకెవ్వరని ఎలుగెత్తి అడిగితే ఎలుగునీడలవైపు వేలు సూపింతు" అన్నారు. ప్రియురాలి ఎడబాటు ఎంత వ్యధ! అందులో ప్రాణానికి ప్రాణంలా మెలిగిన తమ లాంటి దంపతులకు. ఎన్నో ఆలోచనలు ముసుకొన్నాయి. బయట వెన్నెల పుచ్చపువ్వులాగ ఉంది. ఆయనకు పార్వతినుండి ఆలోచనలు మరలడంలేదు.

పార్వతికి వెన్నెల రాత్రిళ్లలో ఆరుబయట పడుకోవటం యిష్టం. అందుకే ఆరుబయట పక్కలు వేసేది. చెవిలో ఏవేవో కబుర్లు చెప్తోంటే తను శ్రోతగా వినేవాడు. అమాయకంగా ఉన్న పార్వతంటే తనకెంతో యిష్టం.

పార్వతికి నీరసంగా ఉంటే ఒకసారి హార్లిక్సు కొని తెచ్చారు ఆయన. తనకు అదెందుకని దెబ్బలాడింది. పెదవి విప్పి ఏదీ అడగదు. తల్లీతండ్రిలేని ఆమెకు భర్తైనా, తండ్రైనా తనే. ఆమెను కనిపెట్టుకొని చూడాల్సిన బాధ్యత తనదే అందుకే ఆ అవసరాన్ని గుర్తించే ఆయన తెచ్చేరు. ఆ విషయమే ఆమెకు చెప్పారు.

తనకు మైసూర్‌పాకమంటే ఎంతో యిష్టం. అందుకే ఆ రోజు స్కూలునుండి వచ్చేసరికి మైసూర్‌పాక్ చేయాలనే తొందరలో శనగపిండి సీసాకుబదులు హార్లిక్స్ సీసా ఖాళీచేసేసింది. స్కూలునుండి వచ్చిన తనకు పళ్లెంలో పాకంతో దర్శనమిచ్చింది.

"ఏమిటోనండి! ఈరోజెంత శ్రమపడి చేసినా మైసూరుపాకం కుదరలేదు. యిలా తయారయ్యింది" అంటూ నీరసంగా చూపించింది. దానిని తిని చూస్తే ఆయనకు సంగతి అర్థమైపోయింది.

"అవునుగాని పార్వతీ! ఏదీ నీవు చేసిన శనగపిండి సీసా" అని అడిగేరు ఆయన. "యిదిగో" అంటూ పట్టుకొచ్చింది ఖాళీ హార్లిక్సు సీసా. దూరంగా శనగపిండి సీసా నిండుగా కనిపిస్తోంది. తన అనుమానం తీర్చుకోటానికి మూత తీసి చూశారాయన. శనగపిండనుకొని హార్లిక్సు వేసి ఆవిడ తయారు చేసినట్లు చెప్పారు. ఈలోపు స్నేహితులు రావటం హార్లిక్సు పాకం తింటూ నవ్వుకోటం జరిగింది. పాపం తన అమాయకత్వానికి సిగ్గు పడుతూ ఆరోజు బయటకు రాలేదామె.

ఎన్నెన్ని సంఘటనలు... ఎన్నెన్ని మధురానుభూతులు. అవి చాలవూ! తన జీవితాన్ని చివరిదాకా నడపటానికి. అవి కొన్ని జన్మలవరకు తనకు దారిభత్యం. ఈ వెన్నెలలోని అందాలను విప్పి చెప్పిందావిడ. బతుకులోని

మాధుర్యాన్ని చవిచూపింది ఆవిడ. యిన్నాళ్లూ, పార్వతి లేదన్న అజ్ఞానంతో దుఃఖించాడు తను. తన తలపులో, మాటలలో, మనస్సులో ఆమే నిండిఉంది. ఆమె యివ్వని జీవిత మాధుర్యమేముంది? యీ ప్రపంచంలో పలు ఆలోచనలతో అలసటగా నిద్రలోకి జారిపోయారు ఆయన.

శలవులు యింకా నాలుగు రోజులలో అయిపోతాయి అనగా "అమ్మా నర్మదా! నేను యింటికి వెళతాను. నువ్వన్నట్లు మీ సాన్నిధ్యంలో నాకు కొంత దుఃఖోపశమనం కలిగింది. మీ భార్యాభర్తల ఋణం తీర్చుకోలేనిదమ్మా! పనిమనిషి రాజమ్మ ఎలాగూ ఉంది. నేను, రఘు నిదానంగా మా పనులు పూర్తిచేసుకోగలం. నీవు అంగీకరిస్తే రేపే బయలుదేరుతాం. మీ పదిన జ్ఞాపకాలు జ్యోతులై నన్ను ముందుకు నడిపిస్తాయి. నా గురించి బెంగపడవద్దు. నీ ఆదరణలో నేను మామూలు మనిషినయ్యాను" అంటూ ప్రయాణసన్నద్ధులయ్యారు రామారావుగారు. భార్యాభర్తలిద్దరికీ అంగీకరించక తప్పలేదు.

బయలుదేరి వస్తోంటే మాధవి కూడా వెంటపడింది. "మామయ్యా!నేను నీదగ్గర చదువుకొంటానంటే అమ్మ పప్పుకోటంలేదు. నీవైనా నచ్చచెప్పు. టి.సి. పుచ్చుకొని నీతో వస్తాను" అంటూ బయలుదేరింది.

"నర్మదా... నీవు ఎప్పుడూ నా సోదరివే. మా యింటి ఆడపడుచువే. ఎప్పుడు ఈ అన్నయ్యను చూడాలనిపిస్తే అప్పుడు తప్పక రామ్మా" అంటూ ఆమెతో చెప్పి బావగారి దగ్గర శలవు పుచ్చుకొని బయలుదేరారు. అంతకుముందు రోజు వాళ్లు తెచ్చిన పెళ్లి ప్రస్తావనని తిరస్కరించినందుకు నొచ్చుకోవద్దని మృదువుగా నచ్చచెప్పారు.

సుందరి తల్లి కాంతమ్మ మహా పట్టుదల మనిషి. ఆవిడ బుర్రలో ఏదైనా ఆలోచన వస్తే అది అమలు జరిగి తీరవలసిందే. ఉడుంపట్టుగల మనిషి. ఓర్పు, నేర్పులతో సాధించగల మనిషి. తాను తలపెట్టిన పనికి ఎన్ని అవరోధాలు వచ్చినా దానిని వదలదు. ఎదుటివారి అయువుపట్లను అవలీలగా తెల్సుకొంటుంది. దానికితోడు నోటిదురుసుతనం ఎక్కువ. ఆవిడ తిట్లధాటికి ఎవ్వరూ ఆగలేదు... ఆవిడతో గొడవెందుకని భయపడతారు. ఆమాత్రం గట్టితనంలేకపోతే ఆమె శర్మలాంటి బాధ్యతలేనివానికి భార్యగా మనగలిగేదికాదు. "పాపం శర్మ" అని అనుకోవలసిందే ఆవిడ భర్తని చూసిన లోకం.

అప్పట్లో శర్మ పక్క యింట్లో దిగిన కాంతమ్మ దృష్టి... చూడగానే అతనిపై పడింది. తండ్రిలేని తనకు పెళ్లి చెయ్యటం తన తల్లివల్ల అయ్యేపని కాదు. శర్మ తండ్రి... కూతుళ్లు యిద్దరికీ పెళ్లిచేసి ఒక తాటాకు కొంప మాత్రం అతడికి మిగిల్చి చనిపోయాడు. తండ్రి వెనకాల వెళ్లి అతడి వృత్తిలో సాయంచేసే శర్మకి వంటలు చేయటంతప్ప మరొక పని చేతకాక ఆ వృత్తిలోనే సెటిల్ అయిపోయాడు.

కాంతమ్మ నవ్వులు, మాటలు అతనికి గిలిగింతలు పెట్టేవి. శర్మ తల్లి అయితే ఆమె సాయం చేసే పనులకి, చెప్పే కబుర్లకి మురిసిపోయేది. అలాంటి పిల్లను పెళ్లిచేసుకొంటే కొడుకు సుఖపడతాడనుకొంది వెర్రిబాగులది. శర్మ అయితే ఆ అమ్మాయి చూపే చనువుకి లొంగిపోయాడు. ఆ అమ్మాయికోసం వెర్రెత్తిపోయేవాడు. గాజులకి, పూసలకి తల్లికి తెలియకుండా డబ్బులు యిచ్చేవాడు. సినిమాలకు తీసుకెళ్లేవాడు.

చెల్లెళ్లను చూసివస్తానంటే శర్మ తల్లిని ఊరికి పంపించేడు. స్వయంగా వండుకొంటానంటే కాంతం వినలేదు. "మా యింటికి రాకూడదా! మా చేతి వంట తినకూడదా! అవునులెండి మేము పేదవాళ్లం. మీ స్థాయికి చాలం" అంటూ బుడి బుడి ఏడ్పులు ఏడ్చింది. శర్మ కంగారుపడిపోయి, బాధపడిపోయి ఆమెను దగ్గరకు తీసుకొని ఓదార్చాడు. తల్లి వచ్చేవరకు వాళ్ల యింట్లోనే భోజనం చేశాడు.

మధ్యాహ్నం వేళలో అతను పడుకొన్నప్పుడు పొరపాటున వచ్చినట్లు వచ్చి "ఏదైనా పుస్తకం ఉంటే యివ్వరూ! ఏమీ తోచటంలేదు" అనేది కాంతం. అతను కాంతం చేతిని పట్టుకొని "నిజంగా నాదగ్గరికి పుస్తకం కోసమే వచ్చావా? అలా అయితే నాతో కాస్సేపు కబుర్లాడితేనే యిస్తాను" అనేవాడు. కాంతంకు కావల్సింది కూడా అదే. ఆ అమ్మాయి చూపించిన




చొరవకూ... అతనికి స్వేచ్ఛగా అవకాశం యిచ్చి నందుకూ... వారిద్దరూ శారీరకంగా ఒకటయ్యారు. అతడి తల్లి వచ్చేవరకు యధేచ్ఛగా వారి ప్రణయం సాగింది.



శర్మ తల్లి వచ్చేస్తోందని తెలిసి ఒకటే ఏడుపు మొదలెట్టింది కాంతం... "యింక నా దారి గోదారే... నన్ను మీరు మోసం చేయరని నా సర్వస్వం మీకర్పించానే... యిప్పుడు మీరేకారణం చేత్తైనా... నన్ను పెళ్లిచేసుకోపోతే నాకు దిక్కేది" అంటూ ఏడుపులు మొదలు పెట్టింది. తను నవ్వులపాలవుతానని... యిరుగు పొరుగు వింటారని భయపడి వెంటనే ఆమెను కౌగిలిలోనికి తీసుకొని "చూడు కాంతం! నిన్ను కాదని నేనుమాత్రం ఉండగలనా? నీతోడితే నా లోకం. నన్ను నమ్మిన నిన్ను ఎలా అన్యాయం చేస్తాను? అమ్మని రానీ... సమయం చూసి అమ్మతో మన పెళ్లి విషయం మాట్లాడతాను" అని వాగ్దానం చేశాడు శర్మ.

కూతుళ్ల దగ్గరినుండి వచ్చిన శర్మ తల్లికి కాంతం తన కొడుకుతో గుసగుసలాడుతుండటం... అతి చనువుతో గంటలకొలదీ గడుపుతుండటం... వారి శృంగార చేష్టలు కళ్లపడి... "నలుగురిలో వాళ్ల విషయం నలగకముందే పెళ్లి చెయ్యడం మంచిదని" నిర్ణయానికి వచ్చింది.

పెళ్లి ఖర్చులకు అయిదు వందల రూపాయలు యిద్దామనుకొన్న తల్లి నోరు నొక్కేసింది కాంతం. చివరికి శర్మే తను దాచుకొన్న వెయ్యి రూపాయలు గొప్పకోసం ఖర్చుపెట్టి కోవెలలో ఆమెను పెళ్లిచేసుకొన్నాడు. పెళ్ళయ్యాక వాళ్ళు పైసా యివ్వలేదని, తన కొడుకే పెళ్ళి ఖర్చులు పెట్టుకొన్నాడని, కోడలికి పట్టుచీర తన కొడుకే గొప్పగా కొన్నాడని తెలిసి గుండెలు బాదుకొంది శర్మ తల్లి. కాని ఏం ప్రయోజనం? చేతులు కాలాక ఆకులు పట్టుకొంటే లాభం ఏమిటి?

కాంతం అసలు స్వభావం తెలియటానికి ఆవిడకు ఎక్కువరోజులు పట్టలేదు. మళ్ళీ వేరే అద్దె దండుగ ఎందుకని మంచి సమయంలో మొగుణ్ణి అడిగి తల్లి తమతో ఉండేందుకు ఒప్పించింది. పొద్దెక్కినా లేవకపోవడం... ఎంతసేపూ కొడుకుతో యికయికలు, పకపకలు, ఏదైనా మంచిది కాదని మందలిస్తే ఎదురు జవాబులు చెప్పడం చూస్తే శర్మ తల్లికి ఒళ్లుమండేది. అత్తగారు, కోడలు ఎడాపెడా మాటలు వినురుకొనేవారు. భర్త వంటలు చేసి డబ్బు తెస్తే, తనే పెత్తనం పుచ్చుకొని చేజిక్కించుకొనేది. పైగా భర్తతో "మా అమ్మ మీతో వంటసాయానికి రావటం లేదా? మీ అమ్మను కూడా రమ్మనండి. మనం గౌరవంగా పనిచేసుకొంటే తప్పేమిటి?" అని నిర్మొహమాటంగా అనడం మొదలుపెట్టింది. శర్మ తండ్రి ఏనాడూ భార్యను బయటకు పంపిఎరగడు. అందువలన శర్మ మెత్తబడి తల్లిని అంటే ఏదోరకంగా కాంతం తగాదా పెట్టుకొనేది. ఇవన్నీ శర్మ తల్లికి కష్టాన్ని కలిగించాయి.

"మీరు పెద్దవారైపోయారు. ఇంకా ఎందుకు బంగారంమీద కోరిక? ఆ గాజులు గొలుసు నాకిచ్చేయండి" అంటూ కోడలు పోరుపెట్టడంతో శర్మ తల్లికి మతిపోయింది. చివరికి "మీరు మా దగ్గర ఉండాలంటే మాకు బంగారం ఇవ్వాలి. లేకపోతే మీ దారి మీరు చూసుకోండి" అని గట్టిగా అనేది. తల్లి తప్పని నచ్చచెప్పబోయినా "నీకేం తెలుసు? ఒక అచ్చటా ముచ్చటా తీర్చేనా? అసలు పెంచలేనిదానివి ఎందుకు కన్నావు? ఇంకా నేనే నీకు కొడుకులాగా ఆదరిస్తోంటే నాకే ఎదురునీతులు చెప్తున్నావా?" అంటూ ఒక్క దులుపు దులిపేసరికి ఆవిడ కాస్తా నోరు మూసుకుంది.

కోడలు చేతిలో ఎలాగూ చివరిరోజులు గడవవని తెలిసిన శర్మ తల్లికూతుళ్ల దగ్గరకే బయలుదేరింది. ఆ ఉన్నదేదో వాళ్లకే ఇచ్చి చివరిరోజులు గడుపుకొందామని, ఆవిడ

బంగారం ఇవ్వకుండా వెళ్లటం కాంతానికి మహామంటగా ఉండి అప్పుడప్పుడు శర్మను కాల్చుకుతినేది. ఎప్పుడో పెళ్లిళ్లకు ఇతర ఊళ్లు వెళ్లేటప్పుడు... చాటుగా తల్లి దగ్గరకు వెళ్లి చూసి తనకు తోచింది ఆవిడకు ఇచ్చేవాడు. ఆ నోట... ఆ నోట ఆ విషయం కాంతంకు తెలిస్తే ఇక వారంరోజులు వరకు ఒకటే గోల, పోరు.

కాంతానికి షోకులు కావాలి. మంచి బట్టలు కావాలి. స్వతహాగా భోజనప్రియురాలు కాబట్టి తల్లిని వేధించి అన్నీ చేయించుకొని తినేది. భార్య ఖర్చులకు శర్మ సంపాదనకు లంగరు కుదిరేది కాదు. దాంతో ఇరుగు పొరుగులకు ఏవో మాయమాటలు చెప్పి, పొగిడీ వబ్బుం గడుపుకొనేది. ఈ సంసారం గోల చూడలేక కాంతం తల్లి కూతురికి ఒక నమస్కారం పెట్టి చెప్పకుండా ఇంటినుంచి వెళ్లిపోయింది.

అటువంటి కాంతం దృష్టి రామారావుగారి పై పడటంలో ఆశ్చర్యం లేదు. ముగ్గురూ కూతుళ్లే. ఎలాగో వాళ్లని ఒదుల్చుకోవాలి. మంచి అల్లుణ్ణి పడితే తమ దరిద్రం కూడా తీరుతుంది. అందుకే మహా పట్టుదలగా ప్రయత్నానికి దిగింది.

"రెండోపెళ్లి సంబంధంకోసం ఎందుకే అంతలా పరుగులు పెడుతున్నావు? నా తల్లి అందాన్ని చూసి ఎవరైనా చేసుకొంటారు" అని భర్త అంటే విరుచుకుపడేది. "నీకన్నా నయమే మంచి ఉద్యోగం... సొంత కొంప... ఇంతకన్నా మంచి సంబంధం నీవు తేగలవా? నీ ప్రతాపం ఎవరికి తెలియదు. ఏదో నేను మార్గం చేస్తుంటే అడ్డుపుల్లలు వేయొద్దు" అని భర్తను దులిపేసేది. దాంతో ఆ మానవుడు మరి నోరెత్తలేదు.

తన భార్యకు హొటల్ టిఫిన్లు కావాలి. ఇంటిపని చేయదు. కిళ్లీ అలవాటు. షోకుకి తక్కువలేదు. నైలాన్ చీరలు, చెప్పులు. ముగ్గురు పిల్లలున్నారన్న ఆలోచనే లేదు. పెద్దది సుందరి వంటపని, రెండోది జలజ ఇంటిపని చూస్తారు. మూడవదాన్ని వెంటేసుకొని పేటంతా పెత్తనాలు. అదేమంటే గయ్యిమని లేస్తుంది. "సినిమాలకైనా పంపే స్థోమత వుందా?" అని దెప్పి పొడుస్తుంది.

శర్మకు భార్య పక్కలో లేకపోతే నిద్దుర పట్టదు. అందుకే ఆవిణ్ణి మచ్చిక చేసుకొంటాడు. భార్య... పిల్లలెదురుగా ఎన్ని దులిపినా కిమ్మనడు. భర్త బలహీనతను కనిపెట్టిన కాంతం అతడిని తన అదుపులో ఉంచుకొని ఇల్లు తన ఇష్టం వచ్చినట్లు నడుపుతోంది.

రామారావుగారి స్నేహితుల గురించి వాకబు చేసినప్పుడు వర్ధనమ్మ గురించి తెలుసుకొంది. వర్ధనమ్మ మహిళామండలి సభ్యురాలు. ఆవిడకు పొగడ్తలు, గొప్పలు కావాలి. రెండు మూడుసార్లు వాళ్లింట్లో అవసరాలకు శర్మ వంటకు వెళ్లడంతో కాంతంకు కాస్త పరిచయం ఏర్పడింది. వర్ధనమ్మ పేదవాడైన శర్మని చూసి జాలిపడి తను ఏడాదికొకసారి తన అత్తగారి పేరుమీద దానంచేసే చీర, జాకెట్టు ఇవ్వడంకోసం కాంతాన్ని పిలిపించింది. కాంతానికి పెద్దవాళ్లతో స్నేహాలు కావాలి. అందుకే అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని ఆమెతో అల్లుకుపోయింది. వర్ధనమ్మకు ఏ అవసరం కలిగినా... కాస్త అనారోగ్యమేర్పడినా కాంతానికి కబురంపేవారు.

ఆ పరిచయాన్ని ఇప్పుడు ఉపయోగించుకో దలచింది కాంతం. అందుకే ఒకరోజు పెరట్లో పూలను అందంగా దండలు కట్టించి, కాసిన్ని అప్పడాలు పొట్లంకట్టి వాళ్ల ఇంటికి బయలు దేరింది. వర్ధనమ్మ మొదట ఈవిడను చూసి మొహం చిట్లించుకుంది. కానీ ఆమె తెచ్చిన గులాబీలను, కనకాంబరాలు, దవనం కలిపి కట్టిన మాలను చూసి చల్లబడింది. "రండి" అంటూ ఇబ్బందిగా పిలిచింది.

"బాగున్నారా?" అని అడిగింది కాంతం. వర్ధనమ్మ జవాబు చెప్పేలోగానే- "బాగుండకేం? మీకేం తక్కువ?? మహాలక్ష్మివంటివారు మిమ్మల్ని బాగున్నారా? అని అడగనక్కరలేదు. మీలాంటివాళ్ల నీడలో మాలాంటివాళ్లే బాగుంటేను" అని ప్రారంభోపన్యాసంతోనే మనిషిని ఆకట్టుకోవటం ప్రారంభించింది.

"అసలు మీ వారికి ఇంత పేరు ప్రతిష్టలు కలుగుతున్నాయంటే కారణం. మీ మొహంలోని కళ సామాన్యమా?" అని అంటూ అడ్డూ అదుపూ లేకుండా పొగిడేస్తుంటే వర్ధన




మ్మ ఉక్కిరి బిక్కిరైపోయింది.

"మీ అభిమానంగాని... నాలో ఏముంది? రండి, కూర్చోండి. పిల్లలు బాగున్నారా?" అని అడిగింది కాంతాన్ని ఏదో ఒకటి అడగాలని.

"ఏం పిల్లలో? ఏమిటో? మాలాంటివాళ్ల కడుపున పుట్టినవాళ్లేం అనుభవిస్తారు? మీలాంటి దయగలవాళ్లవల్లనే ఇంత అన్నం పెట్టగలుగుతున్నాం. పెద్దపిల్ల, రెండోదీ పెళ్లీడుకు వచ్చారు. ఎవరినో ఒకరిని చూసి ముడి పెట్టాలి. ఎంత బెంగగా వుంటుందో వాళ్లను చూస్తోంటే. గుండెలమీద కుంపటిలాగా ఉన్నారు" అని బుడిబుడి ఏడుపులు మొదలుపెట్టింది.

"బాధపడకండి. ఏదైనా సంబంధం చూడమని మావారికి చెబుతాను. మాకు తెలిసిన నలుగురిచేత సాయం చేయిస్తాము" అని వర్ధనమ్మగారు ధైర్యం చెప్పారు.

"అయ్యయ్యో మీకు తోచినది చేయడమా? అసలు మీ దయ లేకపోతే మేము పెళ్లిళ్లు చేయగలమా? మీరు మాకు సాయంకాదు పూనుకోవాలి. మీరే మా పెద్దపిల్ల తలపై నాలుగు అక్షింతలు వేయించాలి. దానికి మీరంటే ఎంత అభిమానమో? ఇదిగో ఈరోజే వత్తిన అప్పడాలు మీకు పంపింది" అంటూ తను తెచ్చిన అప్పడాలు ఆవిడ పక్కన పెట్టింది. అవి అసలు నిజంగా వాళ్లు పెట్టినవి కావు. ఎవరింట్లోనో పెళ్లిపనులకు వెళితే వాళ్లు ఇచ్చినవి వాటినే తెలివిగా ఈవిడకు తెచ్చింది.

వర్ధనమ్మకు ఏనుగు ఎక్కినంత సంబరం కలిగింది. తనమీద గౌరవం ఉంచి మాట్లాడే వాళ్లంటే ఆమెకు చెప్పలేనంత ఇష్టం.

ఆవిడ ముఖభావాలు పసికట్టిన కాంతమ్మ నూటిగా రంగంలోకి వచ్చింది- "మీవారి స్నేహితులు రామారావుగారు లేరూ! ఆయన భార్య పార్వతి ఈమధ్యనే కదండీ పోయింది. పాపం చాలా మంచి మనిషి. పుణ్యస్త్రీ కనుక పసుపు కుంకుమతోపోయింది. ఆయనకు మా సుందరిని ఇస్తే బాగుంటుందని నా కోరిక. మగవాడు పెళ్లిచేసుకోకుండా ఎన్నాళ్లు ఉంటాడు చెప్పండి? వాళ్ల చెల్లెలు నర్మద వాళ్లు నాకు తెలిసిన వాళ్లే. కానీ మీరు పార్వతీదేవిలాగ పెద్దదిక్కుగా ఉండగా మేము వెళ్లి అడగటం ఏం బావుంటుంది? చెప్పండి. మీ కుటుంబం వాళ్లకు మంచి స్నేహితులు. వారి మంచీ చెడ్డా చూస్తున్నారు. అసలు ఆయనకు ఆ యిల్లు చవకగా కొనిపెట్టింది మీవారే కదా! మీ దంపతుల ఉపకార బుద్ధి ఎవరికుంటుంది!? అందుకే మీ చెవిని ఈ విషయం వేద్దామని వచ్చాను" అని నర్మగర్భితంగా ఆమె చెప్తోంటే... వర్ధనమ్మ మొహం చాటంత అయింది.

"అవునండీ! వాళ్ల ఆవిడకు తండ్రి ఇచ్చిన పంట పొలం కొద్దిగా ఉంటే... దానిమీద వచ్చిన రాబడిని దుబారా చెయ్యకుండా దాచుకొన్నారు. ఆ డబ్బు చాలకపోతే కొంత సొమ్ము కూడా మావారు సాయంచేసి ఆ యిల్లు చవకగా కొనిపించారు. ఆ తర్వాత మా సొమ్ము మాకిచ్చేశారనుకోండి. యిల్లుకూడా చూడటానికి పెంకుటిల్లేగాని చాలా బాగుంటుంది. రెండు గదులు, హాలు, వెనక గొడ్లచావిడి... చుట్టుతా విశాలమైన జాగా... ప్రహరీ... ఎప్పుడైనా మరో రెండు గదులు కూడా వేసుకోవచ్చును. యింతకీ ఆయనకు నలభై ఏళ్లు వయస్సు ఉండొచ్చును. మీకు అభ్యంతరం లేదు కదా!" అని అడిగారు కాంతమ్మని.

"ఆఁ... మగవాడికి వయసేమిటమ్మా! ఏదో ఉద్యోగం ఉన్నవారు.. స్వంత యిల్లుంది. పైగా చాలా మంచివారు. యింతకన్నా మంచి సంబంధం నేను మాత్రం ఎక్కడతేగలను? మా పిల్లకు కూడా యిరవై అయిదు ఏళ్ల వయస్సుంటుందిలెండి" అంది నెమ్మదిగా.

"అలాగే చూద్దాంలెండి. ఆయన వాళ్ల చెల్లెలింటికి వెళ్లారు. ఆయన వచ్చిన వెంటనే మాట్లాడదాం" అని వర్ధనమ్మ వాగ్దానం ఇచ్చేసరికి ఆనందంగా లేచింది కాంతం.

"అన్నట్లు... మీరు ఊరగాయలు పెట్టుకొన్నారా? లేదంటే సాయానికి మా పిల్లల్ని పంపుతాను" అని అతి వినయంగా అడిగింది.

"ఆవకాయలు పెట్టటం అయిపోయిందండీ. మా వారికి అరిశలు, చక్కిలాలు యిష్టం. మీ పాప చేయగలదా?" అని అడిగారు వర్ధనమ్మగారు.

"అయ్యో! మా పిల్లలిద్దర్నీ పంపుతాను.



పెద్దది యిలాంటివి చేయటంలో దిట్ట'' అంటూ మాటిచ్చి మరీ... యింటి మొహం పట్టింది కాంతమ్మ.

అది మొదలు కూతుళ్లను ఏదో నెపంతో వాళ్లింటికి పంపటం, దొడ్లో పండిన కూరలు... పూలు పంపడం చేస్తూనే ఉన్నది. తల్లి పడు తున్న ఈ ప్రయాన చూస్తోంటే సుందరికి కష్టం కలిగేది. "ఏమిటమ్మా! ఎక్కడా సంబంధాలే దొరకనట్లు ఆ రెండో పెళ్ళి సంబంధం కోసం... అంతలాగ అంగలారుస్తున్నావు? వాళ్ల కాళ్ళా వేళ్లా పడటానికి సిగ్గు వెయ్యటంలేదా!?'' అంటూ దెబ్బలాడింది.

"ఆఁ... నీ అందం చూసి, మీ నాన్న యిచ్చే కట్నం చూసి మన యింటికి సంబంధాలు కుప్పలు కుప్పలుగా వస్తాయి. రెండోపెళ్లి రెండో పెళ్లి అని ఈసడిస్తున్నావు. నీ వయసెంతో తెల్సా? యిరవై నాలుగు నిండిన నీకు ఎలా పెళ్లి అవుతుందా! అని నేను బెంగపడుతుంటే నీకిలా ఉంది. ఆయనకు ఆస్తి, ఉద్యోగం ఉన్నాయి. వయస్సేదో నలభైకు దగ్గరుంటే కొంపమునిగిందా!? అసలు నన్నడిగితే ఆ వయసుకు పెళ్లికాని వాళ్లెంతో మంది ఉన్నా రు. మగవాడికి వయస్సేమిటి? అయినా ఆయన ఖర్మకొద్దీ... మన అదృష్టం కొద్దీ మొ దటి భార్య చనిపోయింది. ఈ సంబంధం కుదరాలని ఎన్ని దేముళ్లకు మొక్కుకుంటు న్నానో తెల్సా!? అని కేక లెయ్యటంతో సుందరి మరి నోరు తెరువలేదు.

రామారావుగారు బెజవాడనుండి తిరిగి వచ్చారని తెలియగానే స్నేహితులిద్దరూ వచ్చి చూసి వెళ్లారు. పిల్లలకూ... ఆయనకూ కేరేజీ పంపిస్తానంటే ఆయన ఒప్పుకోలేదు.

"రఘు సాయంగా ఉన్నాడు. స్టౌ మీద మా కోసం వండుకోటం ఎంతసేపు? మరీ ఖాళీగా కూర్చుంటే ఏమీ తోచదు కదా!'' అని కొట్టిపారే శారు రామారావుగారు. ఆయన అభిమానధను లు. ఎంతో అవసరమొస్తే తప్ప ఎవరినీ సాయం అడగరు. రఘు కూడా తండ్రికి చేత నైన సహాయం చేసేవాడు. మాధవి అయితే చెప్పనక్కరలేదు. పెద్ద ఆరిందలాగా అన్ని పనులకూ సిద్ధమయ్యేది. పనిమనిషి రాజమ్మ పుణ్యమా అని మొక్కలు పాడవకుండా చక్కగా ఉన్నాయి. ఊరి నుండి వచ్చినప్పటి నుండీ రఘూ, మాధవిలు పోటీపడి మరీ తోటపని చేసేవారు.

రామారావుగారు అన్ని పనులకు అలవాటు పడ్డారు. పార్వతి ఉన్న రోజుల్లో యింటి పనులు చేసేటప్పుడు ఆవిడ వెనకాలే తిరిగి ప్రతీప నిలో తానూ చెయ్యివేసేవారు.

ఆవిడ "ఎప్పుస్తకమో చదువుకో కూడదా? నాకెందుకు యింటి పనిలో సాయంచేస్తానని వస్తారు?'' అంటే...

"ఈ అట్లుపోయటం... కూరలు తరగటం... బ్రహ్మ విద్యలా!?'' అంటూ నవ్వుతూ దెబ్బలా డేవారు.

"అదికాదు పార్వతీ! రేపు నీకు ఏదైనా అవసరమైతే నేను సహాయం చెయ్యవద్దా!?'' అని అనేవారాయన.

పార్వతమ్మ వాకిట ఉన్నా యిరుగు... పొరు గువాళ్లు ఆ మూడు రోజులు సహాయంచేసేవా రు. అందువలన ఆయన చెయ్యికాల్చుకొనే అవసరమే ఉండేదికాదు. పార్వతి స్నేహశీలి. ఎవరికి ఏ సహాయం కావల్సినా అడగకుండా సాయపడేది. అందువలన అందరూ ఆమెకు సహాయపడాలని చూసేవారు.

పాఠశాల తెరవటంతో ఆయనకు క్షణం తీరిక లేకుండాపోయింది. ఉదయం వంటచే సుకోవటం, రఘుకు పెట్టి తాను తినటం, రఘు కోసం కేరేజీ సర్దటం, టైముకు స్కూ లుకు వెళ్లి రావటం, మరల సాయంకాలం కాఫీ పెట్టుకోవటం... తదుపరి వంటకు ఉపక్ర మించటం... కాస్సేపు రఘును చదివించి...అ న్నంపెట్టి, తానూ తిన్నాననిపించి... పడుకో పడం నిద్రపట్టకపోతే పుస్తకాన్ని ఆశ్ర యించటం యిలా యాంత్రికంగా తయా రైంది ఆయన దినచర్య.

మాధవి టి.సి. అడిగిపుచ్చుకొని తెలిసినవా రు వెళ్తోంటే వారితో మాధవిని బెజవాడ పంపించారు.

మాధవి ఒకటే పేచీ "నేను కూడా యిక్కడే వుండి రఘుతోపాటు చదువుకొంటాను మామ య్యా'' అని.





"నీవు ఆడపిల్లవుకదమ్మా! నీకు సంరక్షణ చేయాలి. అమ్మయితే సంరక్షణ చేస్తుంది. నేనేం చెయ్యగలను. నీవు టెంత్ పాస్ అయిన తరువాత నా దగ్గరే ఉండి చదువు కొందువు గాని. అప్పటికి కాస్తపెద్దదానవవుతావు. నా పనుల కూడా చేయగలవు" అని బుజ్జగించి పంపారు.

ఒకసారి సాయంత్రం మధుసూదనంగారు, చక్రధరంగారు రామారావుగారి దగ్గరకు వచ్చారు. రఘు యిప్పుడిప్పుడే సాయంకాలం సమయంలో వంట చేయటం నేర్చుకొంటున్నాడు. తండ్రి... తమకోసం కుక్కరు కొనటంతో సరదాగా వంట చేస్తున్నాడు. స్నేహితులు ముగ్గురూ కాస్సేపు ముచ్చటించుకొన్న తరువాత భార్య వత్తిడి గుర్తు చేసుకొని అసలు రంగంలోకి దిగారు చక్రధరంగారు.

"మీరు, పిల్లవాడు ఇలా ఎన్నాళ్లు చెయ్యికాల్చుకొంటారు? మాకు ఎంత బాధగా ఉంటుందో చెప్పండి. లోకంలో ఎందరు రెండవ పెళ్లి చేసుకోవటంలేదు. ఇదిప్పుడు సర్వసామాన్యమైపోయింది. మీరు ఒప్పుకొంటే మాకు తెలిసిన వాళ్ల సంబంధం ఒకటి ఉంది. పిల్ల చాలామంచిది. కష్టసుఖాలు తెలిసినది. మీరు ఆ అమ్మాయిని చేసుకొంటే మాకు చాలా సంతోషంగా ఉంటుంది" అన్నారు.

రామారావుగారు శూన్యంలోకి చూస్తూ- "చూడండి! నేనంటే మీకున్న అభిమానం నాకు తెలుసు. పార్వతి తనదారి తాను చూసుకొంది నన్ను వదలి. ఆమెతో గడిపిన మధురాతి మధురమైన జీవితం కొన్ని జన్మలవరకు నన్ను నడిపించగలదు. ఆమెకే అంకితమైన నా మనసులో వేరెవ్వరికీ స్థానం యివ్వలేను. యింకొకరితో కాపురం చెయ్యలేను. ఈ ఇంట్లో నా మనస్సులో ఆమె స్థానం సుస్థిరంగా ఉంది. ఒకవేళ నేను చనిపోయి ఆమే బ్రతికుంటే ఆమెకు మీరు యిలాంటి సలహా యివ్వగలరా? పురుషునికో సిద్ధాంతం, స్త్రీకో సిద్ధాంతమా? ఇదేం న్యాయం చెప్పండి" అంటూ మృదువుగా తోసిపుచ్చారు. చక్రధరంగారు మరి మాట్లాడలేకపోయారు.

యిక మధుసూదనంగారు కలుగజేసుకోక తప్పలేదు. "అదికాదండీ! పార్వతమ్మగారితో మీ దాంపత్య జీవితం తెలియనివారంకాము. మీలాంటి దంపతులు చాలా అరుదుగా ఉంటారు. అయినా కాలధర్మాన్ని బట్టి... పరిస్థితులనుబట్టి మనం నడచుకోక తప్పదుకదా! మీ కోసం కాకపోయినా రఘుకోసం, యింటి కోసం అయినా మీరు మళ్లీ పెళ్లి చేసుకోవాలి. యింటికి దీపం యిల్లాలంటారు. ఇల్లాలులేని ఇల్లు పాడుబడ్డ కోవెల లాంటిది. మీ జీవితంలో మళ్లీ వసంతం రావాలన్నదే మాతపన" అంటూ పలువిధాలుగా నచ్చచెప్పచూశారు.

"దయచేసి పదే పదే వివాహ ప్రసక్తి తెచ్చి నన్ను బాధించకండి. నా భార్య రఘు బాధ్యత నాకు అప్పగించిపోయింది. వాడికి నేను, నాకు వాడు. మరిక ఈ ప్రస్తావన వద్దు" అంటూ దుఃఖించటం ప్రారంభించారు రామారావుగారు.

యిక మాట్లాడేదిలేక అప్పటికి ఊరుకున్నారు వారు. తమ స్నేహితుని విశాలభావాలకు, భార్యపట్ల ఆయనకిగల అవగాహనకు వారు ఎంతో గర్వపడ్డారు.

రఘుకి వాళ్ల మాటలు వినబడుతున్నాయి. తండ్రికి ఎలాగైనా పునర్వివాహం చేయాలన్న ఆకాంక్ష వారిలో ద్యోతకమౌతున్నది. తండ్రి మళ్లీ వివాహం చేసుకోవడం తనకెంతమాత్రం ఇష్టంలేదు. పదవ తరగతికి వచ్చిన అతనికి ఆలోచనాశక్తి విచక్షణాశక్తి కూడా అభివృద్ధి చెందుతున్నాయి. తల్లి అంటే అతనికి పవిత్రమైన భావం. పార్వతమ్మని తల్లిగా పొందిన తను ఆ స్థానంలో వేరొకరిని ఊహ మాత్రంగా కూడా సహించలేకపోతున్నాడు. తన తండ్రికి ఏ కష్టం రాకుండా తాను చూసుకోగలడు. అంతేగాని వేరొకరిని అమ్మా! అని పిలవటం, తన తండ్రి పక్కనే చోటివ్వడం భరించలేని పని.

ఒకరోజు వంట చేస్తూ తండ్రిని అడిగాడు "నాన్నగారు! అమ్మ ఫొటో పెద్దది చేయించుకొందామా!" అని.

పార్వతమ్మతో ఆయన కలసి తీయించుకొన్న పెళ్లి ఫొటో ఏనాటిదో! రఘు వాళ్ల జీవితంలో ప్రవేశించిన తర్వాత రఘును తమ మధ్యలో పెట్టుకొని పట్టుబట్టి ఒక ఫొటో

తీయించుకొంది. రఘు, ఆమె కలసి ఒక ఫొటో తీయించుకొన్నారు. ''పార్వతీ! నీ కొక్కదానికే ఒక ఫొటో తీయిస్తాను... నవ్వుతూ నిలబడు'' అని తాను ముచ్చటపడి అడిగితే ఆమె ఒప్పుకో లేదు. ''మీరు పక్కనలేనిదే ఫొటో నాకెందు కండీ! ఈ ప్రపంచంలో అన్నీ మీతోటే నాకు'' అని కొట్టిపారేసింది. చివరకు స్టూడియోవాడి బలవంతం వలన తామిద్దరూ కలసి ఒక ఫొటో తీయించుకున్నారు. పెళ్లి ఫొటో తరు వాత అదే తామిద్దరు కలసి తీయించుకొన్న ఫొటో. అదే చివరిది కూడా. ఆ సంఘటన గుర్తుకు వచ్చి ఆయన కళ్లలో నీళ్లు తిరిగాయి. ఆ ఫొటో రోజూ తనను పలకరిస్తూ తన పడక గదిలోనే ఉంది. మిగిలిన రెండు ఫొటోలు రఘు తన గదిలో పెట్టుకొన్నాడు.

తండ్రి తన మాటకు బదులుచెప్పకపోయే సరికి రఘు మళ్లీ అడిగాడు ''మీరు, అమ్మ కలిసి తీయించుకొన్న ఫొటోలో అమ్మ చాలా బాగుంది. ఆ ఫొటోని బట్టి అమ్మకు వేరే ఫొటో తీయవచ్చుట. మా స్నేహితుడు చెప్పాడు. తీయిద్దామా?'' అని. రఘు కోరికను అర్థంచేసు కొన్న రామారావుగారు సరేనన్నారు.

ఆ సాయంత్రం స్కూలునుండి రాగానే రఘుని తీసుకొని బజారువెళ్లడం... ఫొటోకి ఆర్డరు యివ్వటం జరిగింది. పార్వతి ఉన్నప్పు డు ఎంతవేగంగా కాలం గడిచేదో! యిప్పు డంత స్థంభించిపోయినట్లుంది ఆయనకు. రఘుకోసం భోజనం చెయ్యటం బలవంతంగా తిరగటం చేస్తున్నారాయన. లేదా గంటల కొద్దీ ఆవిడ ఫొటో వైపు చూస్తూ నిర్లిప్తంగా గడవటం అలవాటైపోయింది ఆయనకు. నవ్వటం అనేది ఏనాడో మరచిపోయినట్లున్నారాయన.

''రేపు మీయింటికి వస్తున్నాం ఏదైనా పుస్తకం గురించి మాట్లాడుకొందాం'' అని స్నే హితులిద్దరూ ఆయన్ని మరిపించటం కోసం



అడిగితే... "యింటికి రండిగాని పుస్తకాల గురించి చర్చించే ఉత్సాహం నాకు ప్రస్తుతానికి లేదు అని పేలవంగా చెప్పేరు. రోజురోజుకూ నిస్పృహతో కుంగిపోతున్న ఆయన్ని ఎలా ఓదార్చటమో ఆ స్నేహితులిద్దరికీ అంతు చిక్కటంలేదు. రోజూ సాయంత్రం సమయంలో వచ్చి బాగా ప్రొద్దుపోయే వరకు ఉండి ఏవో కబుర్లు చెపుతూ గడిపేవారు. తమకేదో సందేహమున్నట్లు ఏదో ఒక సంశయం వెలిబుచ్చటమో... లేదా ఎవరో ఒక కవినుద్దేశించి ప్రస్తావించటమో చేసేవారు. యిక విషయోన్ముఖులు కాక తప్పేదికాదు ఆయనకు.

వర్ధనమ్మ ద్వారా జరిగిన ప్రయత్నం ఫలించక పోయేసరికి తానే కార్యరంగంలోకి దూకింది కాంతమ్మ. భర్తనువెంటపెట్టుకొని తిన్నగా రామారావుగారింటికి వచ్చేసింది. ఆ సమయంలో రామారావుగారు వంటచేసుకొంటున్నారు. వచ్చిన వాళ్లెవరో తెలియక... సందిగ్ధావస్థతోనే కుర్చీలు చూపించి కూర్చోమన్నారు వాళ్లని.

"మహాలక్ష్మిలాంటి యిల్లాలు... మిమ్మల్ని ఈ విధంగా దుఃఖంలో ముంచి వెళ్లిపోతుందని అనుకోలేదు. భగవంతునికి మంచి వాళ్లమీద ప్రీతి కాబోలు. లేకపోతే మాలాంటి వాళ్లను తీసుకుపోకూడదూ! దేవతలాంటి పార్వతమ్మను తీసుకుపోయాడు" అంటూ ఆమెను విపరీతంగా పొగుడుతూ ఉపోద్ఘాతం ప్రారంభించింది కాంతమ్మ. ఆమె మాటలను విన్నపోతూ వింటూ మౌనంగా ఉండటమే రామారావుగారి పని అయ్యింది.

"బాబూ! నిజం చెప్పక తప్పటంలేదు. పార్వతమ్మనాకు బిడ్డలాంటింది. మిమ్మల్నీ పిల్లాణ్ణీ చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతుంది. ఆ పిల్లాడి బాధ్యత మీరేం చూడగలరు? నాకు ముగ్గురాడపిల్లలు. పేదవాళ్లం ఎక్కువ కట్నాలిచ్చి పెళ్లిళ్లు చేయలేం. మా పెద్ద పిల్లను మీకిచ్చి చేస్తాం. మీ దగ్గర దాసిలా పడివుంటుంది. నా మాట కాదనవద్దు. మీకు తల్లిలాంటిదాన్ని" అంటూ అసలు విషయం చల్లగా చెప్తూ మొగుణ్ణీ మాట్లాడమని మోచేత్తో పొడిచింది.

"అవును బాబూ! మీ కాళ్ల దగ్గర పడుంటుంది. మీకు సేవచేస్తుంది. మీ బిడ్డ సంరక్షణ బాధ్యత వహిస్తుంది. మా విన్నపాన్ని కాదనకండి" అంటూ చేతులు పట్టుకొన్నాడు శర్మ.

"మీరు పెద్దవారు. మిమ్మల్ని నొప్పిస్తున్నానని అనుకోవద్దు. నాలో వివాహేచ్ఛ లేదు. నేను నా పార్వతిని మరచి పోలేను. మీ అమ్మాయిని చేసుకొని ఆమె బ్రతుకు నరకం చేయలేను. నన్ను మన్నించండి" అంటూ వారిని గౌరవంగా తిరస్కరించి పంపేశారు రామారావుగారు.

రఘుకి ఆమె మాటలుగాని, వేషంగాని నచ్చలేదు. తండ్రికోసం అందరూ తమ యింటి చుట్టూ తిరగటం అతనికి ఉక్రోషంగా ఉంది. సవతితల్లి అన్నపదంపై అతనికి సద్భావనలేదు. తన స్నేహితుడొకడు సవతితల్లి వల్ల ఎన్నో బాధలు పడుతున్నాడు. తండ్రిలేని వేళల్లో ఆమె అతణ్ణి కొడుతుంది. పాపం! అతను చాలా మంచి విద్యార్థి. ఆమె అతణ్ణి చదువుకోనీదు. ఎప్పుడూ ఏవో పనులు చెప్తూనే ఉంటుంది. ఒక్కోసారి అన్నంకూడా పెట్టకపోతే తనకేరేజీలో అన్నం పెట్టిన సందర్భాలెన్నో ఉన్నాయి. ఆ పరిస్థితి తనకు కలగకూడదనే అతని బాధ. పోనీ తండ్రిని విడిచి తన కన్న ఊరు వెళ్లిపోదామంటే శైశవంలోనే ఆయన ఒళ్లో చేరాడు. పైగా కన్నవారికి తనవల్ల అదనపు బాధ్యత. ఏది ఏమైనా తనమంచి చెడ్డలు యిక్కడే ఈయన తోనేవున్నాయి. వయసుకు మించిన ఆలోచనలతోటి, తల్లి మీద బెంగతోటి అతను రోజురోజుకూ శుష్కించి నీరసించిపోతున్నాడు.

వారం రోజులై పిల్లవాడు జ్వరంతో బాధపడుతుంటే రామారావుగారికి ఏమీ తోచటంలేదు. పాపం! మధుసూదనంగారి భార్య ప్రేమగలది, ఓర్పుగలది ఆమె రోజూ వచ్చి రామారావుగారిని బలవంతంగా స్కూలుకు పంపేది.

"పిల్లలన్నాక... జ్వరంరాదా! అన్నయ్యగారూ! మీరిలా బెంగపడితే ఎలా చెప్పండి? నేనున్నాను కదా! స్కూలుకు వెళ్లండి" అంటూ భర్తతో పాటు బలవంతంగా ఆయనను సాగనంపేది.





సాయంకాలం వాళ్లు స్కూలునుండి వచ్చేస రికి ఆయనకు వంటవండి పిల్లాడికి బార్లీకాచి ఉంచేది.

"సరస్వతమ్మగారూ! మీరిలా చెయ్యటం నాకు చాలా బాధగా ఉంది. నేనూ మా రఘూ మిమ్ములను చాలా కష్టపెడుతున్నాం. నేను లేని సమయంలో నా బిడ్డను చూస్తున్నారు. చాలదా! మీరీ పనులన్నీ ఎందుకు చేస్తున్నా రు? నన్ను ఋణగ్రస్తుణ్ణి చేస్తున్నారు" అంటూ విలవిలలాడేవారు.

"మాకు ఏదైనా అవసరం వస్తే మీరు సాయంచేయరా అన్నయ్యగారూ! స్నేహితుల న్నాక ఒకరికొకరు సహాయపడకపోతే ఎలాగ? వదినగారు పోయిన తర్వాత మీరు చిన్న విషయాన్ని కూడా ఎక్కువగా చేసుకొంటున్నా రు" అంటూ ఆమె చెప్తోంటే మధుసూదనంగా రు అందుకొని "మనమధ్య కృతజ్ఞతలూ... ఋణాలు ఏమిటి మాష్టారూ? అందుకే మిమ్మ ల్ని మళ్లీ పెళ్లిచేసుకోమంటున్నాం" అంటూ వచ్చిన అవకాశాన్ని నేర్పుగా ఉపయోగించేరు.

రఘు జ్వరంవల్ల భయపడి నర్మదకు కబు రు పెట్టక తప్పలేదు రామారావుగారికి. నర్మద, మాధవి కబురందిన వెంటనే పరుగున వచ్చే రు. వారం రోజులవరకు తమకు ఈ విషయం తెలియజెయ్యనందుకు నర్మద అన్నగార్ని చీవాట్లు పెట్టింది.

మాధవి అయితే "ఏమిటి రఘూ ఈ జ్వరం? ఎప్పుడూ నీకు రానిది... యిప్పు డెందుకు వచ్చింది చెప్పు. అమ్మకోసం బెంగ పెట్టుకొన్నావా? నాన్న చూడు నీగురించి ఎలా అయిపోయారో!" అంటూ వాపోయింది.

నిజమే రఘు జ్వరంతో ఆయనకు మతిపో యింది. పార్వతిలా రఘు కూడా తనకు దక్క కుండా పోతాడేమోనని ఆయన చాలా భయప డ్డారు. రఘుకు జ్వరంలో రెండు, మూడుసార్లు పార్వతి కలలో కనిపించింది. దాంతో జ్వరతీవ్ర తతో రఘు... ఆ బాధతో ఆయన నీరసించిపో యారు.

నర్మద చేతిలో ఏ మంత్రమున్నదోగాని ఆమె ఆదరణతో... రఘు జ్వరం మటుమాయ మయ్యింది. రెండు, మూడు రోజులలో పథ్యం కూడా పెట్టారు. సరస్వతమ్మ, వర్ధనమ్మగార్లు రోజూ వచ్చి చూసివెళ్తుండేవారు.

ఒరోజు అందరూ కలిసి కూర్చొన్నప్పుడు వర్ధనమ్మగారు నిర్మొహమాటంగా "చూడండి అన్నయ్యగారూ! పోయిన వాళ్లపై ఎంత ప్రేమ ఉన్నా... వారితోపాటే మనం పోలేంకదా! మన బాధలూ... మన కష్టాలూ మనకు తప్పవు. మీకు నేను చెప్పవలసిన దాన్ని కాదు. పెళ్లి అనేది ఒకరికొకరు తోడుకోసమేకదా! నర్మదమ్మ రాగానే పిల్లాడు ఎలా కోలుకున్నాడో చూడండి. మీరు మగవారు. మీరు ఎంత చేసినా తల్లి లేని లోటు లోటే... మీరు మాత్రం ఏం బాగు న్నారు? అటు స్కూలు పనితో... యిటు యింటి పనితో నలిగిపోతున్నారు. మనకు తెలిసిన వాళ్లు గనుక వాళ్ల పిల్లనిస్తామని కాళ్లా... వేళ్లా పడుతున్నారు. మీరు సరియైన నిర్ణయం తీసుకోటంలేదని నా ఉద్దేశ్యం" అని పుటుక్కున తెగేసి చెప్పారు.

"అవునండి! వర్ధని చెప్పింది నిజమే... మీరిలా బాధపడుతుంటే మా మనసులు ఎంత క్షోభిస్తున్నాయో తెల్సా! గతాన్ని ఎంత మరచిపోలేకపోయినా... వర్తమానపు అవసరా లు తీరవుకదా! మీరు మాకోసం... రఘుకోస మైనా మళ్లీ పెళ్లిచేసుకోవాలి. ఏమ్మా నర్మదా! నువ్వైనా చెప్పు" అని ఆమెవైపు చూశారు చక్రధరంగారు.

"నేనూ మా అన్నయ్యకి ఎప్పుడో చెప్పా నండి. వదిన పోయిన తర్వాత మా అన్నయ్య పెదవులపై నేను నవ్వు చూడలేదు. ఆయు ర్దాయం తీరి ఆవిడ పోయింది. మేమా ఈ ఊళ్లో లేము. అన్నయ్య గురించి ఎంత బెంగగా ఉంటుందో. ఎవరో ఒకరు నెమ్మదైన అమ్మాయిని చూసి అన్నయ్యకు చేస్తే బాగుంటుందని నా ఆలోచన. బెజవాడలో కూడా యిద్దరు... ముగ్గురు దూరపు బంధువు లు సంబంధాలను గూర్చి చెప్పారు. యింతకీ అన్నయ్య ఒప్పుకోవాలికదా!" అని అంది నర్మద.

"నీకు తెలియదమ్మా! దగ్గర దగ్గర నలభై ఏళ్లు వస్తున్న నాకు పెళ్లెందుకు? నేను ఒకవేళ పెళ్లి చేసుకొన్నా నాకు భార్య వస్తుందిగాని... రఘుకు తల్లిరాదు. రెండవ పెళ్లి చేసుకోవల సివస్తే ఎన్ని కష్టాలు పడవలసివస్తుందో!

అదంతా రిస్క్‌తో కూడిన విషయం. నాకు అంతటి సాహసం లేదమ్మా!'' అని రామారావు గారన్నారు.

ఆయన మాటలు విన్న చక్రధరంగారు దెబ్బలాడేరు. "మీరు మరీను... విడ్డూరంగా చెపుతున్నారు. ద్వితీయ వివాహం చేసుకొన్నవాళ్లంతా కష్టాలు పడుతున్నారా? మన పరిస్థితులతో యిమిడిపోయే అమ్మాయిని... మనకు సమస్యలు తేని అమ్మాయిని బాగా తెలిసిన వాళ్ల పిల్లనే చేసుకుందాం'' అనగానే-

"అది కాదండి! ఎప్పుడైనా పునర్వివాహం చేసుకొనేవాళ్లు ఏ నిరాశ్రయురాలైన వితంతువునో చేసుకోవాలి. పిల్లలున్నా ఫరవాలేదు. ఒక మోడువారిన జీవితానికి దారి చూపినట్లు ఔతుంది. యిద్దరూ జీవితంలో ఎదురు దెబ్బలు తిన్నవాళ్లే కాబట్టి సహృదయంతో ఒకరినొకరు అర్థంచేసుకోగలరు. ఆవేశాలు, పోట్లాటలుండవు. ఆసరాకోసం చేసుకొన్న వివాహం గనుక ఒకరినొకరు సానుభూతితో అర్థంచేసుకొంటారు. అదే ఏ కన్నె పిల్లనో చేసుకొంటే వారి అసంతృప్తికి... కన్నీళ్లకు కారణం కావలసి వస్తుంది'' అని రామారావుగారన్నారు.

"అయ్యయ్యో! ఏం అఘాయిత్యమండీ! వితంతువును వివాహం చేసుకోవటమా? మీకేం అంత కర్మ పట్టిందండీ! ఈ ఊర్లోనే కాంతమ్మగారి అమ్మాయి సుందరి ఉంది. ఆ అమ్మాయిని యధాలాపంగా మీరు ఒకసారి చూడండి చాలు. మిగిలిన విషయాలు మేం చూసుకొంటాం'' అని వర్ధనమ్మ తేల్చేసి ముందుగా లేవటంతో... మిగతావాళ్లు ఆమెని అనుసరించక తప్పలేదు. రామారావుగారికి తెలుసు తన భావాలు ఎవరికీ నచ్చవని. వారు మౌనంగా మ్రాన్పడిపోయారు.

నర్మదమాత్రం రాత్రి పడుకొనేటప్పుడు అనుకుంది 'అమ్మా కాంతమ్మా! నీ పని అవటంకోసం వర్ధనమ్మను పట్టావా? ఏమైనా ఘటికురాలివే. నీ పిల్ల ఏ బంగారపు పువ్వుల్తోనో పూజచేసి ఉంటుంది. లేకపోతే అన్నయ్యలాంటి దేవుడు భర్తగా లభిస్తాడా!' అనుకొంది మనస్సులో.

రాత్రి పడుకొనేటప్పుడు వర్ధనమ్మ భర్తపైన గయ్యిమని లేచింది. "మంచి స్నేహితుణ్నే సంపాదించారు. శుభమా అని పెళ్లి విషయం ఎత్తితే వితంతువును చేసుకొంటానంటాడు. అతనేం మనిషండీ బాబు'' అని బుగ్గలు నొక్కుకుంది.

"నీకు మా స్నేహితుడిని గూర్చి ఏం తెలుసు? నీ బుర్ర అంతే... నీ ఆలోచన అంతే... అంతకన్నా మీ ఆడవాళ్లకు ఏం తెలుస్తుంది. ఆయన ఔన్నత్యం ఛస్తే మీకు అర్థం అవదు. ఒక వితంతువును చేసుకోవటంవల్ల... మోడువారిన ఆమె జీవితానికి వెలుగు చూపించినట్లౌతుంది. సమాజంలో ఆమెకు రక్షణ కల్పించినట్లౌతుంది. సామరస్యంతో ఒకరినొకరు అర్థంచేసుకోవటంవల్ల ప్రశాంతజీవితం లభిస్తుందని ఆయన అలా అన్నారు. వారికిగల ఆలోచనాశక్తి, సహృదయం నీకెలా అర్థమౌతుంది? ఆయన ఎంతో సహనం... క్షమాగుణం కలవారు. ఒకసారి ఏం జరిగిందో తెలుసా? పరీక్షహాల్లో మా అందరికంటే చాలా స్ట్రిక్ట్‌గా ఉంటారని తెలిసి ఒకసారి టెంత్‌క్లాస్ పరీక్షల ముందే ఒక ఎం.యల్.ఏ. తమ విద్యార్థిని చూసీచూడనట్లు ఉండమని కబురంపారు. ఆ వత్తిడికి ఆయన లొంగలేదు సరికదా నిర్మోహమాటంగా తన హయాంలో అలా జరగదని తిరిగి కబురంపారు. వారు వాచింగ్‌చేసిన రెండు రోజులూ... ఆ అబ్బాయికి ఏదీ అందలేదు. తత్ఫలితంగా పరీక్ష తప్పాడు. తన యింటికి వచ్చి నిందించబోయిన ఎం.యల్.ఏ.తో "మీ బాధ నాకు తెలుసు. మీ అబ్బాయికి నేను చదువుచెప్పి మెరిట్‌తో ఉత్తీర్ణున్ని చేయిస్తాన''ని మాటిచ్చి పంపారు. తర్వాత అన్నమాట నిలబెట్టుకున్నారు. మరొకరైతే ఆ తండ్రి మొహం... ఆ పిల్లవాని మొహం చూడరు'' అంటూ ఆవిడ నోరు మూయించారు.

చివరకు స్నేహితుల బలవంతంవలన, నర్మద పోరువలన ఆయన మళ్లీ పెళ్లికి ఒప్పుకోక తప్పలేదు. పిల్లను చూడనక్కరలేదని మొత్తుకున్నా చక్రధరంగారి బలవంతంవల్ల వారింటిలోనే పెళ్లిచూపులేర్పాటయ్యాయి.

రామారావుగారు సుందరిని సూటిగా "మీకు ఈ వివాహం యిష్టమేనా? నాకు ఒక కొడుకు ఉన్నాడు. నాకు వాడి మంచిచెడ్డలు ముఖ్యం. కనుక వాడి విషయంలో మీతో ఏవిధమైన పేచీ ఉండకూడదు. మీకు యిష్టంలేక




పోతే చెప్పేయండి... మీ తల్లిదండ్రుల బల వంతంతో అంగీకరించవద్దు. జీవితంపై నాకు పెద్ద ఉత్సాహంలేదు. నాతో జీవితం మీకు సరదాగా ఉండకపోవచ్చును. కనుక మీరు అన్నీ ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రండి" అని చెప్పారు.

సుందరి ఆయన నిజాయితీకి ఆశ్చర్యపో యింది. ఇక రూపంలో మంచి ఒడ్డూ, పొడు గైన మనిషి. తెల్లటి శరీరచ్ఛాయ... మంచి కళ అయిన మొహం. ఆయనలోని రీవికి ముఖవ ర్చస్సుకి ఆమె ఆశ్చర్యపోయింది. పెదవి విప్పి మాట్లాడలేకపోయింది. మౌనంగా అంగీకారా న్ని తెలియజేసింది. చివరికి వారి వివాహం కోవెలలో నిరాడంబరంగా జరిగింది.

రఘు ప్రమేయంలేకుండానే సుందరి అతని తల్లి స్థానంలోనికి వచ్చేసింది. అతనికి స్కూలు పోతుందనీ, పసివాడు తండ్రిపెళ్లి చూడరాదనీ, మధుసూదనంగారు రఘుని తమ ఇంట్లో ఉంచారు. వాళ్లు పెళ్లి చేసుకొని వచ్చిన తర్వాత రఘును వాళ్లింటికి పంపించారు.

నర్మద అతనిని దగ్గరకు పిలిచింది. "ర ఘూ కాళ్లు కడుక్కోనిరా... టిఫిన్ పెడతాను" అని. రఘు మౌనంగా తన గదిలోకి వెళ్లాడు. మాధవి వచ్చి తండ్రి రమ్మంటున్నారని చెప్ప గానే తండ్రి గదిలోకి వెళ్లాడు. గదిలోకి వచ్చిన రఘును చేరదీసి అతని మొహంలోనికి ప్రే మగా చూస్తూ "నాయనా! రఘూ! నీకు ఒక విషయం చెప్పాలి. నేను నీకోసం... నా శేషజీ వితం కోసం మళ్లీ పెళ్లి చేసుకొన్నాను. ఈ పనిగుర్చి నీతో ఆలోచించటానికి నీకు తగిన వయస్సులేదు... మనకు ఒక ఆసరా కావాలి. మొన్న నీ జ్వరంలో మనం ఎంతో కష్టపడవల సివచ్చింది. అందుకే నీకు బాగా చదువు చెప్పించడానికి... సౌకర్యం కల్పించటానికి నేను మళ్లీ పెళ్లికి సిద్ధపడవలసివచ్చింది. నీవు ఆమెను చూడలేదుకదా!" అంటూ "న ర్మదా!" అని పిలిచి సుందరిని పిలవమన్నా రు.

సుందరి వచ్చి బిడియంగా గుమ్మంలో నిలుచుంది. "ఇకనుంచి ఈమే నీకు తల్లి. ఈరోజే మన ఇంటికి వచ్చింది. నీవు అమ్మా! అని పిలిచినా... పిన్నీ! అని పిలిచినా నీ ఇష్టమే. మీరిద్దరూ అన్యోన్యంగా ఉండాలి" అంటూ "సుందరీ! ఇతడే రఘు. నా ఆరో.. ప్రాణం. వీడు ఏ విషయంలోనూ కంట తడిపె ట్టకూడదు. వీడిని ఇక నుండి జాగ్రత్తగా చూసుకో" అంటూ వారిద్దరినీ పరస్పరం పరి చయం చేసారు.

రఘు మనస్సులో ఎన్నో ఆలోచనలు! అత్తతో చెప్పి పార్కువైపు బయలుదేరాడు. అతనికి మొదటి చూపులోనే సుందరి నచ్చలే దు. ఆవిడ వదులు జడ, పోకు అంతకన్నా నచ్చలేదు. "అమ్మట...అమ్మ... అమ్మ ఇలాగ ఉంటుందా!? మా అమ్మ పవిత్రరూపమే వేరు" అని అనుకొన్నాడు. అతనితోబాటే వచ్చిన మాధవికూడా అత్తపై సదభిప్రాయం చూపలేదు... తిరిగి తిరిగి ఇల్లు చేరుకున్న ఇద్దరికీ నర్మదే అన్నం పెట్టింది.

కాంతమ్మ "అదేంటి ఈ అబ్బాయి పెదవి విప్పి మాట్లడడేమిటి? నాయనా! నేను నీకు అమ్మమ్మనౌతాను. మీ అమ్మని చూశావుకదా! నీకు నచ్చిందా?" అని ఆరాలు ప్రా రంభించింది.

"చూడండీ! ఆవిడ మా అమ్మకాదు. మా అమ్మ ఆ ఫొటోలో ఉన్నారు. మరోసారి ఏ విషయం చేప్పే అలవాటు నాకు లేదు. ఏ విషయమైనా ఒక్కసారే చెప్తాను" అంటూ కంచంలో చెయ్యి కడుక్కొన్నాడు రఘు.

"అదేంట్రా! రఘూ! కడుపునిండా అన్నం తినకుండా మధ్యలో లేచి వెళ్ళిపోతున్నావు" అంటూ గోలబెట్టింది నర్మద. అతని చేత బలవంతంగా పాలు తాగించింది. సుందరిని తల్లిస్థానంలో భరించలేకపోతున్నాడు రఘు.

★ ★ ★

ఒంటరిగా కూర్చొని గతచరిత్రను నెమరువే సుకుంటూ ఆలోచనల్లో మునిగిపోయిన రఘు దగ్గరికి వచ్చింది సుమతి.

"మీరేమిటిలా తోటలో ఉండిపోయారు. మామయ్యగారికి మాత్రలు ఇవ్వాలి కదా! హార్లి క్సు కూడా ఇవ్వాలి. రండిలోపలికి" అంటూ పిలిచింది.

రఘు ఉలికిపాటుగా తలఎత్తాడు.



"ఎంతటి ప్రశాంతమైన మనిషి ఈమె. ఏ విషయంలో తొందరపడదు... కలవరపడదు. ఆ మొహం ఎంతో పవిత్రంగా ఉంటుంది. ఆ కళ్లు ఎంతో స్నేహపూరితంగా ఉంటాయి" అని తనలో తను అనుకొంటూ ఆమెవంక తదేకంగా చూస్తున్నాడు.

"ఏమిటండీ! మీ ఆలోచన... ఎంతకీ తెగ డంలేదు... పదండి లోనికి... మాధవి భోంచే యలేదు. మీకోసమే కూర్చొంది" అంటూ అత నిని తొందరచేసింది.

"ఆవిడ ఏం చేస్తున్నారు? నాన్నగారు లేచారా?" అంటూ అడిగాడు రఘు.

మామయ్యగారు లేవలేదు. అత్తయ్యగార్ని మాధవి బలవంతంగా లేవదీసి స్నానం చే యించింది. ఆవిడ మా బలవంతంపైన కొంచెం ఎంగిలిపడిలేచారు. ఉదయం మామ య్యగారిని చూడొచ్చు, మాట్లాడవచ్చునని చె ప్పింది మాధవి. మేము ఆమెను కొన్ని ఊర డించాం. మేం మీకు బాధ కలిగించేలా ప్రవ ర్తించడం లేదుకదండీ!?" అంటూ భర్త మొ హంలోకి చూసింది సుమతి.

"లేదు సుమతీ! మీరిద్దరూ నాకన్న ఆలోచ నాపరులు. అందుకే మీరేం చేయాలో వివే కంగా ఆలోచించి అదే చేశారు. ఆమె విష యంలో ఏ విధమైన నిర్ణయమైనా నాన్నగారే తీసుకోవాలి. మనకు ఆమెను పొమ్మనే హక్కులే దు. మనఇంటికి వచ్చిన పరాయి వ్యక్తినైనా ఆతిథ్యం ఇవ్వకుండా పంపంకదా!" అంటూ తమను సమర్థిస్తున్న భర్తను చూచి ఆశ్చర్యపో యింది సుమతి.

"సాయంకాలం సుందరి రాకతో బుసలుకొ ట్టిన ఆ రఘు ఈయనేనా!? ఆ ఆవేశం... ఆ కోపం ఏమయ్యాయి? అపరరుద్రుడులా అని పించారే! అప్పుడు కోపం మూర్తీభవించిన ఆయనని కనీసం పలకరించే సాహసం కూడా తను చేయలేకపోయిందే! మాధవి కనుక ఆయనను నిలువరించ గలిగింది. సమయాని కి తీసుకోలిసిన నిర్ణయాన్ని తీసుకోగలిగింది" అని పరిపరివిధాల విస్తుపోతోంది సుమతి.

"సుమతీ! నాకు భోజనం చేయాలని లేదు. తల నొప్పిగా ఉంది. నువ్వు ఇలా వచ్చికూర్చో... నీ వడిలో తల వాల్చి పడుకొంటాను" అని ఆవేదనగా అంటున్న అతని తలను తన వడిలోనికి తీసుకొని కూర్చొంది సుమతి. ఆమె వడిలో సేదతీరిన అతని మనస్సు శాంతించింది.

"అక్కా!" అన్న మాధవి పిలుపుతో మరికా సేపటికి ఇద్దరూ లేచి ఇంట్లోకి నడిచారు.

రఘు నెమ్మదిగా తండ్రిని లేపి "నాన్నగా రూ! ఎలా ఉంది? గుండె నొప్పిలేదుకదా!? కాస్త కుదురుగా లేవండి" అంటూ ఆయనను నెమ్మ దిగా లేపి... తన గుండెలపై ఆయన తలని ఆనించి మాత్రలు వేసి... హార్లిక్సు పట్టాడు. ఛాతీపై నెమ్మదిగా రాస్తూ పడుకోబెట్టి దుప్పటి కప్పాడు.

అంత మత్తులోనూ "నిన్ను చాలా శ్రమపె డుతున్నానురా! భగవంతుడు నన్ను త్వరగా పిలిస్తే బాగుండును" అన్నారాయన.

"అదేంటి నాన్నగారూ! మీకు సేవచే యడం నాకు శ్రమా? అది నాకు బాధ్యత. దానిలో నాకెంత తృప్తి ఉందో మీకు తెలియ దు" అన్నాడు రఘు. "సర్లేరా! నీవో పిచ్చివా డివి. నీ భోజనం అయిందా?" అంటూ సమా ధానం కోసం చూడకుండా అటుతిరిగి పడుకొ న్నారు.

పక్షవాతం వచ్చి ఒక్కాలు, చెయ్యి చచ్చుబ డిపోయిన దగ్గరనుండీ రఘూయే ఆయనకు అన్నీ చేస్తున్నాడు. ప్రతిపూట కొడుకు మాత్ర లు వేసేటప్పుడు... అతని భోజనం గురించి అడగనిదే ఆయనకు నిద్రపట్టదు. ఆ తండ్రీ కొడుకుల్ని చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. 'వాళ్లు తండ్రీకొడుకులా??' అని.

తండ్రిపని పూర్తిచేసి భోజనానికి నడిచాడు. అతడి ముఖంలోని ప్రశాంతతను గమనించి "అమ్మయ్య" అనుకొంది మాధవి. చెల్లెళ్లను చూస్తూ "శాంతా! రండమ్మా! భోజనం చేద్దాం" అని పిలిచాడు. చిన్న చెల్లెలు అలవాటుప్ర కారం అన్నగారి ప్రక్కనే కూర్చొంది. ఆ కూర, చారూ మెతుకులు తిన్నామనిపించి లేచారు. అన్నయ్య గంభీర వదనాన్ని చూచి తమని మరిపించటానికి అతను చేస్తున్న విఫలయ త్నాన్ని గుర్తించి వసారాలో మాట్లాడకుండా పడుకొన్నారు. మాధవి, సుమతి... సుందరితో




కలిసి గదిలో పడుకొన్నారు.

రఘు తండ్రి గదిలో వాలుకుర్చీలో పడుకొన్నాడు. ఆయనకు పక్షవాతంతోబాటు నాలుగు రోజుల క్రితమే మైల్డ్ హార్ట్ స్ట్రోక్ వచ్చింది. ఈరోజే హాస్పిటల్ నుండి ఇంటికి తీసుకొనివచ్చారు. డాక్టర్ ఇచ్చిన మందులు తెల్లవార్లూ ఎవరోఒకరు కనిపెట్టుకుని రెండుగంటల కొకసారి వేయాలి. అందుకే అతను తండ్రి గదిలో నిద్రపోకుండా వాలుకుర్చీలో కూర్చొన్నాడు. సుమతి వచ్చి కొంతసేపు అతనికి సాయంగా కూర్చొంది. ప్రొద్దుటనుండి శారీరకంగా... మానసికంగా అలసి వుందని ఆమెకు నచ్చజెప్పి పంపేశాడు. కుర్చీలోవాలి తండ్రిని చూస్తున్న అతని కళ్లు అప్రయత్నంగా చెమర్చాయి. తన తల్లి పార్వతి పోయినప్పటినుండీ ఆయన ఏనాడూ సుఖపడలేదు. అరవైఏళ్లు దాటకపోయినా అకాల వార్ధక్యం ఆయనలో కనిపిస్తోంది. ఆయనంత దురదృష్టవంతులెవ్వరూ ఉండరు. ఆలోచనగా తండ్రివైపు చూశాడు. చలనం కోల్పోయిన తండ్రి కాలు, చేతిమీద అతని దృష్టి నిలిచింది. ఎంతో ఆరోగ్యవంతమైన తన తండ్రి ఈరోజు ఎంత అనారోగ్యంతో నిలిచాడు. కాలం మళ్లీ వెనుకకు వెళ్లగలదా? ఆయనను ఆ ఠీవితో... ఆ దర్పంతో... ఆనందంగా కళ్లముందుంచగలదా? ఆలోచనలతో అతని మనస్సు అతని ప్రమేయం లేకుండా గతంలోకి జారిపోయింది. అది మధురమైనది అయినా... కాకపోయినా ఆ అనుభవాలను స్వీకరించక తప్పదు.



**తొ**లినాళ్లనుండి కాంతమ్మని చూస్తే రఘుకి అసహ్యంగా ఉండేది. ఆవిడ అవతారాన్ని చూస్తే కంపరం వచ్చేది. ఎప్పుడూ కిళ్లీ తినడమేపని. పెద్ద ఏదో అధికారం ఉన్నదానిలాగా "రఘూ... రఘూ" అంటూ పిలిచేది. అసలు నర్మదత్త ఉన్నన్నాళ్లు వారితో అతనికి పనికలగలేదు.

"పిల్లలున్నారు. అన్నయ్యకు ఇలాంటివి నచ్చవ"ని నర్మదత్త చెప్తున్నా వినకుండా తన భర్తను పంపి తెప్పించిన గంపెడు పూలతో కూతురికి జడకుట్టి గంగిరెద్దులాగా తయారు చేసింది వారంరోజులవరకూ.

అక్కడికీ నాన్నగారు "అనవసరమైన హంగామాలు వద్దని చెప్పు నర్మదా" అన్నారు సిగ్గువిడిచి.

అత్తమాట వినేవారు ఎవరు? ఏ మూల నుండి వినేదోకాని "అలా అంటే ఎలా బాబు? మీకు సరదాలు, కోరికలు లేకపోవచ్చు... కానీ మా అమ్మాయికి ఉంటాయిగదా. దానికి ఇది మొదటి పెళ్లేకదా! బొట్టూ, పువ్వులపై ఆడదానికి ఆశ ఉండదా" అంటూ పురాణం మొదలుపెట్టింది. మరి ఆయన జవాబు చెప్పకుండా వెళ్లిపోయేరు.

అత్త వారంరోజులు గడవగానే బెజవాడ బయలుదేరింది మామయ్యకు ఇబ్బందని. తను అత్తయ్యను పట్టుకుని ఏడ్చాడు. అమ్మపోయాక తను అత్తయ్యకు ఎంత దగ్గరయ్యాడో అప్పటికిగాని తెలియలేదు. ఆవిడకూ చాలా దుఃఖం వచ్చింది. నాన్నగారు అత్త వెళ్తోంటే నాలుగొందల రూపాయలు చేతిలో పెట్టారు. అమ్మ పట్టుచీర తెచ్చి అత్తకిస్తూ- "నర్మదా... మీ వదినకు నువ్వంటే ఎంతో ఇష్టం. ఈ చీర ఆమెది. నీ కభ్యంతరం లేకపోతే తీసుకో దీన్ని. అలాగే ఈ జడగంటలు మాధవికి ఇవ్వు. మీ వదిన దానికి వీటితో జడవేసి మురిసిపోయేది... ఇవి నా కెందుకు. మీ వద్ద ఉంటేనే ఆవిడ ఆత్మకు తృప్తి" అని అన్నారు.

అత్త ఏడుస్తూ ఆయనని ఎంత వారించినా వినలేదు. "సుందరి ఉంది. రేపు నీకూ పిల్లలు కలుగుతారు. మా కెందుకన్నయ్యా. ఇవన్నీ" అన్నా ఊరుకోలేదు. "నీవు ఈ ఇంటికి చేసిన సేవ, నన్ను సేదతీర్చిన విధమూ జన్మలో

మరిచిపోలేనమ్మా! ఏమిచ్చినా నీకు తక్కువే. ఈ ఇంటికెప్పుడూ నీవు ఆడపడుచువే. ఆ గౌరవాలు అందుకోవలసినదానివే" అంటూ బలవంతంగా ఇచ్చేశారు.

కాంతమ్మ మొహం మాడిపోయింది. సుందరివైపు ఒకచూపు విసిరింది. ఆయన దగ్గర మాట్లాడే చనువు లేక ఆమె మౌనంగా ఉండిపోయింది.

నాన్నగారు వెళ్లి అత్తని రైలు ఎక్కించివచ్చారు.

ఏ ముహూర్తంలో తల్లి చనిపోయిందోగాని తన జీవితం ఒడిదుడుకులు పాలయ్యింది. ఎన్నెన్నో చేదుఅనుభవాలు? ప్రశాంతమైన వాతావరణమే కరువైపోయింది. సుందరి పిన్ని ఎప్పుడైతే ఇంట్లో అడుగుపెట్టిందో అప్పటినుండి తమ జీవితపుతీరు మారిపోయింది. పాపం నాన్నగారు 'పెళ్లి వద్దు' అంటూ అందుకే కాబోలు గోలపెట్టారు.

తను ఆమె కూతుర్ని "అమ్మా" అని పిలవలేదని కాంతమ్మకు ఎంత ఉక్రోషమో. "అమ్మా" అని పిలవమని తనకి ఎన్నోసార్లు చెప్పింది. తను మాత్రం వినలేదు. అమ్మంటే తనకు తనతల్లే గుర్తొస్తుంది. వేరెవర్నీ ఆ విధంగా "అమ్మా" అని పిలవబుద్ధి కాదు. అందుకే తను సుందరిని "పిన్నీ" అని పిలిచేవాడు.

"ఏం నాయనా! మీ నాన్నగారు పెళ్లాడాక ఆవిడ నీకు తల్లి కాకపోతుందా- అమ్మా అని పిలిస్తే నీ నోటిముత్యాలు రాలిపోతాయా?" అంటూ వాదనకు దిగేది కాంతమ్మ.

ఒకసారి నాన్నగారు ఆ వాదన విని "సుందరీ... వాడికి ఎలా పిలవాలనిపిస్తే అలాగే పిలవనీ. వాడు బొత్తిగా పసివాడు కాదుగదా. తల్లిరూపం, తల్లిమాట మరిచిపోవటానికి. వాడితో ఎందుకు వాదిస్తారు" అన్నారు.

"నాకేమీ అమ్మా అని పిలిపించుకోవాలని లేదు. నా బదులు నువ్వెందుకలా గోలపెడతావు? వాడెలా పిలిస్తే నాకేం? నువ్వెందుకలా మధ్యలో బాధపడిపోతున్నావు? ఆ పిలుపుతో మురిసిపోవాలని నేనేం కలలు కనటంలేదు" అంటూ తల్లిమీద గయ్యిమని లేచింది సుందరి.

ఏమాట కామాటే చెప్పుకోవాలి. శర్మగారికి ఇన్నిరోజులు అల్లుడి ఇంట్లో ఉండిపోవటం నచ్చలేదు. "వెళ్లిపోదాం పదవే" అంటూ పదే పదే భార్యని సతాయిస్తున్నారు.

ఎప్పుడూ "ఉండండీ... పిల్ల కాపురానికి కొత్త. నాలుగు విషయాలు చూసుకొనేవరకూ ఉండవద్దా. ఇప్పుడేం కొంప మునిగిపోయిందని అలాగా గొడవ పెడుతున్నారు. వెళ్లొచ్చులెండి. అక్కడ ఏ రాచకార్యాలూ మండిపోవడంలేదు" అంటూ ఈసడించి పారేసింది. రామారావుగారికి వారి గురించి కొద్దికొద్దిగా అర్థమవుతోంది. అసలు ఆయనకు బయట ఎక్కువగా తిరిగే అలవాటు లేదు. అందువలన వారి సంభాషణలు బాగానే వినబడేవి.

శనివారంనాడు ఒకసారి ఆయన "రఘూ! కుంకుడుకాయలు కొట్టినవి ఉన్నాయేమో చూడు. నీకు తలంటిపోయాలి" అని నూతివైపుకు నడిచారు. "అదేమిటి నాయనా... నువ్వు ఆడదానిలాగా బాబుకి తలంటిపోయడమేమిటి? మేమూ లేమూ!?" అంటూ కాంతమ్మ గబగబా కూతురిని పిలిచింది.

"వాడు చిన్నవాడు కదండీ. వాడికి వాళ్లమ్మే నలుగుపెట్టి తలంటిపోసేది. తర్వాత నేనే పోస్తున్నాను వాడికి. పులుసు పోసుకుంటూ రుద్దుకోవడం వాడివలన ఏమవుతుంది?" అంటున్న ఆయన చేతిలోని గిన్నె వంటింటిలో ఏదో పనిలోఉన్న సుందరి వచ్చి తీసుకొంది. "నేను పోస్తాను మీరు పదండి" అంటూ.

అల్లుడు తన గదిలోకి వెళ్లేంతవరకూ ఊరుకుని తను కూడా ఒకబిందె పట్టుకొని వచ్చింది కాంతమ్మ. "చూడు నాయనా రఘూ! నువ్వు పదవతరగతి చదువుతున్నావా? నీ పనులు నువ్వే చేసుకోవాలి. కుంకుడుకాయల రసం తీసుకుని ఒక గిన్నెలో ఉంచుకోవాలి. కొద్దికొద్దిగా ఒక చేతితో పోసుకొంటూ ఒకచేత్తో రుద్దుకోవాలి. అయినా ఆడపిల్లవా? పెద్ద జుట్టుందా? మీ పిన్నికి ఉదయంవేళ ఎన్ని పనులుంటాయి చెప్పు. అది మాత్రం ఒక్కర్తే అన్ని పనులూ చేసుకోవద్దూ! ఉదయం అసలే హడావుడి. మీ నాన్నగార్కి, నీకు స్కూలు టైముకి




వండిపెట్టాలి. వంటిల్లు, దేవుడుగది శుభ్రం చేసుకోవాలి. నీ పనులు నువ్వు చేసుకున్నావను కో... దానికి కొంత సులువుకదా" అంటూ దీర్ఘాలు తీసింది కాంతమ్మ. మళ్ళీ మరొకవైపు "వీపు రుద్దమంటావా నాయనా" అంటూ ప్రేమ ఒలకపోసింది.

రఘుకి ఆవిడ అనడంకన్నా... పిన్ని ఏమీ బదులు పలకకపోవడం కష్టం కలిగించింది. అమ్మ మాత్రం ఈ పనులన్నీ ఒక్కర్తీ చేసుకోలే దూ. మరి పిన్నెందుకు చేయలేదో అతడికి అర్థం కాలేదు. ఒకటి మాత్రం గ్రహించాడు. తన పనులు మాత్రం చెయ్యడం వాళ్లకు ఇష్టంలేదని.

మళ్ళీ వారం రఘు చీకటినే లేచి... తల్లి తండ్రీ లేవకముందే తలంటిపోసుకున్నాడు. "ఎందుకలాగా చేశావు? మీ పిన్ని పోసేది కదా" అంటూ నిద్ర లేవగానే కంగారుగా అడిగారు రామారావుగారు. "తల సరిగ్గా తు డుచుకొన్నావో లేదో" అంటూ దగ్గరికి తీసుకొని తల తుడిచారు ప్రేమగా.

"ఏం లేదు నాన్నగారూ! నేను పెద్దవాడినౌ తున్నానుకదా! నా పనులు నేనే చేసుకొంటే బాగుంటుందని నేనే తల రుద్దుకొన్నాను" అంటూ గబగబా లోనికి వెళ్ళిపోయాడు రఘు. 'ఎవరో ఏదో అని ఉంటారు. అందుకే వాడ లాగ ఉన్నాడు' అనుకొన్నారు మనసులో.

అక్కడికీ... ఆయన కొత్తవారు సరిగ్గా చూస్తా రో చూడరో అని... రఘు మొహమాటపడతా డనీ... రఘుని తనతోనే భోజనానికి కూర్చోపెట్టు కొనేవారు. టిఫిన్, కాఫీ తనే స్వయంగా చూసి పెట్టించేవారు. ఇది కొంచెం కష్టం కలిగించినా ఆడవాళ్లు ఏమీ అనలేకపోయేవారు.

అల్లుడు తమతో ఎక్కువ మాట్లాడకపో వటం ఒక పక్క, భర్త పోరు ఎక్కువై మరోప క్క... తమ యింటికి బయలుదేరింది కాంత మ్మ. "ఏడవకే పిచ్చిమొహమా! ఊళ్లోనే ఉంటాంకదా! నేను, నాన్నగారు వస్తూ ఉంటా ము తరచుగా. నీకు బెంగగా ఉన్నప్పుడు నీవే అడిగిరా" అంటూ కూతురేదో బెంగపడిపోతు న్నట్లు... వంద అప్పగింతలు పెట్టి అల్లుడితో చెప్పి బయలుదేరింది కాంతమ్మ. ఒక పెద్ద వాన వెలిసినట్లనిపించింది రఘుకి.

సుందరికి యింటిపనులమీద శ్రద్ధ తక్కువ. పుట్టింట్లో వంట పనులు అప్పచెప్పి తల్లి షికార్లుకొట్టేది. అక్కడ కూడా వంటపను లు, చెల్లెళ్ల పనులు తప్పలేదు సుందరికి. యిక్కడేమో రామారావుగారికి పరిశుభ్రత ఎక్కువ. దానికితోడు కొంత రఘు బాధ్యత. దాంతో తనేదో ఎక్కువ పనిచేసి అలసిపోతున్న ట్లు బాధపడేది. ఆమెకు నగలన్నా చీరలన్నా సినిమాలన్నా తగని పిచ్చి. పార్వతమ్మ తా లూకు గొలుసు, గాజుల జత ఉన్నాయని నర్మద చెప్పింది. భర్త వాటిని తనకెప్పుడి స్తాడా! అని మరోపక్క ఆతృతగా ఉండేది సుందరికి.

రామారావుగారు వింటుండగా "రఘూ! మనం సినిమాకు వెళ్దామా? ఏమీ తోచటంలే దు" అనేది. "నాన్నగారు వస్తే వెళదాం. లేకపోతే నేను రాను" అంటూ తండ్రిని అడిగే వాడు రఘు. ఆయన రానంటే... "మీరు రాకపోతే... నేనూ వెళ్లను" అని తేల్చి చెప్పేవా డు. కొత్తగా కాపరానికి వచ్చిన సుందరిని బాధపెట్టటం యిష్టంలేక ఆయనకు వెళ్లటం తప్పేదికాదు. సుందరిమాత్రం ఒక విషయం బాగా గ్రహించింది. రఘుతో తను మంచిగా ఉంటేనే భర్తకు తను దగ్గరౌతానని. అందుకే రఘు ద్వారా ఆయనను తనవైపుకు తిప్పుకోవా లని నిర్ణయించుకొంది.

వారానికొకసారైనా సుందరి వర్ధనమ్మగా రింటికి, సరస్వతమ్మగారింటికి వెళ్లేది. సరస్వత మ్మగారెప్పుడూ అక్కరలేని విషయాలు మాట్లా డేవారుకారు. రఘు గురించి, మాష్టారుగారి గురించి కుశలప్రశ్నలు మాత్రమే అడిగి ఊరు కొనేవారు. వర్ధనమ్మగారు అలాగకాదు. ఎవరైనా నాలుగు విషయాలు చెప్పి... ఒక్కలాగ పొగి డితే ఉబ్బిపోయి ఏ విషయమైనా మాట్లాడే స్తుంది. ఏ సలహా అయినా చెప్తుంది. అది మంచిదా? చెడ్డదా? అన్న విచక్షణ కూడా ఉండదు. "ఆయన భార్య స్థానంలోనికి నీవు వచ్చావు. సవతిగా ఆవిడ బాధ్యతలు నీవు నెరవేర్చినప్పుడు ఆమె వస్తువులు అడగటాని కి నీకెందుకు సంకోచం? నీ భర్త దగ్గర నీకు ఎందుకు సిగ్గు?" అంటూ ప్రోత్సహించింది సుందరి నగల ప్రస్తావన తెచ్చినప్పుడు.

అసలు తన భర్తకు పడక గదిలో గట్టిగా మాట్లాడటమే యిష్టం వుండదు. తను ఏవైనా కబుర్లు గట్టిగా చెప్పబోతే "రఘు చదువు కొంటున్నాడు. మెల్లిగా మాట్లాడు. వాడికి డిస్టర్బెన్స్‌గా ఉంటుంది" అనేవారు. ఒక్కోసారి వాడి చదువు అయ్యేవరకు వాడిదగ్గరే కూర్చొనేవారు. ఈలోపు ఏం చేయలేక తను కూడా ఏదో పత్రిక చదువుతూ కూర్చొనేది.

పక్కింటి వనజతో పరిచయమయ్యాక గోడ దగ్గర నిలబడో... తమ తోటలో కూర్చొనో కబుర్లు చెప్పుకొనేవారు. ఇరుగుపొరుగులతో అతిగా ఉండటం, ఇంటి విషయాలు వాళ్లతో చర్చించటం రామారావుగారికి యిష్టం వుండదు.

ఒకరోజు సాయంత్రం బయటనుండి వస్తూ "నీకు ఏం తెచ్చానో చూడు" అని రఘుని పిలిచారు. తండ్రి గొంతుకలోని ఉత్సాహానికి రఘుపరుగు పరుగున వచ్చాడు. తండ్రిచేతిలో పెద్ద ఫొటో వంటిది వెనుకనుండి కనిపిస్తోంది.

"ఆఁ... అమ్మ ఫొటో... అమ్మ ఫొటో తెచ్చారు నాకివ్వండి నాన్నగారూ! నేను చూస్తాను" అంటూ ఎంతో ఆతృతతో ఆ ఫొటో తీసుకొని కాగితాలు ఊడతీశాడు. ఫొటో ఎంత బాగా వచ్చిందో! తల్లి ఎదురుగా నిల్చుని నవ్వుతున్నట్లుంది. అతనికి ఎంత ఆపుకొందామన్నా కళ్లమ్మట నీళ్లు ఉబికివచ్చాయి. ఆ ఫొటో పట్టుకొని వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టాడు. స్నేహితురాలితో కబుర్లు చెపుతున్న సుందరి ఏమయిందో అని ఒక్కసారిగా యింట్లోకి వచ్చింది.

తండ్రీకొడుకులు ఒక్కలాగ ఏడవడంతో ఆమెకు చిరాకు వచ్చింది. ఓదార్చడంపోయి ఆయన కూడా శోకాలు పెట్టడంతో ఆమెకు కోపం వచ్చింది. యింతలో ఎదురుగా ఉన్న పార్వతి ఫొటో ఆమె కంటపడింది. దాన్ని చూసి సహించలేకపోయింది. "పసిపిల్లవాడు ఏడుస్తాడని తెలిసీ యింత పెద్ద ఫొటో కట్టించి తెచ్చారా? వాడికి పోయిన తల్లిని ఎప్పుడూ గుర్తుచేయాలనా మీరు ఈ పని చేశారు? బావుంది దీపం పెట్టాక ఈ ఏడుపులు" అంటూ అరవటం మొదలుపెట్టింది.

"ఈ ఫొటో నా గదిలో పెడతాను రఘూ!" అంటూ ఆమె అరుపులును లెక్కచేయకుండా ఆయన అంటుంటే "మన గదిలో ఉన్న మీ మొదటి పెళ్లి ఫొటోలు చాలవా? చూస్తూ బాధపడడానికి... ఆలోచించటానికి... యింకా యిది కూడా ఎందుకు? హాలులో ఉంచండి" అంటూ అడ్డుచెప్పింది.

రఘు వెంటనే "ఈ ఫొటో నా గదిలో ఉంచుకొంటాను నాన్నగారూ! అమ్మ ఎదురుగా ఉన్నట్లే ఉంటుంది. నేను లేవగానే అమ్మను చూడవచ్చు. హాలులో వద్దు నాన్నగారూ" అంటూ బతిమాలాడు.

"వెర్రి ముదిరి తలకి ఎక్కింది అన్నాడట ఎవరో వెనకటికి... అలాగే మీ యిష్టం వచ్చినట్లు ఊరేగండి. మెడలో కూడా వేలాడేసుకోండి" వెటకారంగా అంటూ వంటింట్లోకి వెళ్లింది సుందరి. చివరికి ఆ ఫొటో రఘు గదిలోకి చేరింది.

స్టౌమీద వంటతో కూతురు కష్టపడుతోందని కాంతమ్మ వచ్చి గొణిగితే తండ్రి గ్యాస్‌పొయ్యి కొని తెచ్చాడు. దాన్ని చూసిన వాళ్ల మొహాలు చేటంత అయ్యాయి. నాలుగు రోజులకొకసారి కాంతమ్మ టంచన్‌గా వచ్చేది. సాయంత్రం టిఫిన్ చేయించుకొని తిని... రాత్రి భోజనం చేసి మరీ వెళ్లేది. ఆమె వస్తే యింక వాళ్లిద్దరికీ కబుర్లకు అంతుండేది కాదు. "నీ యింటిలో నీకు మొహమాటం ఏమిటే పిచ్చిదానా! కడుపునిండా తిను" అంటూ కూతురికి వడ్డించి, నాలుగు కబుర్లు చెప్పి తోటలోని కూరలు, పళ్లు పట్టుకుపోయేది. తోటపనికి సుందరిమాత్రం... ససేమిరా సాయంవచ్చేది కాదు... పైపెచ్చు "నాకలాంటి పిచ్చి లేదు" అనేది. రామారావుగారు, రఘు స్కూలునుండి వచ్చి సాయంత్రం తోటపని చేస్తుంటే తను మాత్రం హాయిగా గోడదగ్గర కూర్చొని పక్కింటావిడతోనో... తల్లివస్తే తల్లితోనో కబుర్ల కాలక్షేపం చేస్తూ కూర్చునేది.

పువ్వులు మాత్రం ఉదయం, సాయంత్రం దండిగా కోసేది. "చెట్టుకి కొన్నయినా ఉంచకుండా అన్నీ కోస్తావేమిటి సుందరీ! రోజా పంచిపెట్టాలా? నాలుగు రోజులకొకసారి యివ్వవచ్చుకదా? చెట్లకు పూలు లేకపోతే తోటంతా బోసిగా ఉంటుంది" అని ఆయనంటే... "నేను తోట పని చేయలేదనేగా మీరిలా అంటున్నది. ఏం నాకు కాకపోతే మీతండ్రీ, కొడుకులకా ఆ





పువ్వులు? వాళ్ళకిచ్చేవు... వీళ్ళకిపంచావు అంటారేగాని... మీ మొదటి భార్య మీ చెల్లె లకు రోజా పూలు పంపేది కాదా? రెండో భార్యననేగా మీకీ చులకన" అంటూ దెప్పటం మొదలుపెట్టేసరికి ఆయన అక్కడ ఉండలేక లోనికి వెళ్ళిపోయారు. ఏమన్నా అంటే "రెండో పెళ్లి వద్దంటే... వినకుండా మా అమ్మ, నాన్న నా గొంతు కోశారు" అంటూ రాగాలు తీసేది. ఆమె ప్రవర్తనకు ఆయన స్తబ్దుగా ఉండిపోయే వారు.

పగలు ఎంత దెబ్బలాడినా రాత్రిళ్లు మాత్రం... చక్కగా తెల్లచీర కట్టుకొని... గంపెడు పువ్వులు పెట్టుకొని తయారయ్యేది. మాటి మాటికీ ముట్టుకోడం... చూడనట్లు రాసుకొని పోవడంవంటి చేష్టలు చేసేది. ఒకసారిమాత్రం రామారావుగారు చెప్పారు "రఘు పెద్దవాడవుతున్నాడు. వాడెదురుగా అసహ్యంగా ప్రవర్తించవద్దు" అని.

అమాత్రంకే "ఏమిటీ! నేనేం సానిపాపనా? ఏదో అటు వస్తుంటే కొంత తగిలితే యిన్ని మాటలా? అసలు నా పాడే మీకు గిట్టదు" అంటూ ఏడుపు మొదలుపెట్టేది.

"శృంగారం అనేది నాలుగు గోడలమధ్య పరిమితం కావాలి. అది వీధినపడితే అపవిత్ర మౌతుంది" అంటూ హితం చెప్పినా ఆమె వినేదికాదు. పెద్ద మెడతో ఉన్న జాకెట్లు తొడిగేది. అసలు రూపం రెచ్చగొడుతున్నట్లే ఉంటుంది. ఎప్పుడూ కాంక్షతో నిండే కళ్లు, గుండ్రటి మొహం, అవసరం లేకుండా తెచ్చి పెట్టుకొనే నవ్వు. యివికాక మనిషి ఒత్తరి... మంచి ఒడ్డూ... పొడుగూ... పవిట పెద్దది వేస్తుందా అంటె అదీ లేదు. ఆ పవిట జానడే. అస్తమానూ అది ముందుకి పడటమో... జారడమో తప్పదు. ఇంక చూసేవాళ్లకు ఎలా కనిపిస్తుంది?

ఆయన సుందరిని మందలించటం అప్పుడప్పుడూ రఘుకి వినబడుతూనేవుంటుంది. ఆవిడమాత్రం అణువంత కూడా చలించదు, వస్త్రధారణలో మార్పు తెచ్చుకోదు.

ఎవరిదో పెళ్లి ఉందని నర్మద, మాధవి రాజమండ్రి వచ్చారు. వాళ్లను చూసిన రామారావుగారు ఆనందభరితులయ్యారు. అందరినీ పేరుపేరున కుశలమడిగారు. అన్నగారిలో కన్పించిన మార్పుకు నర్మద కూడా ఆనందపడింది.

సాయంత్రం తోటలో కబుర్లతో కాలక్షేపం చేస్తూ నెమ్మదిగా సుందరి విషయం చెప్పారు. "నా స్నేహితులు వస్తూంటారు. ఆ జాకెట్లతో పవిట స్థిరంగా ఉంచుకోక కన్పిస్తోంటే... నాకు సిగ్గుగా ఉంటోందమ్మా. నీవు కొంత నచ్చచెప్పమ్మా. నలుగురూ వచ్చినప్పుడు తనెందుకు రావటం? కాఫీలు రఘుతో పంపించవచ్చు కదా! వినదు. తనే తెస్తుంది. ఎంతని చెప్పి దెబ్బలాడను. నంస్కారం నేర్చుకోమని చెప్పమ్మా!" అని చెల్లెలితో తన బాధ చెప్పుకొన్నారు. అన్నయ్య ఆవేదన ఆమెకు బాగానే అర్థమయ్యింది.

రఘు కూడా అత్తని, మాధవిని చూచి పొంగిపోయాడు. రఘుని యింటర్‌లో చేర్చారని విని ఆనందించింది నర్మద. మాధవి కూడా హైస్కూలు చదువుకి వచ్చేసింది. "మామయ్యా! పదవ తరగతి అవ్వాలి... నీదగ్గరకే వచ్చేస్తాను" అంటూ హెచ్చరిక కూడా చేసింది.

అన్నగారు అన్నారనేకాదు సుందరిలో ఉన్న కళే అటువంటిది. ఆమెలో అందంకన్న ఆకర్షణే ఎక్కువ. దానికితోడు మనిషి ఉత్సాహంగా ఉంటుంది. ఎవరికైనా ఆమెను చూస్తే మగవాళ్లను రెచ్చగొట్టే అందమే కన్పిస్తుంది.

"పవిట తీసి దోపుకుంటే బాగుంటుంది వదినా! అస్తమానూ పడిపోతుంటే వడ్డించడం కష్టమౌతుంది" అన్నది నర్మద భోజనాలు వడ్డిస్తున్నప్పుడు సుందరితో. "నాకు యిలాగే అలవాటులే వదినా! ఫరవాలేదు మరీ పొడవుగా చీపురుకట్టలా ఉంటే బరువుగా ఉంటుంది" అని నవ్వేసింది. ఆమె జవాబుకు నవ్వాలో, ఏడ్వాలో తెలియలేదు నర్మదకు.

అయినప్పటికీ మరోసారి "బొడ్డుకిందకి చీర కడితే మనలాంటి వాళ్లకు బాగుండదు. అన్నయ్యకు కూడా అలాంటివి నచ్చవు. కొంత పైకి చీర కట్టుకోడం నేర్చుకో వదినా!" అంది నర్మద.

"చిన్నప్పటినుండి నాకు యిదే అలవాటు



వదినా! అయినా మీ అన్నయ్య మరీ పూర్వకాలంవారిలా మాట్లాడతారు. ఈ కాలంలో అందరూ యిలాగే కట్టుకొంటున్నారు" అని చెప్పేసింది.

ఆమె అమాయకత్వానికి ఏమనాలో తెలియక "మన వస్త్రధారణవలన మనకు గౌరవం రావాలి వదినా! ఎవరో ఏవో పోకిళ్లు పోతున్నారని మనం అనుసరించరాదు. అంతేకాని! అన్నయ్య మాటలు తేలికగా తీసిపారేయవలసినవి కావు" అని నచ్చచెప్ప ప్రయత్నించింది నర్మద.

"మీ అన్నయ్యగారు ఒట్టి చాదస్తపు మనిషి. పంచె, లాల్చీ మానేసి షరాయి, పైజమా వేసుకోమని ఎన్నిసార్లు చెప్పినా... నా సరదాకోసమైనా వేసుకోరు" అంటూ ఆయనమీదే ఎదురునేరం మోపింది.

సుందరి సరదా అయిన మనిషి. బంధువులంటే ఆమెకు యిష్టమే. "సినిమాకు వెళదామా వదినా?" అని ఒక్కలాగ అడగడంతో నర్మదకు బయలుదేరక తప్పలేదు. వాళ్లను మాత్రమే పంపి తాను స్నేహితుల దగ్గరకు వెళ్లిపోయారు రామారావుగారు.

సినిమాలో నర్మదతో "మీ అన్నయ్యగారితో చెప్పు వదినా! మరీ పసుపుతాడుతో ఉండడం బాగోలేదు. ఆయన భార్యగా నన్ను యిలా ఉంచటం ఆయనకుమాత్రం బాగుంటుందా? అందరూ అడగడమే 'మీ అక్కగారి నగలు నీకు యివ్వలేదా?' అని నిర్మోహమాటంగా నటాయించింది.

మర్నాడు అన్నగారు స్కూలుకు వెళుతుంటే... ఆ సాయంత్రం తాను వెళ్లిపోతానని చెప్పింది నర్మద. నాలుగు రోజులుండమన్నా భర్త, పిల్లలు యిబ్బంది పడతారని ఒప్పుకోలేదు. "సరే... అలాగే పెందరాళే వచ్చి సాయంకాలం నిన్ను రైలు ఎక్కిస్తాను" అంటూ వెళ్లిపోయారు రామారావుగారు.

నగలడగమని మళ్లీ వదినగార్ని హెచ్చరించింది సుందరి.

సాయంత్రం వెళ్లేప్పుడు అన్నగారితో నగల విషయం చెప్పి అంతటి వదినే పోతే యింకా ఆ నగలు ఉద్ధరిస్తాయా అన్నయ్యా! మీ పిచ్చిగాని... అవి సుందరి వదినకు యిచ్చేయమని హితవు చెప్పింది నర్మద.

"ఇస్తానమ్మా! యివ్వక నేనేం చేసుకొంటాను వాటిని? రఘు భార్యకు గాజుల జత పుంచి... గొలుసు పుస్తెల తాడు సుందరికిచ్చేస్తాను. శ్రావణమాసంలో యిద్దామని యింతవరకు యివ్వలేదు" అన్నారు.

వరలక్ష్మీవ్రతానికి పట్టుచీర కావాలని ముందునుండే హెచ్చరిక ప్రారంభించింది సుందరి. ఆవిడ ఏమైనా అడగదలిస్తే భర్త ఆదివారం మధ్యాహ్నం పడుకొనేటప్పుడు పదిసార్లు అడుగుతుంది. ఆయనకు భార్య పగలు పదిసార్లు గదిలోకి రావడం యిష్టముండదు. ఈ విషయం ఆమెకు అర్థంకాదని "రఘు యింట్లోనే ఉన్నాడు. యిలా గదిలోకి రావద్దు"ని చిరాకు పడేవారు. రఘు గది వేరేగా లేదాఏమిటి... మన మాటలు వాడికి తెలుస్తాయా?" అంటూ పక్కలోకి చేరేది. రఘు యివి అర్థం చేసుకొన్నవాడిలా ఆదివారం మధ్యాహ్నం భోజనం చేయగానే స్నేహితుడింటికి చదువుకుంటాననో... నోట్సు రానుకోవాలనో వెళ్లిపోయేవాడు. బంధువు లెవరైనా వచ్చినప్పుడు మాత్రం ఉండిపోయేవాడు.

శ్రావణ శుక్రవారంనాడు సుందరికి పుస్తెల తాడు గొలుసు ఇచ్చారు. "గాజుల జత ఉందిగా!" అంటే "అవి పార్వతి రఘు భార్యకోసం అని అనేది. అయినా మొన్న గ్యాసు స్టౌ కొనడంకోసం బేంకులో పెట్టాను" అన్నారు. సుందరి మరి మాట్లాడలేదు. సాయంత్రం యింటికి వచ్చిన కాంతమ్మ కూతురిని ఆ నగలతో చూసి పొంగిపోయింది.

వేసుకొన్న గొలుసు అలాగే ఉంచుకోకూడదూ! అబ్బే తల్లీకూతుళ్లిద్దరిదీ ఒకటే బుద్ధి. రామారావుగారికి చెప్పకుండా గొలుసు పట్టుకెళ్లి మార్పించేశారు. ఒక తులం పెట్టి నల్లపూసలు, మరో తులం పెట్టి గోవర్ధనం గొలుసు చేయించుకొని వచ్చారు. పెద్ద గొప్పగా "చూశారా... ఒక వస్తువు యిస్తే రెండు చేయించాను. చూసి ఎలా ఉన్నాయో చెప్పండి" అంటూ చూపించింది.

అసలే స్కూలునుండి యింటికి వచ్చేసరికి... యింటి తాళమైనా పొరుగువారికివ్వ





కుండా వెళ్లినందుకే ఆయనకు చాలా కోపంగా వుంది. అందులోనూ రఘు ప్రైవేటుకు కాఫీ అయినా తాగకుండా వెళ్లిపోవల్సి వచ్చింది. ఒంటరిగా బయట కూర్చోడం ఆయనకు కష్టం కలిగించింది. పార్వతి ఏనాడూ ఆయన వచ్చేవేళకి పెత్తనానికి వెళ్లిఎరుగదు. ఎంత చెప్పినా సుందరి ఆయన వచ్చేవేళకి తల్లింటి కి వెళ్లడమో, లేక ఏ బజారుకో వెళ్లేది.

"మేము స్కూలునుండి వచ్చేవేళకి ఎవరు నిన్ను వెళ్లమన్నారు? అయినా ఆ గొలుసుకి ఏం వచ్చిందిప్పుడు? నాకు చెప్పకుండా ఎందుకలా మార్పించావు?" అని సుందరిని గట్టిగా నిలదీశాడు.

"అదేమిటి నాయనా! అంతలా కసురు కొంటావు? పిల్ల ఏదో సరదాపడి చేయించింది. నల్లపూసలు లేనిదే ఎలా? అని మార్పించింది. దానికే యింత రాద్ధాంతమా?"అని కాంతమ్మ కలగజేసుకొంది.

"చూడండి! మీరు ఈ విషయంలో మాట్లా డకండి. ఇది మా యింటికి సంబంధించిన విషయం. నేను నాభార్యను అడుగుతున్నాను. మీరు మధ్యలో కల్పించుకోవడం మర్యాద కాదు" అంటూ గట్టిగా చెప్పారు.

"చెప్పు! ఈ బుద్ధి నీకే పుట్టిందా? ఎందుకు ఆ వస్తువు మార్చావు?" అంటూ భార్యను నిలదీశాడు. "మీరు ఆ వస్తువు చూసి మనసు పాడుచేసుకొంటున్నారని మార్పించేశాను. నల్ల పూసలు మామూలుగా వేసుకొంటే బాగుండ వని యిలా చేయించాను" అని భయంభ యంగా చెప్పింది సుందరి. ఎప్పుడూ గట్టిగా మాట్లాడని, మందలించని ఆయనని అలాగే చూస్తే నిజంగా ఆమెకు భయమే కలిగింది.

"అదేమిటమ్మా! భార్యని అలా నిలదీస్తా డు.

ఆ పాతపెళ్లాం నగలు నా కూతురు అలాగే వేసుకోవాలా?ఏదో కాస్త మార్పించుకోకూడదా?" అంటూన్న అత్తగారి మాటలువిని ఆయనకు మరీ కోపంవచ్చింది. "నేనూ ఆ పాత పెళ్లాం వాడిన పాత మొగుడినే. నేను మీకు పనికి వచ్చానుకాని ఆవిడ వాడిన నగలు పనికిరా లేదా? సర్లెండి మీ యిష్టం వచ్చినట్లు ఏడ వండి" అని బయటకు వెళ్లిపోయారు అస హ్యంతో.

అల్లుడు అటు వెళ్లగానే కాంతమ్మ నెమ్మ దిగా జారుకొంది భయపడవద్దని కూతురికి చెప్పి. రఘు ట్యూషన్ నుండి వస్తుంటే మరోప్ర క్కనున్న పార్వతమ్మగారి స్నేహితురాలు అన సూయగారు పిలిచి విషయం చెప్పారు. "మీ నాన్నగారు భోజనం చేశారో .. లేదో! నువ్వయినా యిక్కడ ఎంగిలిపడు" అని రఘును బల వంతపెట్టారు. రఘు వద్దని నమ్రతగా చెప్పి యిల్లుచేరాడు. అతనికీ కష్టంగా ఉంది. అయినా ఏంచేయగలడు?

సుందరి అలకతో ముసుగుపెట్టి పడుకొంది. చివరికి అనసూయమ్మగారే కేరేజీలో అన్నీ సర్ది పట్టుకొనివచ్చి రామారావుగారిని మందలించా రు. "మీరు కూడా చిన్న పిల్లాడిలా ఏమిటి మాష్టారూ? అయిందేదో అయిపోయింది. ఆ పిల్లాడిని చూడండి. భోజనం అయినా లేకుండా ఎలా బిక్కచచ్చిపోయాడో! సిందు యింట్లో అభోజనంగా ఉండకూడదు. కాస్త ఎంగిలి పడండి" అంటూ ఆయనకు సుందరి కి చెప్పి వెళ్లిపోయారు. రఘు వెళ్లి పిన్నిని పిలిచినా ఆమెరాలేదు. దాంతో రఘు కోస మైనా భోజనం చేయక తప్పలేదు రామారావు గారికి.

ఆయన స్నేహితులు పాత అలవాటు ప్ర కారం మళ్లీ ఆదివారం అక్కడే సమావేశమౌదా మని నిర్ణయించుకొన్నారు. నాలుగు రోజులు సుందరి మూతిముడుచుకొన్నా ఆయనే సర్దు కొని మామూలుగా మాట్లాడారు. ఆమె చిన్నది తను పెద్దవాడు. ఆమెకు ఏవో కోరిక లుంటాయి! లేమి వలన ఇన్నాళ్లూ తీర్చుకోలేక పోయింది అని అనుకొన్నారు.

సుందరికి ముందుగా చెప్పి స్నేహితుల కోసం తినడానికి ఏదైనా చెయ్యమన్నారు. రవ్వతో లడ్డూలుచేసి, పకోడీలువేసి కాఫీ కలిపి ఫ్లాస్కులో పోసి రెడీగా ఉంచింది. అందరూ సరదాగా మాట్లాడుకొంటుంటే కాలం తెలియ డంలేదు. పానకంలో పుడకలాగ అదే సమయా నికి వచ్చింది కాంతమ్మ. పొరుగింటావిడని, కూతుళ్లను తీసుకొని. వంట యింటిలో వాళ్ల గొడవకి హడావుడిగా ఆయన ఇవతలకి వచ్చా రు. సుందరినిపిలిచి వాళ్లు ఎక్కువగొడవ

చేయకుండా చూడమన్నారు.

నన్నయ్యగారి కవితా సౌందర్యం మీద ఎవరే చర్చ తీసుకొని వచ్చారు. దాంతో రామారావుగారు నన్నయ్యగారి కవితా పటిమను గూర్చి లీనమై చెవుతున్నారు.

"నన్నయ్యగారి కవిత్వంలో సంస్కృత పద ప్రయోగం ఎక్కువ. అయనకు సంస్కృతమంటే ప్రీతి ఎక్కువ. "సారమతింకవీంద్రులు" అని అయన చెప్పుకొన్నట్లుగా అయన కవిత్వంలో అనేక సూక్తులు... ప్రసన్నమైన కథలు మనకు కన్పించుతాయి. మన అదృష్టంకొద్దీ లోకోత్తరమైన కథలన్నీ మనం ఆయన ద్వారానే విన్నాం. మీకు ఒక విషయం చెవుతున్నాను. ఆయన వ్రాసిన కవితాభాగంలో వచనం- పద్యం, వచనం- పద్యం ఒకదాని వెనుక ఒకటి ఉంటాయి. మనము కేవలం వచనం మాత్రమే చదివినా కథాగమనం మనకు తెలుస్తోంది. వచనాలు విడచి కేవలం పద్యాలు మాత్రమే చదివినా కథా సూత్రాలు తెగకుండాఏకధారగా సాగుతాయి. ఈ విధంగా అయన భారత భాగములో చేసినచమత్కారాలు ఎన్నోఉన్నాయి. సంస్కృత పదములు అయన చేతిలో అచ్చతెనుగు పదాలు వలె భాసిస్తాయి

అంతెందుకు? సమాసములను ప్రయోగించడంలో ఆయనకు ఆయనేసాటి. కద్రువ, వినతలు సముద్రాన్ని చూడటానికి వెళ్లినప్పుడు ఆయన వర్ణించిన పద్యములో సౌందర్యం చూడండి. 'అలఘ ఫణీంద్ర....' మరొక పద్యం ఎత్తుకొని చదివారు. ఇందులో రెండే సమాసాలు ప్రయోగించారు. వెళ్లిన అతివలూ... ఇద్దరే. యిలాంటి చమత్కారములు చేయుటలో అయనది అందెవేసిన చేయి" అని ఏకధాటిగా చెప్తున్నారు రామారావుగారు.

చక్రధరంగారు పొంగిపోయి "అసలు మీరు కవులను ప్రత్యక్షం చేసికొన్నట్లు వారి కవిత్వాన్ని అణువణువునా వారి వలె భావించినట్లు మేమెవరమూ చెయ్యలేము. మీ వలన యిటువంటి విషయాలు ఎప్పుడూ తెలిసికోవాలనే మా అందరి తాపత్రయం" అని అన్నారు.

ఈ లోపే వంటయింటిలోనుండి కాంతమ్మ కంఠం తారాస్థాయిలో విన్పించింది. "అవునండీ! మా అల్లుడుగారే... స్నేహితులంటూ అందర్నీపోగుచేసి యిల్లుగుల్ల చేస్తున్నారు. ఇలాగ టిఫిన్లు, కాఫీలతో మా పిల్ల ప్రాణం తీస్తున్నారు. ఆ చచ్చిపోయినావిడ ఈయనకి అన్నీ యిలాంటి అలవాట్లేచేసింది. ఇది యిల్లా? సత్రమా! చెప్పండి. ఎవరు మటుకు వాళ్లు తెలుసుకోవాలి. ఎవరు మనయింటికి వచ్చి బుద్ధులు చెవుతారు?" అని బుగ్గలు నొక్కుకొంటూ ప్రక్కింటావిడకి చెప్తోంది.

"అమ్మా! ఆయనకు వినిపిస్తుంది. నీవు మాట్లాడవద్దని చెవుతున్నానా?" అంటూ సుందరి చెవుతున్నా అమె వినిపించుకోలేదు. భర్త స్నేహితులు కొద్దిసేపటిలోనే బయటకువెళ్లిపోతూండటం చూసి నివ్వెరపోయింది సుందరి.

"వస్తామండీ! మళ్లీవారం మిగతా విషయాలు మాట్లాడుకొందాం. కొంచెం బజారులోపని వుంది" అంటూ మిగిలినవారు లేవటంతో చక్రధరంగారు లేవక తప్పలేదు. చివరికి స్నేహితులను సాగనంపి రామారావుగారు బాధగా తన గదిలోనికి వెళ్లిపోయారు.

"అదేమిటండీ! కాఫీ, టిఫిన్లు అలాగే ఉండిపోయాయి. వారికివ్వలేదేమి?" అని అడుగుతోన్న సుందరి చెంపపై కొట్టారు ఆయన.

"నా సహనాన్ని పరీక్షించకు. మీ అమ్మను ఈరోజు రావద్దని చెప్పలేకపోయావు? పోనీ వచ్చినావిడ వచ్చినట్లుంటుందా? నోటికి వచ్చినట్లు వాగుతుంది. యిక్కడ పెద్దమనుష్యులున్నారన్న జ్ఞానం ఉందా? ఈవిడ సొమ్ము ఎవరు ఖర్చుచేస్తున్నట్లు? అలా గొంతుచించుకొంటుంది. ఇప్పుడే చెవుతున్నాను. అవిడ మన యింటికి రానవసరంలేదు. అవిడని చూడందే ఉండలేననుకొంటే నువ్వే వాళ్లింటికి వెళ్లి చూసిరా. మళ్లీ అవిడ ఈ యింటి విషయాల్లో కలుగజేసుకొందా నేను భోజనం చేస్తే ఒట్టు" అంటూ కోపంగా వీధిలోకి వెళ్లిపోయారు.

అది మొదలు ఆ ఇంట్లో మరి సాహిత్య సమావేశాలు జరుగలేదు. ఆయన సుందరితో ముభావంగా ఉండేవారు. ఒకరోజు రఘు





వచ్చి పిన్ని కళ్లు తిరిగి పడిపోయిందని చెప్తే ఆత్రుతగా డాక్టరుగారిని తీసుకొని వచ్చారు. ఆమెను పరీక్షించి గర్భవతి అయ్యిందని చెప్పారు డాక్టరు గారు. ఇన్నాళ్ల ఆయన కోపం, వేడి పెనం మీద నీటి చుక్క అయ్యింది ఆ క్షణంలో. ఆ యింట్లోకి ఒక చిన్న పాప రాబోతుందని ఆయనకు చాలా సంతోషం కలిగింది. సుందరిని యిటువంటి సమయంలో ఏ విధంగాను కష్టపెట్టకూడదని నిర్ణయించుకొన్నారు. రఘు ఆనందానికి అవధులులేవు. వాళ్లిద్దరినీ చూసి సుందరి తన బాధ కోపం మరిచిపోయింది.

సుందరికి తల్లంటే భయం. ఆమెకు ఏ విషయంలోను ఎదురు చెప్పలేదు. తల్లి నాల్గు రోజులకి ఒకసారి ఏకూరో, పచ్చడో తెచ్చి తన ప్రేమను ఒలకబోసి నాలుగు కబుర్లు చెప్పేసరికి "తల్లికి తనంటే ఎంత ప్రేమో" అని అన్ని విషయాలలో విధేయురాలిగా ఉండిపోయేది సుందరి. రామారావుగారు కొన్న చీరలు పట్టుకుపోయి తన చెల్లెళ్లకు యిస్తున్నా తల్లికి ఎదురు చెప్పేదికాదు. తల్లిరానప్పుడే తన యిల్లు ప్రశాంతంగా ఉన్నట్లనిపిస్తోంది సుందరికి. ఆర్థికంగా రామారావుగారి పరిస్థితి కూడా ఏమీ బావుండలేదు. పార్వతి బ్రతికున్నప్పుడు అప్పు అన్నది ఆయన ఎరగరు. పంట మీద వచ్చిన డబ్బుతోను, పార్వతి జీతంలో దాచిన డబ్బుతోను ఏమైనా అనుకొని ఖర్చులు వస్తే జరిగిపోయేవి. ఎవరికైనా పందో, యాభయ్యో కావాలంటే యివ్వడం తప్ప ఆయన ఎవరినీ యాచించలేదు. అలాంటిది యిప్పుడు తెచ్చిన జీతం పదిరోజులకు కూడా సరిపోవటంలేదు. సరుకుల కొట్టుచూస్తే పూర్వందానికి రెండింతలు పెరిగింది. నెలవరకూ ధీమాగా సరిపోతాయనుకొన్న సరుకులు మధ్యలోనే ఎలా అయిపోతున్నాయో ఆయనకు అర్థం కావటంలేదు.

ఆ మాటే ఒకసారి చక్రధరం గారితో అంటే "మీరు వచ్చిన జీతంలో కొంత ఉంచుకొని ఆవిడకు మిగిలినది యిచ్చేసి, ఇల్లుదానితోనే నడుపుకోమని హెచ్చరించండి. దాంతో ఆవిడకు బాధ్యత, కష్టం తెలుస్తాయి" అంటూ సూచించారు. తనకీ ఆ సలహాసచ్చి ఆవిడ ఖర్చు కొంత అదుపు చేసినట్లౌతుందని ఆమెకు బాధ్యత అప్పచెప్పారు.

డబ్బు ఎప్పుడైతే చేతిలోపడిందో యింక సుందరి కొనే చీరలకు అంతులేకుండాపోయింది. చిరుతిళ్లుకూడా ఆవిడకు ఎక్కువే. వీధిలోకి ఏ వస్తువు వచ్చినా ఆవిడ కొనవలసిందే. జీతం వచ్చిన తరువాత పదిరోజులు జంతికలని, మైసూరుపాకమనీ డబ్బాలు నింపేది. ఇరవయ్యో తేదీ దాటాక కూర కొనడానికి కూడా డబ్బులేదని మొహం వేలాడేసేది. ఒకసారి రఘుకి టర్మ్ ఫీజు కట్టవలసి వచ్చింది. తండ్రిని సొమ్ము అడిగితే పిన్నిని అడిగి తీసుకోమని చెప్పారు. ఆవిడ అంతకు ముందురోజే మూటలువానివద్ద సగం సొమ్ము చెల్లించి రెండు జరీ చీరలు కొన్నది. దాంతో ఆయనకు చెప్పలేని కోపంవచ్చింది.

"పిల్లవాడికి కావలసిన అవసరాలు చూడొద్దా? నీకు చీరలు ముఖ్యమా! యింత బాధ్యత లేకపోతే ఎలాగ?" అని కేకలేశారు. ఏది అవసరమో ఏది అనవసరమో తెలుసుకునే జ్ఞానం అస్సలు లేనందుకు బాగా దెబ్బలాడారు. చివరికి స్నేహితులనడిగి రఘు ఫీజు కట్టారు. అప్పటినుండి ఆవిడ చేతికి డబ్బు యివ్వడం మానేశారు.

ఏడవ నెల రాగానే గాజులు పెట్టించాలని ఆర్భాటం చేసింది కాంతమ్మ. తన యింట్లో పెట్టించడానికి అచ్చిరాదట.

నర్మదకు కబురుపెట్టి "క్లుప్తంగా కానీయమ్మా!" అని చెప్పారు రామారావుగారు.

"లేకలేక నా కూతురు కడుపున ఒక కాయకాస్తోంటే గుట్టుచప్పుడు కాకుండా చెయ్యమంటే ఎలాగ? నా కూతురేమీ మిద్దెలు మేడలూ కోరిందా? నలుగురి ముత్తయిదువులను పిలిపించుకొనే గతి కూడా దానికిలేదా? ఈ సంబంధం చేసి దాని గొంతుక కోశాను" అంటూ నోటికివచ్చినట్లు మాట్లాడటం మొదలుపెట్టింది.

"పోనీలేమ్మా! నేను ఏ గొడ్రాలినో అయితే బావుండేది ఆయనకి. ఈ ఖర్చులేమీ ఉండేవి కావు. ఇంతకీ ఎవరి కర్మ వారిది. దేనికైనా పెట్టిపుట్టాలికదా!" అని సుందరి సాధింపుగా అంటుంటే ఏం చేయాలో తోచలేదాయనకి.

నర్మదకూడా కొన్ని లాంఛనాలు జరవక పోవడం మంచిదికాదనేనరికి వెయ్యిరూపాయిలు ఖర్చుపెట్టి సీమంతం జరిపించారు రామారావుగారు. కాంతమ్మ, సుందరిల మొహాలు చేటంత అయ్యాయి. అన్నగారు అనలే అప్పుల్లో, ఉన్నారని చీర తనకు వద్దని చెప్పింది నర్మద.

పురిటికి తీసుకొని వెళతామని సుందరిని తన యింటికి తీసుకు వెళ్లింది కాంతమ్మ. తల్లితో వెళ్లబోయే ముందు సుందరి గదిలోనికి వచ్చి "నాకు ఖర్చుకు డబ్బు ఏమైనా యివ్వరా?" అని భర్తను అడిగింది. రామారావుగారు రెండొందల రూపాయిలు ఆమె చేతిలో పెట్టారు. "మీరు వారానికి ఒకసారైనారండి, మిమ్మల్నిచూడందే నేను ఉండలేను" అని ఆమె తలను అయన గుండెలమీద పెట్టుకొని అడుగుతోంటే కాదనలేక పోయారు ఆయన.

రఘు చదువు, ఇంటిపని, స్కూలుపనితో క్షణం తీరిక లేకపోయినా భార్యకోరిక గుర్తుకు తెచ్చుకొని మొదటిసారిగా అత్తవారింటికి బయలుదేరారు. అనుకోకుండా వచ్చిన ఆయనను చూసి కంగారుపడింది కాంతమ్మ. "బావగారూ! అక్క స్నేహితురాలితో కలిసి సినిమాకు వెళ్లింది. ఆరుగంటలకల్లా వచ్చేస్తుంది" అని మరదలు చెప్పడంతో మరి అక్కడ ఉండటం యిష్టంలేక రఘుని తీసుకొని వెంటనే యింటికి వచ్చేశారు రామారావుగారు. స్కూలులో కూడా ఆవిడని తరచూ సినిమాలలో చూస్తున్నామని స్నేహితులు చెప్పడం ఆయనకు అప్పుడు గుర్తుకువచ్చింది.

మర్నాడు సాయంత్రం సుందరే రిక్షాలో యింటికి వచ్చింది."మీరు వస్తున్నారని తెలియక నిన్న మా స్నేహితురాలితో సినిమాకు వెళ్లాను. మీకు కోపం రాలేదుకదా? నాకు అక్కడ ఏం తోచటం లేదు. అనుక్షణం మీరు, రఘు ఎలా ఉంటున్నారో అని బెంగగా ఉంది" అంటూ ఆయన మీదపడి చేతులతో చుట్టేసింది. ఆయనకు సుందరి అస్సలు అర్థంకాలేదు. సినిమాలలోలాగ మీద పడటం, కౌగిలించుకోవటం ఆయనకు నచ్చదు. ఆయన ఎంత మందలించినా ఆమె తన ప్రవర్తన మార్చుకోదు. కాస్సేపు భర్తతో కబుర్లు చెప్పి వంద రూపాయిలు కావాలని అడిగి పట్టుకొని వెళ్లిపోయింది.

అడపా, దడపా ఆఖరి మరదలు రావడం అక్క డబ్బు యిమ్మన్నదన్న మాట చెప్పటం అలవాటైపోయింది. ఆయన మాత్రం ఎక్కడ నుండి తెస్తారు? వంట డబ్బు కొంత పురిటికని దాచి వుంచడం వల్ల సరిపోతుంది. మరి ఈ ఖర్చులు, ఆయన అవస్థ చూసి ఒకసారి రఘు తను చదువుమానేస్తానన్నాడు. కనీసం డిగ్రీ అయినా చదవకపోతే అతను ఎలా బ్రతుకుతాడు? దాంతో ఆయన "డబ్బు తెచ్చే బాధ్యత నాది. నువ్వు అనవసరమైన ఆలోచనలు పెట్టుకోక, చదువుకో" అని ఆయన రఘుని గట్టిగా హెచ్చరించారు. కానీ డబ్బు యింకా ఎలా సంపాదించాలా? అని ఆలోచనలోపడ్డారు. చక్రధరం గారితో ఒకసారి పరిస్థితిని గురించి చర్చించినప్పుడు తన స్నేహితుడొకరికి ట్యూషను పిల్లలు ఎక్కువై బాధపడుతున్నాడని, రామారావుగారికిష్టమైతే కొంతమంది పిల్లలను ఆయన వద్దకు పంపిస్తామని చెప్పారు. లెక్కలు, యింగ్లీషు కూడా తనకు బాగా రావటంతో ఆ సూచన ఆయనకు నచ్చింది.



సుందరికి ప్రసవం కష్టం అవడంతో ఆసుపత్రిలో చేర్పక తప్పలేదు. రెండు రోజులు కష్టపడినా తల్లీ, పిల్ల సుఖంగా బయటపడ్డారు. రఘు ఆ రెండు రోజులు కాలేజీకి వెళ్లలేదు. హాస్పిటల్‌కి యింటికి తిరగటంతోనే సరిపోయింది. పుట్టిన పాపను చూస్తే అతనికి ఎంతో సంతోషంగా ఉంది. పిల్ల తెల్లగా, సన్నగా పాలరాతి బొమ్మలా ఉంది. కళ్లు విప్పి తనవైపు చూస్తుంటే రామారావుగారు కూడా పొంగిపో

యారు. బాలసారె తమ యింట్లోనే చేసుకొంటా మని ఆయన చెప్పటంతో ఇరవయ్యోకటో రోజున రామారావుగారితో తమ యింటికి చేరింది సుందరి. ఆమెతో బాటు కాంతమ్మకూడా అక్కడకు చేరుకొంది.

మామయ్యకు కూతురు పుట్టిందని తెలియగానే మాధవి వెంటనే బయలుదేరి వచ్చేసింది. పాపకు పార్వతి పేరు పెడదామని, నెలకి ఒకరోజు తక్కువగా బాలసారె చేసుకొందామని ఆయన అనుకొన్నారు.

సుందరి పాపకు ఏంపేరు పెడదామని అడిగినవెంటనే 'పార్వతి' పేరు చెప్పారాయన. వెంటనే సుందరి మొహం అవగింజంత య్యింది. "వద్దండీ! మన పాపకు ఆమె పేరు వద్దు. ఆవిడ అల్పాయుష్కురాలు. ఆవిడ దురదృష్టం దీనికి పట్టనీయవద్దు. మీరు ఏం చెయ్యమన్నాచేస్తాను కాని నా బిడ్డకు ఆమెపేరు మాత్రం పెట్టను" అని నిక్కచ్చిగా చెప్పింది.

రఘుకి ఆ మాటలు ఎంతో కష్టాన్ని కలిగించాయి. అమ్మమాట ఎత్తి నలుగురిలో ఆమెను ఎందుకు చులకన చేశారా తండ్రి అని బాధపడ్డాడు. చివరికి సుందరి యిష్ట ప్రకారం పాపకు శాంత అని పేరు పెట్టారు. కాసు బంగారం కొని పాపకు గొలుసుచేయించారు.

మనవరాలిని విడిచిపెట్టి ఉండలేనంటూ రెండు రోజులకొకసారి కాంతమ్మ రావటం, వదో... యిరవయ్యో పట్టుకెళ్లడం జరుగుతూ ఉండేది. రఘుకి తెలిసినా ఏం చెయ్యగలడు? అక్కడికీ ఒకసారి "పిన్నీ! మీరు రోజూ అవి ధకు యిలా డబ్బులు ఇస్తూంటే నాన్నగారికి కష్టంకాదా? అసలే నాన్నగారు ఈమధ్య అప్పులు ఎక్కువై బాధపడుతున్నారు" అని చెప్పబోతే "నోరుముయ్యి! నీకు అక్కరలేని విషయాలలో జోక్యం చేసుకోకు. తండ్రి అంత కష్టపడుతున్నారని నీకు నిజంగా బాధగా ఉంటే నాలుగు ట్యూషన్లు చెప్పి ఆయనను ఆదుకోవచ్చుకదా! అడ్డమైన వాళ్లకోసం రెక్కలు ముక్కలు చేసుకొంటే నేనేం చెయ్యను" అంటూ రోజంతా సాధించింది.

విషయం విని రామారావుగారు "వాడన్న దాంట్లో తప్పేమిటి? నేను కష్టపడడం చూసి సహించలేక అన్నాడు. ఈ యింటి బాధ్యత వాడిది కాదా?" అని గట్టిగా దెబ్బలాడితే "అయితే నా తల్లి మాత్రం పరాయిదా? ఏదో పదో పరకో చేతిలో పెడితే యింత రాద్ధాంతమా?" అంటూ రుసరుసలాడింది.

శాంత పుట్టగానే ఆపరేషన్ చేయించుకొంటానని రామారావుగారంటే గయ్యి మంది సుందరి. "నాకడుపున మొగ నలుసు పుట్టడం మీకు ఇష్టం లేదా?" అని "రఘు మన కొడుకు కాదా?" అని ఆయనంటే సుందరి తల్లి దెబ్బలాటకు వచ్చింది. "కననిదే కడుపుకాదు కట్టనిదే బట్టకాదు అని సామెత ఉంది తెలుసా నాయనా! అప్పుడైతే పిల్లలు లేరని రఘుని తెచ్చుకొన్నారు. కాని యిప్పుడేం ఖర్మ?' అని అంటూంటే ఆయనకు తీవ్రమైన కోపం వచ్చింది. తీక్షణమైన చూపులతో వారిని హెచ్చరించారు.

"రఘు... నా మొదటి బిడ్డ, వాడి జోలికెవరైనా వెళ్లారా... యీ ఇంట్లో ఎవరూ ఉండరు. చావుతప్ప యింకెవ్వరూ వాణ్ణి, నన్ను వేరు చెయ్యలేరు" అని ఆయన ఉద్వేగంతో అంటూ ఉంటే రఘు మనస్సు కృతజ్ఞతతో నిండిపోయింది.

మొత్తానికి సుందరి పుణ్యమా అని రఘు ట్యూషన్లు మొదలు పెట్టేడు. వానికి ఉండేదే సాయంత్రం కొద్ది సమయం. ఆ కొద్ది సమయంలోనే అతను యిలా కష్టపడటం ఆ తండ్రికి వ్యధకలిగించింది. ట్యూషన్లు చెప్పడం మానమని ఆయనెంత చెప్పినా రఘు వినలేదు. సాధారణంగా అతను పట్టుదల పట్టడు. ఒకవేళ పట్టుదల వస్తే వెనకకు తగ్గే రకంకాదు.

సుందరి రెండోసారి గర్భం ధరించడంతో... శాంత ఆలనా పాలనా రఘుపైన పడ్డాయి. కావాలని లేని రోగాలు నటించి పడక వేసేది సుందరి. ఎవరేమి చెయ్యగలరు? తను పెద్దవాడై కూడా తండ్రి నెందుకు శ్రమపెట్టడమని రఘు వంటచేసేవాడు. వంట, చదువు, ఇంటి పని, ట్యూషన్లతో అతను అవస్థపడుతోంటే రామారావుగారి మనస్సు చివుక్కుమనేది.

ఒక్కొక్కసారి స్నేహితుని అవస్థకు బాధ అనిపించి చక్రధరంగారు భార్యని కేకలేసేవా




రు. "ఇదిగో వర్ధనం! నీవు తెచ్చిన సంబంధమే యిది. ఈ పాపం నిన్ను కట్టికుదుపుతుంది. సాధుగోవులాంటి మా స్నేహితుడికి నువ్వు అలాంటి మాయలమరాఠీని తెచ్చి పెళ్లి చేస్తావా? ఇది నీకేమైనా న్యాయమా? ఒక సంబంధం గురించి మనం ఇతరులకు చెప్పామంటే వాళ్లు మనల్ని మెచ్చుకోవాలి" అని భార్యను మందలించేవారు.

"అది కాదు నాన్నా! కాంతమ్మ ఇచ్చిన అప్పడాలు, అరిశలు ఒట్టినే పోతాయా? పాపం ఆ అరిశలు, పువ్వులు చేయించిన పనే యిది. అవునుగాని, అమ్మా! మీ కాంతమ్మగారు కూతురు పెళ్లి అయ్యాక మళ్లీ ఇటు తొంగిచూడలేదు. అవునులే ఇంక రెండోపిల్ల ఉంది కదూ! అప్పుడు వస్తుంది. ఈసారి ఏలడ్డూలు పట్టుకొస్తుందో? పాపం! మళ్లీ ఎవరు వలలో పడతారో?" అంటూ ఝాన్సీ అంటుంటే వర్ధనమ్మకు ఒళ్లు మండిపోయేది.

"దీన్ని చూస్తే పిట్టకొంచెం, కూతఘనం అన్నట్లుంది. అయినా ఆ పిల్లని నేనేమైనా బొడ్డుకోసి పెంచానా? వాళ్ల గురించి బాగా తెలియడానికి. అయినా మీస్నేహితుడిని అనాలి. నాలుగు తగలనిచ్చి మూల కూర్చోపెట్టక నెత్తిమీద కెక్కించుకోవడం ఎందుకు? ఇదిగో మీ పిల్ల వరస ఏంబాగుండలేదు. పెద్దాలేదు, చిన్నాలేదు... నోటికి ఎంతవస్తే అంత అనేస్తుంది" అని రుసరుసలాడింది వర్ధనమ్మ.

అంతటితో ఆగక "ఇలా అయితే దీన్నెవరు పెళ్లి చేసుకొంటారు? దీని పెళ్లి ఎలా చేస్తాం?" అంటూ బాధపడిపోయింది.

"ఇదిగో వర్ధనం! నా కూతురి గురించి బెంగతో నువ్వు మంచం ఎక్కనక్కరలేదు. నా కూతురి కోసం వరుళ్లు క్యూలో నించుంటారు. నువ్వేం కష్టపడి ఇలాంటి పనికిమాలిన సంబంధాలు చూడక్కరలేదు" అని కూతురు వైపు తిరిగి "ఏం చిట్టితల్లీ! నేను చెప్పింది కరెక్టా, కాదా?" అని అడిగారు చక్రధరంగారు.

"సెంట్ పర్సంట్ కరెక్టు నాన్నా ఇప్పుడే మీకు కూడా చెపుతున్నాను. మీరేం కంగారుపడి నాకు సంబంధాలు చూడొద్దు. నేను డిగ్రీ పూర్తిచేసి కాని పెళ్లిచేసుకోను" అని ఖచ్చితంగా తేల్చి చెప్పేసింది పనిలోపనిగా.

ఝాన్సీ తీరే వేరు. ఆమెకున్న ధైర్యం రఘుకు కూడా లేదేమో అన్పిస్తుంది. కాలేజీలో ఏ కాంపిటీషను పెట్టినా ఆమె మొదటి బహుమతి పొందవల్సిందే. రఘు మాత్రం ఏ వ్యాస రచనకో పేరు యిచ్చేవాడు. క్విజ్ పోటీలలో మాత్రం ముందుండేవాడు. ఝాన్సీ, రఘు కలిసి చదువుతున్నా రఘుకు ఆమెతో మాట్లాడటమంటేనే బెరుకు. అసలు అతడు కాలేజీలో చేరడం సుందరికిష్టంలేదు. అతని చదువుకు పెట్టే డబ్బు దండగని ఆమె ఉద్దేశ్యం. రామారావుగారు మాత్రం ఈ విషయంలో ఆమె ఏమి చెప్పినా పెడచెవిన పెట్టేవారు. రఘు మాత్రం తండ్రితో చెప్పి తను ట్యూషన్ల ద్వారా సంపాదించిన డబ్బుతో బట్టలు పుస్తకాలు కొనేవాడు. రామారావుగారు చక్రధరంతో కొడుకు గురించి చెబుతుంటే మౌనంగా వింటుండిపోయేది ఝాన్సీ. రఘులోని అలవిమీరిన సహనం ఆమెలో ఎన్నో ఆలోచనల్ని కలిగించేది. ఆవేశాన్ని తెప్పించేది. పరీక్షలప్పుడు చదువుకు తప్ప మరేపనికీ సమయం కేటాయించకూడదనేది ఆమె సిద్ధాంతం. మెదడునిండా చికాకులతో, చేతినిండా పనులతో సతమతమవుతున్న రఘు పరీక్షలెలా రాస్తాడోనని దిగులు కూడా కలిగేది కొన్నిసార్లు.

ఝాన్సీ ఒక్కోసారి అదే అంటుంది. "రఘూ! నీ పిరికితనం చూస్తే నాకు జాలేస్తుంది. ధైర్యంగా ఆమెతో ఎందుకు దెబ్బలాడలేవు? మీ నాన్నగారిమీద ఆవిడకెంత హక్కుందో నీకూ అంతే హక్కు ఉంది. నీకు వాళ్లమీద యిష్టం ఉంటే నీచదువు పూర్తిఅయిన తరువాత వాళ్లను సుఖపెట్టు. హాయిగా చదువుకోవల్సిన టైములో ఈ ఇంటిపనులేమిటి? పేటంతా తిరిగి తిరిగి ఈ ట్యూషన్లు చెప్పడమేమిటి?" అంటూ దెబ్బలాడేది.

"ఈ ఒక్క సంవత్సరం అయిపోతే మన డిగ్రీ పూర్తిఅవుతుంది. ఈలోపు ఎందుకు సహనం కోల్పోవాలి? నాన్నగారి ప్రేమానురాగాలముందు ఎంతటి బాధనైనా భరించవచ్చును" అని రఘు బదులు చెప్పిన దానికి ఇంకేం మాట్లాడలేక ఊరుకొనేది ఝాన్సీ.

ఝాన్సీని చూస్తే అతనికి ఎంతో ఆశ్చ

ర్యంగా ఉండేది. ఊళ్లో ఉమెన్స్ కాలేజీ ఉన్నా... తనతోపాటు మెన్స్ కాలేజీలో చేరి బీయస్సీ చదువుతోంది. చక్రధరంగారు అప్పటికీ "ఉమెన్స్ కాలేజీలో ఆర్ట్సు చదవకూడదమ్మా! ఆ కాలేజీ దూరం... అందులోనూ మగపిల్లలతో గొడవలు" అని నచ్చచెప్పబోయారు.

"అందుకే నాన్నా! మీపెద్దవాళ్లను చూస్తే కోపం వచ్చేది. ఆడపిల్లలు వేరే గర్ల్స్ స్కూళ్లలోను, ఉమెన్స్ కాలేజీల్లోను చదువుతే భద్రంగా ఉంటారా? తర్వాతయినా సమాజంలో మగవారితోపాటు ఉద్యోగం చెయ్యనక్కరలేదా? జీవించనక్కరలేదా?? కాలేజీ దూరం అంటారా! సైకిలు ఉన్నా నాకు కాలేజీ దూరం అంటారా! సైకిలు ఉన్న నాకు కాలేజీ దూరం అయితే మాత్రం నష్టం ఏమిటి"? అని ప్రశ్నల వర్షం కురిపించింది.

"చిట్టి తల్లీ! నీ సంగతి తెలిసీ ఉమెన్స్ కాలేజీలో చదవమనటం నాదే తప్పు. నీ వన్నట్లు ఈ రోజుల్లో స్త్రీలు, పురుషులకేమాత్రం తీసిపోరు" అని ప్రోత్సహిస్తూ ఆమెను మెన్స్ కాలేజీలో జాయిన్ చేశారు.

ఒకసారి ఝాన్సీకి ఆనంద్ అనే అబ్బాయి ప్రేమలేఖ వ్రాసి, ఆమెవద్దనుండి చదవడానికి తీసుకొన్న పుస్తకంలో పెట్టియిచ్చాడు.

"ప్రేమకు ధైర్యం అవసరం. పిరికితనం ఉన్నవాళ్లు ప్రేమించడానికి అనర్హులు. కనీసం ప్రేమలేఖను ధైర్యంగా చేతికి ఇవ్వలేని వాడివి నాతో నూరేళ్లజీవితాన్ని ఎలా ధైర్యంగా గడవగలవు? పిరికి వాళ్లను నేను అసహ్యించుకొంటాను. సారీ! ఇదిగో నీ ప్రేమలేఖ" అంటూ ఆనంద్‌కు ఆ ప్రేమలేఖను తిరిగి ఇచ్చేసింది. సంగతేమిటని పక్కనే ఉండి అడిగిన రఘుకు విషయం చెప్పింది.

మాధవి పెద్దపిల్లయ్యిందని ఉత్తరం రాగానే ఎవరు వెళ్లాలా? అని ఇంట్లో తర్జనభర్జన అయ్యింది. అందరినీ తీసుకువెళ్లాలంటే రామారావుగారివద్ద తగినంత డబ్బు లేదు. నెలలు నిండినస్థితిలో సుందరి ఎందుకని కూడ ఆయన ఉద్దేశ్యం. ఆవిడపోరు పడలేక చివరకు రఘుని తోడుగా ఆమెను పంపారు.

మాధవికోసం మంచి చీర కొని పంపించారు.

వచ్చిన చుట్టాలు కొందరు రఘుని, మాధవిని వేళాకోళం చెయ్యబోయారు. "పనిలో పని పెళ్లికొడుకు రఘు ఇక్కడే ఉన్నాడు కదా! ఆ మూడు ముళ్లు వేయించేస్తే సరి" అని మాధవి మేనత్తలు ఇద్దరూ ప్రపోజ్ చేశారు. "మామయ్య కొడుకైనంతమాత్రాన పెళ్లిచేసుకోవాలా అంటే! నాకు బాగా చదువుకొని లాయర వ్వాలనిఉంది. అయినా నేనూ, రఘు ఒకేచోట మామయ్యదగ్గరే పెరిగాము. నాకు రఘుని చూస్తే అన్నయ్యలేడనిపించదు" అంటూ అత్తయ్యలను సున్నితంగా వారించింది. ధైర్యంగా మాధవి అలా అనగలినందుకు రఘుకు చాలా సంతోషం కలిగింది. నిజమే మాధవి, తనూ కలిసి ఒకే ప్రాణంగా అన్నాచెల్లెళ్లలాగ పెరిగారు మరి.

సుందరికి మళ్లీ ఆడపిల్ల పుట్టడంతో రామారావుగారికి భయం పట్టుకొంది. కాంతమ్మ రెండవకూతురికి ఇల్లు అప్పచెప్పి అయిదు నెలలు సుందరి దగ్గరే ఉండిపోయింది. తల్లి దగ్గర ఉంటే ఇంక సుందరి సంగతి చెప్పనే అక్కరలేదు. ఇద్దరు ఆడవాళ్లు ఇంట్లో ఉన్నా నీళ్లుతోడటం వగైరా పనులన్నీ రఘువే. ఇంక కాంతమ్మ తిరుగుళ్లకు లెక్కేలేదు. రఘు అవస్థ చూడలేక రామారావుగారు సతమతమయ్యేవారు. పోనీ కొన్నాళ్లు రఘును చెల్లెలింటికి పంపుదామన్నా చిన్నారి శాంత రఘుని విడిచి ఒక్కక్షణం కూడా ఉండలేదు. అంత చిన్నారి వయస్సులోనే ఎవరు ఏమి ఇచ్చినా రఘుకు వాటా పెట్టేది. రఘుకి శాంత అంటే ప్రాణం. శాంత పడక రఘు దగ్గరే. అన్నయ్య రాత్రిళ్లు చదువుకొంటుంటే అతని వడిలో పడుకోనేది. రఘుకు చేరికవ్వడంవల్ల అప్పుడప్పుడు అమ్మచేత, అమ్మమ్మచేత తన్నులుతినేది.

భార్య పురుళ్ళతో, అత్తగారి దుబారా ఖర్చులతో రామారావుగారు ఆర్థికంగా బాగా చితికిపోయారు. ఆయనకు అప్పుడప్పుడు తలనొప్పి, జ్వరం వస్తూండేవి "ఎందుకు ఈ రెండో పెళ్లిచేసుకొన్నానురా! భగవంతుడా?" అని వాపోయేవారు. రఘు తెల్లవారుఝామున చదువుకొంటున్నప్పుడు ఆయనే టీ కలిపి ఇచ్చేవారు. కాలేజీలో చదువుకొంటున్నా ఏనాడూ నోరు విప్పి ఏమీ అడగని రఘుకు ఒకసారి




బట్టలు తీసుకొనివస్తే... అతనిని నెత్తికెక్కించుకొని ఇల్లు గుల్లచేస్తున్నారని సుందరి గొడవ. కాంతమ్మ ఏడుపు.

అయినా ఆయన లెక్కచేసేవారు కాదు. ఆయన ఇప్పుడు ఒకటి గ్రహించారు. చేసేవనేదో కిమ్మనకుండా చేసెయ్యడం. ఒక అర ఎకరం పొలం అమ్మేసి ఉన్న కాడికి అప్పులు తీర్చేశారు. మిగిలిన పొలాన్ని ముందు జాగ్రత్త చర్యగా రఘు పేర్న వ్రాసేశారు. రఘు అంటే ఆయనకు నమ్మకం ఎక్కువ. అతను తనకు, చెల్లెళ్లకు అన్యాయం చేయడని ఆయనకు తెలుసు.

రెండవ పిల్ల బాలసారె చాలా క్లుప్తంగా జరిపించారు. ఆ పిల్లకు "పావని" అని పేరు పెట్టారు. ఆయన ఆపరేషన్‌కు ఎక్కడ బయలు దేరుతారోనని సుందరి ముందుగానే వార్నింగ్ ఇచ్చింది. "మూడవసారైనా మనకు మగ పిల్లాడు పుట్టకపోదు. మీరు ఆపరేషన్ చేయించుకొంటే .నేను విషం తాగిచస్తాను" అని బెదిరించింది.

ఆయన ఒక విధమైన వేదాంతస్థితికి వచ్చేశారు. "జరిగేది జరక్క మానదు" అని. ఈ మధ్య గోదావరి ఒడ్డుకు వెళ్లి గంటలకొలది కూర్చోడం అలవాటు చేసుకొన్నారు. నీరసంగా ఉంటోన్న తండ్రి ట్యూషన్లతో ఏం బాధ పడతారని రఘు ఆ బాధ్యతకూడ తనే తీసుకొన్నాడు.

సుందరి ఒక్కనాడూ రఘుని మనసారా ప్రేమగా పిలిచి ఎరగదు. "ఒరేయ్ పుస్తకాలు పురుగు!" అనో "చేతకాని దద్దమ్మా!" అనో "నాయనా దత్తపుత్రా!" అనో వేళాకోళంగా పిలిచేది. ఆయన అది గమనించి ఎన్నిసార్లు మందలించినా ఆమెకు లెక్కలేదు. ఇటువంటి పరిస్థితుల్లో సుందరి గొలుసు పోయింది ఇంట్లో. అక్కడో... ఇక్కడో నిర్లక్ష్యంగా పడేస్తే రఘో, రామారావుగారో తెచ్చిఇచ్చేవారు. అలాంటిది వాళ్లకు కూడా దొరకలేదు. ఎవరు తీశారో తెలియలేదు. సుందరి ఇంట్లో అందర్నీ పేరు, పేరున గేలపెడుతూ అడిగింది. ఎవ్వరూ తియ్యలేదనేశారు.

"ఇంకెవరు తీస్తారే తల్లీ! ఆ దొంగ వెధవ రఘూయే తీసుంటాడు. ఈ ఏడాదితో చదువైపోతోంది కదా! వాడికి గొప్ప ధైర్యం వచ్చేసింది. వీళ్లు నన్నేం చేయగలరని ధీమా. అయినా మీ ఆయనకెన్నోసార్లు చెప్పాను... కడుపున పుట్టిన పిల్లలున్నారు ఇంకా వీడెందుకని? ఆయన వింటేగా? పై పెచ్చు నా మీద గయ్యిమన్నారు" అంటూ యాగీ ప్రారంభించింది కాంతమ్మ.

అది బాగా తలకెక్కిన సుందరి "ఒరేయ్! నా ఉప్పుతిని నాకే ద్రోహం చేస్తావురా!? పురుగులు పట్టి పోతావురా! నా గొలుసు మర్యాదగా ఇచ్చేయ్, లేకపోతే పోలీసు రిపోర్టిస్తాను" అంటూ ఎడాపెడా కొట్టడం ప్రారంభించింది విచక్షణాజ్ఞానం కోల్పోయి.

"నిజం చెప్తున్నాను పిన్నీ! నేను తీయలేదు పిన్నీ! అమ్మమీద ఒట్టేసి చెప్తున్నాను. కావాలంటే అమ్మ ఫోటోమీద ప్రమాణం చేస్తాను పిన్నీ! అది ఎవరు తీసారో నాకు తెలియదు" అంటూ కళ్లనీళ్ళతో గోలపెట్టాడు. అయినా సుందరి వినలేదు. చేయని నేరానికి అతనిని వేదనతో నింపింది.

రామారావుగారు ఇంటికి వచ్చేసరికి శాంత ఎదురెళ్లి "అన్నయ్య ఏడుస్తున్నాడు" అని వచ్చీరాని మాటలతో చెప్పినది. ఆయన విషయం తెలుసుకొని ఆగ్రహోదగ్రులయ్యారు సుందరిమీద.

"ఎన్నిసార్లు చెప్పేను నీకు బంగారం అశ్రద్ధగా పడవేయవద్దని, సొమ్ము పాపిష్టిది. ఎవరైనా తీసి ఉండొచ్చునుకదా! నీయిష్టం వచ్చినట్లు మాటలు అనెయ్యడమేనా? వాడికేం ఖర్మ? వాడెందుకుతీస్తాడు?" అని కేకలేశారు.

"వాడు తీయకపోతే ఎవరు తీస్తారు? వాడి కాలేజీ చదువులకు బట్టలకు డబ్బులు కావలసి వస్తాయికదా! అందుకే ముందు జాగ్రత్తగా దాచేసి ఉంటాడు" అని ఎద్దేవాగా అంది సుందరి.

"నేను బతికి ఉండగా వాడికి దొంగతనంచేసే ఖర్మ పట్టదు. వాడికి తండ్రి అండవుంది. సంస్కారవంతమైన మనస్సు పెంపకం ఉంది. జీవితాన్ని కష్టపడి మాధుర్యం చేసుకొనే శక్తి ఉంది. పసివాడని కూడా ఆలోచించక చెంపలు పగలకొడతావా? అసలు నీకెవరిచ్చారు ఆ అధికారం?" అంటూ ఆయన సుందరిపైకి చెయ్యెత్తబోయారు.

అంతలోనే రఘు ఆయనను ఆపి "నాన్నగారూ! మీరు ఆవేశం తెచ్చుకోవద్దు. ముందులోనికి పదండి" అంటూ ఆయనను గదిలోనికి బలవంతంగా తీసుకొని వెళ్లాడు.

"గతిలేని వాళ్లం మేమేకదా! మమ్మల్ని పట్టుకొని అన్ని మాటలంటారా? మేము తీస్తే పురుగులు పట్టిపోతాం" అంటూ కాంతమ్మ వాగసాగింది. బజారు పనిచూసుకొని అక్కడకు యాదృచ్ఛికంగా వచ్చిన శర్మగారు విషయం తెలిసి అవాక్కయ్యారు. "సిగ్గులేదూ! కూతురింట్లో పడి తిన్నది కాక, లేనిపోని తగాదాలు పెడుతున్నావా? ఆ అబ్బాయి తియ్యటం నువ్వు చూశావా? ఎందుకింకా నిలబడ్డావు? బట్టలు తీసుకొని బయలుదేరు" అంటూ నాలుగు తిట్టి ఇంటికి బయలుదేరదీశారు కాంతాన్ని.

రెండు రోజులు పోయాక సుందరి చెల్లెలు ఇంట్లోనుండి వెళ్లిపోయి ఒక షరాబును పెళ్ళి చేసుకొంది. వెళ్లిపోతూ సుందరి పేర్న ఒక ఉత్తరం రాసింది. "తన భర్తకు ఫ్యాక్టరీలో ఉద్యోగం రావడానికి మూడువేలు రూపాయలు అవసరమయినందున మరో గత్యంతరం లేక ఆ గొలుసు తానే దొంగిలించానని... జీవితంలో స్థిరపడిన వెంటనే తిరిగి ఆ డబ్బు ముట్టచెపుతానని క్షమించమని" దాని సారాంశం. అనవసరంగా రఘుని అనుమానించి హింసించినందుకు రామారావుగారు సుందరిని మరోసారి తిట్టారు.

పినతల్లికి తనమీద అయిష్టత ఉందని తెలుసుగాని ఇలా దొంగతనం అంటగడుతుందని మాత్రం రఘు ఊహించలేదు. ఆవిడ స్వభావానికి అతనికి పిచ్చెక్కినట్లు అవుతోంది. ఎంతో నిగ్రహం కలవాడు కనుక తట్టుకొని మసులుతున్నాడు.

సుందరి ఖర్చులకు అంతులేకుండా పోతోంది. వారానికి రెండు సినిమాలైనా చూడకుండా ఉండదు. ఎవరో చవకగా అమ్ముతున్నారని డ్రస్సింగ్ టేబిల్ ఒకటి ఇంటికి తెప్పించింది. ఇప్పుడు ఖర్చులో ఉన్నామని ఆయనగోల పెట్టినా వినకుండా మారాంచేసి కొనిపించింది. ఫేషన్‌గా రకరకాలుగా శిగనలంకరించుకోడం, చిన్నపిల్లలలాగా అలంకరణలు చేసుకొని మురిసిపోడం, వయస్సుకు తగినట్లుగా ఉండాలని భర్త హెచ్చరిస్తున్నా వినకపోవడం ఆమెకు అలవాటయ్యింది. ఒకసారి సినిమా హాలులో రామారావుగారు వినేటట్లు ఎవరో అసహ్యంగా ఆమెనుద్దేశించి కామెంట్ చేశారు. అది మొదలు ఆయన ఆమెతో సినిమాకు వెళ్లడం విరమించుకొన్నారు.

"ఎవరో వెధవలు, ఏదో అన్నారని మనమెందుకు మారాలి?" అని సుందరి వాదన. "నీచేత ఈ వగలవేషం... ఈ అక్కరలేని భేషజాలు మాన్పించలేకపోయినందుకు నాకీ శిక్ష పడవల్సిందే" అంటారాయన. "పోనీ టీ.వి. కొనండి మనం ఎక్కడికీ ఎక్కువగా వెళ్లనక్కరలేదు. మనకూ కాలక్షేపంగా ఉంటుందని" కొత్త ప్రతిపాదన చేసింది. పోనీ! యీవంకనైనా యింటిపట్టున ఆమె ఉంటే పరువైనా దక్కుతుందని శక్తికి మించినదైనా టీ.వి. కొన్నారు రామారావుగారు. దాంతో అది చూడటానికి యింటికి వచ్చే సభ్యుల సంఖ్య ఎక్కువయ్యింది. సుందరికి మరికొంచెం హొన్ను కొట్టుకొనే అవకాశం ఎక్కువయింది.

ఇంట్లో ఇరవైనాలుగు గంటలూ టీ.వి. మోత ఎక్కువవ్వడంతో రఘుకి చదువుకోవడం కష్టమయ్యింది. తోటలోకి వెళ్లి చదువుకొంటున్న రఘుని చూసి, ఒక సిమ్మెంటు బెంచీ వేయించి, లైటు కూడా ఏర్పాటుచేయించారు రామారావుగారు. అంతకన్నా చెయ్యడానికి ఆయనకు అవకాశం లేకపోయింది.

నెమ్మదిగా రఘు చదువు ఎలాగో ముగిసింది. ఫస్టుక్లాసులో పాసైన రఘుని ఎం.ఎస్సీ చదివించాలని రామారావుగారి కోరిక. రఘు ససేమిరా పై చదువు చదవనని భీష్మించుకొని కూర్చున్నాడు. ట్రైనింగు పూర్తిచేసుకొని ఏదో ఉద్యోగం చేసుకొని తనకాళ్లమీద తాను నిలబడాలని అతని కోరిక. మధుసూదనంగారు, చక్రధరంగారు రఘు మాటనే సమర్థించటంతో ఆ ఊరిలోనే బి.ఇ.డి. కాలేజీలో చేరాడు రఘు.

మూడవసారి కూడా ఆడపిల్ల పుట్టడంతో సుందరి చచ్చినట్లు ఆపరేషను చేయించుకొంది, ఇక తనకు కొడుకు పుట్టే అవకాశం,





అదృష్టం లేదని. పార్వతమ్మ శాపమే తనను తినేస్తోందని యింటికొచ్చిన ప్రతివారితో చెప్తోంది.

రామారావుగారికి మనస్సులో భయం పట్టుకొంది. ఈ కుటుంబాన్ని తను లాగగలడా. ఈ పిల్లలకి ఒక దారి చూపగలనా! అని కలవరం. తన మాట విని సుందరి శాంతతోనే ఆపరేషను చేయించుకొని ఉంటే ఈ సమస్యలుండేవి కావుకదా! పరిపరి విధాల ఆలోచనలతో స్కూలుకు వెళ్ళి పాఠాలు చెప్పటంలో మునుపటి ఉత్సాహంలేదు రామారావుగారికి.

ఆయనలోని నిరుత్సాహాన్ని గమనించి మధుసూదనంగారు ఒకసారి దెబ్బలాడేరు. "మీ మనస్సుని అనవసరంగా పాడుచేసుకోకండి. ఎలా జరగవల్సినది అలా జరుగుతుంది. కొంచెం మానసిక ఊరటకోసం గ్రంధ పఠనం చేస్తూ ఉండండి. అలా ఖాళీగా ఉండి ఆలోచిస్తుంటే కందిరీగల్లా సమస్యలు చుట్టుముడుతూనే ఉంటాయి" అని హితవు చెప్పారు.

ఆయనకి పుస్తకం పట్టుకోవడం భయం. "ఇలా ఎంతసేపూ పుస్తకాలు పట్టుకోడానికి, పూజలు చేసుకోడానికా నన్ను పెళ్ళిచేసుకున్నది? ఒక సరదాలేదు, సంతృప్తిలేదు. వెధవది కనీసం సినిమాకు కలసి వెళ్ళడానికి కూడా నోచుకోలేనిదీ బతుకు" అంటూ దెప్పుతుంటే ఆయన బుర్రకెక్కేది కాదు చదువు. ఆయనను మంచి పుస్తకాలు చదువుకోనివ్వదుగాని తనుమాత్రం సెక్స్ పుస్తకాలు విపరీతంగా చదువుతుంది.

"ఇదిగో సుందరీ! ఈ వెధవ సెక్స్ సాహిత్యం చదవటం మాను. అది నీ వంటికి, మన యింటికి కూడా మంచిది కాదు" అని ఆయన సున్నితంగా మందలించినా ఆమె బుర్రకెక్కేదికాదు. పైపెచ్చు "భార్యను సంతృప్తి పరచటం భర్త విధికాదా? ఎప్పుడూ అలా నిస్తేజంగా ఉండకపోతే కాస్తంత ఉత్సాహంగా ఉండకూడదా? ముగ్గురు పిల్లల్ని కన్నంత మాత్రాన నేనేమైనా పసి తగ్గిపోయానా?" అంటూ వేధించేది.

మాధవి టెన్త్ ఫస్టుక్లాస్‌లో పాసయ్యింది. ఏమైనాసరే మామయ్యదగ్గరే చదువుకొంటానని మొండికెత్తింది. ఆమెకు మామయ్యంటే ఎనలేని ప్రేమ. చివరకు ఆమెను రాజమండ్రిలోనే చదివించాలని నిశ్చయించుకొన్నారు తల్లిదండ్రులు. అయితే! హాస్టల్‌లో ఉండి చదువుకోవాలని నిబంధన విధించారు. అసలు సుందరిని చూస్తేనే చిరాకు నర్మదకి. లోనెక్ జాకెట్లు వేసుకోడం, అస్తమానూ పవిట జారవిడుచుకోవడం చాలక ఈమధ్య లిప్‌స్టిక్ రాసుకోడం కూడా మొదలుపెట్టింది. ఇవన్నీ భరించడం విసుగు. ఆవిడకు కాంక్ష ఎక్కువ. అందుకే అటువంటిచోట మాధవిని ఉంచడం ఎందుకని వాళ్ల ఆలోచన. త్వరలో తాము రాజమండ్రి ట్రాన్స్‌ఫర్ చేయించుకోవాలనీ, అందాకా మాధవిని హాస్టల్‌లో ఉంచి చదివించాలనే నిర్ణయానికి వచ్చారు.

సుందరికి మాధవి అంటే యిష్టమే. అందునా తెల్లగా, సన్నగా, నాజూకుగా ఉన్న మాధవిని ఆకర్షణగా చూసేది. హాస్టలులో చేర్పిందుకు భార్యాభర్తలిద్దరూ చిన్నబుచ్చుకొన్నారు. "ఆదివారాలు, పండగరోజుల్లో మీదగ్గరే ఉంటుందికదా!" అన్న నర్మద మాటలతో సమాధానపడక తప్పలేదు వాళ్లకు.

రఘు స్నేహితుని తల్లికి ఏక్సిడెంటు అయ్యిందని తెలిసి చూడటానికి వెళ్లాడు. ఆవిడ ఏదో ఊరు వెళ్లే ప్రయత్నంలో రద్దీగా ఉన్న జనంతో బస్సు ఎక్కే ప్రయత్నంలో కాలుజారి పడింది. ఆవిడ కాలుమీద నుండి బస్సు వెళ్లింది. కాలు మోకాలివరకు పోయింది. రెండవకాలి పాదానికి చివరివేళ్లు కూడా చిదికిపోయాయి. రఘు స్నేహితుడు ఆమెకు సవతి కొడుకు. అతడు ఆవిడ వద్ద ఎన్నో బాధలు అనుభవించాడు. ఆవిడ అతనికి సరిగ్గా అన్నం కూడా పెట్టేదికాదట. ఈ దశలో ఆమెకు సవతి కొడుకే ఆధారమయ్యాడు. ఈమధ్యనే అతనికి బంధువుల కృషివల్ల హైదరాబాదులో ఉద్యోగం దొరికే అవకాశం దొరికింది. ఈ పరిస్థితిలో అవిటి, సవతి తల్లిని వదలి వెళ్లడమా? తన భవిష్యత్తును కాలరాసుకొని ఆమెతో యిక్కడే ఏదో ఉద్యోగం చూసుకొని ఉండటమా? అన్నది అతని ప్రధాన సమస్య. నిజంగా ఆమె యితనిపట్ల ప్రవర్తించిన తీరుకు యితను ఏవిధమైన బాధ్యతా తీసుకోకపోయినా తప్పులేదు. కర్తవ్యాన్ని సూచించ

మని రఘుని అడిగాడు. రఘు ఈ విషయాలన్నీ తండ్రితో చెప్పాడు. తన స్నేహితుణ్ని ఎలాంటి నిర్ణయాన్ని తీసుకోమని చెప్పాలో సలహా అడిగాడు.

"చూడు రఘూ! మానవత్వమన్నది అన్నిటికన్నా గొప్ప గుణం! ప్రతి మనిషిలో కూడా ఏవో బలహీనతలు ఉంటాయి. కొందరు వాటిని అధిగమించగలరు. మరికొందరు వాటిని జయించలేరు. ఎదుటివారు సంస్కారహీనులైనంతమాత్రాన మనం కుసంస్కారం చూపించ్చ కూడదు. ప్రతి మనిషికీ క్షమించే మనసుండాలి. క్షమ అనేది దైవదత్తం. అవకాశం లభించినప్పుడు పగ తీర్చుకోవడంవల్ల మానవునికి తృప్తి లభ్యమౌతుందేమోగాని శాంతి లభించదు. ఎదుటివారి తప్పును క్షమించగలిగినప్పుడు అవ్యక్తమైన శాంతి లభిస్తుంది. 'ప్రేమ', 'క్షమ' అనేవి ఉత్తమ లక్షణాలు. నీ స్నేహితుని తల్లి పశ్చాత్తాపంతో పరితపించిపోతున్నప్పుడు ఆమెను వదిలి అతను వెళ్లడం మానవత్వమౌతుందా? అది రాక్షసప్రవృత్తి మాత్రమే. ఒకవేళ ఆవిడలో యిప్పటికీ పశ్చాత్తాపం కలగనప్పటికీ ఆమెను క్షమించి అతను ఆదుకొంటే మహామనిషి ఔతాడు" అని చెప్పారు.

మరోసారి రఘు తండ్రిని అడిగాడు "నాన్నగారూ! మరి కైకేయిని శిక్షించడానికి లక్ష్మణుడెందుకు తెగించాడు? రాముడు అపబట్టేకదా సరిపోయింది. దుష్టసంహారానికి అవతారమెత్తిన రాముడు తన తండ్రి వ్యాకులతకు, తద్వారా మరణానికి కారకులైన కైకను, మందరను ఎందుకు శిక్షించలేదు?" అని చాలా తెలివిగా ప్రశ్నించాడు ఏ సమాధానం తండ్రి చెప్పినా మనిషి ప్రవర్తనలో ద్వంద్వప్రవృత్తి ఉన్నట్లు తండ్రి ఒప్పుకొన్నట్లేనని భావించి.

"చూశావా బాబూ! నీ ప్రశ్నలోనే జవాబు ఉంది. తనకు హాని తలపెట్టిన వారిని కూడా క్షమించమన్నాడు శ్రీరాముడు. నిజమే! నీవన్నట్లు ఆయన దుష్టసంహారానికి అవతారమెత్తాడు. కానీ యిక్కడ కైక, మందర దుష్టులు కారే. వారు కేవలం దైవసంకల్పమాత్ర ప్రేరకులు. కైక కోరికలో స్త్రీ సహజమైన తన బిడ్డ, తన భర్త అన్న స్వార్థ చింతనే కన్పిస్తోంది. ఆమె మందర ప్రేరణతో, ఆ వరాలు కోరబట్టేకదా? రాముడు అరణ్యవాసం వెళ్లి ఎంతో దుష్టసంహరణ, రావణ సంహారణ గావించాడు. యింక లక్ష్మణుని ప్రవర్తన అంటావా! అది కేవలం ఆయన సేవాభావం. లక్ష్మణుడు కూడా ఆదిశేషుని అవతారమేకదా! విష్ణుసేవే అతని పరమావధి. పాముకు తామసలక్షణం సహజమే కదా! అందుకే ఆయనలో ఆ రుసరుసలు, బుసబుసలు" అంటూ తార్కికంగా, సహేతుకంగా వివరించేసరికి, నిశ్చేష్టుడయ్యాడు రఘు. అందుకే తండ్రి అంటే అతనికి, ప్రేమ, భక్తి, గౌరవం... ప్రాణం.



"ఏమిటన్నయ్యా! అంతగా నిద్రలేకుండా ఆలోచించే విషయాలు? గతాన్ని గుర్తుచేసుకోడంవల్ల ఏదైనా ప్రయోజనం ఉందా? ఎందుకన్నయ్యా! అంతగా ఆలోచించి బాధపడడం?" అంటూ అన్నయ్యను తట్టి పిలిచింది శాంత.

అయ్యో! తను చూసుకోలేదు. అప్పుడే తెల్లవారిపోయింది. "ఏంలేదు పదమ్మా! ముఖం కడుక్కొందాం అంటూ పడక కుర్చీలోంచి లేచాడు. తండ్రి యింకా గాఢనిద్రలో ఉన్నారు. ఆయన లేచిన తర్వాత ఆయన పనులు చూడొచ్చులెమ్మని చెప్పి పెరటిలోకి వెళ్లాడు. శాంత అన్నయ్యకు బ్రష్, పేస్టు యిస్తూ "అన్నయ్యా! నీవు బాధపడి తల బద్దలు కొట్టుకోనేందుకేమి ఉంది? ఆమెను వెళ్లిపొమ్మని మనం చెప్పొచ్చునుకదా! మన యింటికి వచ్చిన ఒక అతిథికి అతిథ్యమిచ్చామని సరిపెట్టుకొందాం. నీ మనసు ఈ విషయంకోసం అల్లకల్లోలం చేసుకోడం నేను సహించలేను" అని ఆందోళనాభరితంగా అంది శాంత.




రఘుకి చెల్లెలి మనసు బాగానే అర్థమౌతోంది. తను పిన్ని రాకవలన కలత చెందడం ఆ వసిమనను భరించలేకపోతోంది. శాంత స్వభావమే అంత. ప్రతి విషయం సున్నితంగా, సునిశితంగా ఆలోచిస్తుంది. అలాగని ఎవరు ఏది చెప్పితే దానిని ఒప్పుకోదు. తను ఒక నిర్ణయానికి రావాలి. ఏ విషయంలో ఒక నిర్ణయానికి వచ్చినా దానికి తిరుగుండదు.

వంట యింట్లో సుమతి కాఫీ కలిపి రఘు రాగానే... అతనికి, శాంతకు కాఫీ యిచ్చింది.

"ఆవిడ లేవలేదా?" అని అడిగాడు నెమ్మదిగా శాంతని.

"లేదన్నయ్యా! పడుకొని ఉంది లేపడం ఎందుకని వచ్చేశాను" అని చెప్పింది.

పక్క గదిలో పడుకొన్న సుందరికి వాళ్ల మాటలు వినిపిస్తున్నాయి. వాళ్ల ఎదుట పడటానికి బెరుకుగా ఉంది. తన విషయంలో వాళ్లు ఏం నిర్ణయం తీసుకొంటారోనని సాలోచనగా కళ్లు మూసుకొనే ఉంది. అప్పుడే లేచిన మాధవి ఆమెను చూచి యింకా ఆమె లేవలేదనుకొని వంట గదిలోకి నడిచింది.

"అందరికీ శుభోదయం. అదృష్టవంతులు. అందరూ చక్కగా వేడి వేడి కాఫీ సేవిస్తున్నారు. సుమతీ! నాకు కూడా బెడ్ కాఫీ యిచ్చెయ్యకూడదూ సేవించేస్తాను ఎంచక్కా" అంటూ నవ్వుతూ అడిగింది మాధవి.

"చూడు తల్లీ! ఆ పప్పులేవీ ఉడకవు. బెడ్‌మీద ఉంటేనే బెడ్‌కాఫీ. ఎలాగూ కష్టపడి దిగి వచ్చేశావుకదా! ముఖం కడుక్కొనిరా" అంది సుమతి.

"సరేలే! ఏంచేస్తాం? పాపం! మా రఘు నువ్వేదో బుద్ధిమంతురాలివని పెళ్లి చేసేసుకొన్నాడు. పిల్ల ఏదో ఏకులాగ సుతిమెత్తనిదనుకొని కట్నమయినా బాగా గుంజాడుకాదు. కానీ నువ్వు యిలా మాపాలిటి మేకువవుతావని అనుకోలేదు. వంటయింటి మహారాణీగారి ఆజ్ఞ దాటగలమా? అలాగే కానీ" అంటూ బాత్రూమ్‌వైపు నడిచింది.

తిరిగి వచ్చిన మాధవికి నవ్వుతూ కాఫీ గ్లాసు అందించింది సుమతి. తను కొంత గబగబా తాగాక "ఆఁ ఇంతకీ నువ్వు తాగావా? మరచిపోయి కాఫీ నేను సొంతం తాగేస్తే నామీద అలగడానికా తల్లీ? వెళ్లి నీ గ్లాసు తెచ్చుకో" అంది.

"అమ్మయ్య! నీ ఆజ్ఞ అయ్యిందికదా!" అంటూ నవ్వుతూ తనూ గ్లాసు తెచ్చుకొంది సుమతి.

"ఏమిటి రఘూ? మరీ ఆముదం తాగినట్లు పెట్టావు మొహం. కాస్త నవ్వైనా లేకుండా కొంప మునిగిపోయినట్లు ఏమిటా సీరియస్‌నెస్?" అంది రఘువైపు చూస్తూ మాధవి.

"నీకు అలాగే ఉంటుంది. ప్రతి విషయాన్ని తేలికగా తీసుకొంటావు. పిన్ని వచ్చిందా? నాన్నగారి ఆరోగ్యం చూస్తే అలాగ ఉంది. రెండవసారి స్ట్రోక్ వస్తే కష్టమన్నారు డాక్టరుగారు. ఇప్పుడు ఆవిడను నాన్నగారికి చూపించడమా? మానడమా? నా బుర్ర ఆందోళనతో పగిలిపోతోంది. చూపిస్తే ఫలితం ఎలా ఉంటుందో? నాన్నగారేమౌతారో?" అంటూ ఆందోళనగా మాధవివైపు చూస్తూ అన్నాడు రఘు.

"ఇన్ని ఆలోచనలు దేనికన్నయ్యా? ఆవిడను వెళ్లిపొమ్మని మనం చెప్పొచ్చునుకదా! చేసింది చాలక యింకా సిగ్గులేకుండా వచ్చింది. ఈవిడను చూడాలని ఎవరూ బెంగపడి చావడంలేదు. మీరు చెప్పలేకపోతే నేనే వెళ్లి చెప్తాను. తప్పుచేసి ఆవిడ బాగానే వుంది. మధ్యలో మీరెందుకు బుర్రలు బద్దలు చేసుకోవడం?" అంటూ దూకుడుగా వచ్చింది పావని. ఆమె చేతిలో పూలు చూడగానే తోటలో ఉందని... తమ మాటలు విందని వారికి తెల్సింది.

"పావనీ! వెళ్లిపొమ్మని చెప్పడం తేలికేనమ్మా! కానీ చెప్పవల్సింది మనంకాదు. ఈ యింటికి యజమాని మామయ్యగారు. ఆయన నిర్ణయం ఎలా ఉంటుందో మనకు తెలియదు. మనం అది తెలుసుకోవాలి. అంతేగాని తొందరపడి మనం ఏవనీ చేయకూడదు. ఈ చివరి రోజులలో అనుకోకుండా వచ్చిన ఆమెను ఆయననుండి దూరం చేయడం ధర్మమా? ఆవిడ విషయంలో ఆయన ఆలోచన ఏమిటో? యివన్నీ మనం ఆలోచించవద్దా?" అంది సుమతి.

"మంచి కోడలివమ్మా! కోడలు గుణవంతు

రాలైతే యిల్లు నిలబడుతుందట. అందుకే మా రఘు నిన్ను కట్టుకొన్నాడు. అవును రఘూ! తొమ్మిది గంటలకు డాక్టరుగారు ఎలాగూ వస్తారు. ఆయనకు విషయం చెప్పి ఏం చెయ్యమంటారో అడుగుదాం. ఆయనని అడిగాక అత్త రాక విషయం మామయ్యకు చెప్దాం. మామయ్య ఎలాగూ యిప్పుడు గదిలోనుండి కదలడంలేదు. ఆవిడ పక్కగదిలో ఉండి, పెరటి తోవను తిరగవచ్చు'' అంటూ సుమతి అభిప్రాయాన్ని బలపరిచింది మాధవి.

రఘు మాట్లాడకపోవడంచూసి పావనికి ఉక్రోషం వచ్చింది. "మనం ఆవిడ ప్రవర్తనవల్ల ఎన్ని మాటలు అందరిచేత పడ్డామో! ఎన్ని కష్టాలు అనుభవించామో గుర్తులేదా అన్నయ్యా నీకు! చివరకు శాంతక్క చదువు కూడా మానేసింది ఆవిడవల్లనేకదా? నాన్నగారికి మనోవ్యాకులతతో పక్షవాతం రావడానికి కారణం కూడా ఆవిడేకదా! సంఘంలో మనం ఎన్ని ఛీత్కారాలకు, చీదరింపులకు గురి అయ్యాం? వీళ్ల అమ్మ ఎవరితోనో లేచిపోయింది అంటూ ఎందరు ఎగతాళి చేశారు. ఇంకా నీవు ఆమెవైపే సానుభూతి ప్రదర్శిస్తే నేనిప్పుడే వెళ్లి గోదావరిలో దూకుతాను'' అని ఏడుస్తూ అంది పావని.

ఆమె అలా బాధపడటం, ఆవేశపడటం సబబే అనిపిస్తోంది.

"చూడు తల్లీ! నాన్నగారు, నేను మిమ్మల్ని విడిచి ఉండగలమా? మీకోసంకాదా మేము బతుకుతున్నది. మీ మనసులను బాధపెట్టడం నాకు యిష్టమా? నాన్నగారు ఉండగా నేను ఏ నిర్ణయం తీసుకోకూడదు. నాన్నగారు ఏం చెపితే అది చేద్దాం. నీవు అలా ఏడవకూడదు. పావనీ, నా బంగారు తల్లీ, మనం యిప్పుడు చక్రధరం అంకుల్ దగ్గరకు వెళ్దాం. నువ్వు త్వరగా స్నానం చెయ్యాలి. ఈలోపు నేను నాన్నగారి పనులు చూస్తాను'' అంటూ లేచాడు.

బరువుగా కళ్లు విప్పింది సుందరి. నెమ్మదిగా లేచి యివతలకు వస్తోంటే తూలిపడబోయింది. అటుగా వస్తున్న సుమతి గబుక్కున పట్టుకొంది. ఆవిడ శరీరం వేడిగా తగలడంతో

"ఒంట్లో బావుండలేదాండీ? అదేమిటి ఒళ్లు చేతికి వేడిగా తగులుతోంది?'' అని అడిగింది.

"లేదమ్మా! రాత్రినుండి కాస్త జ్వరంగా ఉంది. ఈ మధ్య తరచు యిలా జ్వరం వచ్చి, అదే తగ్గిపోతోంది'' అంది సుందరి.

"అదేంటండీ! ఒళ్లు యింతలా కాలిపోతుంటే నెమ్మదిగా చెపుతున్నారు? మీరు ఇక్కడే కూర్చోండి. నేను వెళ్లి ముఖం కడుక్కోనేందుకు అన్నీ తెస్తాను'' అంటూ పేస్టు, చెంబుతో వేడినీళ్లు యిచ్చింది.

ఆమె చూపిస్తున్న అభిమానానికి సుందరి కళ్లు చెమ్మగిల్లాయి. కాఫీ కూడా స్వయంగా తెచ్చి, దగ్గరుండి తాగించి గదిలోకి తీసుకెళ్లింది.

మాధవి కూడా వచ్చి "జ్వరంగా ఉందిట. ఎక్కువసేపు వేటి గురించీ ఆలోచించక విశ్రాంతి తీసుకోండి'' అంటూ దుప్పటి తెచ్చి యిచ్చింది. "అమ్మా! మధూ! నేను ఒక్కసారి మామయ్యగారితో మాట్లాడాలి. ఆయనని క్షమాభిక్ష అడగాలి. ఆయన క్షమించానంటేగాని నా పాపానికి విముక్తిలేదు. అందుకే వచ్చాను. ప్రస్తుతం వారిని చూసి మాట్లాడే వరకూ నాకు శాంతిలేదు. నాలో ఉన్నవి రెండే కోరికలు. ఒకటి మీ మామయ్యగార్ని క్షమాభిక్ష వేడుకోవడం, రెండు నా పిల్లల్ని ఒక్కసారి మనసారా చూసుకోగలగడం'' అంటూ ఏడ్చింది సుందరి.

"మీరు మామయ్యతో తప్పక మాట్లాడుదురుగాని. మామయ్యకు అయిదు రోజులక్రితమే హార్ట్ ఎటాక్ వచ్చింది. యింటికి వెళ్లిపోదామని మామయ్య గొడవ చేస్తుంటే, డాక్టర్‌గారు యింటికివచ్చి చూస్తానని మాటయివ్వడంవల్ల తీసుకొని వచ్చేశాం. కనుక డాక్టరుగారిని కనుక్కొన్నాక మీరు మామయ్యతో మాట్లాడవచ్చును'' అని అనునయంగా చెప్పింది మాధవి.

డాక్టరు వచ్చిన తరువాత రఘు బయటకు తీసుకువెళ్లి పరిస్థితి అంతా వివరించాడు. "ఆమెను చూస్తే... ఉద్వేగంతో నాన్నగారి గుండె తట్టుకోగలదా? నిన్నగాక మొన్ననే ప్రమాదస్థితినుండి బయటపడ్డారుకదా!'' అంటూ సందిగ్ధంగా రఘు అడిగితే, "ఆయనను పరీక్ష చేసి చెపుతాన''ని లోనికి వెళ్లారు డాక్టరుగారు.




"ఏమిటండీ మాష్టారూ! ఎలా ఉన్నారు? నీరసం తగ్గిందా, నిద్ర బాగా పడుతోందా?" అని ప్రశ్నిస్తూ పరీక్ష చేయడం మొదలుపెట్టారు డాక్టరుగారు.

"ఇంకా నేను బతికి ఏంచేయాలి డాక్టరుగారూ! మా అబ్బాయిని కష్టపెడుతున్నాను. మా బాబు జనమేజయుడు పరీక్షిత్ మహారాజుకు జరిపించినట్లు నాకు జరిపిస్తున్నాడు. వాని చేతుల్లో కన్ను ముయ్యడంకన్నా... నాకు కావల్సిందేముంది?" అని రామారావుగారు వాపోయారు.

"మీరు అలా బాధపడడం ఏమీ బాగోలేదు. పిల్లలు చూడండి... మీకోసం ఎంత కష్టపడుతున్నారో! వాళ్లకోసమైనా మీరు ధైర్యంగా ఉండాలి. ధైర్యంగా మాట్లాడాలి. మీకేం ఫరవాలేదు. అయినా మీకేంటండీ ముత్యాల్లాంటి పిల్లలున్నారు" అంటూ నవ్వుతూ సమాధానపరచి యివతలకి వచ్చాక రఘుతో "రెండు మూడు రోజులు చూడండి. బాగా కోలుకొనేవరకూ ఆతృత కలిగించే విషయాలు చెప్పకపోవడం మంచిది. ఆయన శరీర పరిస్థితినిబట్టి మళ్లీ రెండవసారి ఎటాక్ వస్తే ప్రమాదం" అన్నారు డాక్టరుగారు.

ఇంతలో రఘుకి సుందరి జ్వరం విషయం గుర్తుకొచ్చింది. సుందరి పడుకొన్న గదిలోకి ఆయనను తీసుకొని వచ్చాడు. సుందరి చలికి మూలుగుతూ రగ్గు కప్పుకొని పడుకొనిఉంది. డాక్టరుగారు సుందరిని చూసి 103 డిగ్రీల టెంపరేచరున్నదని చెప్పి యింజక్షన్ చేసి మాత్రలు వ్రాసి వెళ్లారు.

చక్రధరంగారింటికి రఘు పావనిని తీసుకొని వెళ్లాడు. ఆయన రఘుని సాదరంగా ఆహ్వానించారు. "నాన్నగారికి ఎలాగుంది రఘూ? సాయంకాలం మేము అలాగ మీ యింటికి వద్దామనుకొంటున్నాము" అని చెప్పారు.

"హల్లో! బావున్నారా? ఏమిటి అన్నాచెల్లెలు కలిసి మరీ దయచేశారు" అంటూ పలకరించింది ఝాన్సీ. వారికి కాఫీలు తెచ్చి యిచ్చింది. రఘు ఝాన్సీ ఎదురుగా ఎక్కువగా మాట్లాడడు. వినడమే అతని పని. "నాన్నగారూ! ఈ రఘుని చూస్తే భలే ఆశ్చర్యం వేస్తుంది. కొండ విరిగి మీదపడినా చలించడు. అన్నింటికీ చిరునవ్వే సమాధానమనుకొంటాడు" అంటూ రఘుని వేళాకోళం చేసింది ఝాన్సీ.

"మాటిమాటికి మా అన్నయ్యను ఎందుకు ఏదో అంటావు? మా అన్నయ్య వ్యక్తిత్వం నీకేం తెలుసు? మా అన్నయ్య కనుక ఎటువంటి పరిస్థితులు ఎదురైనా చలించకుండా ఉంటాడు. మా అన్నయ్యను ఈసారి ఏమైనా అంటే ఊరుకోను" అంటూ ఝాన్సీతో పోట్లాటకు దిగింది పావని.

"తల్లీ పావనీ! నువ్వు ఉన్నావని మరచిపోయి మీ బుద్ధుడు గారిని అన్నాను మన్నించు తల్లీ" అని సరదాగా లెంపలు వేసుకొంటున్న ఝాన్సీని చూసి అందరూ నవ్వుకొన్నారు.

కాఫీ తాగిన తరువాత చక్రధరంగారివైపు తిరిగి "మా నాన్నగారికి గల ముఖ్య స్నేహితులు మీరు. మీకన్నా మాకు ఆత్మీయులెవరు? మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడదామని వచ్చాను" అని చెప్పాడు రఘు.

"చెప్పు రఘూ! నావద్ద సంశయమెందుకు? డబ్బు ఏమైనా కావాలా? లేక యింకేమైనా విషయముందా? సంకోచించకుండా చెప్పు" అన్నారు చక్రధరంగారు.

"ఏంలేదు... హఠాత్తుగా రాత్రి మా పిన్నిగారు వచ్చారు. మాకు ఏంచేయాలో తోచడంలేదు. ఆమెకు నాన్నగారిని చూడాలని, మాట్లాడాలని ఉందిట. ఈ పరిస్థితిలో నాన్నగారు ఆమెను చూస్తే ఉద్రేకపడకుండా ఉండగలరా? ఈ విషయంలో మీ సలహాకోసం వచ్చాను" అని తలదించుకొని నెమ్మదిగా చెప్పాడు.

"నిజమేనా రఘూ! సుందరి తిరిగి వచ్చిందా? ఆమెను చూస్తే నీకు కోపం రాలేదా? ఆమెను లోనికి రానిచ్చావా?" అని నమ్మలేనట్లు విస్మయంగా అడిగారు.

"ఏమిటీ! ఆ హీరోయిన్‌గారు మళ్లీ వేంచేశారా? ఏం ఆ రహమాన్‌గారు తన్ని తగలేశారా? లేక సినిమాలోలాగ ఆయనంటే మొహం మొత్తి ఈవిడే వచ్చేసిందా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది ఝాన్సీ.

"నిన్న రాత్రి ఆవిడ వచ్చింది. మీరన్నట్లు నాకు చాలా ఆవేశం వచ్చింది. మొదట ఆవిడను బయటకు పొమ్మన్నాను. కానీ సమయానికి మా మాధవి ఆలోచించి నాకు నచ్చచెప్పి ఆమెను లోనికి తీసుకెళ్లింది. నాన్నగారు నిద్ర పోతున్న సమయంలో ఆమె ఆయనను చూచింది. మేము ఏంచెయ్యాలా అని సతమతమౌతున్నాము. ఈలోగా ఆమెకు విపరీతంగా జ్వరం వచ్చింది. పోనీ! ఆమె నాన్నగారితో మాట్లాడవచ్చా? అని డాక్టరుగారిని సంప్రదించాం. రెండు మూడు రోజుల వరకు ఏవిధమైన ఆతృత, ఆవేశం కలిగించే విషయాలు తెలియచెయ్యవద్దన్నారు. ప్రస్తుతం ఆమె జ్వరంతో ఉంది. వేరే గదిలో నాన్నగారికి ఆమె ఉనికి తెలియకుండా ఉంచాం" చెప్పాడు రఘు.

"రఘూ! నీవు నిజంగా గొప్పవాడివి. నాలాంటిదైతే చీపురు పట్టుకొని యింట్లోంచి గెంటేసేది" అంది ఝాన్సీ కోపంగా.

"నిజం ఝాన్సీ! నేనూ నీలాగే అంటున్నాను. ఆమె నా తల్లి అనిచెప్పుకోడానికే సిగ్గేస్తుంది... అసహ్యమేస్తుంది. మా అన్నయ్య మా మాట వినడంలేదు" అంది పావని ఉక్రోషంగా.

"నీ వాదన నిజమేననుకోమ్మా! కానీ ఎంతైనా తల్లికదా! మీమీద మనసుకొద్దీ వచ్చిందేమో? బాబూ రఘు! ఆమెలో ఏమైనా మార్పు కనిపించిందా?" అని అడిగారు చక్రధరంగారు.

"లేదండీ... నేను ఆమెవైపు సూటిగా చూడలేకపోతున్నాను. మామధ్య ఉన్న బంధమేమిటో నాకే అర్థం అవ్వడంలేదు. సుమతే చూస్తోంది ఆమెను ప్రస్తుతం... మాధవి కూడా జ్వరంతో ఉన్న మనిషిని ఎలా పంపేయగలం... అనే అంటోంది"

"పోనీలే రఘూ! ఎవరికి ఎంత ఋణమో తీర్చుకోకుండా ఉండడం ఎవరితరం? తండ్రికి సేవచేసి ఋణం తీర్చుకొంటున్నావు. మీ పిన్నికి కూడా సేవచెయ్యి. సాయంత్రం నేను మీ యింటికి వస్తాను" అన్నారు చక్రధరంగారు.

"ఇంతకీ నా ప్రశ్నకి నువ్వు జవాబు చెప్పలేదు. ఆవిడ ఏ ఉద్దేశ్యంతో వచ్చింది" అని అడిగింది ఝాన్సీ.

"మాధవిని అడగమంటాను. నాన్నగారిని చూడ్డానికి వచ్చిందేమో" అన్నాడు.

"ఓ నాన్నగారిపై, మనపై ఆవిడకు ప్రేమలేకేం! గంపెడుంది. అందుకే మనకంత కీర్తి తెచ్చింది. యిన్నాళ్లూ ఏదోరకంగా బాధలు పడుతూనే వచ్చాం. మళ్లీ ఏదో నెమ్మదిగా రోజులు గడుస్తున్నాయంటే మళ్లీ ఈవిడ రాక" అంటూ అసహనంగా లేచింది పావని.

"యిప్పుడు ఆమెను పొమ్మంటే చావుబతుకులమధ్యనున్న భర్తను చూడనివ్వలేదంటారు! ఉండనిస్తే మరోవిధంగా ఏదో ఒకటంటుంది లోకం. లోకంపోకడ మనకు కొత్తకాదుకదా" అంటూ వెళ్లడానికి ఉద్యుక్తుడౌతూ లేచాడు రఘు.

"నిజమే రఘూ! నువ్వన్నది. పాపం చిన్నతనంనుండీ ఎన్ని బాధలు పడుతున్నావో! పార్వతమ్మగారున్నప్పుడు ఏం సుఖపడ్డావో... అంతే. తర్వాత నీకు అంతా అవస్థలే మిగిలాయి. చిన్నవాడివైనా బాధ్యత వహించి వీళ్లను చూసుకొంటున్నావు. నీవు వీళ్లనొదిలి వెళ్లిపోతే నిన్నడిగేవారెవరు? వీళ్లను జాగ్రత్తగా చూచుకోడానికేకదా... నీవు పిల్లలు కూడా వద్దనుకొన్నావు. మీ నాన్నగారు .మాత్రం నీకో వంశాంకురం కలగాలని కోరుకుంటున్నారు. నీవు అదిమాత్రం గుర్తుపెట్టుకోవాలి" అన్నారు చక్రధరంగారు.

"అమ్మో! మా అన్నయ్య మమ్మల్ని వదిలి వెళ్లిపోవడమే! ఊహించుకోడానికే భయంగా ఉంది. మాకు అమ్మలేకపోయినా ఫరవాలేదు. కాని మా అన్నయ్య మాకు కావాలి. ఏం అన్నయ్యా! మమ్మల్ని వదిలి వెళ్లిపోవుకదూ!" అంటూ భయంభయంగా రఘు చెయ్యిపట్టుకొంది పావని.

"నేను మిమ్మల్ని వదిలి ఎక్కడకు వెళ్లగలనమ్మా! ఏదో యధాలాపంగా అన్నారు మాష్టారు... అంతేకాని నేను వెళ్లిపోతాననా? ఏం మాష్టారూ అంతేకదా!" అని అడిగాడు రఘు.

"అంతేనమ్మా! అన్నయ్య మిమ్మల్ని వదిలి ఎక్కడికీ వెళ్లడు. మీరు ఎక్కడకీ వెళ్లరు" అని అన్నారు వాళ్ల ఆప్యాయతకు కళ్లు చెమర్చగా.




యింటికి రాగానే రామారావుగారు రఘుని పిలిచారు. ఆయన పక్కలో కూర్చున్నాడు రఘు. "ఎక్కడికి వెళ్లావు బాబూ ప్రొద్దున్నే. నీ మొహం చూడు ఎంత పీక్కుపోయిందో! రాత్రంతా నిద్రపోనట్లుంది. నా అనారోగ్యంతో నిన్ను అలసట పెట్టేస్తున్నాను. ఎన్నాళ్లో నానుంచి నీకు ఈ యాతన. భగవంతుడు నన్ను తొందరగా తీసుకువెళ్తే బాగుండును" అని అన్నారు.

శాంత అప్పుడే బాగా ఉడికించిన అన్నం, కూర వేసి తీసుకొచ్చింది. "ఎందుకు నాన్నా! అలా మాట్లాడతారు. మీరు మాకు బరువా? మీరు లేకపోతే మేముండగలమా? మీకు సేవలు చేయడంకంటే మాకేం కావాలి?" అన్నాడు రఘు తండ్రి చేతిని మృదువుగా పట్టుకొంటూ.

శాంత ఆయనవైపు చూస్తూ "మమ్మల్ని చూస్తే బతకాలని కోరిక పోతుందా నాన్నగారూ? మేం పుట్టినది మొదలు మావలన మీకు అవదలు, అవమానాలే మిగిలాయి. మిమ్మల్ని అన్నయ్యని పొందగలగడమే మాకీ జన్మలో అదృష్టం నాన్నగారూ!" అంటూ బాధ వ్యక్తంచేసింది.

"అమ్మా శాంతా! ఈ రోగాల బాధకు తట్టుకోలేక అలా అంటున్నాను కాని మీవల్ల నాకు కష్టమేమిటమ్మా? నేను చేసుకొన్న కర్మ నేను అనుభవించాలికదా తల్లీ! నీవు బాధపడితే నేను చూసి సహించగలనా?" అని శాంతవైపు ఆప్యాయంగా చెయ్యిచాపారు. అన్నగారి సౌంజ్ఞతో శాంత అటుతిరిగి కళ్లు తుడుచుకొని... తండ్రికి భోజనం తినిపించింది.

"చక్రధరంగారింటికి వెళ్లాం నాన్నగారూ! పావని కూడా వస్తానంటే యిద్దరం కలిసి వెళ్లాం" అని రఘు అన్నాడు.

"ఏం నాయనా! యింట్లో డబ్బు అయిపోయిందా? అసలు యిలాంటి జబ్బులు బాగా డబ్బున్నవారికి రావలసినవి. మనలాంటివారికి కాదు. నా అనారోగ్యంతో నీవు బోలెడు ఖర్చుకు గురయ్యావు. పొలం కూడా ఉన్న కాస్తలో కొంత అమ్మేశావు. నీ ఒక్కడి రెక్కలమీద యింత మంది బతకాలి. ఇలా నిన్ను బాధలు పెట్టడానికే కాబోలు, నా దగ్గరకు తెచ్చుకున్నాను. నీ ఋణం ఎలా తీర్చుకోవాలో?" బాధగా అన్నారు.

"అదేంటి నాన్నా! అలా అంటారు. నాకు మీ సేవసేయడం కష్టమేమిటి? మీరు నాపై చూపిన ప్రేమలో ఇది ఎన్నోవంతు? అయినా తండ్రీ కొడుకులు మధ్య ఋణాలేమిటి నాన్నగారూ! మీరు అనవసరంగా యిలాంటి ఆలోచనలతో బాధపడకండి" అంటూ అనునయించాడు.

"రఘూ! నిన్న ఎవరైనా స్నేహితులుగాని, బంధువులుగాని వచ్చారా? మగత నిద్రలో ఏదో అలికిడిగా అన్పించింది" అని అడిగారు.

"మన యింటికి వచ్చిన ఏ స్నేహితులు... బంధువులు గాని మిమ్మల్ని చూడకుండా వెళ్లిపోతారా మామయ్యా? మేమే రాత్రి సరదాగా కబుర్లు చెప్పుకొంటూకాలక్షేపం చేశాం" అంటూ తెలివిగా సమాధానమిచ్చింది అప్పుడే అక్కడకు వచ్చిన మాధవి.

మాధవిని చూస్తేనే చాలు. ఆయన పెదవులపై చిరునవ్వు తొంగిచూస్తుంది. "ఈ పిల్ల ఎదుర్కొన్న జీవితం ముందు నేనెంత?" అని ఆశ్చర్యపోతారు ఆయన. "యిప్పటికే బాగా ఆలస్యం అయింది. అందరూ వెళ్లి భోజనాలు చెయ్యండి. నేను పడుకొంటాను" అన్నారు.

"అన్నయ్య ప్రక్కన సీటు నాది" అని పావని, సుమ వాదులాడుకొంటున్నారు. "మీ అన్నయ్య ఏమైనా బెల్లం ముక్కా? అంతలా వాదులాడు కొంటున్నారు. అయినా ఈరోజు మీకు, మీ అన్నయ్యకు వండలేదు. అంచేత మీకు భోజనాలులేవు" అంది నవ్వుతూ మాధవి.

"నువ్వు వండితే ఏమోగాని... మా వదిన వండితే మాకు పెట్టందే ఎవరికీ ఉండదు భోజనం" అని సుమ ధీమా వ్యక్తం చేస్తుంటే... "సరేలెండి... మీ అన్నయ్యకు చెరోపక్క కూర్చోండి" అంటూ వాళ్లకు పరిష్కార మార్గం సూచించింది సుమతి.

అలవాటు ప్రకారం రఘు అన్నం కలిపేసరికి చెయ్యి చాచింది సుమ. "అయిదో తరగతి చదువుతున్నావు. యింకా అన్నయ్య కలిపి ముద్దలుపెట్టాలా? షేమ్ షేమ్" అంటూగేలిచేసింది మాధవి.

"నాకు ఎప్పుడూ మా అన్నయ్య చేతి ముద్ద లు తినకపోతే భోజనం చేసినట్లుండదు. నాకు పెట్టకపోతే అన్నయ్యకు కూడా అంతే. ఏం... అన్నయ్యా! అంతేకదూ?"

"అవునమ్మా! నువ్వు మా చిన్నపిల్లవి కదా! నీకు పెట్టకపోతే ఎవరికి పెడతారు మీ అన్న య్య. మాధవి వదిన ఏదో వేళాకోళంచేస్తోంది అంతే" అని సుమకు మద్దతు తెలిపింది సుమతి.

గదిలో పడుకొన్న సుందరికి వాళ్ల నవ్వులు, మాటలు అన్నీ వినిపిస్తున్నాయి. తను ఉన్న ప్పుడు ఎప్పుడైనా యిలాంటి వాతావరణం కల్పించగలిగిందా? ఒక్క నాడైనా పిల్లలంద ర్నీ కూర్చోపెట్టుకొని అన్నం పెట్టగలిగిందా? పిల్లలను ఆప్యాయంగా అక్కున చేర్చుకోగలి గిందా? పిల్లలవరకూ ఎందుకు? భర్తకైనా ప్ర శాంతంగా అన్నంపెట్టిందా? ఈ రోజు వీళ్లంతా యిలా నవ్వుకొంటూ కబుర్లు చెప్పుకొంటుంటే ఎంత హాయిగా ఉంది. ఈ జ్వరం నా అదృ ష్టంకొద్దీ వచ్చింది. లేకపోతే ఈ ప్రశాంతత విలువ తనకి తెలిసేదికాదు. పదేళ్లుగా అశాంతితో క్షణం క్షణం చస్తూ బ్రతుకునీ డ్చింది. ఆరోజులు ఆ నరకం పగవాడికి కూడా వద్దు.

అవును రెహమాన్ తనని విడిచి ఉండడు. మరో వారం రోజులలో వచ్చేస్తాడు. రెహమాన్ పేరు తలపుకు రాగానే ఆమె ఎందుటాకులా వణికిపోయింది. తను ఏనాడో చేసుకొన్న పాపం రెహమాన్ రూపంలో పండింది. తనని శిక్షించ డానికే భగవంతుడు యిలా చేశాడు అని అనుకొంటూ పక్కమీద అశాంతిగా దొర్లింది.

"ఆ గదిలో నాన్నగారు పడుకొన్నారు. ఈ గదిలో చుట్టాలున్నారు. మనం ఎక్కడ కూర్చొని గవ్వలాడుకొందాం? పావనక్కా!" అని అడి గింది సుమ. "తల్లీ! యిప్పుడు నువ్వు ఆట పెట్టకమ్మా! వసారాలో కాస్సేపు పడుకొందాం. సాయంత్రం నిన్ను తీసుకెళ్లి పాలకోవా కొనిపె డతాను" అంటోన్న రఘుని చూసి "నువ్వువ డుకో అన్నయ్యా! యిది అల్లరి చెయ్యకుండా నేను చూస్తాను" అని చెప్పి సుమను అవత లకు తీసుకువెళ్లింది శాంత.

కాస్త హార్లిక్స్ కలిపి సుందరి చేత తాగించి వంట యిల్లు తుడుచుకొని అక్కడే చేరబడ్డారు సుమతి, మాధవి. "మధూ! నిన్ను చూస్తే నాకు ఎంత సంతోషంగా ఉంటుందో! ఈరోజు ఒక లెక్చరర్‌గా ఎంతోమంది పిల్లలను తీర్చిదిద్దు తున్నావు. నీకు ఉన్నది ఒక్క తమ్ముడేకదా! అతని చదువూ పూర్తి అయిపోయింది. ఇంకా నువ్వు పెళ్లి ఎందుకు చేసుకోవు? అసలు ఆ ప్రసక్తే తీసుకురానివ్వవు. ఏమిటి కారణం? నీకభ్యంతరంలేకపోతే నాకు చెప్పవా?" అంటూ కుతూహలంగా అడిగింది సుమతి మాధవిని.

"నీ దగ్గర నాకు దావరికమేముంది? నేను మా అమ్మ నాన్నలతో దెబ్బలాడి ఒక ఏడాది యిక్కడ మామయ్య దగ్గరే ఉండి చదువు కొన్నానో లేదో మా నాన్నగారు నన్ను విడిచి ఉండలేక యిక్కడకు ట్రాన్స్‌ఫర్ చేయించుకొ న్నారు. నాకు మామయ్యంటే ఎంతో యిష్టం. అందుకే పేచీపెట్టి మరీ యిక్కడే చదువుకొ న్నాను. చిన్నప్పుడు ఆయన దగ్గరే పెరగడంతో ఆయనంటే నాకు ఎక్కువ మక్కువ.

నేను సాయంత్రం వేళలో హిందీ స్కూలుకి వెళ్లేదాన్ని. నాకు అక్కడ కృష్ణకాంత్ మాష్టారు పరిచయమయ్యారు. ఆయన మా హిందీ స్కూలుకు మాష్టారుగా క్రొత్తగా వచ్చారు. తెల్లగా పొడుగ్గా... మంచి శరీర సౌష్టవంతో ఎంతో ఆకర్షణీయంగా ఉండేవారు. విశాల మైన ఫాలభాగం చురుకైన కళ్లు... నల్లగా నిగనిగలాడే నొక్కులజుత్తుతో ఎదుటివారి మన సుని దోచుకొనేలా ఉండేవారు. ఆయన పాఠం చెప్పుతూ ఉన్నంత సేపూ నేను ఆయననే చూస్తూ ఉండేదాన్ని. ఎప్పుడూ చిరునవ్వుతో పాఠం చెప్తోన్న ఆయన నన్నే చూస్తూ పాఠంచె ప్తున్నారా! అనిపించేది. ఏదో తెలియని ఆక ర్షణ నన్ను ఆకట్టుకొనేది. ఒక్కరోజు కూడా మానకుండా హిందీ స్కూలుకు వెళ్లేదాన్ని. క్రమేపి ఆయనను చూడకుండా బ్రతకలేనని పించింది. ఇది ఆత్మార్పణా? ప్రేమా? నాకే తెలియదు. నేను హిందీకి అక్కరలేని ప్రాధాన్య తనిస్తున్నానని మా అమ్మగారికి కోపం. అవతల నా బి.యస్.సి. చదువు దెబ్బతింటుందనీ... క్లాసురాదనీ భయం... ఆమెకు. క్లాసు రాకపోతే చదువు అనవసరంఅని ఆమె బాధ.





చివరికి డిగ్రీలో కూడా నేను హిందీనే సెకండ్ లాంగ్వేజీగా తీసుకోవడంతో అమ్మకు కోపం వచ్చింది. హిందీ అందమైన భాష. సులభమైన భాష. అందమైన మా మాష్టారు చెపుతోంటే ఆ భాషపై మరీ ప్రేమ పెరిగేది. ఒక్కోసారి మా స్నేహితురాలు విజయ వెక్కిరించేది. "మధూ! నువ్వు మాష్టార్ని చూడటానికి వస్తున్నావా? హిందీ నేర్చుకోడానికి వస్తున్నావా?" అనేది. మరోసారి "మాష్టారికి నువ్వు దిష్టిపెట్టేస్తున్నావేమిటి మధూ! మాష్టార్ని లడ్డూలైనా దిష్టితీసికొని నాకు యివ్వమనాలి" అని గేలిచేసేది.

మాష్టారి ప్రోత్సాహంతో రాష్ట్రకి చదవటం మొదలుపెట్టేను. మాష్టారు నాతో చనువుగా మాట్లాడేవారు. పుస్తకాలేమైనా కావలిస్తే యింటికి వచ్చితీసుకోమనేవారు. మాష్టారు ఒక్కరే ఉండేవారు. నేను, విజయ కలిసివెళ్ళి కావల్సిన పుస్తకాలు తెచ్చుకొనేవాళ్లం. కాలేజీలో తీసుకొన్న హిందీకి సంబంధించిన విషయాలు కూడా అర్థమవ్వకపోతే చెపుతాననేవారు. దాంతో నేను మరికొంతమంది పిల్లలం ఆయనింటికి ఆదివారం నాడు వెళ్లేవాళ్లం.

మాష్టారి యిల్లు బ్రహ్మచారి నివాసంలాగ కనిపించేది. అది రెండు గదులవాటా. ఒక గదిలో యినుపమంచం, పుస్తకాలు, సూట్‌కేసు ఉండేవి. రెండవ గదిలో మామూలు కిరోసిన్ స్టౌ, కుక్కరు, కొద్దిగా గిన్నెలు, చిన్న ఫేను ఉండేవి. ఆ వాతావరణం చూసిన మాకు మాష్టారు బ్రహ్మచారేనన్న అభిప్రాయం ఏర్పడింది. ఇలాగే ఒక ఏడాది గడిచింది. నాకైతే ఆయన ఆరాధనలో లోకం అద్భుతంగా కనిపించేది. హిందీ పరీక్షలలో ప్రథమ స్థానం సాధిస్తున్న నేనంటే ఆయనకు ప్రత్యేకమైన అభిమానం. ఆయన నుండి నేను ఏమీ పొందలేకపోయినా, అలాగ దూరం నుండి ఆయన్ని చూస్తూ బ్రతికెయ్యగలనని అనిపించేది.

మా స్నేహితురాలికి నా మీద అనుమానం. నేను ఆయనతో ప్రేమలోకి పడుతున్నానని అది గ్రహించేసింది. నిజమే కాబోలు ప్రేమ ఒక దివ్యమైన అనుభూతి. ఆ అనుభూతిలో వద్దామా ఇతరులతో మనకు పని ఉండదు. చివరకు ఎవరైనా ఏమైనా అనుకొంటారేమోనన్న భయం, సిగ్గు కూడా ఉండవు. నాకైతే ఈ ప్రపంచాన్నంతా మాష్టారి రూపంతో చూస్తే చాలనిపించేది. నా జన్మ ధన్యమౌతుందనిపించేది.

మనసు లోపలిపొరలు మృదువుగా అయిపోయేవి. అప్పుడప్పుడు ఆ ఉంగరాల క్రాపుని వేళ్లతో నిమరాలని, ఆ అందమైన మోముని రెండు చేతుల మధ్య బంధించాలని కోరికలు ఉవ్వెత్తున లేచేవి. సన్నగా నాలో ఏదో ప్రకంపన. ఎలా కంట్రోల్ చేసుకోవాలో అర్థమయ్యేదికాదు.

"మిస్ మధూ! వాట్ హాపెన్డ్" అంటూ మాష్టారు నా నుదుటిపైన స్వేదబిందువులను, నా చేతి వేళ్ల వణుకును చూసి ఆందోళనగా అడిగేవారు.

"నథింగ్ సర్!" అనడానికి నా సర్వశక్తులని కూడదీసుకోవలసి వచ్చేది. ఎలా ఎప్పుడు అలవాటు చేసుకొన్నారోగాని మా ఫ్రెండ్స్‌లాగే మాష్టారు కూడా నన్ను 'మధూ' అని పిలిచేవారు.

ఒకరోజు మా ఫ్రెండు అడిగింది- "మధూ! దాచకుండా నీ మనసులోని విషయం చెప్పవే!" అని నిగ్గదీసింది. "ఏం చెప్పను? ఆయన బ్రాహ్మణులని మాత్రం చెప్పగలను. ఉద్యోగస్తులని చెప్పగలను. నేను ఆయనపట్ల ఆకర్షితురాలనయ్యానని చెప్పగలను. ఆయన వివాహితులా! అవివాహితులా! అన్న విషయం కూడా తెలియదు. ఆ విషయం ఆయనను అడిగేందుకు ధైర్యం చేయలేకపోయాను" అని చెప్పాను.

మా స్నేహితురాలు నన్ను చెడామడా తిట్టింది. "ఆయన గురించి ఏమీ తెలుసుకోకుండా ఈ ఆరాధనేమిటి? ఈ ప్రేమ ఏమిటి? నలుగురూ వింటే నవ్విపోతారు. మనం మనసిచ్చేప్పుడు అది పాత్రదానమా, అపాత్రదానమా అని ఆలోచించుకోవద్దా?" అని.

నాకు మాత్రం లోకంతో పనిలేదనిపించింది. "నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు" అనుకున్నాను. ప్రేమనేది హృదయాంతరాళంలోనుండి అనూహ్యంగా పుట్టుకొచ్చేది. అందుకే ప్రేమ గుడ్డిది. అన్నిటిని ఆలోచింవ



చేయదు. నిజంగా అది ఒక గొప్ప స్పందన... అనుభూతి. ఈ అనుభూతి పొందిన పిమ్మట అనిపిస్తుంది. 'ప్రేమానుభూతి పొందలేని జీవితం ఒక శూన్యమే' అని.

మా స్నేహితురాలు మాత్రం మాష్టారితో మాట్లాడి విషయం తెలుసుకొందాం రమ్మని నన్ను బలవంతం చేసింది. ఏమో విషయం వ్యతిరేకమయితే విని తట్టుకొనే గుండెధైర్యం నాకు లేదు. అందుకే తననే వెళ్లిరమ్మన్నాను. తను కూడా బాగా చదువుతుందని, చలాకీగా ఉంటుందని మాష్టారుకి కూడా ఆమె మీద అభిమానమే.

తను వెళ్లిన ఒక అరగంటలో తిరిగి వచ్చేసింది. పది లంఖణాలు చేసినట్లు నీరసంగా ఉన్నదాని మొహం చూసేసరికి నాకు కంగారు పుట్టింది. మంచినీళ్లిచ్చి కూర్చోపెట్టాను నా గదిలో. "పార్కుకి వెళ్దాం వస్తావా?" అని అడిగింది. మా అమ్మ, చెల్లి, తమ్ముడు యింట్లో వున్నారు. విషయం వాళ్లకు తెలియకూడదని దాని తాపత్రయం.

పార్కులో ఒక చెట్టునీడలో నున్న బెంచీ మీద చతికిలపడ్డాం.

"త్వరగా చెప్పవే! ఈ గుండె ఆరాటం భరించలేదు" అన్నాను ఉత్కంఠతతో.

"మాష్టారికి పెళ్లయ్యిందే. నాలుగేళ్ల బాబు కూడా ఉన్నాడు. వాళ్లమ్మగారికి నుస్తీ చేసింది. పూర్తిగా బెడ్‌రెస్ట్ అవసరమట. కొన్నాళ్లు మంచం దిగనీకుండా మందులు వాడించాలట. డాక్టర్లు చాలా స్ట్రిక్ట్‌గా కాషను యిచ్చారట. అందుకని ఫామిలీని తీసుకు రాలేదుట" అని నెమ్మదిగా చెప్పింది.

నేను పాలిపోయిన మొహంతో "ఇదంతా మాష్టారే చెప్పారా? నువ్వు నా ప్రేమగురించి ఆయనతో చెప్పేశావా? అనలీ విషయాలన్నీ



ఎలా రాబట్టావు?'' అని అడిగాను. ''లేదే! నేనేదో డౌటు తీర్చమన్నట్లు వెళ్లాను. ఆయన వంటలో ఉన్నారు. మీరె యిలా చేతులు కాల్చుకొంటున్నారు. మీ శ్రీమతిగారిని తీసుకొని రావచ్చుకదా సార్! అని అడిగాను. అప్పుడు చెప్పారు విషయాలన్నీ. వాళ్లమ్మగారికి కుదుట పడగానే వాళ్లందరినీ తీసుకొని వస్తారట. ఒక్క రూ ఉండటానికి ఆయనకు కూడా కష్టంగా ఉందట'' అని చెప్పింది నా స్నేహితురాలు.

''తర్వాత'' అన్నాను.

''తర్వాత ఏముంది... తన స్వవిషయాలు చెప్పి బోరు కొట్టిస్తున్నానేమో అని బాధపడ్డారు. నా డౌట్సు గురించి అడిగారు. నేను అర్జంటు పని మర్చిపోయి వచ్చాను... మళ్లీ వస్తానని ఆయనకు చెప్పి వచ్చేశాను'' అని చెప్పింది.

''మంచి పని చేశావు. నా గురించి చెప్పకపో వడమే మంచిది. తన గురించి వివరాలు తెలుసుకోకుండా యిలా మనసు పారేసుకు న్నందుకు నన్ను గుర్చి ఆయన ఏమనుకొంటా రే! నా బాధ నాలోనే ఉంటుంది'' అన్నాను.

''నేను మొత్తుకొంటూనే ఉన్నాను. నువ్వు వినిపించుకోలేదు. ఏ విషయం తెలుసుకో కుండా ఈ ప్రేమ... దోమ ఏమిటని. యిప్పటి కైనా మించిపోయింది లేదు. నువ్వు అంతా మర్చిపోయి మామూలుగా తిరగాలి తెల్సిందా?'' అంటూ హెచ్చరిస్తూ లేచింది. అది అంత సులభతరమైన పనా? మనస్సు భారంతో నిర్లిప్తంగా అనుసరించాను దాన్ని.

మర్నాడు హిందీ క్లాసుకు వెళ్లలేకపోయా ను. రెండు రోజులు వరుసగా మానేసరికి అమ్మకు అనుమానం వచ్చింది. ''ఏమిటే స్కూ లుకు వెళ్లడంలేదు? ఒంట్లో బావుండలేదా? అలా పీక్కుపోయావేంటి?'' అంటూ అమ్మ ఒకటే గోల. మూడోరోజున మా ఫ్రెండే వచ్చే సింది. ''ఏమయిందే నీకు? ఎందుకిలా నీర సంగా అయ్యావు? స్కూలుకు రాలేదేం?'' అంటూ బలవంతాన లాక్కెళ్లింది.

దారిలో నెమ్మదిగా అన్నాను- ''నామీద నాకే అసహ్యంగా, జాలిగా ఉంది. నా మనసుని కంట్రోలు చేసుకోలేకపోతున్నాను. మాష్టారిని మరచిపోలేకపోతున్నాను''

చెపుతోంటే కళ్లల్లో నీళ్లు తిరిగాయి. దానికీ బాధ అనిపించిందేమో మృదువుగా భు జంమీద చెయ్యివేసి ''కొంతకాలం అయితే గాని నీ మనసు కుదుటపడదు. కాస్త చదువు మీద దృష్టి కేంద్రీకరించు. ఇలా నీరసించి పోతే అమ్మ ఆరాతీస్తుంది'' అని హితవు చెప్పింది.

మాష్టారు ఎప్పటిలాగే చిరునవ్వుతో ''అదే మిటి మీరు మూడురోజులనుండి రావటంలే దు... నీరసంగా అయిపోయారు? జ్వరమా?'' అని అడుగుతుంటే ఆయన చూపే ఆప్యాయ తకు నా కళ్లు చెమర్చాయి. నెమ్మదిగా ఏదో సమాధానం చెప్పి కూర్చున్నాను. ఆయనవైపు సూటిగా చూడలేకపోయాను.

అయితే ఈ బాధకన్నా మరొక పెద్ద గాయం అనుకోకుండా తగిలింది. మా అమ్మనాన్నలు ఏక్సిడెంటులో మరణించారు. ఒక బాధ ముందు మరో పెద్ద బాధ కలిగేసరికి మొదటి బాధ చిన్నదైపోతుంది. నా పరిస్థితి అంతే అయ్యింది'' అని సుమతితో తన కథను చె ప్పింది మాధవి.

అంతా పక్కగది గుమ్మందగ్గర నుంచొని విన్న రఘు మనసు జాలితో నిండిపోయింది. ''పిచ్చిపిల్ల ఎంత బాధను దిగమింగి నవ్వు తూ తిరుగుతుందో! అందుకే కాబోలు వివాహా నికి సుముఖత చూపడంలేదు. పైకిమాత్రం తమ్ముడి బాధ్యత తీరితేగాని చేసుకో నంటోంది'' అని అనుకొన్నాడు రఘు.

తన మనసులోని భావాలను ఏమాత్రం పైకి కనపడనీకుండా అప్పుడే తను లోనికి వస్తున్న ట్లు... ''మీ అక్కా చెల్లెళ్ల కబుర్లేనా మాకేమైనా కాఫీనీళ్లు పొయ్యడం ఉందా?'' అనడిగాడు రఘు. రఘు రావటంతో సంభాషణ ఆపి లేచారిద్దరూ.

'మనసు యిచ్చిన వాళ్లని మరచిపోలేక ఒంటరిగా మిగిలిపోయింది మాధవి. కట్టుకొన్న వాడిని కూడా వదిలి సిరిసంపదలకోసం సుఖా లకోసం వెళ్లిపోయింది పిన్ని. ఇద్దరూ ఆడవా ళ్లే... అయినా వారి బాటలు వేరు... అభిప్రా యాలు వేరు... విలువలు వేరు' అనుకొన్నాడు రఘు బరువుగా. సుందరి జ్వరతీవ్రతతో వడు కొంది. రఘుకు ఏంచేయాలో... ఈ సన్నివేశాన్ని





# ఏరిన ముత్యాలు

★ పెద్ద కోరికలను కాక, మంచి కోరికల్ని మనం దాచుకోవలసిరావడం నిజంగా విచిత్రం.

—డబ్ల్యు.ఎస్. లాండర్

★ మన కోరికలు జీవితమనే నీటిఆవిరికి ఇంద్రధనస్సు యొక్క రంగులనిస్తాయి.

—ఠాగూర్

★ అహంవల్ల ఏర్పడే అంధకారం మామూలు చీకటికంటే దట్టమైనది.

—గాంధీజీ

★ గర్వం శరీరంమీద కొవ్వువలె కన్పించకుండా, పొరమీదపొర పెరుగుతూ వుంటుంది. కానీ రోజురోజుకు అది అభివృద్ధి పొందుతున్న సంగతి వ్యక్తి గుర్తించలేడు.

—నెహ్రూ

★ నాది అనే అహం బయలుదేరినప్పటినుండి ప్రపంచదుస్థితి ప్రారంభమైంది.

—ఉన్నవ లక్ష్మీనారాయణ

★ గర్వించకు. నేడు నీ నివాసం పున్నతమైందే కావచ్చు. కానీ రేపు నీవు భూమిలోపల వుంటే పైన గడ్డి మొలుస్తుంది.

—స్వామి రామతీర్థ

★ వృద్ధాప్యం రూపాన్ని ఆశ ధైర్యాన్ని మృత్యువు ప్రాణాన్ని అసూయ నీతిని, కోపం సంపదను, కామం సిగ్గును హరిస్తే గర్వం అన్నిటినీ హరిస్తుంది.

—విదురనీతి

★ గర్వం అనేది అందరిలోనూ వుంటుంది. ఉన్న తేడాఅల్లా అది పైకి కనబరిచే పద్ధతి, విధానాల్లో మాత్రమే.

—ఫ్రాంకాయిస్ డెలారోష్

★ నోటినుండి వెలువడ్డ ఒక్క చెడ్డమాటను నాలుగు గుర్రాల రథం కూడా వెనక్కి తీసుకొని రాలేదు.

— చైనా సామెత

★ మాటలకంటే హృదయం, ఆచరణ గొప్పవి. వాటి ద్వారానే మనం ఇతరులతో ప్రసంగించాలి.

— అనుభవానందస్వామి

★ దేవుడు మనకు రెండు చెవుల్ని రెండు కళ్లను, ఒకే నాలుకను ప్రసాగించాడు. ఎందుకంటే ఎక్కువ వినమని, బాగా చూడమని, తక్కువ మాట్లాడమని.

— సుకరాత్

★ ఒక దేశం నిజమైన సంపద ఆ దేశపు స్త్రీ, పురుషులలోనే ఉంది. వారు అల్పులు, అసంతుష్టులు, అనారోగ్యులు అయితే అది బీదదేశంగానే ఉంటుంది.

— రిచర్డ్ అల్డింగ్టన్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

ప్రమాదంలేకుండా ఎలా ఎదుర్కోవాలో అర్థంఅవడంలేదు.

సాయంకాలం ఇద్దరూ సన్నజాజి పందిరివద్ద కూర్చొన్నప్పుడు "నీ కథంతా పూర్తిగా చెప్పవల్సిందే... అసలు మీ అమ్మగారు, నాన్నగారు ఎలా పోయారు?" అంటూ మాధవిని అడిగింది సుమతి.

"దైవానికి ఎందుకో మా కుటుంబంమీద కన్ను కుట్టింది. లేకపోతే ఎన్నిసార్లు అమ్మ, నాన్న స్కూటర్‌మీద వెళ్లలేదూ! ఆరోజు ఎవరో ముఖ్యమైన స్నేహితులింటిలో పెళ్లికి చెల్లిని తీసుకొని వెళ్లారు. తమ్ముడు రాజా వెళ్తానని పేచీ పెట్టాడు. అక్క ఒక్కర్తీ ఉండవలసివస్తుంది. నీవు మగపిల్లవాడివి కాబట్టి అక్కకు సాయం ఉండాలని నచ్చచెప్పి పెళ్లికి ధవళేశ్వరం వెళ్లారు. అక్కడకీ లగ్నం అయిన తర్వాత రాత్రిమీద రావద్దు ఉదయాన్నే రండని మరీ మరీ చెప్పాను. మేం పిల్లలం ఒంటరిగా ఉన్నామని రాత్రిపూటే తిరిగి బయలుదేరిపోయారు. ధవళేశ్వరం బ్రిడ్జివద్ద లారీ ఒకటి వీళ్ల స్కూటర్ని గుద్దేసింది. తెల్లవారేక మాకు కబురొచ్చింది. వెంటనే తమ్ముణ్ని పంపి మామయ్యకు కబురంపేను. చనిపోయిన అమ్మా, నాన్నలను చూసి గొల్లుగొల్లున ఏడుస్తున్న మమ్మల్ని మామయ్యే ఓదార్చారు. మామయ్యే జరగవలసిన తంతుని జరిపించారు. నాన్నగారికి రావల్సిన డబ్బు, ఇన్సూరెన్స్ సొమ్ము మామయ్యే తంటాలు పడి తెప్పించారు. ఈ పనులు పూర్తయ్యేవరకు... మామయ్యే మా బాధ్యత వహించారు. మమ్మల్ని కళ్లల్లో పెట్టుకొని ఓదార్చారు.

సుందరత్తయ్యే మొదట్లో కొద్ది రోజులు మమ్మల్ని బాగా చూసినా తర్వాత... తర్వాత ఒకటే గొణుగుడు మొదలుపెట్టింది. మామయ్యా, రఘు వింటున్నా సాధింపులు మానేదికాదు. మామయ్యా ఆమె మాటలు పట్టించుకోవద్దని మమ్మల్ని పదే... పదే బ్రతిమాలేవారు. రఘు విషయంలోనే మామయ్యతో ఎప్పుడూ ఏదో ఒకటి పోట్లాడేది. దానికి సాయం మేము తయారయ్యాం. తమ్ముణ్ని అన్నమానం వినుక్కునేది. చిన్నదైనా శాంత మాత్రం ఎప్పుడూ మమ్మల్ని అభిమానించేది. తమ్ముడు ఎప్పుడూ అమ్మా నాన్నల కోసం ఏడ్చేవాడు. వారిలేనిలోటు వాణ్ణి కృంగతీసేది.

"బాగుంది నాయనా! నిండుఇంట్లో ఒకటే ఏడుపులు. ఊరికి పోయే శని అంతా నెత్తిన పెట్టుకొంటాడీయన. తాను దూరడానికి సందు లేదు మెడకో డోలట" అంటూ గొణిగేది. వాళ్ల అమ్మ నాన్నవస్తే మా మీద ఏవో చాడీలు చెప్పేది. పెద్దవాళ్లైనా వాళ్లు మా మీద సానుభూతి చూపలేదు కాని ఆమె మాటలు పట్టుకొని మమ్మల్ని సాధించేవారు. ఇవన్నీ చెపితే మామయ్య బాధపడతారు. వంటపని మానేసి ముసుగు పెట్టేది. శాంత నన్ను వండనీయక పోతే దాన్ని కొట్టేది. రఘు, శాంత మమ్మల్ని ఆదరణగా చూడకపోతే మేమేమయ్యేవాళ్లమో.

ఇలా ఉండగా ఇంకో సంఘటన జరిగింది. సుందరత్తయ్య పక్కింటి స్నేహితురాలు వనజ పురిటికని పుట్టింటికి బయలుదేరింది. "మీరు ఉండరుకదా! మీ వారికేదైనా సాయం కావలిసివస్తే నేను చేస్తాన"ని చెప్పింది అత్తయ్య. కాని ఆమె మీద వనజకు సదభిప్రాయంలేదు. అందుకే "మీరే అంతమందికి చాకిరీ చేయలేక సతమతమవుతున్నారు. ఒక నెలా రెండు నెలలా అయిదు నెలలు దాకా నేను తిరిగి రావటం అవ్వదు. అంత శ్రమ మీకెందుకు. ఆయన పాట్లేవో ఆయన పడతారు. ఏ మగాడికైనా ఈ అవస్థ తప్పదుకదా!" అంటూ తెలివిగా దాటేసింది వనజ.

ఆవిడ పురిటికి వెళ్లాక ఆవిడ భర్త డాబామీదే పికార్లు. ఈవిడ నూతిదగ్గర ఉన్నా... తోటలో ఉన్నా కనబడుతుంది. వీలుచూసుకొని ఏవో ఒక ఊసుపోని కబుర్లు. నాకైతే అతనిని చూస్తే సదభిప్రాయం ఉండేదికాదు. అత్తయ్య మాత్రం అతనిని ఒక పెద్ద హీరోలా భావించేది. ఇతరులు చూస్తే అసహ్యపడేలా మోజుచూపేది.

భార్య ఇక్కడ ఉన్నప్పుడు రాత్రి పదయ్యేవరకు పేకాటకు పోయేమనిషి ఇప్పుడు ఇరవై నాలుగు గంటలూ ఇంట్లోనే కాలక్షేపం. మామయ్య, రఘు ఉండేటైములో మాత్రం జాగ్రత్తపడేవాడు. వాళ్లు లేని అదను కనిపెట్టి పనిమనిషి రాలేదు నీళ్లు కావాలనో... అలా అలా ఏదో





ఒక వంక పెట్టుకొని వచ్చి ఏదో ఒక సంభాషణ పెట్టుకొని టిఫిన్ ఆరగించి మరీ వెళ్లేవాడు. ఒకటి రెండుసార్లు మామయ్య దృష్టిలో పడ్డాడు. ఎదిగిన పిల్లను ఇంట్లో ఉన్నానని అసలే బాధ పడుతున్న మామయ్యకు ఈ వ్యవహారం నచ్చక అతని రాకను విమర్శిస్తూ అత్తయ్యను మందలించేరు.

దాంతో సుందరి మరీ పెడర్థాలు తీసి ఎగరడం మొదలుపెట్టింది. "నామీద అనుమానమా? నేనేం అలాగ లేకిబుద్ధుల దాన్ని కాదు. అసలు ఈ రెండవపెళ్లి మగవాళ్లకిదేం రోగమో! వీళ్లని పెళ్లి చేసుకోవడమే నరకం. నించుంటే అనుమానం... కూర్చుంటే అనుమానం" అంటూ రంకెలు వేయడంతో మామయ్య మరి ఆ విషయం ఎత్తడం మానేశారు.

వనజ భర్త ఇండైరెక్టుగా "మా ఆవిడ వెళ్లాక మంచి భోజనమే కరువైపోయింది. మీకు నా మీద దయలేదు. చిన్నచూపు చూస్తున్నారు" అంటూ కబుర్లాడటం చూసి మాకు కష్టం కలిగేది.

ఒకరోజు మేము, రఘు బలవంతంపై గోదావరి గట్టుకు షికారు వెళ్లాం. కాసేపున్నాక రాజా తలనొప్పి ఎక్కువగా ఉందని గోలచేస్తే మేము కాస్త ముందుగా ఇంటికి బయలుదేరాం. పావని కాస్సేపు కూర్చుందామంటే, రఘు, పావని ఉండిపోయారు. తీరా ఇంటికి వచ్చిన మాకు తలుపులుకు వేసిన తాళంకప్ప స్వాగతం చెప్పింది. ఒక గంట నిరీక్షణ తర్వాత సుందరి వచ్చింది. మమ్మల్ని చూసి తప్పుచేసినిదానిలా గాబరా పడిపోయింది. "మీరు అప్పుడే రారేమోనని మావాళ్ల ఇంటికి వెళ్లాను" అంటూ ఏదో నోటికివచ్చినట్లు ఆదుర్దాగా చెప్పింది.

మర్నాడు సుందరి వాళ్లఅమ్మగారు వచ్చారు. రావటంతోనే "మరీ నల్లపూసయిపోయావు... ఎక్కడా కనిపించకుండా... నేను వద్దామంటే అవడంలేదు. నువ్వైనా ఈ ముసిలి తల్లిని చూడటానికి రావచ్చుకదా! సుందరీ" అంటూ అడిగింది. సుందరి తేలుకుట్టిన దొంగలా ఉండిపోయింది. తల్లి మాట మార్చటానికి నానా తంటాలు పడింది. ఆ తర్వాత మేమేమైనా మామయ్యవద్ద అనుమానం వ్యక్త పరుస్తామేమోనని మాతో లేనిపోని తగాదాలు తెచ్చేది. రాజా వేరే ఇంటికి పోదామని గొడవపెట్టాడు. స్కూటరు డబ్బు అందటంతోనే మామయ్యను అతికష్టంమీద ఒప్పించి వేరే ఇంటికి వచ్చేశాము. తమ్ముడు నేను వేరేగా ఉన్నందుకు మామయ్య మాత్రం చాలా బాధ పడ్డారు.

మామయ్య పాపం ఎంతో శ్రమపడి నాన్నగారి స్నేహితుల ద్వారా ప్రయత్నించి నాన్నగారికి రావలిసిన డబ్బు అంతా తెప్పించారు. ఆ డబ్బును నాపేర... తమ్ముడు పేర ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయించారు. దానిమీద వచ్చే వడ్డీ మాకు సరిపోయింది. తల్లి, తండ్రి పోయిన దుఃఖం ఒక పక్క, మరోవైపు రాజా బాధ్యత... మాబతుకులకు దారి కల్పించుకోవడం కోసం... చదువుకోవడం ఎంతో కష్టమయిపోయింది. చివరికి ఎలాగో మామయ్యవల్ల నిలదొక్కుకున్నాము" అంటూ ఆపింది మాధవి శాంత రావటంతో.

"వదినా! ఆవిడకి వాంతి అయిపోయింది. నాన్నగారు 'ఎవరదీ? ఎవరికీ... ఒంట్లో బాగాలేదు?' అని తెగ ఆరాగా అడుగుతున్నారు. ఏంచేద్దాం? బాగా తెచ్చిపెట్టుకొన్నాం. ఆవిడను నిన్ననే పంపించేస్తే బాగుండేది. చివరికి నాన్నగారికి తెలిస్తే ఇప్పుడేమౌతుందో?" అంటూ ఆందోళన వెలిబుచ్చింది శాంత.

"శాంతా! నువ్వు ఏ విషయంలో తొందర పడవు. నెమ్మదైనదానివి. యిప్పటి పరిస్థితులలో కన్నతల్లిపట్ల యింత కఠినత్వం వహించడం మంచిదా? రెండు రోజులు ఓపిక పడితే అన్నీ సర్దుకోవా?" అంటూ శాంతను సముదాయించింది సుమతి.

"వదినా! కన్నతల్లి అని ఆవిడను అనకు. ఏ కన్నతల్లీ ఆమెలా స్వార్థంగా ఉండదు. పశుపక్ష్యాదులు సహితం తమ సంతానంపట్ల ఎంతో శ్రద్ధవహిస్తాయి. రెక్కలు వచ్చేవరకు వాటిని సాకుతాయి. కానీ... ఈవిడ? ఏం చేసింది? జన్మనిచ్చినంతమాత్రాన తల్లిఅయిపోదు, పెంచాలి... కష్టసుఖాలు పంచుకోవాలి. ముద్దుముచ్చటలు తీర్చాలి. మాకు ఈవిడ పంచింది అవమానాలు... సమాజంలో ఛీత్కారాలూ. లేచిపోయినదాని కూతుర్లని మమ్మల్ని

ఎందరు హేళనచేశారో! నీకు తెల్సా? మాకు ఏమీ చెప్పలేక... మమ్మల్ని చూడలేక నాన్నగారు పడ్డ వేదన నీకు తెల్సా? అన్నయ్య ఈ యింటికి దత్తత వచ్చిన పాపానికీ, పెద్దవాడైనందుకు మమ్మల్ని పెంచవల్సివచ్చింది. సుమ చిన్నతనంలోనేకదా నీవు అన్నయ్య జీవితంలో ప్రవేశించింది. మాకోసం ఎన్నో కష్టాలు పడిన అన్నయ్య గురించి నీకు తెలుసుకదా! అలాంటి అన్నయ్య యిప్పుడు ఆమె గురించి బాధపడటం మాకు సుతరామూ యిష్టంలేదు. మాకు దేవుడిచ్చిన ఈ అన్నయ్యకంటే... ఆ తల్లి ముఖ్యంకాదు'' అంటూ ఆవేశంగా చెప్పన్న శాంతను దగ్గరకు తీసుకొంది సుమతి.

''ఈ యింట్లో మొట్టమొదట ఆకర్షించింది... నువ్వే శాంతా! పరిచయమైనది మొదట నీతో. అందుకే చనువుగా అన్నాను. నీ బాధ నాకు తెలుసు. అయినా కష్టాలు వచ్చినప్పుడే మనం సంయమనం పాటించాలి. భగవంతుడు మనకు ఈ జీవితం యిచ్చినందుకు సార్థకం చేసుకోవాలి. తల్లినే క్షమించలేనివాళ్లం బయట ప్రపంచంలో ఎవరిని క్షమించగలం? ప్రతి మనిషికీ ఏవో కొన్ని బలహీనతలు ఉంటాయి. ఆ బలహీనతలు లేకపోతే మానవులు తప్పుచేయరు. మానసిక దౌర్బల్యంతో ఎవరైనా తప్పు చేస్తే వాళ్లను మనం వదిలివేయాలా? తప్పుతోవన నడిచేవారికి తిరిగి వెనుకకు వచ్చే అవకాశమే లేదా? భగవంతుడు తప్పుచేసిన వాళ్లకు శిక్ష వేయక మానడు. నిప్పు తెలిసి ముట్టుకొన్నా... తెలియక ముట్టుకొన్నా ఏవిధంగా కాలుతుందో... తప్పు కూడా అలాగే తెలిసి చేసినా... తెలియక చేసినా శిక్షపడక మానదు. అన్నీ తెలిసినదానివి నీవు. కాస్త ఓర్పు వహించు'' అంటూ ఆడపడుచును సముదాయించి యింట్లోకి నడిచింది సుమతి.

సుందరికి మాత్ర యిచ్చి... ఆ గదిలో ఫేను వేసి యివతలికి వచ్చింది మాధవి. మాధవి చేస్తున్న పనులు సుందరికి కష్టంగా ఉన్నాయి. 'తల్లీ... తండ్రి పోయి తమ పంచన చేరితే ఆ పిల్లల్ని ఆదరణగా ఒడిలోకి తీసుకోలేకపోయింది తను. కనీసం పదిరోజులు కడుపులో పెట్టుకొని ఓదార్చలేకపోయింది. ఈరోజు ఆ పిల్ల తనకు సేవచేస్తోంది. తను కొంతకాలమైనా ఈ యింట్లో ఉండాలని తాపత్రయపడుతోంది. తను మాత్రం ఆ పిల్లలిని ఇంట్లోనుండి వెళ్లగొట్టింది. తన పిల్లలకు తనమీద కోపం ఉందంటే ఉండదూ! తను చేసిన పనికి ఎవరికైనా కోపం వస్తుంది. పిల్లల్ని కన్నదేగాని, వాళ్లని ప్రేమతో పెంచిందా? శాంతకు ఆదరంగా జడవేసి ఒక్కనాడైనా అన్నం పెట్టిందా? యింటి పనులు చిన్నవీ పెద్దవీ అన్నీ ఆ అమ్మాయికే అప్పచెప్పేది. భర్త దెబ్బలాడినా, తను వినేదికాదు. ఏ దెయ్యం ఆవహించి తనచేత అలా ప్రవర్తింపచేసిందో?

దేముడిలాంటి తన భర్త ఆదరణపట్ల, తను చూపించిన కృతజ్ఞత ఏమిటి? తను కోరిన ఏకోరిక కాదన్నారు? టి.వి. ఆనీ, డ్రెస్సింగ్ టేబుల్ ఆనీ ఆయన ప్రాణాలు తీసి కొనిపించింది. కనీసం ఆయన సంపాదన ఏమిటి... తన కోరికలకు ఏ పరిధి ఉండాలని తను ఆలోచించిందా? తన గొంతెమ్మ కోరికలు తీర్చి ఆయన ఎన్ని అగచాట్లు పడ్డారో తను గమనించిందా? దగ్గరగా కూర్చొని ఏనాడైనా పిడికెడు మెతుకులు పెట్టిందా? రెండవ పెళ్లివాడని... యింకా మొదటి భార్యను మరచిపోలేదని తన దుగ్ధ. ఏం ఆయన రెండవ పెళ్లివాడని తెలిసేకదా తను పెళ్లికి వప్పుకొన్నది. అప్పట్లో తన పరిస్థితికి రెండో పెళ్లికి వప్పుకొన్నా... తనకిక్కడ ఏలోటు జరిగింది?

పెళ్లయ్యాకమాత్రం తన తల్లి, తన కుటుంబంలో పెడుతున్న తగాదాలకి తను పెదవి విప్పిందా? తల్లిదండ్రులు తన ఎదుటే విచ్చలవిడిగా ఉండటం, వెకిలిగా సంభాషించుకోడం తనలో కూడా పిచ్చిని లేపేవి. అందుకే భర్త ఎంత వారించినా... ఆలుమగల మధ్య బంధాన్ని ఎంత గొప్పంగా ఉండాలని చెప్పినా తను వినిపించుకొనేదే కాదు. దాంపత్యజీవితంలో పొందిన సుఖంతో సంతృప్తి చెందలేదు. అడ్డూ... అదుపూలేని విచ్చలవిడి శృంగారంకోసం వెంపర్లాడింది. అందుకే ఫలితం అనుభవిస్తోంది... తను' ఆలోచనలతో బరువుగా కళ్లుమూసుకుంది.

''రఘూ! ఆవిడ శరీరంనిండా వాతలు, ఏవో మచ్చలు... చేతులమీద... ఏదో పెట్టి కాల్చినట్లు... కాలిన మచ్చలు... భయంకరంగా ఉంది.





ఆవిడని చూస్తోంటే ఎలాంటి మనిషి ఎలాగ అయిపోయిందోనన్న బాధగా ఉంది'' అంటూ మాధవి చెప్పింది.

మాధవివైపు అదోలా చూశాడు రఘు "అతను మంచివాడు కాదు. ఒట్టి అనుమానం మనిషి. అతను ఏమైనా బాధపెట్టేడేమో?" నెమ్మదిగా అన్నాడు రఘు.

"అతని గురించి నీకెలా తెలును? ఎప్పుడైనా చూశావా అతనిని?" అంటూ ఆసక్తిగా అడిగింది మాధవి. సుమతి, శాంత కూడా ఆసక్తిగా రఘువైపు చూశారు... విషయం తెలుసుకొనేందుకు.

"కాకినాడలో పిన్ని ఉందేమో చూసిరమ్మన్నారు నాన్నగారు. ఆయనది కాకినాడేనని యిక్కడ ఎవరో చెప్పారు. కాకినాడ వెళ్లి కాస్త విచారించగా... ఆయన యింటి అడ్రస్సు... అన్ని విషయాలు ఒక కిళ్లీకొట్టువాని ద్వారా తెలిసింది. వీళ్లు యింతకీ అక్కడ చేరలేదు. మద్రాసు, తిరుపతి, బెంగుళూరు వెళ్లారట'' అని అన్నాడు.

"ఆయనకి పెళ్లయ్యిందా? పిల్లలేమైనా ఉన్నారా?" అంటూ సుమతి అడిగింది. "ఆ( అంతకుముందే ఎప్పుడో పెళ్లి అయిందట. ఆయన భార్య పేరు రజియా. చాలా మంచావిడ. వీళ్ల గురించి తెలుసుకోడానికి ఆవిడనే కలవవలసి వచ్చింది" అన్నాడు రఘు.

"అన్నయ్యా! నీకు సిగ్గుగా అన్పించలేదా? ఆయనింటికి నువ్వు వెళ్లావా? ఆయన మొదటి భార్యనడిగి విషయాలు తెలుసుకొన్నావా? సిగ్గువదిలి ఈమె వెళితే, నువ్వు ఆవిడకోసం ఎందుకు తాపత్రయపడాలి?'' అంటూ దెబ్బలాడింది శాంత.

"అమ్మా! శాంతా! ఆవిడకోసం వెతికింది మన గురించికాదు. ఏడాది కూడా నిండని సుమకోసం, ఆ చంటి పిల్ల, తల్లికోసం అలమటిస్తుందని... ఏ పాపం ఎరుగని నా చిట్టితల్లి శిక్షింపబడకూడదని నాన్నగారు చెప్పిన వెంటనే బయలుదేరి వెళ్లాను. అక్కడ నాకు తెలిసిన విషయాలేమిటంటే... అతనికి ఇద్దరు మగపిల్లలు, ఒక ఆడపిల్ల... అతను ఇదివరలో కూడా ఒక పెళ్లికాని పిల్లను చేరదీశాడట. వేరే కాపురం కూడా పెట్టారట. కొన్నాళ్లు మోజు తీర్చుకొని ఆ అమ్మాయిని వదిలేస్తే... ఆవిడ ఆత్మహత్య చేసికొందట.

ఈ విషయాలన్నీ అతని భార్యే చెప్పింది. మన సంగతి విని, ఆవిడ ఎంతో బాధపడింది. వ్యాపారం పనిమీద అతను ఎప్పుడూ ఊర్లు తిరుగుతుంటాడట. ఈమధ్య ఎక్కువరోజులు ఊరెళ్లకుండా ఉంటే ఆవిడకీ అనుమానం వచ్చిందట. నేను వెళ్లేముందే ఏదో పనిమీద బెంగుళూరు వెళ్తున్నానని... రావటానికి వెంటనే కుదరదని ఆమెతో చెప్పి వెళ్లాడట... ఆమె చాలా సంస్కారవంతురాలు. పాలు తెచ్చి తీసుకొనేంతవరకూ ఊరుకోలేదు'' అని చెప్పాడు రఘు.

"తొందరపడ్డాను అన్నయ్యా! ...అసలు భగవంతుడు మమ్మల్ని ఎందుకు పుట్టించాలి? నీచమైన ఈ కుటుంబ పరిస్థితులు ఎందుకు కల్పించాలి? ఎంత పాపం చేసికొన్నామో కదా!" అంటూ శాంత ఏడుస్తోంటే రఘు కూడా కన్నీళ్లపర్యంతమయ్యాడు.

"అమ్మా శాంతా! సుఖమైనా... దుఃఖమైనా అనుభవింపక తప్పదమ్మా! వీటి గురించి నీవు ఎక్కువగా ఆలోచించి మనసు పాడుచేసుకోకు'' అంటూ అనునయించాడు రఘు.

చక్రధరంగారు, ఝాన్సీ వచ్చి రామారావు గారితో కాసేపు కబుర్లు చెప్పారు. ఝాన్సీ పెళ్లి విషయం గురించి అడిగారు రామారావుగారు.

"అవునండీ! నాతో పని చేస్తున్న లెక్చరర్‌గారిని చేసుకొంటున్నాను. మా అమ్మకు యిష్టంలేదు. వాళ్లు పేదవాళ్లనీ... ఆయనకు బోలెడు బాధ్యతలని... అంతమాత్రాన వాళ్లు ప్రేమకు అనర్హులా? అందుకే అమ్మ ఎంత గొణిగినా నా పట్టుదల నాది. మా నాన్నగారి ఓటు నాకేనను కోండి'' అంటూ గలగలా చెప్తోన్న ఝాన్సీ తల ప్రేమగా నిమిరారు.

"ఏమైనా ఝాన్సీ చాలా ధైర్యంగలది... స్థిరనిర్ణయం తీసుకోగలది. తల్లి బంధువులని గానీ... ఆస్తికల వారనిగానీ... వాళ్లమ్మ సూచించిన సంబంధాన్ని వప్పుకోలేదు. పేదవాడైనా గుణవంతుడు చాలని నిర్ణయంగా దెబ్బలాడి మరీ చేసుకొంటోంది'' అని చక్రధరంగారన్నారు.

"అసలే సిరిసంపదలమధ్య అల్లారుముద్దుగా పెరిగావు. ఆ పరిస్థితులతో రాజీపడగలవా? ఆ బాధ్యతలన్నీ తట్టుకోగలవా?" అని పావని అడిగింది ఝాన్సీని. "నా జీతం... ఆయన జీతం పొదుపుగా... వాడితే జాగ్రత్తగా అన్ని బాధ్యతలను తట్టుకోవచ్చు. సుఖసంతోషాలు డబ్బులో లేవు... మన మనసులోను... తృప్తిలోను ఉన్నాయి" అని చిరునవ్వుతో చెప్పింది ఝాన్సీ.

రామారావుగారికి ఝాన్సీని చూస్తే సంతోషం. చెప్పింది చేసి తీరుతుంది. ఎన్ని ఆటంకాలు ఎదురైనా కార్యసాధనలో వెనకడుగు వేయదు. ఆమె పట్టుదలకు... రాజీకి రాకతప్పదు ఆమె తల్లికి.

"భగవంతుడు దీన్ని పుట్టించి పెద్ద శిక్ష వేశాడు నాకు" అంటుంది వర్ధనమ్మ. "శిక్షకాదే! అది మన పాలిటి వరం" అంటారు చక్రధరకంగారు. ఆయనకు కూతురంటే ప్రాణం. కూతురి నిర్ణయాలు సరియైనవని... సమయస్ఫూర్తిగలవని ఆయనకు తెలుసు... అందుకే ఆమె నిర్ణయాలపై గౌరవం.

కాసేపు... రామారావుగారితో మాట్లాడేక... పక్కగదిలోనికి వెళ్లి సుందరిని చూశారు తండ్రీకూతుళ్లు. జ్వరతీవ్రతతో ఆమె పడుకొని ఉంది. మాధవి లేపుతానంటే వద్దని వారించారు. "రఘూ! నీవు రేపు సమయం చూసి నాన్నగారితో విషయం చెప్పు. ఆయన ఆరోగ్య పరిస్థితి చూసి మరీ చెప్పు. తొందరపడవద్దు. అంతగా అవసరమైతే ఆమెను మా యింట్లో ఉంచు" అన్నారు చక్రధరంగారు. "లేదండీ, పిన్నిని యిక్కడే ఉండనివ్వండి. సుమతి, మాధవి ఆమెను చూస్తారు. ఈ జ్వరంతోనున్న ఆమెతో మీరేం అవస్థపడగలరు" అని మృదువుగా చెప్పాడు రఘు.

"సరే! నీకెలా యిష్టం అయితే అలా చెయ్యి" అంటూ రఘు చేతిలో అయిదొందలు ఉంచారు... దేనికైనా అవసరమౌతుంది ఉండనిమ్మన్నారు రఘు వద్దని ఎంత చెప్తున్నా వినకుండా.

శాంత చీరలమీద పెయింటింగు చేస్తోంది. మిషనుమీద బట్టలు కుడుతుంది. ఇంట్లో అప్పడాలుచేసి... షాపులకు పంపిస్తుంది. ఆమె ఇంట్లోనుండి కదలకుండానే డబ్బు సంపాదించి, అన్నగారికి సాయపడుతుంది. స్కూల్లో చదువుకొనేటప్పుడు తల్లి ఎవరితోనో లేచిపోయిందని తోటి విద్యార్థులు ఎగతాళి చేస్తుంటే... ఏమీ అనలేక నిస్సహాయంగా ఏడ్చుకొనేది. కొందరు టీచర్లు వాళ్లని మందలించకుండా- "ఉన్న మాటంటే ఉలుకెక్కువని... ఎందుకు ఏడుపులు, వెక్కిళ్లు" అని పుండుమీద కారం చల్లినట్లు ప్రవర్తించేవారు. చివరికి తండ్రి, అన్నగారు ఎంత చెప్పినా వినకుండా చదువుమానేసింది. ఇరుగుపొరుగు వాళ్ల ఇళ్లకు కూడా వెళ్లేదికాదు. పావని దీనికి విరుద్ధం. ఎవరైనా ఏమైనా అంటే మరోనాలుగు జవాబులు చెప్పేది. వాళ్లయిళ్లలో ఉన్న లోపాలను ఎత్తి చూపేది. ఆమె జోలికి రావడమంటే అందరికీ భయమే. అలాగ ఆమె నోరు కవచంగా ఉంచుకోవడంవల్లే చదువు సాగించగలుగుతోంది.

అప్పుడప్పుడు ఇరుగుపొరుగువాళ్లు వీళ్లెక్కడికైనా వెళ్తున్నప్పుడు - "ఆఁ... వీళ్లు మాత్రం తిన్నగా సంసారాలు చేస్తారా ఏమిటి? తల్లిలాగే ఎవడితోనో ఒకడితో పోతార్లే... ఇలాంటి మేళానికి పెళ్లిళ్లెందుకు?" అని గట్టిగా అనేవారు. పేరంటానికి ఎప్పుడూ ఎవరు పిలిచినా వెళ్లేవారు కారు. వెళ్లి వాళ్లకు కాలక్షేపం అవడం దేనికని చెల్లెళ్లను మాన్పించేది శాంత.



శాంతజీవితంలో సుమతితో పరిచయం ఒక గొప్పవరం. సుమతివాళ్లు రామారావుగారి ఎదురింటిలో అద్దెకు దిగారు. సుమతి తండ్రి పౌరోహిత్యం చేస్తూ అతికష్టంమీద కుటుంబా




న్ని పోషించేవారు. సుమతి తర్వాత ఆడపిల్లే కలగడంతో, మరి మగ బిడ్డకోసం ఆశపెట్టుకోకుండా భార్యకి ఆపరేషన్ చేయించారు. పదవ తరగతి పాసైన తర్వాత మరి సుమతికి తగినంత ఆర్థికస్థోమతలేక పైచదువు చెప్పించలేదు. ఇంట్లో తల్లికి సాయంచేస్తూ ... ఏవో కుట్లు, అల్లికలు చేసే సుమతికి ఎవరూ తగిన స్నేహితులు లేరు.

ఒకసారి ముగ్గులేస్తుంటే శాంతని పలకరించింది సుమతి. "మీరు రోజూ చాలా అందంగా వేస్తారు ముగ్గులు. నాకు నేర్పించరా! నాకు ముగ్గులంటే చాలా ఇష్టం. రోజూ మిమ్మల్ని అడుగుదామనుకొంటె కుదరటంలేదు. నేను ఆరుగంటలకు లేచేసరికి మీరు ముగ్గులు వేసేసి వెళ్లిపోతారు" అని అంది నవ్వుతూ.

స్నేహపూర్వకమైన ఆమె చిరునవ్వు శాంతను ఆకట్టుకొంది. అలాగ ముగ్గులు దగ్గర పరిచయమైన వారి స్నేహం పుస్తకాలు చదువుకోవటం... వాటిపై చర్చించుకోవడంవరకు వచ్చింది. శాంత ప్రైవేటుగా చదువుకుంటోందని తెలిసి సుమతికి ఆమెపై మరింత గౌరవభావం ఏర్పడింది.

రఘును చూడగానే బిడియంగా పక్కకు తప్పుకొని వెళ్లిపోయేది. అతని మంచితనం, సౌమ్యం, అందం ఆమెకెంతో నచ్చాయి. వాళ్ల కుటుంబం గురించి ఇరుగుపొరుగువారు చెప్పుకొనే కబుర్లు గురించి తన తల్లిద్వారా విని... ఆ కుటుంబంమీద సానుభూతి చూపింది. అంతేగాని ఆమెకు ఏవిధమైన ఏవగింపు కలగలేదు. శాంతతోపాటు మాధవి కూడా ఆమెకు మంచి మిత్రురాలైంది. శాంతతో ఆమె ఇంటిపనులలో సాయంచేయడం... పావని వాళ్లను చేరదీయటంతో ఆ కుటుంబానికి మరింత దగ్గరైపోయింది. సుమతి సహచర్యంలో శాంత బయట ప్రపంచంలోనికి అడుగుపెట్టడం ప్రారంభించింది. వాళ్లంతా కలసి సరదాగా సినిమాలకు వెళ్లేవారు.

సుమతి తండ్రికి కూడా రామారావుగారంటే గౌరవం. ఎప్పుడైనా కలిసినప్పుడు మనస్ఫూర్తిగా చిరునవ్వుతో పలకరించుకొనేవారు. చిన్నపిల్లలైనా ఒబ్బిడిగా ఇల్లుదిద్దుకొంటున్నారని ఆయనకెంతో ఇష్టం. శాంతని సుమతి బలవంతంగా తమ ఇంటికి తీసుకువచ్చేది. ఆమెతోకలిసి చీరలకు పెయింటింగ్ చేయడం నేర్చుకొంది. శాంతకు సుమతిలోని నిర్మలత్వం, స్నేహశీలత, మంచితనం నచ్చాయి. అందుకే మనస్ఫూర్తిగా స్నేహితురాలిని చేసుకొంది. సుమతిని కూడా ప్రైవేటుగా పరీక్షలు కట్టమని పోరసాగింది. శాంత కోరికమేరకు సుమతి ప్రైవేటుగా ఇంటరుకు కట్టింది.

రఘు చెల్లెలికి పాఠాలు చెప్పేవాడు. ఆమెతోపాటు సుమతికి కూడా పాఠాలు చెప్పసాగేడు. చామనఛాయరంగు...ఒత్తైన జుత్తు... చక్కని పొడవు... పొడవుకుతగ్గ తీరైన శరీరసౌష్టవంతో ఉన్న సుమతిని... ఆమె మితభాషిత్వాన్ని... వినయ, వినమ్రతలను చూసి రఘు నెమ్మదిగా ఆమెపట్ల ఆకర్షితుడయ్యాడు. వాళ్లిద్దర్ని చూస్తే శాంతకు సంతోషం.

ఒకనాడు శాంత తండ్రితో సుమతిని, తమ అన్నయ్య రఘుకు చేస్తే బాగుంటుందని సూచించింది రామారావుగారికి సుమతంటే సదభిప్రాయముంది. గుణవతి, వినయవతి అయిన పిల్ల. అంతకన్నా మంచి పిల్లను తాను తేగలడా!? బయట సంబంధం తెస్తే కట్నకానుకలు తేగలడేమోగాని... సుమతిలాంటి సౌశీల్యతగల అమ్మాయిని తేగలడా? సుమతిని చేసుకొంటే... ముఖ్యంగా ఆమె రఘు జీవితవిధానంలో బాగా ఇమిడిపోగలదు. పైపెచ్చు ఆమెకు తన పిల్లలపై గల ఆదరణతో వాళ్లు సుఖశాంతులతో ఉండగలరన్న విశ్వాసం కలిగింది ఆయనకు. అందుకే ఆయన వెంటనే ఒక నిర్ణయానికి వచ్చి, సుమతి తండ్రిని కబురంపారు.

రామారావుగారే... ఏ భేషజాలు లేకుండా తన కూతుర్ని వాళ్ల రఘుకు చేసుకొంటామని అడిగేసరికి సుమతి తండ్రి పొంగిపోయారు. రఘు బుద్ధిమంతుడు, తెలివైనవాడు, పరిస్థితులను ఆకళింపుచేసుకొని జీవించేనైజంకలవాడు. ఈ కాలం పిల్లలలా విచ్చలవిడిగా తిరగడం, అక్కరలేని ఫోజులు కొట్టడంలాంటి చిల్లర మనస్తత్వం లేనివాడు. అన్నింటికీ మించి చిన్నవయస్సులోనే బాధ్యతలనెరిగిన





వాడు కావటంతో ఆయనకు రఘు అంటే గౌరవం. అందుకే ఆయన సంతోషంగా అంగీక రించారు.

తాను ఎక్కువగా కట్నకానుకలు ఇవ్వలేను గాని... సుమతి కోసం దాచిన అయిదువేలు కట్నంగా ఇస్తామన్నారు... పెళ్లి ఉన్నంతలో ఘనంగా చేస్తానన్నారు. రామారావుగారు మాత్రం కట్నం వద్దన్నారు. పెళ్లికూడా ఘనంగా చేయనక్కరలేదు. సింపుల్‌గా చేసు కొందామన్నారు. కాని... సుందరి చేసిన పనిని గూర్చి చెప్పి, సుమతికి అటువంటి ఇంటికి రావడం ఇష్టమోకాదో కనుక్కోమన్నారు.

రఘు మొదట్లో తన వివాహానికి అంగీక రించలేదు. తాను తండ్రికోసం, చెల్లెళ్లకోసం మాత్రమే జీవిస్తున్నానని... పెళ్లిఅనే జంఝా టంలో దిగితే తాను కుటుంబానికి సరియైన న్యాయం చేయలేనని... అందుచేత ఎంతమా త్రం పెళ్లి చేసుకోనని చెప్పాడు. రామారావుగా రు శతవిధాల రఘుకు బోధపరచారు. చివ రకు అతను పెళ్లి చేసుకోడానికి అంగీకరించక పోతే, తాను పచ్చినీళ్లు కూడా ముట్టుకోనని రామారావుగారు భీష్మించుకొని కూర్చొన్నారు. కానీ సుమతి అభిప్రాయాన్ని ఆమెతో నేరుగా మాట్లాడి తెలుసుకొంటేగాని చేసుకోనన్నాడు.

అతని కోరిక ప్రకారం శాంత సుమతిని అన్నగారితో మాట్లాడటానికి ఒప్పించింది. వాళ్లి ద్దరినీ గోదావరి గట్టుకు షికారుకని తీసుకెళ్లి ఏకాంత స్థలం చూసి "మీరు మాట్లాడుకోండి... ఈలోగా నేను గుడికి వెళ్లి వస్తాను" అని చెప్పి అక్కడినుండి వెళ్లిపోయింది. రఘు గోదావరి మధ్యలోనున్న యిసుక తిన్నెమీదికి ఆమెను తీసుకెళ్లి కూర్చున్నాడు.

సుమతి యిసుకలో పిచ్చిగీతలు గీస్తూ మౌనంగా కూర్చొంది. రఘు గొంతు సవరించు కొని సంభాషణకు ఉపక్రమించాడు. "మీకు పిన్ని గురించి తెలిసే వుంటుంది. ఆమె ఆడంబరాల మీద మోజుతో డబ్బుకోసం వేరొక రితో వెళ్లిపోయింది. ముగ్గురు పిల్లల్ని భర్తని వాళ్ల ఖర్మానికి వదిలేసి తనదారి చూసుకొంది. పిన్ని చేసిన పనివల్ల, మేమంతా మాన సికంగా కుంగిపోతున్నాము. మా నాన్నగారు నన్ను పెంచుకొన్నారు. నా అసలు తండ్రి, నా చిన్నప్పుడే పోయారు. మా జనక తండ్రి పిల్ల లు ఆ పల్లెటూరులోనే ఉన్నారు. ఎప్పుడైనా వెళ్లి చూసి రావడం తప్ప మరేవిధమైన సంబంధంలేదు. సుమ చిన్న పిల్ల... దానికి ఏడాది నిండకుండా పిన్ని వెళ్లిపోయింది. మా నాన్నగారు విధివంచితులు. పిన్ని వెళ్లిన తర్వాత ఆయనకు పక్షవాతం వచ్చింది. ఆయనకు నా ఆసరా కావాలి, చెల్లెళ్లకు ఒక దారి చూపాలి..." అని కొంచెంసేపు ఆగాడు.

"మీకు ఈ విషయం గురించి నిర్మొహమా టంగా చెప్తున్నందుకు నా గురించి హీనంగా అనుకోకండి. మా నాన్నగారి బలవంతంవలన నేను పెళ్లికి సిద్ధపడుతున్నాను తప్ప... నాకు పెళ్లి చేసుకోవాలని లేదు. అందుచేత నా బాధ్యతలను సంతోషంగా అంగీకరించి... భాగ స్వామ్యం తీసుకోగల సహధర్మచారిణి నాకు కావాలి. అంతేకాకుండా మీకు ముఖ్యంగా చెప్ప వలసిన విషయమేమిటంటే ప్రస్తుతం నాకు పిల్లలు వద్దు. నా బాధ్యతలన్నీ పూర్తిగా నెరవే రేవరకు నేను పిల్లలను గురించి ఆలోచించలే ను. అసలు నా బాధ్యతలు నెరవేరతాయో... లేదో నాకు తెలియదు. ఆడవాళ్లకు మాతృత్వం అంటే ప్రాణం. మీరు నా నిర్ణయాలవల్ల తరు వాత బాధపడకూడదు. మా పిన్ని ప్రవర్తనవల్ల మా చెల్లెళ్ల పెళ్లిళ్ల బాధ్యత, చాలా కష్టతరమై నది. అది నెరవేరడానికి చాలా సమయం పట్టవచ్చు. అందుకే సంతానం విషయంలో నా నిర్ణయం మీకు యిష్టమైతే మిమ్మల్ని చేసుకో డానికి నాకు అభ్యంతరం ఉండదు" అని అన్నాడు రఘు.

సుమతి కాస్సేపు ఏమీ మాట్లాడలేకపో యింది. అతనిమీద ప్రేమతో... జాలితో ఆమె మనసు మూగబోయింది. "ఎంత త్యాగం! ఎవరు యిలా జీవితాన్ని తనవారికొరకు ధార పోయగలరు? తనకు పిల్లలు కలిగితే... వారి మీదగల మమకారంతో... తన చెల్లెళ్లపట్ల అను రాగం తగ్గిపోతుందేమోనని భయం... ఆరాటం! అటువంటి త్యాగపురుషునితో జీవితం పంచుకోవడమే ఒక వరం" యిలా ఎన్నో ఆలోచనలు సుమతి మదిలో.

"మీరు చెప్పింది వింటే... మీ నిర్ణయం ఎంత నిజాయితీగలదో అనిపిస్తోంది. మనకు



పిల్లలు పుడితే... రవ్వంత స్వార్థంతో కుటుంబానికి అన్యాయం జరుగుతుందేమోనన్న మీ భయం నాకు అర్థమయ్యింది. అద్దంలో చూచినట్లుగా మీ మనసు నాకు తెలుస్తోంది. సూర్యరశ్మి తగిలితే మంచుబిందువులు కరిగిపోయినట్లు... భగవదనుగ్రహంవలన మన సమస్యలన్నీ తీరిపోవచ్చు. మనకు నిజంగా సంతానం కలిగే యోగముంటే ఎవరూ తప్పించలేరు. మీ అభిప్రాయానికి నేనెప్పుడూ వ్యతిరేకత చూపను. యింక మన వివాహానికి మీకు అభ్యంతరం ఉండదనుకొంటాను'' అని తన సుముఖతను తెలియజేసింది సుమతి. రఘుకి ఆమె మాటలు వింటే గొంతుక డగ్గుత్తి వచ్చినట్టు అయ్యింది. నెమ్మదిగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని, బయలుదేరాడు.

చేతులు కలుపుకొని వస్తోన్న వారిని చూసేనరికి, శాంతకు అంతా అర్థమైపోయింది. కొబ్బరి చెక్క కొట్టి... చిన్న ముక్కలు ప్రసాదం వారి చేతిలో ఉంచింది. సుమతిని ఆనందంతో కావలించుకొంది. "మాకు ఎంతో ప్రియమైన అన్నయ్యతో జీవితాన్ని పంచుకోడానికి నువ్వు ఒప్పుకోవడం నాకు ఎంతో ఆనందంగా ఉంది'' అంటూ ఆమెను అల్లుకుపోయింది.

రఘు పట్టుదలవల్ల అన్నవరంలో క్లుప్తంగా వివాహం జరిపించారు. రామారావుగారికి సహాయంగా పావని ఉండిపోయింది. మధువర్కాలతో వచ్చిన కొడుకుని, కోడలిని చూసేసరికి రామారావుగారికి ఆనందభాష్పాలు జలజల రాలాయి. ఆ వెంటనే కన్నీళ్లూ ముంచుకొచ్చాయి. "రఘూ! మీ అమ్మ ఉంటే ఎంత ఆనందించేదో! ఆమె ఎక్కడ... ఏ లోకంలో ఉన్నా ఆమె చల్లని ఆశీస్సులు నీకుంటాయి. అందుకే యింత సుగుణాలరాశి నీకు భార్యగా లభించింది'' అంటూ వారిని అక్కున చేర్చుకొన్నారు. ఆ చిన్నారి దంపతులను చూస్తే ఆయనకెంతో ముచ్చటగా ఉంది. ఆరోజు తన స్నేహితులను కుటుంబాలతో భోజనాలకు రమ్మని పిలిచారు. కొత్త దంపతులతో సత్యన్నారాయణ వ్రతం చేయించారు. సుందరి వెళ్లిపోయిన తర్వాత అన్నిరోజుల తర్వాత ఆ రోజు ఆ యింట్లో అందరూ ఆనందంగా గడిపారు.





సుమతి మామగారిని కన్నతండ్రికంటే ఎక్కువగా సాకేది. శాంత, పావని యింటిపనులలో వదినకు చాలా సాయం చేసేవారు. ఎంతో కలిసికట్టుగా తిరిగే వాళ్లని చూస్తే అక్కాచెల్లెళ్లా అనిపించేది. సుమతి రఘుకు తలలో నాలుకలా మెలిగేది. వాళ్ల అనురాగ దాంపత్యం చూడముచ్చటగా ఉండేది.

ఎన్ని మాసాలు గడిచినా తనకు మనవడు కలిగే సూచనలు కనిపించకపోయేసరికి రామారావుగారి మనస్సు చివుక్కుమంది. వాళ్లు సంతానం కలగకుండా జాగ్రత్త పడుతున్నారేమోనని అతని భయం. రఘుతో ఎన్నోసార్లు మామూలుగా అన్నట్లు "నాకో మనవడు కావాలిరా! కాలక్షేపం కావడంలేదు. మన వంశం అభివృద్ధి చెందితే నాకు చూడాలని ఉందిరా! మన యింటి పేరు నిలిపే మగపిల్లవాడు కావాలి'' అనేవారు. ఒక్కోసారి వాళ్లను వెళ్లి డాక్టరుకు చూపించుకోమని పేచీపెట్టేవారు.

"మీరు మాకు చిన్నపిల్లవానికిందే లెక్క మామయ్యా! అంతకుమించి మాకేం కావాలి?'' అంటూ సుమతి నచ్చచెప్పేది.

"ఇదిగో తల్లీ! నీవు నన్ను మభ్యపెట్టాలని చూడకు. పసిపాపలు లేని యిల్లు... యిల్లుకాదు. పోనీలే నేనే నీ కడుపులో పడుతానులే... చూస్తూండు... యిది నిజం'' అనేవారు. రఘు ఆ మాటలకు నవ్వుకొనేవాడు.

దాంతో ఆయన మరీ పట్టుదలగా చెప్పేవారు - "రఘూ! నేను నిన్ను విడిచి పోలేనురా! అందుకే నీకు బాబుగా తప్పక జన్మిస్తాను. నీకు నవ్వులు పంచియిస్తాను'' అనేవారు. ఆయన అభిమానానికి కళ్లు నీళ్లతో నిండిపోయి... నోట మాట వచ్చేది కాదు రఘుకు. అవ్యక్తమైన ఆనందంతో అతని మనస్సు తేలిపోయేది.

అసలు తన తండ్రి అలా తేరుకొంటాడనీ... పిల్లలతో... సుమతితో సరదాగా గడుపుతాడనీ రఘు అనుకోలేదు... సుందరి ఆయనలోని జీవశక్తి తీసేసి... జీవన్మృతుడిని చేసింది. పెళ్లి చేసుకొని... కొన్నాళ్లు కాపురంచేసి... ముగ్గురు పిల్లల్ని కని... తనని, పిల్లల్ని కాదని వేరొకరితో వెళ్లిపోయిందంటే ఎంత అవమానం? ఎంత పరాభవం? మగవాడికి ధనం పోయినా... కీర్తి పోయినా తట్టుకోగలడేమోగాని భార్య మరొక

పురుమనితో వెళ్లిపోతే... ఆ అవమానాన్ని ఎలా భరించడం? పార్వతి పోయినప్పుడు ఆయన అనుభవించిన వేదన వేరు. జీవన సహచరిణీ, అనురాగ స్రవంతిని భగవంతుడు ఆయనకు దూరంచేశాడు. ఇప్పటి పరిస్థితి వేరు... లేమి నుండి వచ్చిన పిల్ల కాబట్టి అణుకువగా ఉండి,పరిస్థితులను అర్థం చేసుకొంటుందను కొన్నారు. కానీ తమ ఊహల్ని తారుమారు చేసి... గుండెల్లో మానని గాయాన్ని చేసి తాను వెళ్లిపోయింది.

ఎన్నోమార్లు ఆయన మగత నిద్రలో కలవ రించినప్పుడు... ఆయన మాటలు రఘు చె విన పడేవి. ఆయన పడే ఆవేదన అతనికి అర్థమయ్యేది. ఆయన మనసు పడే నరకయా తన అవగతమయ్యేది. ఇటు తండ్రి పడే బాధ చూడలేక... అటు తల్లి కనపడక అల్లాడే పిల్లలను సముదాయించలేక... ఒకపక్క సమా జంచేసే హేళనను భరించలేక నలిగిపోయేవా డు తాను. తన తండ్రి జీవితంలోని చేదు సంఘటన అది. తన తల్లి మరణం ఆయన లోని ఉత్సాహాన్ని కోరికను చంపింది. పిన్ని చేసిన పని ఆయన మగతనాన్ని పరాభ వించింది.

"రఘూ! నేనావిడకు ఏమి తక్కువ చేశా నురా? డబ్బంటే ఎంత కోరితే అంత యిచ్చా ను. బంగారం కోరితే అది యిచ్చాను. నేను ఎలా ఉన్నతంగా బతకాలనుకొన్నానో దానికి విరుద్ధంగా... ఆమెను తృప్తిపరచడానికే బతికా ను. ఆవిడ ఇష్టానుసారం ప్రవర్తించాను. నేనేం తప్పుచేశానని ఈ శిక్ష విధించింది? తల వంచుకొనేటట్లు చేసింది. పెళ్లి జరగదేమోనని బాధపడే యువతిని ఆదరించానే! భార్య హోదా యిచ్చానే! నా తాహతుకుమించిన కోర్కెలను కోరినా, మన్నించానే... యింకా నాతో జీవితంలో ఆవిడ ఏమి లోటు చూసిందిరా? దేనికి బానిసై నన్ను గడ్డిపరకలా హీనపరి చిందిరా? పసిపిల్లల మోమైనా చూచిందా? వారుగాని... మా దాంపత్యబంధంకాని ఆవిడ ను కట్టిపుంచలేకపోయిందే? ఎలా నేను ఈ అవమానాన్ని తట్టుకోవాలి?" అంటూ రఘు చేతిలో ముఖం దాచుకొని ఏడ్చేవారు. అతని ఒడిలో తలవాల్చి కుమిలిపోయేవారు. తండ్రి పడుతున్న బాధ అతనికి గొంతుక నులుము తున్నట్లుగా అనిపించేది. ఏవిధంగా చెప్పడాని కీ అతను అశక్తుడు. నిద్రమాత్రలు యిచ్చి ఆయనని డాక్టరు చెప్పిన విధంగా నిద్రపుచ్చే వాడు. నిద్రలో కూడా ఆయన కంఠనాళాలు దుఃఖంతో కదిలేవి.

ఒక్కోసారి గొంగళిపురుగు ముడుచుకొన్న ట్లు ముడుచుకొని పోయేవారు. పిల్లల్ని దగ్గ రకు రానిచ్చేవారు కారు. వాళ్లని చూస్తేచాలు ఉద్రేకపడిపోయేవారు. "మీరు యిక్కడ ఉండ వద్దు. మీ అమ్మ దగ్గరకి వెళ్లిపొండి. మీరంతా నాకు శత్రువులు. నా దగ్గర ఉండకండి. ఆవి డకు అక్కరలేని బాధ్యత నాకు కావాలా? పొండి" అంటూ గట్టిగా అరిచేవారు.పెద్ద చెల్లె లు శాంత ఊహ తెలిసినదవటంవల్ల, అన్నగా రికి శ్రమలేకుండా వంటపని చేసేది. చెల్లెళ్లను ఓదార్చేది. తండ్రి బాధకు గిలగిలలాడేది. అలసటతో ఆయన పడుకొంటే దిగాలుగా చూస్తూ కూర్చొనేది. పెదవి విప్పి చెప్పకపో యినా ఆమె వేదన అందరికీ అర్థమయ్యేది.

మిత్రులు వచ్చి కూర్చుంటే భోరున ఏడ్చేవా రు. 'నేను పనికిరాని వాడిని. భార్యను అదు పులో ఉంచుకోలేని చవటని. నాతో యింకా మీకు స్నేహమా? నేను మీకు పంచేది అవమా నాలే. నాకైతే చీమూ, నెత్తురు లేదు. మానం, అభిమానం లేదు. నేను ఒక పరాజితుడిని, కేవలం జీవితంలోని చేదును మింగడానికే బతుకుతున్నాను. ఇప్పుడు నేనంటే మీకు అసహ్యంలేదా? చులకన అన్పించడంలేదా? దయచేసి నన్ను వదిలేయండి. మీ స్నేహమా ధుర్యానికి నేను అనర్హుడిని" అంటూ చక్రధ రంగారి భుజంపై తలవాల్చి విలపించేవారు.

"చూశారా! యిక్కడ చాలా బాధగా ఉంది. మరచిపోదామనుకొన్నా ఈ బుద్ధి మరుపనీయ డంలేదు. ఈ అవమానాన్ని తట్టుకోలేక ఈ చిన్న గుండె బ్రద్దలౌతోంది" అనేవారు గుండెల మీద కొట్టుకుంటూ. ఆయనను ఓదా ర్చలేక సమాధాన పరచలేక స్నేహితులు సత మతమయ్యేవారు. ఆయన స్కూలుకు నెలరో జులు శలవుపెట్టేశారు. మిత్రులిద్దరూ తీరిక సమయాల్లో ఎక్కువ కాలం ఆయనతో గడిపే వారు. ఆయనను ఎలాగైనా మామూలు మని

షిని చేయాలని వారి పట్టుదల.

కొద్దిరోజులు గడిచేసరికి ఆయనలో ఒక విచిత్రమైన మార్పు వచ్చేసింది. దేవుని గదిలో కూర్చొని గంటలు... గంటలు గడిపేవారు. ఒక్కోసారి కళ్లనీళ్లతో దేవుని నిలదీసేవారు. పిల్లల్ని అప్పుడప్పుడు పిలిచి "మీ అమ్మ నిర్దయగా మిమ్మల్ని విడిచి వెళ్లింది. నేను మాత్రం మిమ్మల్ని వదలను తల్లీ! మీరు దూరమైతే నేను బ్రతుకలేను. మీరు నాకు కావాలి" అనేవారు.

డాక్టరుగారు ఆయన మానసిక స్థితి బాగుండలేదనీ, తగిలిన గాయం సామాన్యంకాదనీ, కోలుకొనేందుకు కొంతకాలం పడుతుందనీ చెప్పారు. అయన కళ్ల ఎదుట సుందరి ఫొటో అయినా ఉంచవద్దనీ... ఆవిడ ప్రసక్తి తేవద్దనీ చెప్పారు. దాంతో ఎవరూ ఆ సంగతి ఎత్తలేదు.

బయటవారికేవేమీ పట్టవుకదా! పట్టుకొని అప్పుడప్పుడు వచ్చి "అయ్యో... ఆవిడ ఎలాంటి పనిచేసింది! పాపం! మీ పరువైనా చూడలేదు. పిల్లల్ని విడిచి వెళ్లడానికి ఎలా మనన్సు ఒప్పిందో!?" అంటూ జాలీ... సానుభూతి కనపరిచేవారు. అయితే అది ఆ కుటుంబంపై నిజంగా ప్రేమ ఉండికాదు. ఎదుటివారు బాధపడుతుంటే చూసి ఆనందించే మనస్తత్వం కొందరిది... కేవలం పొరుగిల్లు కాలుతోంటే, చుట్ట వెలిగించుకొనే స్వభావం.

పరామర్శ పేరుతో వచ్చి... తండ్రిని బాధపెడుతున్నవారిని చూస్తే రఘుకి కోపం. సాధ్యమైనంతవరకు వారిని తండ్రి వద్దకు వెళ్లనిచ్చేవాడుకాదు. వారు చూపించే సానుభూతి అంటే అతడికి గిట్టదు. కాని అలా ఎంతమందిని ఆపగలడు!? ఎన్నిరోజులని తండ్రిని దాచగలడు!? చక్రధరంగారన్నట్లు ఎప్పటికైనా లోకాన్ని ఎదిరించగల శక్తి ఆయన పొందాలి. లోకుల మాటలకు భయపడి కొందరు తమదైన జీవిత సరళిని కూడా వదులుకొని తోకముడిచిన పిల్లిలాగ అయిపోతారు. కొంతమంది లోకాన్ని ఖాతరు చేయక... అది ఒక కాగితపు పులి అని దాన్ని ఎదిరించి బ్రతుకుతారు. రామారావుగారు మొదటి రకం మనిషి. లోకానికి జడిసి... బ్రతకడానికే భయపడుతున్నారు.

ఒక్కోసారి ఆయన రఘుని పిలిచి "తల్లి మీద కొడుకుకి అధికారం ఉందిరా. ఆవిడ తప్పుచేసినప్పుడు చెయ్యకూడదని హెచ్చరించడం కొడుకు ధర్మం. మీ పిన్ని తప్పుగా ప్రవర్తిస్తోందని అనుమానం వచ్చినా మనం శిక్షించలేదురా! అందుకే ఆవిడ మనల్ని వెర్రి వెధవలకింద జమకట్టింది. నువ్వైనా కాస్త భయపెట్టి ఉంటే ఇది యిలా జరిగేది కాదేమో!" అని అంటూండేవారు. రఘుకి అనలు ఆయన ఈ వేదన వల్ల బ్రతుకుతారా? అనిపించేది. ఒకప్రక్క అప్పులవాళ్ల బాధ, మరోప్రక్క కుటుంబం జరుగుబాటు కష్టంగా ఉండేది. ఏం చేయాలో తోచేదికాదు. అక్కడికీ తండ్రి స్నేహితులు అన్నివిధాల ఆదుకొంటున్నారు. తండ్రిని చూస్తే శలవు కేన్సిల్ చేసుకొని ఉద్యోగానికి వెళ్లేలాగ కనపడటంలేదు.

తండ్రి స్నేహితుల సిఫార్సుతో ఒక బట్టల షాపులో సాయంత్రం ఆరు గంటల నుండి పని చేయడానికి ఒప్పుకొన్నాడు. సాయంత్రం వరకు ప్రైవేట్లు పని... చెల్లెళ్లకు చదువు చెప్పటంతో సరిపోయేది. తన ట్రైనింగు పూర్తి అయినా యింకా ఉద్యోగం రాలేదని బాధ... తండ్రి ఆరోగ్య పరిస్థితి బాగోకపోవడం ఆయన ఉద్యోగం పట్ల యింకా సుముఖత చూపకపోవడం... ఈ పరిస్థితుల నన్నిటినీ తట్టుకోడం రఘుకి చాలా కష్టంగా ఉంది.

ఒకరోజు చక్రధరంగారే గట్టిగా కేకలేసారు "ఏమిటి మీరు చేస్తున్నపని? ఎంతకాలం మీరిలా బాధపడతారు? తప్పు చేసినావిడ బాగానే ఉంది. దర్జాగా తిరుగుతోంది. మీరేం తప్పుచేశారని మీకీ పిరికితనం? ధైర్యవంతుడు జీవితంలో ఒక్కసారే మరణిస్తాడు. పిరికివాడు జీవితంలో క్షణ క్షణం చస్తాడు. రఘు మొహం చూడండి. ఇటు మీతో అటు పిల్లలతో ఎంత అవస్థపడుతున్నాడో! ఆ పిల్లలకు కడుపు నిండా అన్నం పెట్టడానికైనా మీరు స్కూలుకి రండి" అని మందలించారు.

"ఏ మొహం పెట్టుకొని స్కూలుకిరాను? నా మొదటి భార్యతోనే నేను మరణించినా బాగుండేది. ఈ రెండో పెళ్లి చేసుకొని ప్రాణం మీదికి తెచ్చుకొన్నాను" అంటూ వాపోయారు.




ఇటువంటి పరిస్థితులలోనే సుందరి జాడ తెలుస్తుందేమోనని ఒకసారి రఘుని కాకినాడ పంపించారు. అతను తెచ్చిన సమాచారం ఆయనను మరింత కుంగతీసింది. చివరికి స్నేహితుల పోరుపడలేక ఎలాగో స్కూలుకి వెళ్లారు. చక్రధరంగారి హెచ్చరిక వల్ల ఎవరూ ఆయనను ఈ విషయం గురించి ప్రశ్నించలేదు. చాలా మామూలుగా అందరూ ఆయనతో ప్రవర్తించారు కానీ ఏ పని చేయడానికీ ఆయనకు మనస్కరించేది కాదు. చివరికి పాఠాలు చెప్పటంలో కూడా లీనం కాలేకపోయారు. చాలా భారంగా రోజులు నెట్టేవారు.

సుందరి యింటికి రాక మునుపే వర్ధనమ్మగారు శాంతకు ఒక సంబంధం తీసుకు వచ్చారు. వాళ్లు మధ్యతరగతి వాళ్లే. ఆ అబ్బాయి ఎందులోనో క్లర్క్గా పనిచేస్తున్నాడు. శాంత స్వభావం చాలా మంచిదని వర్ధనమ్మగారు వాళ్లకు నచ్చచెప్పి ఈ సంబంధాన్ని తీసుకొని వచ్చారు. వాళ్లు కట్నంగా ముప్పై వేలు కాక ఆడబడుచు లాంఛనాలు, అలక కట్నంగా స్కూటరు కావాలని కోరారు.

"మేము అన్ని కట్నకానుకలు యిచ్చుకోలేం. ఏదో మా శక్తికి మించిన ఒక పదివేలు కట్నం... ఆడపడుచు లాంఛనాలుగా ఒక వెయ్యి రూపాయిలకు మించి యివ్వలేమని" రామారావుగారు చెప్పారు.

"పిల్ల తల్లి ఎవరితోనో యిల్లు వదలివెళ్లిపోయిందని తెలిసినా మేం కాబట్టి యీ సంబంధంచేసుకోడానికి వచ్చాం. మరి ఆ మాత్రం కట్నకానుకలు యివ్వకపోతే ఈ సంబంధం ఎందుకు చేసుకోవాలి?" అని చాలా అనాగరికంగా అడిగారు.

రఘుకి, మాధవికి వాళ్ల మాటలు, కోరికలు వింటోంటే మతిపోయింది. వాళ్లడిగినంత యిచ్చేస్తే ఏ కళంకం ఉన్నా పోతుందా! ఏదో ఒక నెపంతో డబ్బు గుంజుకోవాలనే తత్వం తప్ప... వాళ్లలో సానుభూతి ఏ కోశానా లేదన్నది నిర్వివాదాంశం. అలాంటి డబ్బు మనుషులతో తమ శాంత సుఖపడదని మరేం మాట్లాడకుండా ఆ సంబంధాన్ని నిరాకరించారు. అప్పటి నుండి శాంతకు సంబంధాలు రావడం కష్టమైపోయింది. ఏదో ఒక సంబంధం వచ్చినా తల్లినిబట్టి పిల్లను నిందించేవారో... ఈ మిషతో మరీ ఎక్కువ కట్నం డిమాండు చేసేవారో అయ్యేంటున్నారు.

దాంతో రామారావుగారికి మరీ బెంగపట్టుకొంది. తాను శాంత పెళ్లి జన్మలో చెయ్యలేనని అధైర్యపడిపోయారు. ఆ ఆందోళనతో ఆయనకి పక్షవాతం వచ్చింది. ఒక చెయ్యి, ఒక కాలు కదపలేక అవస్థపడిపోయారు. ఎన్ని మందులు వాడినా ప్రయోజనం శూన్యమైపోయింది. ఆయన ఉద్యోగం చెయ్యలేనని పై అధికారులకు మనవి చేసుకొన్నారు. ఆయన మిత్రుల గట్టి పట్టుదల వలన, అధికారుల మంచితనం వలన త్వరలోనే రఘూకు ఉద్యోగం వచ్చింది.

తండ్రికి ఊరట కలిగించాలని రఘు ఎంతో పట్టుదలతో సంబంధాలు వెదికినా లాభంలేకపోయింది.

"నా తల్లి ఒక యింటిది అయ్యేయోగం లేనట్లుంది. దానిపెళ్లి నా కళ్లతో చూస్తానని ఆశలేదు. నా వలన నా పిల్లలు అన్యాయం అయిపోయారు" అంటూ ఆయన బాధపడుతోంటే ఒకరోజు మాధవి దెబ్బలాడింది.

"నువ్వు అనవసరంగా బెంగ పడవద్దు మామయ్యా! మన శాంతకు యిష్టమైతే మా తమ్ముడు రాజా చేసుకొంటాడు. కాకపోతే వాడి చదువు పూర్తయ్యి... ఉద్యోగం వచ్చిన తర్వాత చేసుకొంటాడట. మేము యిద్దరం మాట్లాడుకొని ఈ నిర్ణయంకు వచ్చాం... కొంత కాలం ఆగవచ్చునంటే ఈ సంబంధం చెయ్యి" అని ఆమె చెపుతోంటే రామారావుగారు పరమానంద భరితులయ్యారు. ఇన్నాళ్లు తనకీ ఆలోచన కలగనందుకు తిట్టుకొన్నారు. నూరేళ్లు చల్లగా బ్రతుకమ్మా! ఈ మోడు వారిన జీవితంలో పన్నీరు చిలికించావు" అన్నారు ఆనంద భాష్పాలునిండిన కళ్లతో.

మాధవి సైన్సు టీచరుగా స్థిరపడినా తమ్ముణ్ణి మాత్రం పై చదువులు చదివిస్తోంది. ఎం.ఎస్.సి. మొదటి సంవత్సరం చదువుతున్నాడు రాజా. తమ్ముడి చదువు పూర్తై ఉద్యోగం వచ్చేవరకు ఆగమనడం భావ్యం కాదేమోనని యిన్నాళ్లూ ఊరుకొంది. కానీ రామారావుగారి ఆరోగ్య పరిస్థితి ఆమెను నోరు విప్పేలా చే

సింది. రాజాకు కూడా శాంత అంటే అభిమానమే.

ఈ సంగతి తెలిసి రఘు మాధవికి వేనోళ్ల కృతజ్ఞత చెప్పాడు.

"తల్లి దండ్రులను పోగొట్టుకొన్న మమ్మల్ని చేరదీసిపెంచారు మామయ్యా. మా కష్టాలలో ఆదుకొన్నారు. అలాంటి ఆయనకు ఈ మాత్రం ఉపకృతి చేసుకోగలిగే అవకాశం రావటం మా అదృష్టం. శాంత ఏమీ కుంటిది, గ్రుడ్డిది కాదు. మేం ఉదారంగా చేసుకొన్నామనుకోడానికి. నువ్వు మమ్మల్ని పరాయివాళ్లలా చూడకు" అంటూ దెబ్బలాడింది.

ఆమెకు గల అభిమానానికి రామారావుగారికి కళ్లవెంట నీళ్లు తిరిగాయి. "ఇంతకీ నా శాంత తల్లి అదృష్టవంతురాలు" అంటూ "ఆమె తల నిమిరారు.

★ ★ ★

సుందరికి జ్వరం మూడు రోజులైనా తగ్గలేదు. మూడోరోజు మరీ ఎక్కువయ్యింది. డాక్టరు ఇంజక్షన్లు, మందులు యిచ్చినా టెంపరేచర్ తగ్గలేదు. ఆరోజు ఎక్కువగా ఉండటంతో సుందరి నిద్రలో కలవరింతలు కూడా మొదలుపెట్టింది. ఆవిడకు వంటి మీద తెలివిలేదు. రాత్రంతా ఒకటే కేకలు "రెహమాన్... నన్నుకొట్టకు నీకు పుణ్యం ఉంటుంది నన్ను వదిలెయ్... ఈ దెబ్బలు నేను భరించలేను. నేను తట్టుకోలేను., రెహమాన్ నన్ను కొట్టద్దు. నిజం రెహమాన్ నేను స్కూలు పిల్లలను చూడటానికి వీధిలో నించున్నాను. మరేం కాదు; ఎదురింటి స్టూడెంట్లను నేను చూడలేదు. ఒట్టు... నన్ను నమ్ము... సిగరెట్‌తో కాల్చకు. నిన్ను నమ్మి వచ్చాను... నన్ను శిక్షించకు" అంటూ వంటిమీద స్పృహలేకుండా కలవరిస్తోంటే అందరూ కంగారుపడ్డారు. వెంటనే డాక్టరుగారిని తీసుకొని వచ్చారు. "జ్వరం ఎక్కువగా ఉంది. మరేం కంగారుపడకండి. చల్లని గుడ్డలు నుదుటి మీద వేయండి. ఇంజక్షను యిస్తాను. నిద్రపోతారు" అని ధైర్యం చెప్పారు.

"ఆవిడ తట్టుకోలేని మానసిక క్షోభను అనుభవిస్తున్నారు. ఆమెకు మీ అందరి ఆదరణ ఉన్నది అన్న నమ్మకం కలగాలి. లేకపోతే దక్కరు. నేను మీ ఫ్యామిలీ డాక్టరుగా ఈ విషయం చెప్పక తప్పదు" అని రఘును ప్రక్కకు తీసుకువెళ్లి చెప్పారు.

"నన్ను క్షమించు రెహమాన్ ఒక్కసారి పంపించు... అయన్ని పిల్లల్ని చూసి వస్తాను. నిన్ను యింకేమీ కోరను" అంటూ కలవరిస్తూ యింజక్షన్ ప్రభావంతో మత్తులోనికి జారిపోయింది సుందరి.

అన్నగారి ద్వారా డాక్టరుగారు చెప్పిన విషయం విని అంతా బెంగగా... స్తబ్దుగా ఉండిపోయారు. "నాన్నగారితో నీవు నెమ్మదిగా చెప్పన్నయ్యా! ఆవిడ నాన్నగారిని చూడకుండా మాట్లాడకుండా... ఏమైనా అయితే కష్టం" అంటూ అన్నగారితో నెమ్మదిగా చెప్పింది శాంత.

"నేనూ అదే అనుకొంటున్నానమ్మా! రేపే వీలుచూచుకొని నాన్నగారితో చెప్పేద్దాం" పిన్ని వచ్చినప్పుడు ఏదో సంచి తెచ్చినట్లుంది అందులో ఏమున్నాయో చూడు శాంతా!" అన్నాడు.

శాంత సంచీ తీసి చూసింది. అందులో ఒక డైరీ ఉంది. అది అన్నగారికిచ్చింది.

మాధవి, సుమతి ఆమె ప్రక్కనే ప్రక్కలు వేసి పడుకొన్నారు. ఒకరి తర్వాత ఒకరు కనిపెట్టుకొని చూస్తున్నారు. రఘుకి పాపం నిద్రేలేదు. అటు తండ్రిని ఇటు ఈమెను చూస్తూ, అసహనంగా తిరుగుతున్నాడు. శాంత కూడా నిద్ర పట్టక అన్నగారి వద్దకు చేరింది. "ఏమ్మా! నిద్ర పట్టడంలేదా?" అంటూ అక్కడే ఉన్న కుర్చీలో చతికిల పడ్డాడు. శాంత యిచ్చిన డైరీ చేతిలోనికి తీసుకొన్నాడు.

"నాకు అనుమానంగానే ఉందమ్మా! ఆవిడ ఎంతో వేదన అనుభవిస్తోందని. చెప్పడానికి వీలుకాని విషయాలు డైరీలో వ్రాసుకొంటాం. పిన్ని కూడా చదువుకొన్నదే డైరీలో ఏం వ్రాసుకొందో!" అంటూ డైరీ తెరిచాడు. శాంత కుతూహలంగా అన్నగారి ప్రక్కనచేరి తాను కూడా డైరీ చదవసాగింది.

మొదటి పేజీలో ఇలారాసి ఉంది...

"'నేను రెహమాన్ గురించి తప్పుగా అంచనా వేసుకోవడంలేదు కదా! యింట్లో డబ్బు





యిబ్బందులు... పిల్లలు... ఎప్పుడూ నిర్లిప్తంగా ఉండే ఆయన... నాకు విసుగెత్తిపోతోంది. అందుకే రెహమాన్‌తో జీవితం పంచుకోవాలని పిస్తోంది. తొందరపడటంలేదు కదా! అతడి గురించి ఏమీ తెలుసుకోకుండా ఇల్లు విడిచి వెళ్లకూడదు''.

మరో వారం తర్వాత...

''పురిటి నుండి వచ్చిన తర్వాత వనజకి మా సంగతి తెలిసిపోయినట్లుంది. భర్తతో దెబ్బలాడి ఇల్లుమార్చేసింది. రెహమాన్ వనజ వాళ్లుండే యింట్లోకి మకాం మార్చాడు. రెహమాన్‌కు నేనంటే చాలా యిష్టమని అర్థమయ్యింది. అతనికి కాకినాడలో, బెజవాడలో బట్టల వ్యాపారం ఉందిట. ఎక్కువగా ఊర్లు తిరుగుతుంటాడు. చాలా అందంగా ఉంటాడు. ఎప్పుడూ మేడ మీదనుండి చిలిపి కళ్లతో నవ్వుతూ సైగచేస్తుంటాడు. ఆశ్చర్యం! ముగ్గురి పిల్లల తల్లినైనా అతని వలలోపడిపోయాను.''

నాలుగు రోజుల తర్వాత...

''ఈరోజు భోగి... పండగకోసం కొత్త చీర తెచ్చాననాన్నాడు. యింట్లో ఆయన పిల్లలు లేని సమయం చూసి వచ్చి ఏవో కబుర్లు చెప్తుంటాడు రెహమాన్. చూసేవాళ్లేమనుకొంటారో... ఆయనకు తెలిస్తే ఏమౌతుందో... నా భయం చెప్పాను. ఏం చెప్పినా పట్టినపట్టు విడవకుండా చీర ఇచ్చి వెళ్లాడు. అమ్మ యిచ్చినట్లు చెప్పుకొన్నాను ఆయనతో''

పదిరోజుల తర్వాత...

''రెహమాన్ జీవిత చరిత్ర చెప్పాడు. తనకి కూడా పెళ్లయ్యిందట. కానీ ఆమెవల్ల జీవితంలో సుఖం పొందడంలేదట. ముగ్గురు పిల్లలు కూడా పుట్టారట. ''పిల్లలకేం, లోటు? యిట్టే పుట్టుకొస్తారు. ముగ్గురు పిల్లలు పుట్టినంతమాత్రాన వయసు అయిపోయినట్లేనా?'' అని చిలిపిగా నవ్వుతాడు. ఆ నవ్వు చూస్తే ఒళ్లు ఝల్లుమంటుంది.

ఇరవై రోజుల తర్వాత...

''నన్ను ఎప్పుడూ విడిచిపెట్టననీ... ఇన్ని రోజుల పరిచయమైనా తనని అర్థంచేసుకోలేదని నిష్ఠూరంగా అన్నాడు. తనకి నేను కావాలిట. నన్ను పెళ్లిచేసుకొని స్వర్గసౌఖ్యాలు చూపిస్తానంటున్నాడు. తనకు కావల్సింది పొందడానికెప్పుడూ వెనుకాడడు. ఆయన స్కూలు నుండి వచ్చే టైమయ్యేవరకు కూర్చొన్నాడు. వద్దన్నా పళ్లు, స్వీట్లు తెచ్చి వుంచేశాడింట్లో. ఆయన సాయంత్రం రాగానే అడిగారు అవన్నీ ఎక్కడివని. పక్కింటివాళ్లిచ్చారంటే మాట్లాడకుండా నడిచారింట్లోకి. ఒకటిమాత్రం నిజం. రెహమాన్‌ని చూస్తేమాత్రం నా మనసు నేను చెప్పినట్లు వినదు. దానికేమౌతుందో! పిచ్చి పిచ్చిగా ఆలోచిస్తుంది. ఎన్నడూలేనిది నా భావాలు ఎవరికైనా చెప్పాలని నాలో తహ తహ... ఎవరికి చెప్పను? నవ్వుకోరూ!''

మరోనాలుగు రోజుల తర్వాత...

''రెహమాన్‌కోసం నా శరీరం... మనసు ఆత్రుతపడుతున్నాయి. అతడు చేసే చిలిపి పనులు... నాకు ఎప్పుడూ గుర్తుకువచ్చి, నా పెదవులు చిరునవ్వుతో విచ్చుకొంటాయి. ఇంట్లో నా శరీరం ఉందికానీ... నా మనసు లేదు. నేను వివాహితను, పిల్లలున్నారు. అతనికి అనవసరమైన స్వాతంత్ర్యం ఇస్తున్నానేమో!''

వారం తరువాత...

''రెహమాన్ ఊరు నుండి వచ్చాడు. సినిమాకు వెళ్తున్నానని రఘుతో చెప్పి ఒంటరిగా బయలుదేరాను. రెహమాన్ నాతో వచ్చాడు. అతడికి ఏమీ తోచటంలేదు. ఎన్నాళ్లిలాగ? ఏదో ఒకటి నిర్ణయించుకోమని చెప్పాడు. ఎన్ని కబుర్లు ఎంత అందంగా చెపుతాడో... గంటలు కూడా నిముషాల్లా దొర్లిపోతాయి అతని సహచర్యంలో.

మరో పది రోజులకు ఇలా రాసుకుంది...

''రెహమాన్ కేంపునుండి వచ్చాడు. ఒక కొత్త మోడల్ నెక్లెస్ తెచ్చాడు. వద్దన్నాను. దాన్ని ఎలా ధరించగలను? ఎవరిచ్చారని చెప్పగలను? ఇన్ని రోజులు గడిచినా ఒక నిర్ణయానికి రాలేదని అలిగాడు. తనపై నాకు నమ్మకం లేదని... అన్నాడు. వెంటనే రెండు రోజులలో నా నిర్ణయం చెప్పమన్నాడు. నేను నిరాకరిస్తే ఈ ఊరే తిరిగి రానన్నాడు. అతడితో జీవితం ఎలా ఉంటుందో? అసలు ఎలా వెళ్లడం? సుమ చిన్నది. ఇంకా ఏడాది నిండలేదు. నేను దాన్ని విడిచి ఉండగలనా? శాంతపా

వని ఏమౌతారు? ఆయన నన్ను గూర్చి ఏమను కొంటారు? మా పెళ్లికి ముందే రెహమాన్‌తో పరిచయమైతే బాగుండేది.

మరో మూడు రోజులకు...

"అతడు లేనిదే నేను బతకలేనన్పిస్తోంది. అతని శృంగార చేష్టలు... అతని స్పర్శ అను క్షణం గుర్తుకొస్తున్నాయి. అతనిపైనే నా ధ్యాస. ఈ ఆకర్షణ వెల్లువనుండి మరి నేను తప్పించుకోలేను. రెహమాన్ తోడిదే జీవితమని పిస్తోంది... ఇంక ఆయనను మోసం చెయ్యలేను. ఆయనకు భార్యగా... ఆయన పిల్లలకు తల్లిగా... ఆ పవిత్రతను ఎప్పుడో కోల్పోయాను. నా దారి నేను చూసుకోవడమే మంచిది"

మళ్లీ కొన్నాళ్లవరకు డైరీలో ఏమీ రాయలేదు. ఆ తర్వాత పేజీలు... తేదీలు ప్రమేయం లేకుండా ఏకంగా వ్రాసివున్నాయి, వరుసగా!

రెహమాన్... బెంగుళూరు, మద్రాను, తిరుపతి చూపించాడు. నెలరోజులు హాయిగా తిరిగాం. నాకోసం ఎన్నో కొన్నాడు. మంచి చీరలు, నగలు... ఒకటేమిటి? నేను కోరుకున్న జీవితం యిన్నాళ్లకు అనుభవంలోకి వచ్చింది. నన్ను క్షణం వదలడు. అతనికి యింటిమీదికి గాలి మళ్లినట్లుంది. పైకిమాత్రం వ్యాపారం చూసుకోవాలని కాకినాడ తీసుకొని వచ్చాడు.

రఘు రెహమాన్ యింటికి వచ్చి వెళ్లాడని రెహమాన్ చెప్పాడు. రెహమాన్ భార్యకు మా గురించి తెలిసిపోయినట్లు నాకర్థమయ్యింది. కాకినాడలోనే నన్ను వేరే యింట్లో ఉంచాడు. ఒక ముసలి పనిమనిషిని కుదిర్చాడు. ఆ అవ్వ ఎప్పుడూ నన్ను కనిపెట్టుకొని ఉంటుంది.

కాకినాడ వచ్చాక... రెహమాన్ నిత్యం నాతో ఉండటంలేదు. రెండురోజులకొకసారి వస్తాడు. భార్యా, పిల్లల్ని విడిచి ఉండలేడట. మరి నేనో? ఇతనికోసం అందరినీ వదిలేశానే! నా మనసు నన్ను ఎత్తిపొడిచింది.

"అతను యింటికి రాకపోతే ఒంటరిగా ఉండలేనని" ఎన్నోసార్లు చెప్పాను. "నీకు డబ్బు, నగలు సమకూర్చాలికదా! మరి అవన్నీ నేను సంపాదించాలి. మరి నేను ఎప్పుడూ నీ పక్కలో పడుకొంటే అవన్నీ ఎలా వస్తాయి? వ్యాపారం కొండెక్కుతుంది" అంటూ ఎత్తిపొడిచాడు. కేవలం డబ్బుకోసమేనా నేను అతడితో వచ్చేసింది?

రెహమాన్‌కి భార్యంటే చాలా ప్రేమ, గౌరవం అని గ్రహించాను. ఆవిడను నొప్పించడానికి ప్రయత్నించడు. ఆమె బాగానే ఉంటుందట. తన చర్యలవల్ల ఆమె బాధపడకుండా వాక్చాతుర్యంతో... లాలించి బుజ్జగిస్తాడు. ఆ ఇంటి విషయాలు మామ్మ చెప్పేది. మామ్మ లోగడ అక్కడ పనిచేసిందట.

ఒకరోజు వస్తానని నా దగ్గరకు రాలేదు. వాళ్ల బాబు పుట్టిన రోజని... వాళ్లంతా సినిమాకు వెళ్లారట. మర్నాడు వచ్చి చెప్పాడు. "పోనీ! ఒకసారి వచ్చి కనిపించి వెళ్లకూడదా? ఏమీ తోచక పిచ్చి పుడుతోంది" అని అన్నాను.

"రజియాకి పిల్లలు పుట్టినరోజునాడు నేనింట్లో లేకపోతే బాధగా ఉంటుంది. నా విషయాలు అన్నీ తెలిసినా... ఆమె నన్నేమీ అనదు. నీ విషయం తెలిసి కూడా నిన్ను విడిచిపెట్టమని గొడవచేయలేదు. అటువంటి ఆమెను నేను గౌరవించవద్దా?" అని అన్నాడు. మర్నాడు బజారుకు తీసుకువెళ్లి టేపురికార్డరు కొనిపెట్టాడు. ఇద్దరం సినిమాకి వెళ్లాం.

"నా పిల్లలు ఎలా ఉన్నారో తెలుసుకోవాలనిపించింది. మామ్మ మనవడు ఉన్నాడని చెపితే వాణ్ని మా యింటికి పంపాను. వట్టినే వెళ్లి చూసి రమ్మంటే బాగుండదని నా సామాన్లు, బట్టలు తెచ్చిపెట్టమని చెప్పాను. ఆయన ఒక్క మాట మాట్లాడక టి.వి., బట్టలు, నేను కొనుక్కొన్న ముఖ్యమైన వస్తువులన్నీ యిచ్చేశారు. వాటన్నిటినీ తీసుకువెళ్లడానికి డబ్బు చాలదేమోనని రెండొందల రూపాయిలు కూడా యిచ్చారు. పిల్లల గురించికాని... తన గురించికాని ఒక్క మాట కూడా చెప్పలేదు. ఆయన. అభిమానం నాకు తెలియనిదా?

రెహమాన్‌కి ఆ విషయం తెలిసి దెబ్బలాడాడు "నీకు కావలసినది కొనలేని చవట వెధవని కాను. నువ్వు ఎవ్వరినీ ముష్టి ఎత్తనక్కరలేదు. ఎవ్వరి యోగక్షేమాలు తెలుసుకోనక్కరలేదు. పిచ్చి పిచ్చి వేషాలు వేశావా... మర్యాద దక్కదు" అంటూ ఎగిరాడు. నిజంగా అతడికి





తెలిస్తే... వెళ్లనిచ్చేవాడు కాదని అర్థమయ్యింది. నన్ను తనతో లేచిపోయి రమ్మన్నప్పుడు "నీకు కావలసినప్పుడు పిల్లల్ని చూడటానికి వెళ్లవచ్చు" అని నచ్చచెప్పినది యితనేనా అని నాకు ఆశ్చర్యం కల్గింది.

"రెహమాన్ పదిరోజులపై వ్యాపారం పనిమీద ఊరెళ్లాడు. ఏమీ తోచటంలేదని మ్యాట్నీ సినిమాకు వెళ్లాను. సినిమానుండి యింటికి వచ్చేసరికి సోఫాలో కూర్చొని ఉన్నాడు. చాలా కోపంగా ఉన్నాడు. రిక్షా దిగి లోపలికి వచ్చి అతనిని చూసేసరికి నాకు కాళ్లు వణికాయి. ఎలాగో కూడతీసుకొని లోనికి వెళ్లాను."

"నీ యిష్టం వచ్చినట్లు తిరగడానికి యిదేమైనా హొటలనుకున్నావా? నేను ఊళ్లో లేనప్పుడు బయటకెందుకు వెళ్లాలి? ఏ వెధవతో కులకడానికి వెళ్లావే... నిజం చెప్పు. లేకపోతే నీ తాట వలిచేస్తాను" అంటూ చావబాదాడు. "ఏం తోచటంలేదని సినిమాకు వెళ్లానని" చెప్పినా నమ్మలేదు. నన్ను కొట్టి కోపంగా వెళ్లిపోయాడు. అతడు తెచ్చిన పట్టుచీర సోఫాలోనే ఉంది. అలా వెళ్లిపోయిన మనిషి మూడవ రోజు వరకూ రాలేదు. నాకు అతడి స్వభావం అర్థంకాలేదు. అంతలోనే ప్రేమ... అంతలోనే కోపం... అంతలోనే అనుమానం. నేనెక్కడికీ వెళ్లకూడదు. ఆ విషయం గ్రహించాను. అన్నీ ఉన్నా ఆ బంగారు పంజరం నాకు విసుగ్గా ఉంది.

నాకు ఒక విషయం ఆశ్చర్యంగా ఉంది. రెండు రోజులు కోపం వచ్చి రాకపోయినా... మూడవరోజు మాత్రం తప్పక నాదగ్గరకి వస్తాడు. ఒకసారి అదే అడిగాను. "అంత కోపంగా వెళ్లిపోయావు. కోపం పోయిందా? నేను గుర్తుకొచ్చి వచ్చావా?" అని అడిగితే నావైపు తదేకంగా చూస్తూ చెప్పాడు-

"నీ ఆకర్షణ నన్ను రమ్మని పిలుస్తూనే ఉంటుంది. నాకు ఆడవాళ్లు స్వతంత్రంగా ఉండడం యిష్టముండదు. అలా ఉండకపోతే నేను నీదగ్గరకు ఎలా రాగలనని నీవడగవచ్చు. అన్నీ యివ్వని భర్త అయితే వాళ్లు బాధపడవచ్చు. కానీ! అన్నీ యిచ్చే నాలాంటి సమర్థుడైన భర్తవద్ద, వాళ్లకు లోటేంటి. అయినా... రజియా కూడా నీదగ్గరకు వెళ్లమని... నిన్ను చూసిరమ్మని చెపుతోంది. అందుకే వచ్చాను" అని చెప్పాడు. నాకు మతిపోయింది. "ఇది సాధ్యమా?" అని పదే పదే ప్రశ్నించుకొనేదాన్ని.

"నా భర్త నా సవతిని తలుచుకొని బాధపడుతోంటే... నేను సహించలేకపోయేదాన్ని. ఆవిడ ఫోటో ఎదురుగా ఉంటే... ఆయనతో దెబ్బలాడి పడకగదిలో వద్దని వారించాను. చివరికి ఆవిడ నగలు అలాగ వేసుకోవడానికి కూడా నా మనసు అంగీకరించలేదు. అలాంటిది రజియా ఉదారంగా ఎలా ఉండగలదు? నాలో లేని గుణం ఆమెలో ఉండటం కూడా నేను భరించలేకపోతున్నాను.

"నేను రెహమాన్‌ని అడిగేదాన్ని- "నీకు యిక్కడ బాగుంటుందా? అక్కడా?" అని. అతడు దానికి మాత్రం జవాబు చెప్పకుండా దాటవేశాడు.

అతను యింట్లో వుంటే నేనేపనీ చెయ్యకూడదు. అతనికి యిష్టంవచ్చినట్లు అలంకరించుకోవాలి. అతనికి నచ్చినరీతిలో ప్రవర్తించాలి. ఏవో తీయని కబుర్లు చెప్తూ అతడిని సంతోషపెట్టాలి. నాకు యింటిపట్టున ఉండటం ఎక్కువ యిష్టంవుండదు. నాపోరు పడలేక తరచూ సినిమాలకు తీసుకువెళ్లేవాడు.

ఒకసారి జ్వరం వచ్చి నాలుగు రోజులు నేను లేవలేదు. అతనికి నా విషయం తెలియదు. మామ్మని వాళ్లింటికి పంపాను, ఒకసారి రమ్మని చెప్పమని. వెంటనే డాక్టరు వచ్చి చూసి యింజక్షన్ యిచ్చి వెళ్లారు. అతను ఊర్లో లేడని రజియా డాక్టరును పంపిందిట! తర్వాత అతను ఊరినుండి వచ్చినవెంటనే, రజియాద్వారా విషయం తెలుసుకొని, వచ్చాడు. పథ్యం తిని నీరసంగా పడుకొన్న నన్ను చూసి ఆందోళనపడ్డాడు.

"జ్వరం వస్తే బయటకు వెళ్లవా? నిన్ను సినిమాలకు, షికార్లకు వెళ్లవద్దనన్నానుగాని డాక్టరువద్దకు వద్దనలేదే!" అన్నాడు. మామ్మను పిలిచి "డాక్టరువద్దకు వెళ్లవచ్చునుకదా!" అని మందలించాడు. పండ్లరసం తీసి తాగించాడు. మళ్లీ నేను మామూలు మనిషి అయ్యేవరకు కేంపుకెళ్లలేదు.

"ఒకసారి ఏదో పండగకు అతడు ఏవో

బట్టలు కొని తెచ్చాడు. ముందు ఆ యింటికి వెళ్లి వాళ్లకిచ్చి వచ్చాడని తెల్సింది. ఉక్రోషం పట్టలేక "మీకు నాకన్నా వాళ్లే ఎక్కువా? వాళ్లందరూ తీసుకోగా మిగిలినవి నాకు. నేనంటే ప్రేమ ఉంటేకదా! ఆవిడ నాటకం నాకు తెలియనిదా? నేనంటే ప్రేమ ఉన్నట్లు ప్రవర్తిస్తోంది. నావల్ల ఉదారంగా ఉంటే, నీవు ఆవిడకు మరింత సన్నిహితమౌతావని, ఈ నాటకం" అని అరిచాను.

అతను లాగి నా చెంపమీద కొట్టాడు. "రజియా ఊసెత్తావంటే గెంటేస్తాను. ఆవిడ కాలిగోరుకి పోలవు. నీ గుణం ఎక్కడ? ఆవిడ గుణం ఎక్కడ? మల్లెపూవు ఆవిడ... ఉల్లి పువ్వు నువ్వు. మానవత్వం అన్నా... నైతిక విలువలన్నా నీకు సున్నా. ఆవిడ పేరెత్తే అర్హతైనా లేదు నీకు" అన్నాడు కోపంగా ఊగిపోతూ.

"ఓహో! నైతిక విలువలా? మానవత్వమా? నీనోట ఆ మాటలు వింటే... పులి వేదపాఠం చెపుతున్నట్లుంది. ముగ్గురు బిడ్డల తల్లిని, భర్తచాటు భార్యని ప్రలోభపెట్టడం ఏం నైతిక విలువ? డబ్బు ఎర చూపి లొంగతీసుకోవడం మానవత్వమా?" అంటూ హేళనగా అడిగాను.

సమాధానంగా కాలుతున్న సిగరెట్టుతో చురకలు పెట్టాడు. "దరిద్రపు మొహందానా! నా విషయం మరోసారి ఎత్తితే మర్యాద దక్కదు. నీకు డబ్బు, నగలపిచ్చి. దేవుడులాంటి భర్త నీ కంటికి ఆనలేదు. నీ వగలతో నన్ను రెచ్చగొట్టావు. ఏం నేను రమ్మంటే నీ బుద్ధి ఏమైపోయింది? నీ పిల్లలమీద నీకసలు ప్రేమ తగలడిందా?" అంటూ కసితీరా వావ బాదాడు.

మామ్మ నాకు కాపడం పెడుతూ "అతను కోపిష్టివాడమ్మా! ఇల్లు వదిలి, మీ ఆయన్ని పిల్లల్ని వదిలి ఇతడిని నమ్ముకు వచ్చావు. అతనితో తగాదాలు ఎందుకమ్మా?" అంటూ హితవు చెప్పింది. నా మనసు, శరీరం - తిట్లకి, దెబ్బలకు అలవాటు పడింది.

నామనసు నాకు స్పష్టంగా అర్థమౌతోంది. పిల్లలకోసం నాపేగు పీకుతోంది. అందుకే అంటారు కాబోలు పేగు లాగనిదే ప్రేమలేదని.




ఒకసారి అమ్మకు అయిదొందలు మనీఆర్డర్ పంపాను. "నిరాకరింపబడిందనే" రిమార్కుతో తిరిగి వచ్చేసింది. మా అమ్మకి కూడా నేను చేసినవని నచ్చలేదని అర్థమయ్యింది. అందుకే అంటారు పెద్దలు "గడపదాటిన ఆడదీ... చిమిడిన అన్నం ఒక్కటే" అని. వాటిని ఎవ్వరూ బాగుచేయలేరు.

రెహమాన్‌కి నా శరీరం తప్ప... నాతో అవసరంలేదు. నా ఆలోచనలతో పనిలేదు. అతనికి కోరిక కలిగిందంటే... కాళ్లూ చేతులు కట్టయినా సరే తీర్చుకుంటాడు. ఎదురు తిరిగితే సిగరెట్‌తో కాలుస్తాడు. పైశాచిక ఆనందం పొందుతాడు. మామ్మమాత్రం నా మొండితనంతో నేనే అతడిని వెర్రెక్కిస్తున్నానంటుంది. అతడు ఎన్ని కొట్టినా లెక్క ఉండదు. కానీ సిగరెట్టుతో కాలిస్తే భరించలేను. గోలగా అరుస్తాను. చివరికి లొంగిపోతాను. విజయగర్వంతో నవ్వే అతడిని చూస్తే కోపం వస్తోంది. కానీ ఏమీ చెయ్యలేని నిస్సహాయత. ఆయనకి నామీద ప్రేమలేక పోలేదు. కానీ అనుమానం కూడా ఎక్కువే. ఊరినుండి రాగానే నన్ను చూడకుండా ఉండలేడు. ఏ విషయంలోనూ తక్కువ చేయడు.

అతను బాగా ఉన్నప్పుడు ఒకసారి ఏడ్చాను, పిల్లల్ని చూడాలని ఉందని."వాళ్లు నిన్ను రానిస్తారా? రానిస్తే వెళ్లు నాకేం అభ్యంతరం?" అని అన్నాడు. పిల్లలూ, ఆయన... నేను చేసిన ద్రోహానికి నన్ను రానిస్తారా! అన్న సందేహం నాకూ కలిగేది. పిల్లలు నన్ను అసహ్యించుకొంటే నేను భరించగలనా? రఘు నన్ను గెంటేస్తాడేమో! నామనసు నన్ను చిత్రవధ చేసేది.

"ఓసారి రాజమండ్రి వెళ్తోంటే రెహమాన్‌ని బతిమాలాను. కనీసం వాళ్ల యోగక్షేమాలు తెలుసుకోమని. అతను ఏకళనున్నాడో సరేనన్నాడు. తిరిగి వచ్చి రఘుకి పెళ్లయ్యిందని... ఆ వచ్చినామె పిల్లలను జాగ్రత్తగా చూస్తోందని చెప్పాడు. ఆయన విషయం అడిగాను. "ఏం! పాతమొగుడిమీద ప్రేమ ఒలికిపోతుందా?" అని హేళనగా నవ్వాడు. ఒక్కోసారి కోపంతో తను రాక పోయినా, నేను పట్టించుకోనని అతని కోపం. అందుకే అలా అన్నాడు.

మళ్లీ తనే చెప్పాడు, "నీ దయవల్ల ఆయన

కి పక్షవాతం వచ్చిందట. ఉద్యోగం మానేశారట. ప్రస్తుతం రఘు ఉద్యోగం చేస్తూ కుటుంబాన్ని పోషిస్తున్నాడు''

నా మనసు ఆయన అనారోగ్యానికి ఎంతో విలవిలలాడింది. దీని కంతటికీ కారణం నేనే. ఈ విషయాన్ని నా మనసు క్షణక్షణం గుర్తుచేస్తోంది. నిజంగా ఆయన దైవస్వరూపుడు. ఎన్ని విషయాల్లోనో నన్ను క్షమించారు.

''రఘుని నేనెంతో హీనంగా చూశాను. దొంగతనం అంటగట్టాను. ఒక్కనాడూ ప్రేమగా అన్నం పెట్టలేదు... తలంటుపోయలేదు... కనీసం ప్రేమగా మాట్లాడలేదు. చివరికి అతను చదువుకోసం ఎన్నో కష్టాలు పడుతుంటే పట్టనట్లు ఉన్నాను. ఎప్పుడూ నేను, నా కోరికలు తప్ప ఎవ్వరినీ ఆత్మీయంగా చూడలేదు. చివరికి ఆ రఘుయే నా భర్తకి, నా బిడ్డలకు గతి అయ్యాడు. ఆధారం అయ్యాడు. నాకళ్లు తెరచుకొన్నట్లు అయ్యింది.

''ఆయన నన్నెంతో ప్రేమగా చూశారు. ఎంతో గౌరవించారు. ఏ కోరికలు కోరినా తీర్చారు. ఇంకా నాలో అసంతృప్తే. గృహిణికి సంతృప్తి కావాలి. ఎండమావుల వెంట పరిగెడితే చివరికి మిగిలేది శూన్యమే. ఆయన ఎన్నిసార్లు చెప్పారూ. ''దైవధ్యానం చేసుకో సుందరీ! మనసుకు నిగ్రహం ఉంటుంది. ప్రశాంతత ఏర్పడుతుంది. మంచి మార్గం, మంచి మాట మనల్ని నడిపిస్తాయి. మానవులకు ధర్మార్థ కామమోక్షములని చతుర్విధ పురుషార్థములను చెప్పాయి వేదములు.ధర్మమునే మొదట చెప్పారు. దానికే ప్రాధాన్యత ఇచ్చారు. దాని ద్వారా అర్థము, కామము, మోక్షము పొందమన్నారు. కనుక నేలవిడచి సాము చేయరాదు'' అని బోధించేవారు. ''అబ్బా! ఈ మేష్టార్లని పెళ్లి చేసుకొంటే ఏ విషయమైనా పాఠం చెప్పినట్లు చెపుతారు'' అని విసుక్కొనేదాన్ని.

ఆయన చిరునవ్వుతో- ''నువ్వు ఏమీ తెలియని దానివి. అందుకే నీకు చెప్పటం నాధర్మం. భార్యని మంచి త్రోవలో నడిపించటం భర్త విధి. లక్ష్మీ సహస్రార్చన చేసుకో రోజూ... స్త్రీలకు సౌభాగ్యం సిద్ధిస్తుంది'' అని చెప్పేవారు. ఒక్కోసారి ఇంట్లో పరిస్థితులకు తాను విసుక్కొంటే... ఆ దారిద్ర్యానికి అసహ్యపడిపోతే, నొచ్చుకొనేవారు. ''చూడు సుందరీ! నది దగ్గరకు మనం ఏ పాత్ర తీసుకొని వెళితే, దానితోనే మనం నీళ్లు పొందగలం. మనం చిన్నపాత్ర తీసుకొని వెళితే, కొంచెం నీరే వస్తుంది. పెద్దపాత్ర తీసుకొని వెళితే, ఎక్కువ నీరు వస్తుంది. అలాంటిదే పూర్వజన్మ సుకృతమనేది. మనం చేసుకొనే సుకృత నిష్పత్తిలోనే ఈ జన్మలో దాని ఫలితాన్ని పొందుతాం. కిందటి జన్మలో చేసుకొన్న పాప, పుణ్యా సంచితార్థాలను బట్టి సుఖదుఃఖాలు మనల్ని వెంటాడతాయి. ''నీవు చేసుకొన్న పుణ్యమే నిన్ను కాచునని'' పెద్దలు ఊరికే అనలేదు. మనం చేసుకొన్న పుణ్యం తక్కువైతే ఎక్కువ ఫలం ఎంత కోరుకున్నారాదు'' అని నచ్చచెప్పేవారు.

సంస్కారంలో ఆయన ముందు నేనెంత? నా చెల్లెలు వేరే కులంవానిని పెళ్లిచేసుకొని వెళ్లిపోయింది. అది నాకు ఉత్తరం వ్రాస్తే నేను జవాబు వ్రాయలేదు. ఆయన దెబ్బలాడేరు ''మనమలను వాళ్ల బలహీనతలను క్షమించాలి సుందరీ! చిన్న పిల్ల- తెలియక చేసినదానికి మనం శిక్షించకూడదు. తెలియక పాపని నిప్పులో చెయ్యిపెడితే నీవు వదిలేయగలవా? దగ్గరకు తీసుకోవా? ఓదార్చవా? ఆ బొబ్బలకు మందు పూయవా? ఇదీ అంతేను మనుమలు తెలియక చేసినదానికి మనం దూరం చేసుకోరాదు'' అని చెప్పి నా చేత దానికి జవాబు వ్రాయించారు.

''అంతటి ఉన్నతుని, సంస్కారవంతుని భర్తగా పొందానంటే... ఏ జన్మలో చేసుకొన్న అణువంత పుణ్యామో! ఆయనతో తనను ముడివేసి... నాలుగునాళ్లు కాపురం చేయనిచ్చింది. నేను చేసుకొన్న పాపమే ఆయననుండి నన్ను దూరం చేసింది. ఈ విధమైన జీవితాన్ని యిచ్చింది. లేకపోతే పుణ్యాత్ముడైన ఆయనెక్కడ? నేనెక్కడ? నక్కకు... నాకలోకానికి ఉన్నంతతేడా ఉంది. ఆయన అన్నట్లు గత జన్మలో ఆయన కొంచెం పాపం చేసికొని ఉంటారు. లేకపోతే నాలాంటి దాన్ని భార్యగా పొందేవారుకారు. ఆయన వ్యక్తిత్వం, ఏ విషయాన్నైనా లోతుగా ఆలోచించే మేధస్సు నేను

ఎందుకు గుర్తించలేకపోయాను? ఏ గర్వపు పొర నా కళ్లను కప్పేసింది? ఆయన చూపించిన మంచి త్రోవలో నడవనీకుండా నన్ను పెడత్రోవపట్టించింది?

ఏం దురదృష్టం. ముత్యాలాంటి పిల్లలు... కన్నకొడుకుకన్నా మిన్నగా ప్రేమించే రఘు... కష్టమైనా నేనిష్టపడే కోర్కెలు తీర్చే భర్త... అటువంటి జీవితాన్ని ఏ దౌర్భాగ్యపు క్షణాలలో దూరం చేసుకొన్నానో! ఆ యింటికి నేను మాయని మచ్చతెచ్చాను. తల్లిగా పిల్లల ఆలనా... పాలనా చూడవలసిన నేను... తెలిసీ తెలియని వయస్సులోనున్న వాళ్లను నిర్దయగా వదిలేసాను.

ధనం మీది వ్యామోహం... మితిమీరిన కామం నన్ను నీతి మార్గం నుండి దూరం చేశాయి. నేనెంత దౌర్భాగ్యురాల్ని... ఇంకా నేనెలా జీవించ గలుగుతున్నాను? ఇప్పుడు పశ్చాత్తాపంతో నా మనసు కుమిలిపోతోంది. పిల్లలకోసం ఆరాటంతో అలమటిస్తోంది.

నాలోని ఈ మార్పు రెహమాన్‌కు రుచించటంలేదు. "ఏమిటి పెద్ద భక్తురాలిలాగ పూజలు మొదలెట్టావు? ఇంకేం కోరికలు మిగిలిపోయాయి. ఆ దేవుడు తీర్చడానికి?" అని ఎగతాళిగా నవ్వాడు. నేను ఎదురు జవాబు చెప్పేదాన్ని కాదు. నేనుండే వీధిలోని పిల్లలు మా యింటి ముందు నుండే స్కూలుకు వెళ్లాలి. వాళ్లు స్కూలుకి వెళ్లి వచ్చే టైములలో విధిగా వీధి గుమ్మంలో నుంచొని చూడడం అలవాటు చేసుకొన్నాను. ఆ పిల్లలలో నా కళ్లకి నా చిన్నారి పిల్లలు కనిపించేవారు. ఎదురింటిలో ఉన్న స్టూడెంట్లు నన్ను రెప్పవేయకుండా గమనిస్తున్నారన్న విషయం నాకు తెలియదు. ఒక రోజు ఆనందంతో పిల్లల్ని గమనిస్తున్న నన్ను... తమకంతో తదేకంగా చూస్తున్న స్టూడెంట్లును రెహమాన్ గమనించాడు. అసలు ఎంత సేపటినుండి వాళ్లు నన్నలా చూస్తున్నారో నాకు తెలియదు. అప్పుడే ఓ కాగితం ఉండనేనున్న గేటువైపు పడడంతో, అది రెహమాన్ చేతికి చిక్కడంతో అసలు యుద్ధం ప్రారంభమయ్యింది.

"నువ్వు కామ పిశాచానివి... నీకు ఒక భర్తపొత్తుచాలదు" అంటూ జుత్తు పుచ్చుకొని ఇంట్లోకి బరబరా ఈడ్చుకెళ్లాడు. "చెప్పు! వాళ్లకి నీకు మధ్య ఎన్నాళ్ల నుండి యిటువంటి సంబంధం? ఎంత చనువు మీ మధ్యలేకపోతే ఉత్తరాల వరకూ వస్తుంది గ్రంధం?" అని జవాబుకు కూడా చూడకుండా గొడ్డును బాదినట్లు కొట్టడం ప్రారంభించాడు.

"నన్ను నమ్ము రెహమాన్! వాళ్లెవరో నిజంగా నాకు తెలియదు. బడికి వచ్చిపోయే పిల్లల్లో... నా చిన్నారులు కన్పిస్తోంటే వాళ్లను చూసి తృప్తి పొందుతున్నాను. నా ముగ్గురి పిల్లల మీద ప్రమాణంచేసి చెప్తున్నాను. ఏ తల్లయినా తనపిల్లల మీద అబద్ధపు ప్రమాణం చేస్తుందా?" అని ఎంత నచ్చచెప్పినా అతడు వినలేదు.

"నీకు పిల్లల మీద ప్రేమా? అసలు నీవు ఆడదానివేనా? ప్రేమ, జాలి, సానుభూతి, దయ అనే గుణాలు నీకెక్కడివే? నీవాళ్లందర్నీ వదిలేసి నాతో లేచిపోయి వచ్చినప్పుడే నువ్వేమిటో తెలిసిపోయింది. నీకు వంటినిండా పచ్చి కామం తప్ప మరేమీ లేదే!" అంటూ గొడ్డును బాదినట్లు బాదాడు. కనిపించిన చోటల్లా వాతలు పెట్టాడు. అతను పెట్టిన హింసలకు, రెండు రోజుల వరకు పక్కమీదనుండి లేవలేకపోయాను.

రెండో రోజు సాయంకాలం మా యింటికి ఒకామె వచ్చింది. మంచం మీదనుండి బలవంతంగా లేవబోతే వారించింది. మామ్మ వలన ఆమే రజియా అని తెలిసింది. నిర్మలమైన చిరునవ్వు, తెల్లని శరీరచ్ఛాయ స్నేహపూరితమైన చూపులు... ఆమెను చూచేసరికి నాకు గౌరవ భావం కలిగింది.

"మీరు లేవకండి! ఆయన వట్టిమూర్ఖుడు... అనుమానం మనిషి... మిమ్మల్ని చావకొట్టి వదిలిపెట్టారు. నా మొహం చూసి ఆయనను క్షమించండి. ఆయన ప్రవర్తనకి ద్వేషం పెంచుకోకండి. మీరు ఉసూరుమంటే... అది నా బిడ్డల్ని కట్టికుదుపుతుంది. నా సౌభాగ్యాన్ని హరిస్తుంది. మీరు మమ్మల్ని క్షమించండి" అంటూ కళ్లనీళ్లతో నా చేతులు పట్టుకొంది.

అంత బాధలోనూ... ఆమె విజ్ఞతకు... పాపపుణ్యాల విచక్షణకు నేను విచలితురాలనయ్యాను. "లేదులెండి... నేను తప్పు చేశాను...





దాని ఫలితాన్నే అనుభవిస్తున్నాను. గుణవంతుడైన భర్తని, ముద్దులు మూటగట్టే పిల్లల్ని... తుచ్ఛమైన కోరికలను తీర్చుకోడానికి వదిలేసి... ఎండమావుల వెంట ప్రయాణం చేశాను. మానసిక దౌర్బల్యానికి దాసురాలినైపోయాను. మావారి యందుచేసిన ద్రోహం, అవమానం తనకి కూడా చేస్తానేమోనని రెహమాన్ అనుమానం. అతని ప్రవర్తన వల్లనే నేను గతంలో చేసిన తప్పు తెలుసుకొన్నాను. నేను జీవితంలో ఏమిటి పోగొట్టు కొన్నానో అర్థమయ్యింది. నా పాపానికి నిష్కృతిలేదు. ఈ పశ్చాత్తాపంతో నేను దగ్ధమై... పునీతురాలనైతే చాలు" అంటూ కళ్ళు తుడుచుకొన్నాను.

"నిండింట్లో కన్నీరుపెట్టకూడదు. అది మీకు... మాకు కూడా మంచిదికాదు. మీ బిడ్డల గూర్చి నేను కనుక్కొంటాను. మీ అక్కగా నన్ను భావించండి! ఒంటరిదాన్నని ఎన్నడూ అనుకోవద్దు. నేను, నా పిల్లలు నీ వాళ్ళం. ఏం కావలిసినా అడుగు. నీ బిడ్డలని చూడాలని ఉంటే తప్పక వెళ్లి చూసిరా నేను వారికి చెవుతాను. ఈ ప్రపంచంలో తల్లీ పిల్లల్ని వేరుచేసే శక్తి ఎవ్వరికీ లేదు. తప్పక మీ వాళ్లను చూడవచ్చునంది" రజియా. ఆమె సహానానికి... విజ్ఞతకు నేను మనస్సులోనే ధన్యవాదాలు చెప్పాను.

కాస్సేపు నావద్ద కూర్చొని... కొంత డబ్బు నా చేతిలో పెట్టింది. అవసరమైతే దేనికైనా మామ్మచేత కబురంపమని చెప్పి వెళ్లిపోయింది. ఇది కలా! నిజమా! భర్త ఉంచుకొన్న ఆడదానిపై అంతటి ప్రేమ, సానుభూతి ఎవ్వరైనా చూపగలరా? ఆమె వెళ్లినవైపే నిశ్చేష్టురాలనై చూస్తూండిపోయాను. అందుకే రెహమాన్‌కు ఆమె అంటే గౌరవం. ఆవిడ మాటంటే ప్రాణం యిస్తాడు. ఇంతటి ఉన్నత విలువలు గల స్త్రీని ఏ భర్త ఆదరించడు? ఏ భర్త గౌరవించడు? ఆవిడ చెప్పే బోధనలవల్లే రెహమాన్ తప్పుచేసినా దిద్దుకొంటాడనిపించింది. ఎంతటి విశాలహృదయురాలు. భర్తను... అతని ప్రవర్తనను ఏవగించుకోకుండా... అతనిని సాధించకుండా... నమ్కరించుకోడానికి ప్రయత్నిస్తోంది. ఆమె తనకిచ్చిన ధైర్యంతోనే పిల్లలని చూడాలని మాటిమాటికి అన్నిస్తోంది. ఎంతటి గొప్ప స్త్రీమూర్తి ఆమె!

"రెహమాన్ వచ్చి, తగిలిన దెబ్బలు చూసి బాధపడ్డాడు. "నువ్వు మళ్లీ నన్ను విడిచి ఎవరితోనైనా వెళ్లిపోతావేమోనని నా భయం. అప్పుడప్పుడు పిచ్చివాడిలాగ, నిన్ను కొడుతున్నాను. నువ్వు అనుక్షణం నీ పిల్లలకోసం... భర్తకోసం అలమటిస్తుంటే... నాకు కష్టంగా ఉంటుంది. కోపం పెరిగిపోతోంది. అందుకే ఆ కోపంలో నేనేం చేస్తున్నానో నాకు తెలియదు" అంటూ నన్ను దగ్గరకు తీసుకొన్నాడు.

నాలో నేను నవ్వుకొన్నాను. నా జీవితమేమిటో నాకే తెలియటంలేదు. ఒక్కటిమాత్రం నిజం... చనిపోయేలోపు వారిని చూడాలి. క్షమాభిక్ష వేడాలి. బిడ్డల్ని చూసి ఒక్కసారి అక్కున చేర్చుకోవాలి. ఎందరు ఈ విషయంలో ఛీకొట్టినా... అసహ్యించుకొన్నా నేను పట్టించుకోను అని నిర్ణయించుకొన్నాను. ఈ నా నిర్ణయానికి తిరుగులేదు...



ఆవిడ డైరీ చదివిన రఘు, శాంతలకు కళ్లు కాల్వలయ్యాయి. ఆవిడ పడే తపనని తాము అర్థంచేసుకోలేకపోయారు. పిల్లలమీద ఆమె పెంచుకొన్న మమకారం... తమకు బోధపడలేదు.

ఆమెను ఇంటికి రానివ్వకుండా నిరోధించబోయాడు తను. నిజంగా ఒక మహాపాపంనుండి తనను తప్పించింది మాధవి. పిన్ని గురించి తీసుకోవలసిన ఏ నిర్ణయమైనా నాన్నగారిదే. ఏ శిక్ష విధించాల్సివచ్చినా ఆయనే విధించాలి. ఆయన ఉండగా ఆమెను నిరో

ధించే హక్కు తనకి ఉన్నదా? ఎంత అవివేకంగా తను ప్రవర్తించాడు. ఆమె తప్పుచేసింది... నిజమే... క్షణికావేశంలో చేసింది. కానీ పశ్చాత్తాపంతో ఆమె దహించుకుపోతుంది... ఆమె యిప్పుడు త్రికరణశుద్ధిగా నాన్నగారి పాదాలమీద పడి క్షమాపణ వేడుకోవాలనుకొంటోంది. ఆమెకు తను ఆ అవకాశం ఎందుకు యివ్వకూడదు?...'' పరిపరివిధాల ఆలోచనలు రఘు మస్తిష్కంలో మెదులుతున్నాయి.

శాంత మర్నాడు సుమతికి, మాధవికి ఆమె గురించి... ఆమె డైరీలో వ్రాసుకొన్న వివరాలు చెప్పింది. వారు సానుభూతిగా విన్నారు. ఆరోజు డాక్టరుగారిని అడిగి యింటికి వచ్చాడు రఘు. తండ్రికి నెమ్మదిగా విషయం చెప్పమన్నారు డాక్టరుగారు. ఒక్కసారి ఆవేశం కలిగేలా చెప్పవద్దన్నారు.

"నాన్నగారూ! మిమ్మల్ని ఒకటి అడగనా?'' అన్నాడు రఘు. మాధవి, శాంత బయట నుండి వారి సంభాషణ వింటున్నారు. ఆయనకు, హార్లిక్సు యిచ్చి, నెమ్మదిగా దిండ్లమీద ఆనుకొనేలా కూర్చోబెట్టాడు.

"అడుగు బాబూ! నీకు సందేహమెందుకు? సుమతి ఏ ఊరైనా వెళతానని అడిగిందా? లేక శాంత ఏదైనా కొనిపెట్టమందా? అంతా నీ యిష్టమే బాబూ! ఈ ఇంటి బాధ్యతను, ఏనాడో నీ చేతిలో పెట్టాను. ఇంకా నా అనుమతి ఎందుకు?'' అన్నారు రామారావుగారు.

"అదికాదు నాన్నగారూ! పిన్ని గూర్చి మీకు తెలుసుకోవాలని లేదా? ఆమె ఎలా ఉన్నదో చూసిరానా?'' అని అడిగాడు నెమ్మదిగా.

ఆయన ఒక్క క్షణం ఆశ్చర్యంగా చూశారు రఘువైపు. "అదేమిటి బాబూ! ఇన్నేళ్ల తర్వాత ఆమె ప్రసక్తి దేనికి? నీకేమైనా మతిపోయిందా? ఎక్కడో ఉన్న ఆవిడ గురించి ఎందుకూ ఆలోచిస్తున్నావు?'' అని బాధగా అడిగారు.

"అదికాదు నాన్నగారూ, మీకు ఒకవేళ చూడాలని ఉందేమోనని... అలా అయితే తీసుకు వద్దామని నా ఉద్దేశం. చూడాలని అనిపించడంలో తప్పులేదుకదా?'' అన్నాడు రఘు.

"రఘూ! నీకు పిన్నంటే ఎంత యిష్టం బాబూ! ఆవిడ ఎన్ని మాటలు అన్నా... ఎన్ని తప్పులు చేసినా నీవు పట్టించుకోలేదు. ఒక వేళ ఆమెను చూడాలని, నీ మనసులో ఉందా? ఉంటే వెళ్లు బాబూ! వెళ్లి తప్పక చూసిరా. నీ కోరికను కాదనే శక్తి నాకు లేదు'' అని అన్నారు.

రఘు హతాశుడైనట్లు మరి మాట్లాడలేదు. తను చెప్పాలనుకొన్నది ఒకటి, ఆయన అర్థం చేసికొన్నది వేరొకటి. భగవంతుని దయవలన ఆవిడ ప్రసక్తి రాగానే... ఆయన ఆవేశపడలేదు... యిది చాలు ప్రస్తుతానికి, మరోసారి మళ్లీ మాట్లాడవచ్చును అసలు విషయం అనుకొన్నాడు.

పావనికి అన్నగారి అవస్థ చూస్తే నవ్వు వచ్చింది. మరోపక్క కోపంగా ఉంది. తల్లి తిరిగి రావటమే ఆమెకు కోపంగా ఉంది. 'తప్పుచేసిన ఆవిడ మళ్లీ ఏ మొహం పెట్టుకొని వచ్చింది. తను చిందవందర చేసిన మా బతుకులను చూడటానికే వచ్చిందా? ఆవిడ తన సంతోషం, తన కోరికే ముఖ్యమనుకొని వెళ్లిపోయిందే! తమ కుటుంబం గురించికాని తండ్రి పరువు, ప్రతిష్ఠలను గురించికాని కొంచమైనా ఆలోచించిందా? ఆవిడ సృష్టించివెళ్లిన కల్లోలంనుండి యింకా పూర్తిగా తాము తేరుకోనేలేదు. మళ్లీ తమ జీవితాలలో కల్లోలం సృష్టించడానికి వచ్చింది'

అసలు తనవాళ్లకి కూడా బుద్ధిలేదు. తామంతా ఎన్ని బాధలు పడ్డారు. అన్నయ్య పైచదువులు చదువుకోలేకపోయాడు. చదువుమీద శ్రద్ధాసక్తులు కలవాడు కాబట్టి ప్రైవేటుగా ఎం.ఏ. కట్టి పాసయ్యాడు. హాయిగా 'నాకేం' అని తిరగవలసిన వయసులో... అందరి కుర్రాళ్లలా నిశ్చింతగా, చదువుకోవలసిన టైములో... ఎలా దేముడా అని అల్లాడిపోయాడు. చివరికి వాడి అదృష్టం బాగుండి మంచి భార్య లభించింది. అసలు బాధ్యతల ఒత్తిడికి తట్టుకోలేక... విధి వంచితులమైన తన చెల్లెళ్లపట్ల శ్రద్ధానురాగాలు తగ్గిపోతాయేమోనని, వివాహానికి సుముఖత చూపలేదు. ఎన్ని అవమానాలు... ఎంత దారిద్ర్యం అనుభవించాడు! ఇంటి పరిస్థితులవల్ల ఎప్పుడూ స్తబ్దత... గట్టిగా మాట్లాడటానికే తనకీ చెల్లెకీ





భయం. చెల్లెలైతే ఎప్పుడూ అమ్మకోసం ఏడ్చేది. దాన్ని ఊరుకోపెట్టడానికి ఎన్ని తంటాలు పడే వారు అన్నయ్యా, అక్క!

పెళ్లివాళ్లు వచ్చి నానా మాటలు అన్నారని అక్క చచ్చిపోతానని ఏడ్చింది. అన్నయ్యే దాన్ని ఎంత ఓదార్చాడు. ఎంత అల్లాడిపోయాడు. చిన్నప్పటినుండి మీతో కలిసి బతికాను... మీలో ఎవరైనా ఏ అఘాయిత్యానికైనా గురైతే నేను బతకగలనా... మీరు లేకపోతే నాకు దిక్కేది? అంటూ పరిపరివిధాల ఏడ్చాడే... అబ్బ! ఎన్ని బాధలు! ఎన్ని మానసిక గాయాలు! అన్నింటినీ గరళం మింగినట్లు అనుభవించామే!... యివి చాలకా? తగుదునమ్మా అని ఈవిడ వచ్చింది? యిప్పటికే ఈవిడ రాక అందరికీ తెలిసిపోయింది. రకరకాల ప్రశ్నలు వేస్తున్నారు. వీటన్నింటినీ ఎలా భరించడం? ఈ సమస్యను ఎలా ఛేదించడం?" పైకి చెప్పలేకపోయినా... తనలో తానే ప్రశ్నించుకొంటుంది పావని.

'అన్నట్లు... అమ్మ వచ్చిన విషయం అమ్మమ్మకు చెప్పాలి' అనుకొంది పావని. కాంతమ్మకు సుందరి చేసిన పని నచ్చలేదు. ఆవిడ ఎంత నోరు ఉన్నదైనా... ఎంత బుర్రలు మార్చినదైనా... కొంత సాంప్రదాయానికి కట్టుబడి ఉంటుంది. పిల్లలకు ఎలాగో ఒకలాగ పుస్తె ముడి వేయించాలనుకొంది తప్ప... యిలాంటి ప్రవర్తన హర్షించలేదు. రెండవ కూతురు తన ప్రమేయం లేకుండా వెళ్లిపోయి వేరే కులం వాణ్ని పెళ్లిచేసుకొంది. తెలిసినవాళ్లంతా ముఖంమీదే అనేయడంతో ఆవిడకు తలకొట్టినట్లయింది. రెండోది అంత పనిచేస్తుందని ఆమె ఊహించలేదు. మరోపక్క ఆడపెత్తనం తగ్గకపోతే యింట్లోనుండి వెళ్లిపోతానని భర్త బెదిరించడంతో ఆమె కోరలు తీసిన పాములాగ అయ్యింది. ఇరుగుపొరుగిళ్లకు షికార్లు వెళ్లడం కూడా మానేసింది. విషయం తెలిసినా అందరూ పదేపదే అడగటం... అదో కాలక్షేపం అవడం భరించలేక, యింటిపట్టునే ఉంటోంది. గోరుచుట్టుమీద రోకటి పోటులా సుందరి బరితెగించి చేసిన పనితో తిరిగి మనిషికాలేకపోయింది.





"ఏం రోగం వచ్చింది దానికి? మొగుడు ముసలివాడా? అంటే కాదే! మధ్యవయస్కుడే... ముద్దుమురిపాలు తీర్చలేదా? అంటే లేదే! ఆమె కోరడమే తడవు, ఎన్ని ఇబ్బందులు పడైనా ఆమె కోర్కె తీర్చేవాడే! ఎంత మంచివాడు! ఎవరి తప్పునైనా తన కడుపులో పెట్టుకొనేవాడే! తన కూతురు వాళ్లింట్లో బంగారం దొంగిలించి దొరికిపోతే, కిమ్మనలేదు... సరికదా 'చిన్నపిల్ల ఏదో తెలియని తనంలో బతుకుతెరువుకి పట్టుకెళ్లింది. మన పిల్ల చేసిన పనిని, మనం కడుపులో పెట్టుకోపోతే ఎలా?" అని సుందరి వద్ద సమర్థించి, నచ్చచెప్పారు. అటువంటి ఆయన్నీ... ముచ్చటగా ఉన్న ముగ్గురి పిల్లల్నీ వదలి, ఎంత కండకావరంతో వెళ్లిపోయింది?" అని కూతురి గురించి అనుకొనేది కాంతమ్మ.

మనవరాళ్లు తనని చూడటానికి వచ్చినప్పుడు తన బాధ వెళ్లబోసుకొనేది. సుందరి చేసిన పనికి మొహం చెల్లక రామారావుగారింటికి రావడమే మానుకొంది. వర్ధనమ్మగారు ఆవిడ యింటికి వచ్చి ఆవిడ పెంపకాన్ని... సుందరి విచ్చలవిడితనాన్ని తిట్టి... తిట్టి మరీ వెళ్లింది. "కూతురు చెడిన... మాత దోషము" అన్నట్లు యిది తన స్వయంకృతాపరాధమే. పిల్లల్ని అదుపులో ఉంచుకోలేకపోవడమే తన నేరం.

అందుకే తన పెంపకంమీద నమ్మకంలేక ముగ్గురి పిల్లల్ని పెంచే శక్తి లేక... రామారావుగారిమీదే తన మనమరాళ్లు బాధ్యత వదిలేసింది. ఎప్పుడో చూడాలని మనసు పీకినప్పుడు, వెళ్లి వాళ్ల చేతిలో తోచినది పెట్టి, తిరిగి వస్తుంది. అదైనా ఎప్పుడో! రామారావుగారి ఎదుట పడటానికి మొహం చెల్లదు, ధైర్యంచాలదు.

పావనిని చూచేసరికి కాంతమ్మకు కొండంత భయం కలిగింది. పిల్లలు మరీ ఎప్పుడో అవసరమైతేగాని రారు. రామారావుగారికి పక్షవాతం వచ్చినప్పుడు రఘు వచ్చి చెప్పి వెళ్లాడు. చిన్నవాడు ఆయన పరిస్థితికి భయపడుతున్నాడని, భార్యా, భర్తలిద్దరూ వెళ్లి ధైర్యంచెప్పి వచ్చారు. ఇప్పుడు పావనిని చూచేసరికి, ఏం కొంపమునిగిందా అని భయంభయంగా చూస్తోంది.

"ఏమిటమ్మమ్మా! దెయ్యం పట్టినట్లు ఆ

చూపేమిటి? నన్ను లోపలికి రానీయవా ఏంటి?'' అంటూ ఆమెను తోసుకొని లోనికి వచ్చింది.

"తల్లీ... అందరూ బాగున్నారా? నాన్నగారు ఆరోగ్యమేకదా?'' అంటూ ఆత్రుతగా అడిగింది. లోపలనుండి శర్మగారు కూడా వచ్చి పావనిని చూసి యోగక్షేమాలు అడిగారు.

"అందరూ బాగానే ఉన్నారు. మీరు అనవసరంగా కంగారు పడవద్దు. నేనే మిమ్మల్ని చూద్దామని వచ్చాను... మీతో ఒక పనిఉండి వచ్చాను'' అంటూ అసలు విషయం చెప్పింది పావని. సుందరి తిరిగి రావటం... జ్వరంతో బాధపడుతున్న విషయం... డాక్టరుగారు నెమ్మదిగా తండ్రికి విషయం చెప్పమన్న సంగతీ... అన్నీ పూసగుచ్చినట్లు చెప్పింది. వాళ్లిద్దరూ రెప్పవేయడం కూడా మరచిపోయి, విషయం విన్నారు.

మళ్లీ పావనే అంది- "మీరు మా యింటికి ఒకసారి రావాలి. ఆవిడకు జ్వరం తగ్గేవరకు మీ యింట్లో ఉంచుకోండి. మా నాన్నగారికి ఎలాగ విషయం చెప్పాలా అని అన్నయ్య తల బద్దలు కొట్టుకొంటున్నాడు. కనుక మీదగ్గర కొన్నాళ్లు ఉంచుకోండి'' అని.

"ఛీ... అది నాకు కూతురా! నాగుణాలు దానికి వచ్చి ఉంటే యింత అనర్థాన్ని సృష్టించేది కాదు. అహంకారంతో... అందం, ఆకర్షణ ఉన్నాయని తప్పుదారిలో నడిచింది. దేవుడిలాంటి భర్తని, ముత్యాల్లాంటి బిడ్డలనీ నట్టేట్లో ముంచి... ఎవడితోనో లేచిపోయింది. పుట్టినింటికీ మెట్టినింటికీ అపకీర్తి తెచ్చిపెట్టింది. అది ఏనాడు ఇల్లు విడిచి వెళ్లిందో ఆనాడే అదిచచ్చినట్లు లెక్క. దానిగురించి ఆరోజే స్నానం చేశాము. ఆ నీచురాలి మొహం చూడటానికి కూడా మాకు అసహ్యం'' అని శర్మగారు పావనితో చెప్పి, కాంతమ్మవైపు తిరిగి "ఎవరైనా దాన్ని చూడటానికి వెళ్లినా ఇక్కడికి తీసుకువచ్చినా... నా శవాన్ని చూస్తారు'' అంటూ కోపంగా వెళ్లిపోయారు. కాంతమ్మ మారుమాట్లాడలేకపోయింది.

"ఏం అమ్మమ్మా! అంతేనా! ఆవిడని మేమే భరించాలి. మా నాన్నగారి ఆరోగ్యం అంతంత మాత్రం... ఈ పరిస్థితులు తెలిస్తే ఏమౌతుందోనన్న భయంతో... అన్నయ్యావాళ్లకు చెప్పకుండా వచ్చినందుకు మంచి సమాధానమే లభించింది. పోనీలెండి, మేమే ఆ బాధలు పడతాం. ఎన్నో బాధలు అనుభవించాం. యిదోలెక్కా?'' అని నిష్ఠూరంగా అంది.

"మీరెందుకమ్మా! బాధపడటం? ఆ రెహమాన్ దగ్గరికే పొమ్మనండి. ఇంకా ఆదేవాలయంలో ఉంచడం ఎందుకు? దాని లాంటి పతిత ఉండవలసిన ఇల్లా అది? అతడితోనే స్వర్గమని వెళ్లింది కదా! అక్కడికే వెళ్లిపొమ్మనండి. మాలాగే అది చచ్చిపోయిందని మీరు అనుకోండి'' అంటూ హితవు చెప్పింది కాంతమ్మ, భర్త నిర్ణయంతో గత్యంతరంతోచక.

వాగ్వివాదం మరి చేయదలచక తిరిగి ఇంటికి వచ్చేసింది పావని. "ఎక్కడికి వెళ్లావని'' నిలదీసింది సుమతి పావనిని. మాధవి రెప్పవేయకుండా చూస్తోంది పావనిని. "చెప్పు పావనీ! నీవు అంతసీరియస్‌గా వెళ్లావంటే ఏదో ఒక పనిచేయడానికనే నా అనుమానం. కొంప తీసి కాకినాడ వాళ్లకు ఆవిడ విషయం ఫోను చేసి చెప్పివచ్చావా? ఏం... అందుకే కదా! నీవు వెళ్లింది'' అంటూ గట్టిగా అడిగింది సుమతి.

ఏనాడూ వదిన అంతగట్టిగా మాట్లాడటంగానీ... నిలదీయడం గాని... పావని అనుభవంలో లేదు. అందుకే మాట్లాడకుండా అలా వినుపోతూ... నిలబడింది.

"చెప్పు పావనీ! చేసింది చెప్పడానికి, భయమెందుకు? చెప్పు, నాకు తెలుసు, కాకినాడ ఫోను చెయ్యడానికేగా వెళ్లావు'' అంటూ మళ్లీ అడిగింది అదే నిజమన్నట్లు.

"కాదు వదినా! కాదు... నేను అంత అవివేకినికాను. కాకినాడ నేనెందుకు ఫోను చేస్తాను. కాకపోతే అమ్మమ్మగారింటికి వెళ్లి విషయం చెప్పాను. ఆవిడ జ్వరం తగ్గేవరకు... వాళ్లవద్ద ఆమెను ఉంచుకోమని అడిగాను. ఆవిడకు నువ్వు... కాంతక్క... మాధవి వదిన అందరూ సేవలు చెయ్యవలసివస్తోంది. మరో ప్రక్క అన్నయ్య నాన్నగారికి విషయం చెప్పలేక సతమతమౌతున్నాడు. మధ్యలో ఆవిడ జ్వరం... అందుకే అందాక వాళ్లింటికి తీసుకెళ్లమని అడిగాను'' అని చెప్పింది నెమ్మదిగా.

"వాళ్లేమన్నారు?" అని అడిగింది మాధవి. తాతయ్య అభిప్రాయం, అమ్మమ్మ నిస్సహాయత తు.చ. తప్పకుండా చెప్పింది పావని.

"చూడమ్మా! పావనీ! నీవు చిన్నపిల్లవి... మీ నాన్నగారు, మీ అన్నగారు ఉన్నారు. ఏ మంచి చెడయినా వాళ్లు ఆలోచించాలి. నీకివన్నీ ఎందుకు? మరోవిషయం... చక్రధరం అంకుల్, అవసరమైతే ఆవిడను వాళ్లింటికి పంపమన్నారు. అయినా అన్నయ్య పంపారా? ఒక విషయం నువ్వు బాగా గుర్తుంచుకో. ఇది మన ఇంటి విషయం. మన సమస్యని మనమే పరిష్కరించుకోవాలి. తెలిసో తెలియకో మనం రోటిలో తలదూరిస్తే మనమే సమయస్ఫూర్తితో బయటకు తీసుకోవాలిగాని, ఎవరైనా ఏం చేయగలరు? ఇతరులైతే తీయకపోగా మరింత ఇరికిస్తారు. మీ అన్నయ్య ఆవిడను పంపాలనుకొంటే... జ్వరమైనా, ఏమైనా వెంటనే పంపేసేవారు. ఈ ఇంటితో ఆవిడకు కొంత బంధం ఉంది. ఇంటికి వచ్చిన అపరిచిత వ్యక్తి అనారోగ్యంతో ఉంటేనే మనం తరిమికొట్టలేమే! అలాంటిది... జ్వరంతో తీరని వేదనతో... ఉన్న ఆమెను బయటకు పంపగలమా!? అది మనకు గౌరవమా? ప్రతీ సమస్యకు ఒక పరిష్కారం ఉంటుంది. మనం కాస్త ఓర్పు వహించాలి అన్నీ చక్కబడతాయి. దయచేసి ఈ సమస్యను మరింత జటిలం చేయవద్దు" అని హితవు చెప్పింది సుమతి. ఆమెకు తెలిస్తే అభిమానంతో చెప్పకుండా వెళ్లిపోతుందేమోనని అనుమానం వ్యక్తం చేసింది.

"ఆవిడకు అభిమానమా! సిగ్గు, శరం, అభిమానం అలాంటి మాటలు ఆవిడ నిఘంటువులోనేలేవు. వదినా! అవే ఉంటే ఆవిడ ఈ ఇల్లు దాటే ఉండేది కాదు... మళ్లీ సిగ్గులేకుండా వచ్చేదీ కాదు. ఏ మొహం పెట్టుకొని వచ్చింది... మా మీద ప్రేమ కారిపోతున్నట్లు? ఈ వయసు మళ్ళిన టైములో ఎవరు చూస్తారని ఇక్కడే తిష్టవేయడానికి వచ్చింది" అంది పావని రోషంతో.

"పావనీ! నీవు చిన్నదానివి. నీకన్నా పెద్దవాళ్లున్నారు. వాళ్లు ఈ విషయాలు చూసుకొంటారు. మంచైనా, చెడైనా వాళ్లేం చెపితే మనం అదే ఆచరించాలి. దీని మీద యింక వాదనలు వద్దు. వెళ్లి నీ పనులు చూసుకో" అంటూ గట్టిగా హెచ్చరించింది సుమతి.

రామారావుగారివద్ద మధ్యాహ్నం విశ్రాంతిగా కూర్చొంది మాధవి. "మామయ్యా! మీ ఒంట్లో ఏ చిరాకులేకుండా ఉన్నారా?" అని అడిగింది.

"ఏం తల్లీ! ఒంట్లో బాగానే ఉంది. ఏ చీకాకు లేదు. ఉన్న బాధలు అప్పుడే తగ్గవు. ఒక్కసారే చనిపోయాక తగ్గుతాయి. అప్పుడు ఈ ప్రాణం ఎంత హాయిగా ఉంటుందో తెలుసా?" అని అన్నారు.

"ఛ,ఛ... అవేం మాటలు మామయ్యా! బాగా నీరసంగా ఉందేమోనని అడిగాను. నాకు కొన్ని సందేహాలున్నాయి మీతో మాట్లాడాలని అడిగాను. అంతే... కానీ మీరలా బాధపడితే..." అర్థోక్తిలో ఆగిపోయింది.

"అడుగమ్మా! ఫరవాలేదు" అన్నారు రామారావుగారు.

"ఏంలేదు మామయ్యా! ఎవరైనా తెలిసో తెలియకో తప్పుచేశారనుకోండి. వాళ్లు తమతప్పు తెలుసుకొని పశ్చాత్తాపంతో ఉన్నారనుకోండి. వాళ్లను మనం క్షమించాలా? వద్దా?? వాళ్లు చేసిన ద్రోహాన్ని మనసులో ఉంచుకొని, తిరస్కరించాలా? ఈ సమస్య తెలిస్తే నేనీవిషయంలో ఒక నిర్ణయం తీసుకోవాలి" అని అడిగింది. వాళ్లిద్దరి సంభాషణల పరమార్థం తెలిసిన రఘు యథాలాపంగా వచ్చినట్లు వచ్చి తండ్రివద్ద కూర్చున్నాడు.

"చూడమ్మా! తప్పులు చేయనివారు ఈ పుడమి మీద లేరు. సకల సద్గుణ సంపన్నుడు... భగవంతుడు ఒక్కడే. ఆయనే పరిపూర్ణ మానవుడు. పురుషులలో... ఉత్తమ పురుషుడిని తానని ఆయనే గీతలో చెప్పుకొన్నాడు. ఎవరినైనా శిక్షించినా, క్షమించినా ఆయనకే అర్హత ఉంటుంది. కేవలం మనం నిమిత్తమాత్రులమమ్మా! అనంతమైన విశ్వంలో మనం ఏపాటి? మానవుడు ఎన్ని గొప్పపనులనైనా చేయవచ్చు. కానీ అరిషడ్వర్గ బంధనాలను తెంచుకోలేడమ్మా. ఈ కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను జయించలేడమ్మా. వాటిని జయించగలిగినవాడే నిజమైన మానవుడు.




తప్పుకు ఎప్పుడూ శిక్ష ఉంటుంది. భగవంతుడే ఆ తప్పు చేసినవాళ్లను, వివిధ రీతులలో శిక్షిస్తాడు. మనం ఎవరమమ్మా? మళ్లీ వాళ్లను శిక్షించడానికి? 'ప్రేమ' మహోన్నతమైనది 'క్షమ' మహోత్కృష్టమైనది. ఎదుటివారిని మనం ప్రేమిస్తే... వాళ్లు తప్పుచేసినచో క్షమించగలగాలి. అప్పుడే మనం వాళ్లను నిజంగా ప్రేమించినట్లు. విశాలమైన మనస్సు అవగాహన ఉంటే... శిక్షించడం వలన మార్పురాదు. మంచితనంతో మలచుకొంటే మార్పువస్తుందని మనం గ్రహించగలం.

ఈ ప్రపంచంలో తెలిసో తెలియకో అందరూ తప్పులు చేస్తారు. ధనంవలనో, కామంవలనో, అహంకారం వలనో తప్పుదారిలో నడుస్తారు. ఉప్పుకారం తింటున్న శరీరాలు కదా! ఆవేశంలో అనర్థాలు జరుగుతాయి. వాటిని మనం సహించగలగాలి... క్షమించగలగాలి'' అని చెప్పారు నెమ్మదిగా.

''నాన్నగారూ! ఒక సందేహం. తప్పులు చేస్తున్నవారి నందరినీ క్షమిస్తూ కూర్చొంటే వారు అది అలుసుగా తీసుకోరా? ప్రభుత్వమైనా... న్యాయస్థానాలైనా... తప్పులుచేసినవారిని శిక్షిస్తున్నారా? క్షమిస్తున్నారా? ''క్షమించువారిగని చాలమివెట్టుదురు'' అన్నట్లు క్షమించేవారిని చేతకాని వారిగా అలుసుగా చూస్తారు కదా?'' అని ఆవేశంగా అడిగింది పావని.

''పావనీ! నీ ప్రశ్నలోకూడా సబబు ఉందమ్మా! న్యాయస్థానాలు కూడా నేరస్థులలో మానసిక మార్పులు తేవాలనే జైలు శిక్షలు విధిస్తున్నాయి. ఆ శిక్షలో అంతరార్థం ఏమిటి? శిక్షాకాలంలో వాళ్లకు నియమబద్ధ జీవితమేర్పరచి సాత్వికాహారం యిచ్చి ఆవేశకావేషాలకు ఆలవాలమైన సంఘజీవనం నుండి దూరంగా ఉంచి... మానసికమైన మార్పు తేవటమే దాని పరమార్థం. శిక్షద్వారా మానసిక చైతన్యాన్ని తీసుకురావడానికి అహర్నిశలు కృషి చేస్తోందన్నమాట ప్రభుత్వం'' అని పావనికి చెప్పారు.

''అయితే తప్పుచేసిన వాళ్లని క్షమించి మార్పుతేవడమే మంచిదంటారా? మరి తప్పు చేసిన దుర్యోధనుడినిగాని, దుశ్శాసనుడిని గాని పాండవులు క్షమించారా? శ్రీకృష్ణుడంతటి వాడే శిశుపాలుడిని క్షమించలేదు... శిక్షించాడని... మనపంచమవేదమైన భారతం చెప్తోందికాదా! మరి ఈ విషయాలు ఎందుకు గ్రహించరు? అని అడిగింది పావని కోపంగా.

''ఆవేశం వద్దు తల్లీ! ఆలోచన చెయ్యి. శ్రీకృష్ణుడు భగవంతుడు. శిక్షించినా క్షమించినా ఆయన సమర్థుడు. అక్కడికే శిశుపాలుని నూరు తప్పులు క్షమించాడు. పాండవులు కూడా దుర్యోధనుని ఎన్నో తప్పులను క్షమించారు. యుద్ధ భూమిలో కూడా మోహావేశ బంధనుడైన అర్జునుడు... అస్త్ర సన్యాసం చెయ్యలేదా? అప్పుడేకదా! శ్రీకృష్ణ భగవానుడు గీతనుద్భోదించింది. అందుకే కదా! భారతం పంచమవేదం అయ్యింది. గీతలో ఏమని ప్రవచించారు? చంపేనీవెవరు? చచ్చే వాళ్లెవరు? మీరంతా నిమిత్తమాత్రులు. సర్వచరాచర సృష్టి స్థితి-లయ కారకుడను నేనే... సర్వజగత్తూ నేనే. పురుషులలో ఉత్తమ పురుషుడను నేనే... స్వార్థానికి ధర్మమును ఆహుతిచేసి... మదమత్తులైన మానవకోటిని నాశనం చెయ్యడానికి సంకల్పించాను. ఈ రణయజ్ఞాన్ని ఎవ్వరూ ఆపలేరు. అందుచే ఆయుధం ధరించి నన్నే స్మరించి... ఈ యుద్ధాన్ని విద్యుక్త ధర్మంగా స్వీకరించి చెయ్యమన్నాడు. దాని పర్యవసానమే దుర్యోధనాదులకు మరణశిక్ష. అంతేగాని మరేమీకాదు. మనం మానవ మాత్రులం. మనకు క్రోధం, పగ ఉండకూడదమ్మా!'' అంటూ వాత్సల్యంగా ఆమెవైపు చూస్తూ అన్నారు.

''స్వార్థానికి ధర్మం ఆహుతి అయినప్పుడు... శిక్ష అనుభవింపక తప్పదుకదా అధర్మ భ్రష్టులకు. మరి క్షమిస్తే దాన్ని వారు అర్థం చేసుకోరు సరికదా! క్షమించేవారిని చులకనగా చూస్తారు. అది కూడా మనం గ్రహించాలి'' అని ఉత్సాహంగా అంది తండ్రిని తన త్రోవలోకి తీసుకురావచ్చని.

''చూడమ్మా! పావనీ! జీవితం నీటి బుడగ వంటిది. అశాశ్వతమైంది. అలాంటి జీవితాన్ని మంచి పనులకు వినియోగించి కాలాన్ని సద్వినియోగంచేసుకోవాలి. పగ, కోపం, ద్వేషం మానవుని పతన మార్గంలోకి నడిపిస్తాయి. వాటి వలన మానవునకు శాంతి, తృప్తి లభించవు. 'ప్రేమ' దైవస్వరూపం. ప్రేమ

మానవులను పునీతులనుచేస్తుంది. 'క్షమ' ఎదుటి వారిలో మంచిని మేలుకొలుపుతుంది. ఉదాత్తమైన భావాలు కలవారే ఎదుటివారి తప్పులను క్షమించగలరు. ఎదుటివారు మనలోని ఈ గుణాన్ని మన చేతకానితనంగా భావించినా మనకు నష్టంలేదు. కాలగతిలో వాళ్లే నెమ్మదిగా తెలుసుకొంటారు తాము పొరపడినట్లు. ఎంతో సంస్కారం ఉంటేగాని 'త్యాగం', 'క్షమ' గుణాలు మానవులకు అలవడవు తల్లీ!'' అన్నారు ప్రేమగా ఆమె తల నిమురుతూ.

ఆయనయొక్క సహృదయతకు పిల్లలంతా ముగ్ధులయ్యారు. రఘుకి తండ్రి అంటే బాగా అర్థమయ్యింది ఆ క్షణంలో. ఆయన శిక్షణలో అంతకాలం పెరిగినా తనలో కోపావేశాలు మిగిలి ఉన్నందుకు సిగ్గుపడ్డాడు. పిన్ని ఆగమన విషయం నిస్సందేహంగా తండ్రికి చెప్పవచ్చు అనుకొన్నాడు.

''మామయ్యా! ఇవన్నీ మేమెందుకు అడుగుతున్నామంటే... మీకు ఒక ముఖ్యమైన విషయం చెప్పాలని. సుందరి అత్తయ్య మిమ్మల్ని, పిల్లలను చూడాలన్న తహతహతో ఇక్కడకు వచ్చింది. ఆమె పశ్చాత్తాపంతో దహించిపోతున్నట్లు మాకర్థమయ్యింది. ఆమె ఆరోగ్యం ఎంతమాత్రం బాగోలేదు. నాలుగు రోజుల నుండి విపరీతమైన జ్వరంతో బాధపడుతోంది. ఆమెను రానిచ్చామని మీరేమంటారోనని భయం. ఆమెను నిరోధించడానికి సంస్కారం అడ్డువస్తోంది. అందుకే మీ అభిప్రాయాన్ని పరోక్షంగా తెలుసుకొని ఈ నిజాన్ని మీకు చెప్పడానికి సాహసిస్తున్నాం'' అని చెప్పింది మాధవి.

ఆయన మాధవివైపు నమ్మలేనట్లు చూశారు. ''ఇది నిజమా బాబూ?'' అని రఘుని ప్రశ్నించారు. ''నిజమే నాన్నగారూ, పిన్ని వచ్చింది. మిమ్మల్ని చూడాలని మీతో మాట్లాడాలని తపించిపోతోంది'' అని చెప్పాడు రఘు.

ఆయనకు ఆపుకోలేని దుఃఖం వచ్చింది. ఇన్నాళ్లూ ఆయన అనుభవించిన మూగవేదన కట్టలు తెంచుకొని ప్రవహించింది. రఘు తండ్రి వీపు నిమురుతూ అనునయపరిచాడు.

''ఎంత ఎదిగిపోయావు బాబూ! ఎంత ఉన్నతంగా ప్రవర్తించారు మీరంతా! ఆమెను రానిచ్చి... ఆమెకు సేవలు చేస్తున్నారా? మీరంతా నాకు తెలియకుండా. నా పరిస్థితిని సమీక్షించుకొని నా నిర్ణయాన్ని సేకరిస్తున్నారు. బాబు రఘూ! ఈ ఇంటి బరువు బాధ్యతలు ఏనాడో నీకప్పగించాను. నీకు ఏది ఉచితమని తోస్తే ... అదే చెయ్యి'' అని ఆవేశంగా అన్నారాయన.

''మీరు ఆవేశపడతారేమోననే... ఇన్నాళ్లూ మీకు చెప్పడానికి సందేహించాము. నేను కూడా పిన్నిని చూసిన తక్షణం... ఆవేశంతో దిక్కుతోచక అనుచితంగా ప్రవర్తించబోయాను. మాధవి వివేకంతో ఆగి, నా తప్పు సరిదిద్దుకొన్నాను. ఆమె విషయంలో నిర్ణయం మాత్రం మీదే. ఆమె నా మాతృస్థానంలో ఉంది. అందునా పశ్చాత్తప్త హృదయంతో... జ్వరంతో మంచం మీదపడిఉంది. ఆమెను తిరస్కరించడం భావ్యమా?'' అని రఘు ఆమె ప్రస్తుత పరిస్థితిని, ఆమెయొక్క తపనని తండ్రికి అర్థమయ్యేలా చెప్పాడు.

''నన్ను ఆమె ఉన్న గదిలోనికి తీసుకొని వెళ్లు రఘూ! అన్నీ తెలిసి ఇంక ఉపేక్షించడం అధర్మం'' అని రఘుని అడిగారు.

రఘు, సుమతి ఆయనను ఆమె పడుకొని ఉన్నచోటుకు జాగ్రత్తగా తీసుకొని వచ్చారు. ఆమెను చూసి పడుకొన్న ఆమె నుదుటిపై అరచేతినుంచి ''సుందరీ!'' అని పిలిచారు ఆర్ద్రంగా... ఆయన కంఠంలో మార్దవం తొణికిసలాడుతోంది.

అంతజ్వర తీవ్రతలోనూ... ఆ పిలుపుకి... ఆ కర స్పర్శకు మగతగా కళ్లు విప్పింది సుందరి. ఆ కరస్పర్శ ఆమెకు చల్లగా, హాయిగా ఉంది. తన కళ్లు నిజమే చూస్తున్నాయా? ఇది కలా? నిజమా?? ఇన్నాళ్లు తను పడిన తపన... తీరిపోతుందా? ఈ వాస్తవాన్ని ఆమె జీర్ణించుకోలేక... ఒక్కసారి బావురుమని ఏడ్చి సొమ్మసిల్లి, స్పృహ కోల్పోయింది. వెంటనే సుమతి ఆమె ముఖంపై నీళ్లు చల్లి తుడవసాగింది. రఘు డాక్టరు వద్దకు పరుగెత్తాడు.

''మీరేం కంగారుపడకండి. జ్వర తీవ్రత ఎక్కువగా ఉంది. అలాంటి సమయంలో మి




మ్మల్ని ఒక్కసారి చూసి తట్టుకోలేకపోయింది. సరైన ఆహారం లేక నీరసంగా కూడ ఉన్నారు. మందులు మార్చి యిస్తున్నాను. రాత్రికి టెంప రేచరు తగ్గిపోవచ్చు" అని చెప్పి ఇంజక్షన్ చేసి మందులు చీటీ వ్రాసియిచ్చారు డాక్టరు గారు. ఆవిడకు నిద్ర పట్టడానికి మాత్ర ఇచ్చా రు.

రామారావుగారు నమ్మలేకపోతున్నారు, సుందరి తన తప్పు తెలుసుకొని... తన వద్దకు పశ్చాత్తాపంతో వచ్చిన వాస్తవాన్ని. ఆమెకు ఇన్నేళ్లకు పిల్లలమీద మమకారం కలిగింది. నవమాసాలు మోసి, రక్తమాంసాలు ధారపోసి జన్మనిచ్చిన బిడ్డలనుండి.. ఆ తల్లిని వేరుచేసే శక్తి ఎవ్వరికీ ఉండదు. ఈ చివరి రోజులలో వాళ్లను దూరం చేసి తను పాపం మూటకట్టుకో లేనని... పిల్లలతో ఆమెను తృప్తిగా గడపని మ్మని అనుకొన్నారు.

సుందరికి కాస్త టెంపరేచరు తగ్గింది. పూర్తిగా నార్మల్ వచ్చాక పథ్యం పెట్టమన్నారు డాక్టరుగారు. ప్రతిరోజూ రెండుపూటలా ఆమె ను పలకరించి, ఆరోగ్యవిషయం కనుక్కొంటు న్నారు రామారావుగారు. పిల్లల్ని పిలిచి, తల్లికి కావలిసినవి శ్రద్ధగా చూడమని చెప్తున్నారు.

సుందరికి ప్రాణం చచ్చినట్లుంటోంది... వాళ్లచేత సేవలు చేయించుకోవడం. వాళ్లకు నిజంగా తన సేవలు, సంరక్షణ కావలిసి వచ్చినప్పుడు తప్పించుకొని తిరిగింది, ఇల్లు విడిచిపెట్టి వెళ్లింది. ఆడపిల్లల సంరక్షణకు ముఖ్యంగా తల్లిదే ఎక్కువ బాధ్యత... అయినా తను వాళ్లను కన్నదేగాని బాధ్యతను స్వీక రించలేదు. రఘువట్ల చాలా అమానుషంగా ప్రవర్తించింది. కానీ, వాళ్లంతా అవేమీ మన సులో పెట్టుకోకుండా... తృణీకారభావం లేకుండా తనకు సపర్యలు చేస్తున్నారే! ఆమె వాళ్ల ఔదార్యాన్ని ఆదరణను భరించలేకపో తోంది. తాను చేసిన తప్పులు తన హృదయా న్ని వేయి శూలాలతో తూట్లు, తూట్లు పొడు స్తుంటే ఆమెకు దిక్కుతోచటంలేదు.

వాళ్లనీ... వాళ్ల ఐకమత్యాన్ని... వాళ్ల క్రమశి క్షణ... చూస్తుంటే ఆమెకు ఎంతో ఆనందం కలుగుతోంది. ఎవరూ ఎవరినీ అదిలించరు. ఎవరూ ఎవరిపై కోపగించుకోవడంగాని... కటు వుగా మాట్లాడుకోడంగానీ చెయ్యరు. ఆ ఇల్లు పవిత్రతకు, ప్రశాంతతకు మారుపేరులా గోచ రిస్తోంది. విలువైన వస్తువులు లేకపోవచ్చును. డబ్బు ఇచ్చే భోగాలు లేకపోవచ్చును. కాని వాటన్నింటినీ మించిన తృప్తి ప్రతి వారిలోను కన్పిస్తోంది. "వీళ్లందరూ తనవాళ్లేనా! వీరినా తను అవమానపరచి వెళ్లిపోయింది?" అని ఆమె వాపోయింది.

రామారావుగారు ఒక్కనాడు కూడా ఆమె గతాన్ని గురించి ప్రశ్నించలేదు. "ఇన్నేళ్లూ ఎలా జీవించావు?" అని మాట వరసకైనా అడగలేదు. తమ మధ్య అసలు ఏమీ జరగన ట్లే ప్రవర్తిస్తున్నారు. ఆమె యోగక్షేమాలు నిర్వి కారంగా అడుగుతున్నారు. "ఏ భర్త అయినా... యింత నిగ్రహం ప్రదర్శించగలడా?" అని తనలోతనే ఆశ్చర్యపోతోంది. ఆ యింటిలో ప్రతి ఒక్కరి ప్రవర్తన, మనస్తత్వం... పరిశీలిస్తున్నకొ ద్దీ... వారిపై అవ్యాజమైన ప్రేమానురాగాలు కలుగుతున్నాయి. "ఈ ఇంట్లో ఉండడానికి నిజంగా తను అర్హురాలా!? వచ్చని చెట్టుకు చీడ పట్టినట్లు... ఆయన జీవితాన్ని అంటిపె ట్టుకొంది కొన్నాళ్లు తను, చీడపట్టిన ఆకును త్రుంచివేసినట్లు... భగవంతుడు తనని ఈ కుటుంబం నుండి వేరుచేశాడు" అని అను కొంది.

అసలు సుందరికి ఆ ముగ్గురి పిల్లల్నీ చూస్తుంటే చెప్పలేనంత ఆనందంగా ఉంది. 'ఆ పిల్లల్ని కన్నది తనేనా?' అని తనలో తనే వేయిసార్లు ఆశ్చర్యపోయింది.

"వాళ్లని కన్నప్పుడు తను ఆవగింజంత ఆనందం కూడా పొందలేదు. వరుసగా ఆడ పిల్లలే పుట్టారనీ... పిల్లలు పుట్టడంవలన తను వయస్సుమళ్లినదానిలా కనిపిస్తుందనీ ఒకటే బెంగవడిపోయేది.

భర్తతో పోట్లాటలే జీవిత పరమావధిగా భావించింది. కానీ తామిద్దరి అనురాగ ఫలా లుగా వాళ్లను తీర్చిదిద్దాలని ఏనాడూ అనుకో లేదు. పిల్లలు పాలుతాగుతుంటే పరిపూర్ణ మాతృమూర్తిలా తరించిపోయిందా? ఒక్కనా డైనా వాళ్ల చిలిపి పలుకులు విని మురిసిపో యిందా? ఇంతెందుకు? వాళ్ల ఆలనా, పాలనా

రఘుకు, భర్తకు వదిలేసి తన విలాసాలు తను చూసుకొంది.

వాళ్లు తన భర్తకీ పిల్లలేనని... ఆయనకీ వారిపై మమతానురాగాలుంటాయని మరచి పోయి... పిల్లలకు పేర్లు పెట్టడం దగ్గరనుండీ ఆయనను వ్యతిరేకించడమే. పాపం ఆయ నకు ఏవో అందమైన పేర్లు బిడ్డలకు పెట్టుకో వాలని కోరిక. తను పడనిచ్చిందా?

ఎంతో అదృష్టం... పూర్వజన్మ సుకృతం ఉంటేగాని కడుపు పండదంటారు. తల్లి దండ్రుల భాగ్యఫలాలు సంతానమంటారు. తను మాత్రం వారిని తన బాటకు అడ్డుగా భావించింది. కసాయిదానిలాగ వారిని వారి కర్మకు వదిలి, తన సుఖం... తన స్వార్థమే చూసుకొంది. అందుకే భగవంతుడు తనను ఇలా శిక్షించాడు.

ఏది వద్దనుకొని తృణీకరించి, ఎండమావు లవెంట పరుగెట్టిందో... దానికోసం అంగలార్చు కొని యిప్పుడు వచ్చింది. చర్వితచర్వణం... గతించిన దాని గురించి యిప్పుడు ఆలోచించి ప్రయోజనమేమిటి? తల ఆలోచనలనుండి ఒక్కసారి విదిలించుకొంది సుందరి.

★ ★ ★

"అక్కా! అక్కా! మనం కాసేపు తోటలో కూర్చొందామా?" అని అడిగింది పావని శాంతని. "పద నాకూ ఏమీ తోచటంలేదు" అంటూ సన్నజాజి పూలు, దారం పట్టుకొని బయలుదేరింది శాంత దండ కూర్చుతూ మాట్లాడుకోవచ్చుని. ప్రతిరోజూ సన్నజాజులు మాలకట్టి వదిన తలలో తురమందే ఆమెకు తోచదు.

పావని, శాంత తోటలో అరుగుమీద కూర్చు న్నారు. చెల్లి తనతో ఏదో మాట్లాడాలని తపనప డుతోందని గ్రహించింది శాంత.

"అక్కా! ఆవిడను చూస్తే నాకు వళ్లు మండిపోతోంది. దర్జాగా జ్వరంపేరుతో మనందరిచేత సేవలు చేయించుకొంటోంది. ఇంక ఇక్కడే సెటిలవుతుందేమో!" అని తన మనసులోని అనుమానాన్ని వ్యక్తంచేసింది పావని.

"చూడు పావనీ! మనకంటే పెద్దవాళ్లు నాన్నగారు, అన్నయ్యా ఉన్నారు. వాళ్లిద్దరూ ఏంచేద్దామనుకొంటే అది చేస్తారు. మనకు వాళ్లలాగ మంచీ, చెడూ తెలుస్తుందా? అందు చేత నీవు లేనిపోని ఆలోచనలు పెట్టుకోవద్దు" అంది శాంత.

"అబ్బ... అదికాదక్కా! అన్నయ్యకు నాన్న గారంటే చచ్చేంత భక్తి ప్రేమ. నాన్నగారు మరీ సత్తెకాలం మనిషి... ఆవిడ... ఆ సుందరి మహా తెలివితేటలుగల మనిషి. ఇప్పుడు మళ్లీ మనల్ని బుట్టలో వేస్తోంది" అంది కో పంగా పావని.

అప్పుడే తోటలోకి వచ్చిన సుందరి తన మాట వినిపించడంతో ఒక గుబురు పొద చాటుకి తప్పుకొంది. ఆమెకు తన పిల్లలు తన గురించి ఏమనుకొంటున్నారో వినాలని వుంది.

"ఇదిగో... పావనీ! నీకు ఎన్నిసార్లు చెప్పా ను? అమ్మను ఆవిడ... ఆవిడ... అంటూ అలా కోపంగా మాట్లాడవద్దని. మనం అన్నయ్యా పెంపకంలో పెరిగాం, మర్చిపోకు. అయినా అమ్మమీద నీకెందుకే అంత కోపం?" అని సున్నితంగా మందలించింది శాంత.

"అక్కా! అంత మెల్లగా అడుగుతావేం? ఆవిడ కడుపున పుట్టిన నేరానికి అందరూ మనల్ని ఎన్నేసి మాటలన్నారు? మనల్ని చీడ పురుగుల్ని చూసినట్లు చూడలేదూ? చివరకు లోకం మాటలు భరించలేక నువ్వు చదువు మధ్యలో మానేయలేదా? చిన్నతనంలో నిశ్చింతగా గువ్వపిట్టల్లాగ తల్లి ఒడిలో సేదతీ రవలసిన మనం అనాథలమైపోలేదా? అన్న య్యా మెడకు చుట్టుకోలేదా? ఏ సరదాలు మనకు తీరాయి? లోకం మిగిల్చిన నిందలు... కన్నీళ్లేకదా! మన జీవితాలు ఇంత స్తబ్దతగా మారడానికి ఎవరు... కారణం? వ్యక్తి సుఖంక న్నా కుటుంబ శ్రేయస్సు ముఖ్యమని అన్నయ్యా ఎన్నిసార్లు మనకు చెప్పలేదు! ఆ సూక్తి ఆవి డకు మాత్రం వర్తించదా? వ్యక్తి సుఖమే ముఖ్య మనుకొన్న ఆవిడను అలాగే పడి ఉండమను. పిల్లలట... పిల్లలమీద ప్రేమ కారిపోతున్నట్లు? మనం పొందిన అవమానాలు, బాధలు ఆవి డకు ఏం తెలుసు?

పైపెచ్చు నాన్నగారు కానీ... అన్నయ్యా కానీ... ఆమెను వెళ్లిపొమ్మని ఒక్క మాటైనా అంటున్నారా? అక్కా! నాకు చాలా అసహ నంగా వుంది. ఆమె ఉనికిని నేను భరించలేక పోతున్నాను. నువ్వైనా నా బాధను అర్థంచేసు కో" అంటూ ఆవేశంగా చెప్పుకుపోతోంది పావని. ఆమె కళ్లు అరుణాంకితాలయ్యాయి. ఆమె చూపులు పెద్ద విస్ఫోటాలు సంభవిస్తా యేమోనన్నంత భయంకరంగా ఉన్నాయి.

"అక్కా! నిన్నూ... పావనక్కనీ వదిన రమ్మంటోంది" అంటూ తోటలోకి వచ్చింది సుమ. "నువ్వు పద... కాస్సేపుండి వస్తామని వదినకు చెప్పు" అంది శాంత. వచ్చినంత వేగంగా పరుగుతీస్తూ వెళ్లిపోయింది సుమ.

"హాయిగా మనం సుమ అంత పిల్లలమై నాకాదు... ఎవరు ఎలా చెపితే అలా వినడానికి. మనకూ వయసొచ్చింది. ఆలోచించే మన సుంది. బాధ్యతారాహిత్యంగా సంచరించలేని సంస్కారం ఉంది" అంటూ లేచింది పావని.

"పావనీ! నీవు ఆవేశంలో ఉన్నావు. ఏది చెప్పినా నీకు వ్యతిరేకంగా మాట్లాడిన ట్లుంటుందిపుడు" అంటున్న శాంతను మధ్యలో ఆపింది పావని.

"ఆవేశం కాదక్కా! ఆవేదన. ఎందుకూ పనికిరాని ఒక కిళ్లీకొట్టువాడు నా చేతిని పుచ్చు కొని అసభ్యంగా మాట్లాడగలిగాడంటే... ఈవిడ చేసిన నిర్వాకం కాదా? మా నీరజవాళ్ల అమ్మ మొన్న ఎన్నిమాటలందో తెల్సా? మనం సిగ్గులేనివాళ్లమట. మనతో స్నేహం చేస్తే... వాళ్ల నీరజ చెడిపోతుందట... ఆవేశం పట్టలేక నాలుగు దులిపి వచ్చేశాను" అంది పావని.

ఆమధ్య రఘు ఇంటివద్ద లేకపోతే తండ్రికి సోడా తేవటానికి పావని కిళ్లీకొట్టుకు వెళ్లింది. కిళ్లీకొట్టువాడు అసభ్యంగా మాట్లాడి చెయ్యిప ట్టుకొన్నాడట. ధైర్యంగల పిల్లే అయినా ఈ హఠాత్సంఘటనకు ఒక్కసారి మ్రాన్పడిపోయి





యింటికి వచ్చి ఏడ్చింది. రఘు వచ్చాక విషయం విని... వాడికి గట్టిగా బుద్ధి చెప్పి వచ్చాడు.

ఇంతకూ తమ పరిస్థితులు అలాంటివి. అందరూ అలుసుగా చూసేవి. సమాజపు తీరే అంత. మన బతుకు మనని బతకనీయరు.

"పావనీ! అన్నయ్య మనల్ని ఎంతో కష్టపడి పెంచాడు. అతనికి అగౌరవం కలిగేలాగ మనం ప్రవర్తించకూడదు. అన్నయ్య అన్నీ ఆలోచిస్తాడు. నువ్వు అనవసరంగా బాధపడకు" అంటూ చెల్లెలి చేతిని పుచ్చుకొని పూలమాలను పట్టుకొని లేచింది శాంత. చాటుగా ఆలకిస్తోన్న సుందరికి మనసంతా భారమైపోయింది.



"రాజా బావ వచ్చాడు... రాజా బావ వచ్చాడు" అంటూ సుమ వేస్తున్న కేకలు వాళ్ల చెవిని పడ్డాయి. గబగబా యిద్దరూ ఇంట్లోకి నడిచారు. "ఇదేమిటి? ఉరుములేని పిడుగు లాగ వీడు చెప్పాపెట్టకుండా వచ్చాడు? అయినా సరిగ్గా ఈ సమయంలోనే రావాలా?" అని మనసులో అనుకొంటూ... తమ్ముడికి ఎదురొచ్చింది మాధవి.

"ఏరా! బావున్నావా?" అంటూ రాజా భుజంమీద చేయివేసి ప్రేమగా అడిగింది మాధవి.

"ఆఁ... మా యూనివర్శిటీకి నాలుగు రోజులు శలవులు వచ్చాయి. సరే... మామయ్యకు బాగోలేదని వ్రాసిన నీ ఉత్తరం అందింది. అందుకే చూడాలనిపించి వచ్చేశాను" అంటూ సూట్‌కేసు కిందపెట్టాడు రాజా.

"బాగున్నారా! తమ్ముడూ! కాళ్లు కడుక్కోండి" అంటూ తను తెచ్చిన నీళ్లను రాజాకు అందించి కుశలప్రశ్నలు అడిగింది సుమతి.

ఆమెకు సమాధానం చెపుతూ... కాళ్లు కడుక్కొని మామయ్య గదిలోకి వెళ్లాడు రాజా. అందరూ అతడిని అనుసరించారు.

"బాగున్నారా మామయ్యా?" అంటూంటే రాజాకి గొంతుకకి అడ్డుపడ్డట్లయ్యింది. 'ఎలాంటి మామయ్య... ఎలాగ అయిపోయారు?' అని అనుకొన్నాడు బాధగా.

"బాగున్నాను బాబూ! నువ్వేమిటి? మరీ నీరసంగా అయిపోయావు? అక్కడ భోజనం సరిపడలేదా నీ వంటికి?" అంటూ రాజాని పక్కమీద కూర్చోపెట్టుకొని ఆప్యాయంగా అడిగారు రామారావుగారు.

"నాకేం... మామయ్యా! నేను బ్రహ్మాండంగా ఉన్నాను. అయినా... మీ కంటికి నేనెప్పుడూ... అలాగే కనిపిస్తానుకదా... చిక్కినట్టు" అంటూ నవ్వేడు రాజా. మేనల్లుణ్ని కళ్లనిండుగా తృప్తిగా చూసుకొన్నారు రామారావుగారు.

"రఘు బావ ఏడీ?" అని రాజా అడుగుతోంటే... అప్పుడే గదిలోకి వచ్చింది పావని. "అన్నయ్య ఇప్పుడే బజారుకెళ్లాడు. కాస్సేపట్లో వచ్చేస్తాడు బావా!" అంటూ నవ్వుతూ పలకరించింది పావని. సుమతి రాజాకి కాఫీ పట్టుకొచ్చి యిచ్చింది.

"ఆశ్చర్యం! ఎప్పుడూ పంజాబ్ ఎక్స్‌ప్రెస్‌లా గలగలా కబుర్లు చెప్పే నువ్వు ఇంత పిల్లికూనలా ఉన్నావంటే ఏదో విశేషమే" అంటూ పావనిని వేళాకోళం చేస్తూ ఆశ్చర్యంగా అడిగాడు రాజా పావనిని.

అందరితో హుషారుగా మాట్లాడుతున్నాడు గాని అతని కళ్లు శాంతకోసం వెదుకుతున్నాయి. గదిలో కూర్చొన్న సుందరిని అందరూ తాత్కాలికంగా మరచిపోయారు. సుందరికి వాళ్ల కబుర్లు, హడావిడీ కనబడుతూనే ఉంది.

సుమ వదినను చేతులతో చుట్టేసి తలపైకెత్తి ఏదో రహస్యంగా అడుగుతోంది. సుమతి నవ్వుతూ బదులు చెప్తోంది. సుందరికి ఆ దృశ్యం ఎంతో కంటికింపుగా కన్పించింది.

"ఏమిటమ్మా! వదినదగ్గర మారాం చేస్తు

న్నావు?'' అని అడిగారు రామారావుగారు.

''రాజా ఎప్పుడూ తనకోసం ఏదో ఒకటి తెస్తుంటాడుకదా... మొన్న వచ్చినప్పుడు రైలు బొమ్మ తెమ్మని అడిగిందట. తెచ్చాడో లేదో అడగమని చెపుతోంది'' అంది నవ్వుతూ సుమతి.

''ఏమ్మా! ఆయిదవ తరగతి చదువుతున్నావు... ఇంకా నీకు రైలు, కారు, బస్సు బొమ్మలేంటమ్మా..! అయినా బావదగ్గర నీకు కొత్తా? నువ్వే వచ్చి అడుగు'' అన్నారు రామారావుగారు.

''ఓహో! నీకు రైలు తెస్తానన్నానుకదూ! తెచ్చాను తల్లీ! ఇలా రా... మరీ వదినని బల్లిలాగ అంటుకుపోనక్కరలేదు'' అంటూ సుమను దగ్గరకు తీసుకొని, సూట్‌కేసు తెరిచాడు రాజా. తను తెచ్చిన రైలు బొమ్మను బయటకు తీసి... కీ యిచ్చి చూపించాడు సుమకు. సుమ దాన్ని చూసి చాలా పొంగిపోయింది.

గేటు తీసుకొని లోపలికి వస్తున్న రఘును చూడగానే రైలు పుచ్చుకొని పరుగెత్తుకెళ్ళి చూపించింది. ''అన్నయ్యా! రాజా బావ మనకి రైలు తీసుకొచ్చాడు. చూడు కీ యిస్తే ఎంత బాగా తిరుగుతోందో!'' అంటూ రఘు చెయ్యిపట్టుకొని కూర్చోపెట్టి చూపించింది సుమ.

''ఎప్పుడొచ్చావు రాజా! చదువు బాగా సాగుతోందా?'' అంటూ రాజాని పలకరించి... చెల్లెలు చూపిస్తున్న రైలు బొమ్మను చూస్తూ ''చాలా బావుందమ్మా! ఇన్నాళ్లూ నీ ఆట సామానులలో రైలు బొమ్మ లేదు... ఇప్పుడదీ వచ్చేసిందికదూ!'' అంటూ చెల్లెలు సంతోషాన్ని తనూ పంచుకొన్నాడు రఘు.

''అన్నయ్యా! మరేమో యీసారి దసరాకు బొమ్మల కొలువు పెట్టుకొందాం. రైలుకు స్టేషను కడతావా? అప్పుడు బలే బాగుంటుంది'' అంటూ రఘు వీపుమీద వాలి గారంగా అడిగింది సుమ.

''అలాగేనమ్మా! తప్పకుండా బొమ్మల కొలువు పెట్టుకొందాం...రాజా! స్నానం చేద్దాం పద భోజనాలు చేయవచ్చును'' అంటూ లేచాడు.

''అన్నయ్యా!'' అని ఏదో చెప్పబోతున్న సుమని కసిరింది పావని... ''అన్నయ్యని యింటికి రానియ్యవు, విశ్రాంతి తీసుకోనివ్వవు. బయటనుండి వచ్చినవాళ్లకు చిరాకుగా ఉండదా? స్నానం చేసిరానీ - నీ కబుర్లు వింటాడు'' అంటూ మందలించింది పావని.

సుమ బిక్కమొహం చూస్తే రామారావుగారికి జాలివేసింది. ''పావనీ! అది చిన్నపిల్ల... దాన్ని కసురుకోకు తల్లీ! దానికి పుట్టి బుద్ధెరిగాక చూసిన వ్యక్తి అన్నయ్య. దాని ప్రపంచమంతా అన్నయ్యే. నాడితో ఆడుతుంది, పాడుతుంది. మన ఎవరిదగ్గరా మారాం చేయదు. దానికి సమయాసమయాలు ఏం తెలుస్తాయి?'' అని అన్నారు నెమ్మదిగా.

శాంత, సుమతి భోజనాల ఏర్పాట్లు చేశారు. మాధవి వచ్చి శాంతని కూడా భోజనానికి కూర్చోమని చెప్పింది. శాంతకి రాజాని చూస్తేనే సిగ్గుగా ఉంది. తమ పెళ్లి గురించి అనుకొన్నాక కలవడం ఇదే. ఉత్తప్పుడైతే తానూ నెమ్మదిగా పలకరించేది ఇప్పుడు అతనిని చూడటానికే బిడియంగా ఉంది. అందుకే వాళ్లతో కూర్చోడానికి వప్పుకోలేదు.

''శాంతా! ఏమిటమ్మా? రాజాబావ నీకు కొత్తా? అలాగ దూరంగా వెళ్లిపోతున్నావు. అయినా మధూ! మా చెల్లెలు యిప్పుడే పెళ్లికూతురులా ఉందికదూ? నా కంటికి అలాగే కనిపిస్తోంది'' అంటూ ప్రేమగా చెల్లిని చూశాడు రఘు. అందరి బలవంతంమీద అన్నయ్య పక్కన కూర్చొంది శాంత.

రాజాకి శాంతను చూడటానికి రెండు కళ్లూ చాలటంలేదు. మాట్లాడదామంటే చుట్టూ అందరూ ఉన్నారు. చివరికి ఉండబట్టలేక ''బావున్నావా శాంతా?'' అని అడిగాడు.

''ఊ...'' అని జవాబు చెప్పి సిగ్గుతో చూపులు మరల్చుకొంది శాంత.

సుమ ఇదంతా బుంగమూతి పెట్టి చూస్తోంది.

చిన్నపిల్ల సుమను తోటి పిల్లలెవరూ తమతో ఆడనిచ్చేవారు కాదు. బాల్యచాపల్యంకొద్దీ వెళ్లినా ఎవరో ఒకరు కొట్టి దెబ్బలాడేవారు. దాంతో శాంత చెల్లిని బయటకు వెళ్లనిచ్చేది కాదు. రఘుకి ఆ అమ్మాయిని చూస్తే బాధ. హాయిగా అనుభవించవలసిన బాల్యం ఇలాగ





ఒంటరితనంలో గడపవలసి వస్తోందే అని.

పావని దారి వేరు. ఆమె బయటి ప్రపంచాన్ని వదిలేది కాదు. బయట ఎవరు ఏమన్నా ఎదురు తిరిగి నాలుగు అనడం అలవాటైపోయింది. చిన్నప్పటినుండి ఈ లోకానికి నేనెందుకు భయపడాలి అనే తత్వం. దానికితోడు ఝాన్సీ పరిచయంలో మరీ నిర్భయంగా సంచరించేది. స్కూల్లో ఏ పోటీ అయినాసరే పాల్గొనేది. వీర రుద్రమదేవి... వీరనారి అని అబ్బాయిలు ఏడిపించినా లెక్కచేసేది కాదు.

ఎవరైనా తన కుటుంబ పరిస్థితులను ఎత్తి అవహేళన చేస్తే తానూ వారింట్లో లొసుగులు, బలహీనతలు తెలుసుకొని ఎత్తిపొడిచేది. దాంతో ఆమె నోట్లో నోరు పెట్టటానికి... ముఖ్యంగా అమ్మలక్కలు జడిసేవారు. కొంత మంది మాత్రం నాలుగు అని పది తినేవారు.

శాంత చెల్లెలి విషయాలు విన్నప్పుడు కేక లేసేది. ''నువ్వు అనవసరంగా పదిమంది నోళ్లలో నలుగుతున్నావే'' అని. ''ఇది లోకం... అమాయకులనే ఆడిపోసుకుంటుంది. అలాంటిది మనలాంటి చరిత్ర ఉన్నవాళ్లని వదులుతుందా?'' అని ఆమె అన్నప్పుడు పావని పకపక నవ్వేది.

''ఏమిటక్కా! మరీ పిరికి పాఠాలు చెపుతావు. నాఅంతట నేను వాళ్ల జోలికి వెళ్లానా? వాళ్ల సంగతులు ఎత్తానా? నా గురించి, నా కుటుంబం గురించి అవాకులు, చవాకులు పేలేవాళ్లనిమాత్రం నేను విడిచిపెట్టేది లేదు. ఈ లోకం గురించి నువ్వూ, అన్నయ్యా భయపడతారు. నాకేం భయంలేదు. భయపడేవారినే ఈ లోకం భయపెడుతుంది. ఇది ఒక కాగితం పులి. ఎదురు తిరిగామా తోక ముడుస్తుంది'' అని తేలికగా చెప్పేది. ఒక్కోసారి వీళ్ల సంభాషణల సైములో ఝాన్సీ రావడం తటస్థపడితే... పావనికి మరి నాలుగు మాటలు చెప్పి ప్రోత్సహించేది.

ఒక్కోసారి రఘు ''మనకెందుకమ్మా అలాంటి వాళ్లతో గొడవలు? మన బతుకు మనది. మనదారి మనది. అనవసరంగా ఎవరితోనూ వాదన పడకు'' అని హితవు చెప్పేవాడు చెల్లికి.

''నాఅంతట నేను గొడవ పడుతున్నానా? వాళ్లే నా జోలికి వస్తున్నారా? నువ్వే ఆలోచించు అన్నయ్యా. మన బతుకు మనది. మన కష్టనుఖాలు మనవి. వాళ్లేం ఆరుస్తున్నారా? తీరుస్తున్నారా? నాకు ఒళ్లు మండుతుంది అలాంటి వాళ్లను చూస్తే'' అంటూ వాదించేది.

''లోకం అంటే అంతేనమ్మా! దానికి అక్కర లేని గొడవ ఉండదు. అవకాశం దొరికినవారిని వెంటాడి వేధించడం దాని నైజం. అందుకే అన్నారు పెద్దలు 'లోకాన్ని మూసే మూకుడుంటుందా?' అని. కార్యార్థులైనవాళ్లు... వివేకవంతులు... లోకాన్ని లెక్కచేయక వారి దారిని వారు నడుస్తారు'' అంటూ హితవు చెప్పేవాడు.

శాంత స్వభావం పావనికి పూర్తిగా విరుద్ధం. తన భావాలు, తన ఇష్టాలు తనలోనే దాచుకొంటుంది. ఎంతసేపు ఇతరులకు తనవల్ల యిబ్బంది కలగకూడదని ఆలోచిస్తుంది. 'దుష్టులకు దూరంగా ఉండాలనే సూక్తిని నమ్ముతుంది. పట్టుదల విషయానికొస్తే... ఏ పనిని ప్రారంభించినా అది పూర్తి అయ్యేవరకూ వదలదు. అన్నగారి అభిప్రాయాలు ఆమెకు తెలును. అతను తమకొరకు చేసిన త్యాగం ఏనాడూ మరచిపోదు.

అన్నయ్యకు ఏ పని చేస్తే ఆనందం కలుగుతుందా అని ఆలోచించడమే ఆమె ప్రతిక్షణం చేసే ఆలోచన. అన్నగారి అభిరుచిమేరకు ఇల్లు సర్దేది. వదిన సుమతి అంటే ఎనలేని గౌరవం. ఆమెకు తలలో నాలుకలాగ మసలుకొనేది. శాంతవలన అందరికీ ఆనందమేగాని... ఆమె పనులలోగాని, నడవడిలోగానీ వెకిలితనం వెలితితనం ఎవరికీ కనిపించేది కాదు. ''నిండు గోదావరి మా చెల్లి శాంతమ్మ'' అంటాడు రఘు చెల్లెలి గురించి మెరిసే కళ్లతో.

''అవునూ... శాంతా! ఏనాడూ ఏమీ కావాలని... ఏ చీరలూ కొనమనిగాని అడగవేమిటమ్మా? పెదవి విప్పి ఏమీ అడగకపోతే నీ కోరికలు ఎలా తీరుతాయి? ఇలాగైతే రేపు మా బావగారు నీకు ఏమీ కొనరు తెలుసా? ఆడవాళ్లు నిత్యం ఏదో ఒకటి కోరుకొంటారట. నువ్వేమిటమ్మా! ఆడవాళ్లలో తప్పపుట్టావు!'' అంటూ చెల్లిని ప్రేమగా తలమీద నిమురుతూ

అనేవాడు రఘు.

"ఏంకావాలన్నయ్యా నాకు. పెదవి విప్పి నిన్ను కోరకుండానే, వేయి కళ్లతో మా అవసరా లు గమనిస్తావు. నిరంతరం మా గురించి ఆలోచనతప్ప ఏముంది నీకు? నీలాగ కనిపె ట్టుకొని అవసరాలు తీర్చే మగవాళ్లు అరుదు. అయినా నన్ను పొగిడేస్తావుకానీ... వదిన మన యింటికి వచ్చిన దగ్గరనుండీ ఏనాడైనా ఏదైనా కోరిందా? ఆమెకు ఏమైనా సరదాలు ఉన్నాయేమో అడుగు" అనేది అన్నగారితో శాంత.

"ఊఁ... సర్లే మీ వదిన రోజూ రాత్రిళ్లు ఎన్ని కోరికలు కోరుతుందో తెల్సా?" అంటూ భార్య వైపు చిలిపిగా చూస్తూ... "శాంత పెళ్లి బాగా చెయ్యాలండి... పావనికి పట్టువరికిణీ తెప్పించాలి. పావనికి బాగా చదువు చె ప్పించాలి... యిలా జోరీగలాగ నన్ను నిద్రపోని వ్వకుండా ఏదో ఒకటి అడుగుతూనే ఉంటుంది" అని రఘు అన్న మాటలకు శాంతకు కళ్లలో నీళ్లు తిరిగేవి.

★ ★ ★

"రఘూ! మళ్లీ అత్తయ్యకు కొంచెం టెంపరే చరు వచ్చినట్లుంది. రేపు ఉదయమే డాక్టరు గారికి చెప్పాలి" అంటూ హార్లిక్సు గ్లాసు పట్టు కొని సుందరి పడుకొన్న గదిలోకి వెళ్లింది మాధవి.

"అత్తయ్యా... అత్తయ్య ఎవరు రఘు బావా? ఎవరు వచ్చారు మన యింటికి?" అని ఆశ్చర్యంగా అడిగాడు రాజా "మా పిన్ని వచ్చింది... అదే మీ సుందరత్తయ్య" అంటూ నవ్వుతూ ఏ భావం కనపడకుండా మామూ లుగా చెప్పాడు రఘు.

"ఏమిటీ! సుందరత్తయ్య మళ్లీ వచ్చిందా? ఆమెకు జ్వరమా? అయితే ఆమెను మీరు యింటికి రానిచ్చారా? ఇప్పుడు యిక్కడే ఉందా? నాకు అంతా ఆశ్చర్యంగా ఉంది" అని రాజా అంటుంటే అక్కడే ఉన్న పావని అందు కొంది.

"ఆఁ... ఆవిడకు మా నాన్నగారిని... మమ్మ లని చూడాలని హఠాత్తుగా ప్రేమ పుట్టుకొ చ్చిందట... వచ్చింది. మా అన్నయ్య సంగతి తెలుసుకదా! ఆప్యాయంగా అతిథి సేవలు చేస్తున్నాడు. ప్రస్తుతం జ్వరంతో ఆవిడ గదిలో పడక వేసింది" అంటూ హేళన, చిరాకు మిళితంచేసి రాజాకు అసలు విషయం చె ప్పింది.

"నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. మామ య్య... మరి మామయ్య ఏమీ అనలేదా? ఆమె ను ఉండనిచ్చారా?" ఆశ్చర్యాన్ని జీర్ణం చేసుకో లేక అడుగుతున్న రాజాని మాధవి మంద లించింది.

"ఇందులో ఆశ్చర్యమేముందిరా? మామ య్య మన అందరిలాంటివాడు అనుకొంటు న్నావా? క్షమాగుణం ఆయన నరనరాన జీర్ణించుకొంది. అంచేత ఇందులో ఆశ్చర్యపడ వలసినదేమీలేదు. పద పద... నీకు వసారాలో పక్క వేశాను. వెళ్లి పడుకో. లేనిపోని ఆలోచన లేవీ పెట్టుకోకు" అంటూ రాజాని మరి మాట్లా డనీకుండా పడుకోడానికి సాగనంపింది. శాంత గురించి ఆలోచనలను పక్కకుపెట్టి... సుందరి రాక గురించి ఆశ్చర్యపోవడం రాజావంత య్యింది.

మరుసటిదినం కూరలు తేవడానికి బజా రుకు వెళ్లినప్పుడు రఘు అన్ని విషయాలు రాజాకి వివరించాడు. అన్నీ విన్నాక రాజాకు నోటివెంట మాటరాలేదు కొంతసేపు.

"నువ్వేమనుకొన్నా రఘూ! నా అభిప్రాయం నేను చెప్పక తప్పదు. మామయ్యను... ఈ కుటుంబాన్ని అన్ని బాధలకు గురిచేసిన ఆమె ఏ మొహం పెట్టుకొని వచ్చింది? శాంత, పావని, మీరు ఎన్ని బాధలకు అవహేళనలకు గురి అయ్యారు ఆమెవల్ల? ఆడదై కుటుంబంగౌరవాన్ని కాపాడవలసిన ఆమె కుటుంబ గౌరవాన్ని మంటకలిపింది. నాకు ఆమెమీదకానీ, ఆమె స్థితిమీదకాని ఆవ గింజంతైనా సానుభూతిలేదు. వళ్లు కొవ్వి బాధ లు కొనితెచ్చుకొనేవారిని నేను సమర్థించలేను. నన్ను అల్పుడుగాకానీ, సంస్కారహీనుడిగా కానీ నీవు అనుకొన్నా నేనేం చేయలేను" అంటూ నిష్కర్షగా తెగేసి మరీ చెప్పాడు రాజా.

"నిజమే రాజా! నీ అభిప్రాయం సరైనదే... కానీ... మా నాన్నగారి గురించి నువ్వు చిన్నప్ప టినుండీ ఎరిగినవాడివి. ఆయన నిర్ణయాలను





గౌరవించటం... ఆ బాటలో నడవడంతప్ప వేరే నిర్ణయం చేయలేనివాడను నేననీ నీకు తెలును. మీ పెళ్లి నిర్ణయం మాధవి చెప్పిన తరువాత ఆయనిప్పుడిప్పుడే నిశ్చింతగా ఉంటున్నారు. శాంత ఆణిముత్యం. నువ్వు ఆమెని చేపట్టడానికి నిర్ణయించుకోవడం మా అదృష్టం. శాంతను సుందరి కూతురిలాకాక ఒక అమాయక కన్నెపిల్లగా మాత్రమే భావించి స్వీకరించు. సుందరి పిన్ని రాకతో... దయచేసి ఏవిధమైన అభ్యంతరం కలిగించ వద్దు'' అని రాజా చేతులు పుచ్చుకొన్నాడు రఘు.

''అయ్యయ్యో! అదేమిటి రఘూ! మా పెళ్లికి ఆవిడ రాకకు ఏమిటి సంబంధం? దాన్ని దృష్టిలో పెట్టుకొని నేను అనడంలేదు. శాంత అంటే నాకు ఎంతో ఇష్టం. పైగా మా అక్క చేసిన నిర్ణయం గౌరవించడం నా బాధ్యత. ఇది నేను త్రికరణశుద్ధిగా తీసుకొన్న నిర్ణయం. దీనిలో ఏ పరిస్థితిలో మార్పు ఉండదు.

ఆవిడ రాకపట్ల నా అయిష్టాన్ని మాత్రమే చెప్పాను. మామయ్యంటే మాకు ప్రాణం. ఆమె మామయ్యకు పెట్టిన బాధలవల్ల... ఆమెపట్ల కించిత్ కూడా సానుభూతి కలగటంలేదు. అంతేగాని దీన్ని గురించి శాంతను తిరస్క రించే కుసంస్కారిని కాను. నువ్వన్నట్లు మామ య్యను గౌరవించటం మన బాధ్యత. ఆయన అభిప్రాయాలతో మనం ఏకీభవిద్దాం. దీన్ని ఇక్కడితో వదిలేద్దాం'' అని రాజా అనడంతో రఘుకి అవ్యక్తానందం కలిగింది.

రాజా ఈ సమయంలో అనుకోకుండా రావడం... సరిగ్గా సుందరిపిన్ని ఉనికి... ఎలారా భగవంతుడా! అని రఘుకి రాత్రి నిద్ర సరిగ్గా పట్టలేదు. మాధవి, రాజా ఒక తల్లి బిడ్డలే అయినా వారి, వారి ఆలోచనాసరళిలో ఎంత తేడా అని ఆశ్చర్యపోయాడు రఘు.

శాంతను కలిసి ఎలాగైనా మాట్లాడాలని రాజా కోరిక. శాంత మాత్రం అందకుండా... ఊరిస్తున్నట్లు యింట్లో తిరుగుతుండటంతో ఏంచేయాలో పాలుపోలేదు రాజాకు. తమ వివాహం సంగతి అనుకొన్నాక యిదే రావటం తను. పోనీ పావనికి చెబుదామంటే ఆటలు పట్టిస్తుంది.

అక్కడికీ మధ్యాహ్నం అక్క, శాంత కలిసి బియ్యం ఏరుతుంటే అక్కడికి చేరాడు తను నెమ్మదిగా. ''ఏరా! కాసేపు పడుకోకపో యావా?'' అని అడిగింది మాధవి ప్రేమగా.

''నిద్రపట్టటంలేదక్కా... దాహంగా ఉంది. కొంచెం మంచినీళ్లివ్వవా?'' అని అడిగాడు. అలాగైతే ఆమె లేస్తే శాంతతో మాట్లాడవచ్చని అతని ఆలోచన. కానీ... శాంత గబగబా లేచి వెళ్లి చల్లటి నీళ్లు తెచ్చి యిచ్చింది రాజాకు. అతనికి బలే కోపం వచ్చింది. అక్కడే ఉన్న బియ్యం తీసుకొని గుప్పిళ్లతో పోస్తూ ఏవో కబుర్లు చెప్పటం మొదలుపెట్టాడు. అసలు అతని బాధ శాంతతో మాట్లాడలేకపోతే తను వ్రాసితెచ్చిన చీటీ ఆమె చేతిలో పెట్టాలని అతని ఆలోచన. అవకాశం కోసం అక్కడ కూర్చున్నాడు.

సుమతి రాజాకు యిష్టమని జంతికలు తయారుచెయ్యడంలో నిమగ్నమయింది. పిండిలో ఉప్పుకారాలు చూడటానికి మాధవిని వంటింట్లోకి కేకవేసింది. అవకాశం చిక్కేసరికి గబగబా తను వ్రాసితెచ్చిన చీటీ శాంత చేతిలో కుక్కాడు. సరిగ్గా అప్పుడే ఎక్కడినుంచో ఊడి పడింది పావని. తటాలున శాంత చేతిలోని చీటీ లాక్కుని విప్పి బయటకు గట్టిగా చది వింది.

''శాంతా! మరీ అన్యాయం... నాతో మాట్లాడ టంలేదు. నీకు పాపం చుట్టుకొంటుంది. నీతో కలిసి మాట్లాడాలి. మనం కలిసి షికారు వెళ్దామా... నీ... రాజా'' అని ఉన్నదున్నట్లు యధాతథంగా చదివేసింది. అప్పుడే వంటింట్లోనుండి వచ్చేసిన మాధవి అది చూసి నవ్వాపుకోలేకపోయింది. రాజా ఉక్రోషం పట్టలేక పావని నెత్తిమీద రెండు మొట్టికాయ లు మొట్టాడు. శాంతకు పాపం! చెప్పలేని సిగ్గు వేసింది.

''ఇదిగో బావా! మధ్యలో నన్ను కొడతా వెందుకు? ఏమిటో నీ రహస్య సందేశం పెళ్లికి ముందు... అని చదివాను... అంతే! నేను చేసిన తప్పేమిటంట? అయినా ఈ చీటీ రాయబారాలెందుకు? అక్కతో డైరెక్టుగా చెప్ప వచ్చుకదా! అబ్బే... పిల్లికూన. అక్కముందు

అబ్బాయిగారెందుకూ వనికిరారు'' అంటూ ఆటలు పట్టించడం మొదలుపెట్టింది.

"నా విషయం నీకనవసరం... నాకు కాబోయే భార్యకు ప్రేమలేఖలు వ్రాస్తాను... షికార్లు తీసుకెళ్తాను. మధ్యలో నీ వేళాకోళం ఏమిటి?'' అని మరింత ఉడుక్కుంటూ అడిగాడు రాజా.

అప్పుడే నిద్రలేచి వచ్చిన రఘుకు వాళ్ల గొడవేమిటో అర్థంకాలేదు.

పోనీ అంతటితో ఆపుతుందా పావని. అలాగ ఆపితే ఆమె గొప్పతనం ఏముంది? "చూడు బావా! పిరికివాళ్లకి ప్రేమించే అర్హత లేదు. ప్రేమకు కానీ... పెళ్లికికానీ... గుండెధైర్యం కావాలి. నీలాగ జావకారిపోకూడదు. పోనీ మరదల్ని నన్నైనా బ్రతిమాలుకోరాదూ! రాయబారం నడిపేదాన్నికదా!'' అంటూ ఏడిపించడం మొదలెట్టింది.

"ఏమిటీ... మా తమ్ముడిని మరీ ఆటపట్టిస్తున్నావు? రేపు నీకు ఎలాంటివాడు వస్తాడో నేను చూడనా?'' అంటూ పావనికి బ్రేకువేసింది మాధవి.

"నాకా! ఏ డేషింగ్ హీరోనో ఏరి కోరి మరీ వస్తాడు. పావనంటే ఏమిటనుకున్నావు? ఎక్కడో బంగారు పూలతో పూజ చేస్తూ ఉంటాడు... నాలాంటి భార్య దొరకాలని. అదిసరేకానీ! పావం! మీ తమ్ముణ్ణి మరదల్ని సినిమాకు పంపుతావా? షికారుకు పంపుతావా?'' అంటూంటే ఆమె మాటలకు అందరూ నవ్వుకొన్నారు. శాంతతో మాట్లాడటం కుదరకపోగా పావని నోట్లో నానిపోయాడు పావం రాజా.

మర్నాడు యింక వెళ్లిపోతాడనగా ఉదయమే పూలు కోస్తూ కనిపించింది శాంత. పావని లేచిన జాడలేదు ఎక్కడా. అదే అదునని గబగబా తోటలోకి తనూ వెళ్లాడు రాజా. "శాంతా'' అంటూ భుజంమీద చేయి వేసేసరికి ఉలిక్కిపడి చూసింది శాంత.

"మీరా! అప్పుడే నిద్ర లేచారా?'' అని అడిగింది ఆశ్చర్యంగా. "ఏంచేయను? నీతో మాట్లాడదామని మైలురాళ్లు లెక్కపెట్టుకొంటూ అంత దూరంనుండి వస్తే నీకేమీ పట్టదు. ఆ రాలుగాయి లేవకుండా నిన్ను కలుద్దామని వేగం లేచిపోయాను. ఇప్పటికైనా కలిశావు. నా అదృష్టం'' అంటూ సిమ్మెంటు బెంచీమీద కూర్చున్నాడు.

"మీకు చిన్నప్పటినుండీ తెలిసినదానినే కదా బావా! నన్ను మీరు వివాహం చేసుకొంటాననడమే నా అదృష్టం. అంతకన్నా నాకేం కావాలి. కాకపోతే నలుగురిలో ఆడదానికుండే సహజమైన సిగ్గుతో మాట్లాడలేకపోయాను. ఏమీ అనుకోకండి బావా!'' అంటూ నెమ్మదిగా నందివర్ధనాలు కోయడం మొదలుపెట్టింది.

"అదికాదు శాంతా! నేనంటే నీకిష్టమేనా? నాతో పెళ్లి నీకంగీకారమేనా? నీ నోటివెంట వినాలని నా తపన. నామట్టుకు నాకు ఎంతో ఆనందంగా ఉంది. చిన్నప్పటినుండీ నువ్వంటే నాకెంతో యిష్టం. నీకు సంబంధాలు చూస్తున్నారంటే నాకెంతో బాధగా ఉండేది. మామయ్య వద్దకు వచ్చి వద్దని చెప్పే ధైర్యం లేదు. అక్క పెళ్లి అవ్వకుండా నేను తొందరపడితే అందరూ నవ్వుతారేమోనని భయం. అక్కకీ మన ఆలోచన రావటం అదృష్టం. కాగల కార్యం గంధర్వులే నెరవేర్చారన్నట్లయ్యింది. భలే! అనేక భావాలతో తన్నుకొని బాధపడ్డానుకో... ఎలాగైతేనేం, నీకొచ్చిన సంబంధాలు తప్పిపోవడం... అక్కయ్య మామయ్యతో మన గురించి అనటం, ఖాయపడటం జరిగింది. నాకు ఎప్పుడెప్పుడు నిన్ను చూద్దామా... అని ఆత్రంగా అనిపించింది. చివరికి ఉండబట్టలేక వచ్చేశాను. యింక నాపైన నీ అభిప్రాయం ఏమిటి? నా చదువు ఈ ఏడాదితో పూర్తవుతుంది. అప్పుడు చేసుకొందామా వివాహం?'' దొరికిందే ఛాన్సని ఆత్రంగా మాట్లాడుతుంటే శాంతకు సిగ్గనిపించింది.

"నేనేం అందని చందమామను కానుకదా బావా! మీరంతగా నా కోసం యిష్టపడ్డారంటే... అది నా అదృష్టం. మీది గొప్ప మనసు. కనుకనే మా ఇంటి పరిస్థితులు తెలిసీ నన్ను చేసుకోడానికి యిష్టపడ్డారు. మీ రుణం మాధవి వదిన రుణం జన్మలో తీర్చుకోలేను.

వివాహమంటూ అవుతుందో... లేదో... అన్నయ్యకి నాన్నగారికి గుదిబండలా... ఆవేదనను కలిగిస్తూ బతకాలే అని ఇన్నాళ్లూ బాధపడ్డాను మీలాంటి అనురాగమూర్తిని జంటగా ప్రసా





దించిన భగవంతుడికి కృతజ్ఞురాలిని. మీ ఇష్టం మీరెప్పుడంటే అప్పుడే మన వివాహం. నా వలన మీకు జీవితంలో ఏ విధమైన అశాంతి దుఃఖం కలిగించనని మాట ఇస్తున్నాను... బావా!'' అంటున్న శాంతను ఆపేశాడు రాజా.

''నీకేం శాంతా! బంగారు బొమ్మవి. నిన్ను చేసుకోవడం నా అదృష్టం. ఒక్క మాట ఇవ్వాలి నాకు'' అని అంటున్న రాజావైపు ఏమిటన్నట్లు చూసింది శాంత.

''నువ్వు నోటితో మాట్లాడనక్కరలేదు శాంతా! నీ కళ్లే అన్నీ మాట్లాడేస్తాయి. నేను వెళ్లిపోతున్నాను. నాకు నువ్వు వారానికొక ఉత్తరం రాయాలి. నా లేఖలు అందిన వెంటనే రాయాలి. తెల్సిందా? మాట ఇచ్చి చెప్పు'' అంటూ రాజా శాంత చేతిని పట్టుకొన్నాడు.

''మా అన్నయ్య ఏమనుకొంటాడో?! మీరు ఉత్తరం మా అన్నయ్యకు రాసి అందులో నాకు రాయండి'' అంటున్న శాంతను చిరుకోపంగా చూశాడు రాజా.

''మీ అన్నయ్యకు, నీకు, మీ నాన్నగారికీ అందరికీ ఒకేలాగ రాస్తామా ఉత్తరాలు? మీ అన్నయ్య దాంట్లో నీకు ఎలా రాస్తాను? నీకు వేరే రాస్తాను. నువ్వూ వేరే రాయలి. ఏం బుర్రో ఇంత పిసరు ఆలోచనలులేవు'' అంటోన్న రాజాని భయంగా చూసింది శాంత.

''అసలు నాకు ఉత్తరాలు రాసే అలవాటు లేదు. అందులో అన్నయ్యకు తెలీకుండా నేనే పనీ చేయలేను'' అని చెప్తున్న శాంతను మింగేసేలా చూశాడు రాజా.

''అవునులే! అసలు నాకున్న ఆత్రుత, ఆరాటం నీకుంటే కదూ? ఉంటే... వచ్చి ఇన్నిరోజులైనా ఇలాగ నిమ్మకు నీరెత్తినట్లుంటావా? నా అంతట నేనే నీతో మాట్లాడటంకోసం ఎన్ని ప్రయత్నాలు చేశాను? మీ ఆడవాళ్లకు గొప్ప ధీమా సుమా!'' అంటూ ఆమె చేతిని నెమ్మదిగా ముద్దుపెట్టుకొని వదిలేశాడు. ఆ స్పర్శతో ఏదో అవ్యక్తానుభూతిని పొందింది శాంత.

మళ్ళీ మళ్ళీ హెచ్చరించాడు రాజా ''ఏమో! ఏం చేస్తావో నాకు తెలీదు. నాకు మాత్రం నాకాబోయే భార్య నుండి ప్రేమలేఖలు రావాలి. అన్నయ్యకే చెప్పి రాస్తావో! మామయ్యకే చెప్పి రాస్తావో! నీ ఇష్టం... మరి రేపు నేను వెళ్లిపోతున్నాను. పోనీ కనీసం ఒక సినిమాకైనా కనికరించి అమ్మాయిగారు రాలేదు'' అని కినుకుగా అంటున్న రాజాను వదిలి... ఎవరో నూతివద్దకు వస్తోన్న అలికిడి విని గబగబా తోటలోనుండి పూల సజ్జ తీసుకొని ఇంట్లోకి వెళ్లిపోయింది.

పొద్దెక్కాక నిద్రలేచిన పావని రాజాను చూసి బోలెడు ఆశ్చర్యపోయింది. ''మనలో మనమాట... రాజా బావా! ఇంత ఉదయాన్నే నిద్రలేచావు. కొంపదీసి మా అక్కతో ఎక్కడైనా మీటింగు పెట్టేశావేమిటి? ఎవరితోను అనసులే... నాకు కాస్త చెప్పు'' అంటూ వెనక వెనకే తిరిగి వేళాకోళం చేయడం మొదలుపెట్టింది. సుమతికి పావని అతనిని అలా ఏడిపించడం నచ్చలేదు. అందులో శాంత మరీ పావని మాటలకు అటూ...ఇటూ తిరగలేకపోవడం చూసి పావనిమీద చిరుకోపం వచ్చి తీక్షణంగా చూసింది.

''బాబోయ్! మా వదిన కళ్లతోనే కొట్టేటట్లు చూస్తోంది. మీ ఇద్దరి గొడవా నాకెందుకు? వదినమ్మా! అలుగుటయే ఎరుగని అజాతశత్రువే అలిగినాడు... అన్నట్లు నీకు కోపమా!?'' అని దగ్గరగా వెళ్లి అడుగుతుంటే సుమతి కూడా ఫక్కున నవ్వేసింది.

రామారావుగారు సుమతిని పిలిచారు. ''చూడమ్మా! రాజా రేపు వెళ్లిపోతాడట. పాపం! అక్కడ ఏమి తింటున్నాడో ఏమిటో!? ఈ రోజు కాస్త మైసూరుపాకం, పెరుగుగారెలు చేసి వాడికి పెట్టమ్మా! వాడికి అవి చాలా ఇష్టం. వాళ్ల అమ్మ ఉన్నప్పుడు వాడికోసం తరచూ చేసేది. అలాగే నాలుగు ముక్కలు చక్రధరంగారి ఇంటికి, మధుసూదనంగారికి పంపమ్మా.

సుందరికి రాత్రి మళ్లీ జ్వరం తగిలిందట కదా! ఏమిటో తగ్గనట్లే తగ్గి మళ్లీ వస్తోంది. రేపు నార్మలుకి వస్తే పథ్యం పెట్టాలి'' అని అన్నీ వరుసగా చెప్పారు.

''అలాగే మామయ్యా! అన్నీ మీరు చెప్పినట్లే చేస్తాను. ప్రస్తుతం అత్తయ్యగారికి జ్వరంలే

దు'' అంటూ వెళ్ళిపోయింది సుమతి.

అంత మందినీ సరదాగా చూస్తుంటే ఆయ నకు తన జబ్బు సగం నయమయినట్లని పిస్తోంది '''పిల్లలు ఎన్నిరోజులైై ఇలాగ సర దాగా ఉన్నారు? నా ఇల్లు ఎన్నాళ్ళకిలా నంద డిగా ఉంది?'' అని మనసులో అనుకొన్నారు.

''నాన్నగారూ! తాతగారు వస్తున్నారు'' అంటూ రామారావుగారితో చెప్పి... శర్మగారికి ఎదురెళ్ళింది పావని. శర్మగారు ఎప్పుడో తప్ప అల్లుడింటికి రారు. అందులో సుందరి ప్రవర్త నతో తలకొట్టేసినట్లయ్యి రావడం మరీ అరుదై పోయింది.

''ఏమ్మా! అప్పుడే స్నానం చేసి తయారైన ట్లున్నావు. ఏమిటి విశేషం?'' అని అడిగారు పావనిని చూసి.

''మాకు ఈరోజు వక్తృత్వపు పోటీలున్నాయి తాతయ్యా! నేను పాల్గొంటున్నాను. అందుకే తొందరగా వెళ్లాలి'' అని జవాబు చెప్పింది పావని.

రఘు, సుమతి వచ్చి ఆయనను పలక రించారు. సుమతి లోనికి వెళ్లి ఆయనకు కాఫీ తెచ్చి ఇచ్చింది.అల్లుడి మంచంవద్ద కూర్చుని ఆయన కబుర్లు చెప్పడం మొదలుపెట్టారు.

''అన్నట్లు మరచిపోయాను. సుమతల్లీ! మీ అమ్మమ్మ నీకు ఇవ్వమని పూతరేకులు, కార ప్పూస ఇచ్చింది. అవి మీకు ఇచ్చేసి... అలా రాజా వచ్చాడటకదా! చూసి వెళ్దామని వచ్చా ను. ఇవి లోనికి తీసుకెళ్లమ్మా!'' అని తను తెచ్చిన సంచీని అందించారు. అప్పుడే స్నానం చేసి వచ్చిన రాజా నవ్వుతూ శర్మగార్ని పలకరించాడు.

''చాలా రోజులైందోయ్! నిన్ను చూసి'' అంటూ ఆప్యాయంగా పలకరించి ప్రక్కన కూర్చోపెట్టుకొన్నారు. సుమతి ఆయనతోపాటు అందరికీ టిఫిన్లు తెచ్చియిచ్చింది.

శర్మగారికి సుమతిని చూస్తే ఎంతోయిష్టం. అటువంటి పిల్ల ఉండటం చాలా అరుదని ఆయన అంటారు. ఆ పిల్లకున్న అణుకువ, మంచితనం పెద్దలపట్ల గౌరవం చూస్తే ఆయ నకెంతో ముచ్చట. ఆయన ఎప్పుడు ఏ పని మీద అల్లుడింటికి వచ్చినా ఆత్రంగా చూసేది సుమతి గురించే. ఆ అమ్మాయి వల్లనే తన అల్లుడి కుటుంబం ఒక ఒడ్డుకు చేరుకొందని ఆయనకు ప్రగాఢవిశ్వాసం. రఘుకు తగ్గ భార్య అని మురిసిపోతారు.

''నేను మీతో ఒకమాట చెప్పాలని వచ్చాను అల్లుడుగారూ! పడినన్ని రోజులూ బాధలే పడ్డారు. ఒక రాక్షసిని, పతితని మీకు అంటగ ట్టి... మీ మనశ్శాంతిని పోగొట్టాము. మీ జీవి తంలో కల్లోలం లేపాము. అదుపాజ్ఞలలో పిల్ల లను పెంచలేని అసమర్థుడను నేను. అందు కే మీకు మొహం చూపించడానికి కూడా సిగ్గుపడుతుంటాను. తమ్ముడు తనవాడైనా ధర్మం చెప్పమన్నారు పెద్దలు. నా మనసులో మాట చెప్దామని వచ్చాను...'' అంటూ అర్థోక్తిలో ఆగి రామారావుగారివైపు చూశారు శర్మగారు.

ఏనాడూ... పట్టుమని తనతో పదిమాటలు కూడా మాట్లాడని మామగారు వచ్చి... ఈరోజు తనతో మాట్లాడతాను అనడంతో ఆశ్చర్యం వేసింది. బహుశా సుందరి విషయంలో ఏదో నిర్ణయం చేసుకొని వచ్చారేమోనని అనుకొన్నా రు మనసులో. తమకు అనవసరమైన విషయ మన్నట్లు ఆడవాళ్లు లోనికి వెళ్లిపోయారు.

''అల్లుడుగారూ! పావనివల్ల అన్ని విషయా లు నాకు తెలిశాయి. ఆ దరిద్రపు మొహం పిల్లల్ని మిమ్మల్ని చూడాలని రావడం మీరు ఆదరించడం... రెండూ బాగున్నాయి. మెడప ట్టుకొని గెంటేయక ఇంట్లోకి ఎందుకు రానిచ్చా రు?

ఒక్కనాడైనా మీ ఆలనా పాలనా చూసిందా? మీ పరువు ప్రతిష్ఠలగురించి ఆలోచించిందా? కన్నూ... మిన్నూ కానక కామంతో కైపెక్కిపోయి గుమ్మందాటి వెళ్లిపోయిఉది. పచ్చని సంసారా న్ని పదిమంది నోళ్లలో పడవేసింది. చేసిన పనికి సిగ్గూ, ఎగ్గూ లేకుండా రావడం ఒకటి. మీకు చెప్పేటంతటి వాడిని కాను. ఈ చివరి రోజులలో మళ్ళీ దాని వలన మీ మనశ్శాంతి పోతుందనే భయంతో నేను... ఈ విషయం చెప్పడానికి వచ్చాను.

నిర్మొహమాటంగా దానిని ఇంటిలోనుండి పొమ్మని చెప్పండి. చీడపురుగు పడితే... ఆ భాగాన్ని చెట్టునుండి త్రుంచి అవతల పారేస్తా ము. లేకపోతే పచ్చటి చెట్టు నాశనమౌతుంది.

అది మీకుటుంబానికి పట్టిన చీడ పురుగు. దానిని ఏరి పారెయ్యండి.

మీరు ప్రేమ, జాలి చూపవలసినది దాని మీదకాదు. మీరు, పిల్లలు ఎలాగో నిలబడి మీ సంసారాన్ని గుట్టుగా లాక్కొస్తున్నారు. దయ చేసి దీనిమూలంగా మళ్లీ వీధిన పడకండి'' అని ఆవేశంగా చెప్పసాగారు.

రామారావుగారు మౌనంగా తన చేతివేళ్ల వైపు చూసుకొంటూ ఉండిపోయారు. ఆయ నకు మామగారి బాధ, తన గురించి పడుతు న్న వ్యధ బాగానే అర్ధమయ్యాయి. ఆయన మాటకు ఎదురు చెప్పినట్లు కాకుండా... తన అభిప్రాయాన్ని ప్రశాంతంగా చెప్పాలని ఉద్యు క్తులౌతూ... నెమ్మదిగా ఆయనవైపు తిరిగి...

''మీరు అనవసరంగా ఆవేశపడకండి మామగారూ! మనం పెద్దవాళ్లమైపోయాం. ఆవేశకావేశాలు మనకు తగవు. మీరు ముందు శాంతపడండి...'' అంటూ ఆయనకు నచ్చచె ప్పబోయారు.

''ఆవేశమా? నాది... ఆవేశమా!? కాదండీ మీకు తెలియదు. భరించలేని బాధతో చెప్తు న్నాను. మగవాడికి గౌరవం వచ్చినా.. అగౌ రవం వచ్చినా... ఆడదానివల్లనే. మగవాని జీవితనౌకకు చుక్కాని ఆడది. ఆ ఆడదే ఒళ్లు పొగరుతో ఆ సంసార నౌకను చిన్నాభిన్నం చేస్తే దానినేమనాలి? దాన్నేం చేయాలి? అలాంటిదాన్ని ఉప్పు పాతరవేసినా పాపంలే దు'' అని ఆయాసం వలన ఆగారు.

గదిలో పడుకొని ఉన్న సుందరికి వచ్చిందె వరో తెలిసిపోయింది. తండ్రిని చూద్దామని ఎంత కోరికగా ఉన్నా... ఆయన మాటలకు ఆకోర్కె వెనక్కి వెళ్లింది. మరింత నిస్సత్తువ ఆవరించటంతో పక్కకు అంటుకొనిపోయింది.

''మీకు తెలియదా మామగారూ... మన సంస్కృతిలో వివాహబంధం ప్రామాణికమై నది. ఆ బంధం పడే క్షణంలో... ధర్మేచ, అర్థేచ, కామేచ, మోక్షేచ నాతిచరామి... అని ప్రమాణంచేశాను. తన తప్పుకు కుమిలిపో తూ... ఇంటికి చేరిన అర్ధాంగిని ఎలా తిరస్క రించమంటారు? మరి ఆ ప్రమాణానికి విలువ ఏమిటి?

అంతే కాకుండా బిడ్డలమీద తీపితో ఆమె అలమటిస్తోంది. తల్లీబిడ్డలను దూరంచేసే హక్కు నాకేకాదు... ఈ ప్రపంచంలో ఎవరికీ లేదనే నా ఉద్దేశ్యం. భార్యగా ఆమెను భరించా ల్సిన బాధ్యత నాపై ఉంది. నా బిడ్డల తల్లిగా ఆమెను గౌరవించాల్సిన బాధ్యత నాపైన ఉంది. ఇప్పుడు చెప్పండి, అసహాయ పరిస్థి తిలో బిడ్డలకోసం పరితపిస్తూ వచ్చిన ఆమెను పొమ్మనడం భావ్యమా? మీరైనా నా పరిస్థితిలో నాలాగే ప్రవర్తిస్తారు'' అంటూ ఆయనను సమాధానపరచడానికి శాంతంగా ప్రయ త్నించారు రామారావుగారు.

''నేనా...! నేను ఛస్తే ఇలాగ చేయను. మీ అంత ఔదార్యం నాకు లేదు. నేను మామూలు మనిషిని. రాగద్వేషాలకు అతీతుడను కాను. అయినా ఆ ముక్కుపచ్చలారని పిల్లల భవిత వ్యంకోసం దానిని గెంటేసినా తప్పులేదు. నీచు రాలు... ఎలా రాగలిగిందో సిగ్గులేకుండా!'' అని అసహ్యంగా అన్నారు శర్మగారు.

''పోనీలెండి మామగారూ! జ్వరంతో నీర సించిపోయి మంచాన పడిఉంది. స్త్రీలపైనా... రోగులపైనా మనకు క్రోధమేమిటి? పగ ఏమిటి? భగవంతుడు ఒక్కసారే మన నుదిటి పై ఎలా బతకాలో వ్రాసేస్తాడు. ఆ విధి లిఖితంప్రకారం మనం నడవడం అనివార్యం. జ్వరం తగ్గేవరకు ఆమెకు రక్షణ యివ్వడం మా విధి. జ్వరం తగ్గాక ఆవిడకు ఇష్టం ఉంటే ఇక్కడ ఉంటుంది. లేదా... తన మనసుకి ఎలా తోస్తే అలా చేస్తుంది. మీరు ఈ పూట ఇక్కడ ఉండండి. మీ మనవరాళ్లుతో హాయిగా గడ పండి. రాజా కూడా ఉన్నాడుకదా! మళ్లీ రేపు వాడు వెళ్లిపోతాడు'' అంటున్న రామారావుగారి మాటలను లెక్కచెయ్యకుండా లేచారు శర్మగా రు.

''క్షమించండి, మరో రోజు వచ్చి భోజనం చేస్తాను. ఈ రోజు నాకు కాస్త పని వుంది. మరొకసారి చెపుతున్నాను... దారినపోయే తద్ది నాన్ని ఎందుకు అనవసరంగా నెత్తిన పెట్టు కొంటారు? దాన్ని పంపెయ్యండి... దాని బాధ అదిపడుతుంది. ఎదిగిన పిల్లలగురించి ఆలో చించండి''అంటూ పక్కనే సుందరి పడుకొని ఉన్న గది గుమ్మం దగ్గరకు ఆవేశంగా వచ్చి





నిలుచున్నాడు.

"ఇదిగో! ఇప్పుడే చెపుతున్నాను. నువ్వు ఒక అమ్మకు, అబ్బకు పుట్టినదానవనుకొంటే నీదారిన నీవు ఫో... ఇప్పటికే ఆయన బతుకులో ఆరని చిచ్చుపెట్టావు. ఆయన భగవంతుడు లాంటివాడు కనుక నీకు ఆశ్రయమివ్వగలిగారు. ఇంకా ఆయన బతుకు నాశనం చేయకు. ఈమాత్రం ప్రాణాలతోనైనా బ్రతకనీ. పిల్లలను కాదని నీకు తోచినదారిన తగలడ్డావు. ఆ దారినే ఫో. ఉన్నవాళ్లకైనా మనశ్శాంతి ఉండనీయి" అని కేకలేశారు.

"సుమతీ! నేను వెళుతున్నానమ్మా" అని చెప్పులు వేసుకొని రామారావుగారితో చెప్పి బయలుదేరారు. రఘు, రాజా ఆయన వెనుకే వెళ్లారు.

రామారావుగారికి అయోమయంగా ఉంది. ఏదో తనతో చెప్పి వెళ్లిపోతారనుకొన్నారు... కానీ... సుందరిని ఇలా డైరెక్టుగా తిడతారని అనుకోలేదు. లోపలనుండి సుందరి వెక్కివెక్కి ఏడుస్తున్న శబ్దం వినిపిస్తోంటే ఆయన నిస్తేజంగా ఉండిపోయారు.

కొంతసేపు గడిచాక మాధవిని పిలిచారు. "మీ అత్తయ్యకు కాస్త ధైర్యం చెప్పమ్మా! ఏదైనా తాగుతుందేమో కనుక్కో" అన్నారు. మళ్లీ ఉండబట్టలేక తనే ఆమె గదికి వెళ్లారు. "నీకు తెలియనిదేముంది సుందరీ! మీ నాన్నగారు పెద్దవారు. ఏదో కోపం పట్టలేక అన్నారు. నువ్వేం అనుకోకు. అనవసరంగా దాన్ని గురించి మనసులో ఆలోచించకు. అలా అయితే జ్వరం అసలు తగ్గదు' అని చెప్పి వచ్చేశారు రామారావుగారు.

మర్నాడు రాజా మామయ్యతో శాంత వివాహం గురించి బెంగపడవద్దనీ... ఆయనెప్పుడంటే అప్పుడు తాను వివాహం చేసుకొంటాననీ ధైర్యం చెప్పి వెళ్లాడు. అందరి ప్రాణాలు తెరపిన పడ్డట్లయ్యాయి.

సాయంత్రం రఘుని పిలిచి పడకకుర్చీలో కూర్చోపెట్టమని అడిగారు. ఆయనకు అప్పుడప్పుడూ తోటలో పడక కుర్చీలో కూర్చోడం అలవాటు. ఆ తోట ఆయనకు జ్ఞాపకాల మూట. ఏవో గడచిన మధురస్మృతులను నెమరు వేసుకొంటుంటారు.

ఒక్కోసారి ఆయనకు తను అనవసరంగా ఎక్కువ రోజులు బతికేస్తున్నానా అనిపిస్తుంది. 'మంచాన పడి ఈ బతుకు బతకకపోతే ఏం' అనిపిస్తుంది.

'చావంటే ఏమిటి? మన ఉనికి లేకపోవడం. మన సీటు ఖాళీ ఔతుంది. మిగిలిన సమస్త ప్రపంచం యధావిధిగా నడుస్తుంది. అంతే... ఏదీ ఎవరికోసం ఆగదు. ఈ జీవితచక్రం ఇలా పరిభ్రమించవలసిందే. కష్టాలు, సుఖాలు, కన్నీళ్లు, బాధలు, ఆనందాలు అన్నీ ఇష్టం ఉన్నా లేకపోయినా భరించవల్సిందే. కష్టమని రోజులు ఆగిపోవు. ఇష్టమని నడవకుండా ఉండవు. అందుకే జ్ఞానులైనవాళ్లు ఈ సంసార లంపటాన్ని తగిలించుకోరు' ఇలా రకరకాల ఆలోచనలు ఆయన బుర్రలో... ఎందుకో ఈమధ్యే ఆయనకు బతుకుమీద మరీ విరక్తి కలుగుతోంది.

'పార్వతి పోయింది... అదృష్టవంతురాలు. పసుపుకుంకాలతో వెళ్లిపోయింది. ఎన్నాళ్లు బతికినా ఇదే బతుకుకదా! ఇంక ఏం మార్పు మిగిలివుంది? పార్వతితోనే బతుకుమీద యిచ్చపోయింది. ఆత్మహత్య మహాపాపమని ఆమెను అనుసరించలేక మిగిలివున్నాను' ఆలోచనల రొదతో బరువుగా నిట్టూర్చారు.

'తన జీవితంలో పాలుపంచుకొన్న స్త్రీలు ఇద్దరూ చెరొకరకం. భిన్నధృవాలు. ఒకరు తనకు అంతులేని ఆనందప్రదాతలు. ఇంకొకరు జీవితంలో దుర్భర దుఃఖాన్ని అవమానాన్ని మిగిల్చినవారు. ఒకరు తన అభివృద్ధికి కారకులైతే... ఒకరు తన పతనావస్థకు కారకులు.

పార్వతిమీదకు పోతున్నాయేమిటి... ఈరోజు తన ఆలోచనలు? ఆ తక్కువ జీతంతో... ఎనలేని తృప్తితో తనతో కాపురం చేసింది. తృప్తి, ఆనందం మానవులు భావించటంలోనే ఉందా?

ఏనాడూ నవ్వు చెదరని ఆమె మోము ఆయన కళ్లముందు కదలాడింది. పవిత్రతకు నిలయం నా పార్వతి. అవును ఆమె నా భాగ్యదేవత. కనుకనే ఆమె ఉన్నన్ని రోజులూ తనకు ఏలోటూ లేకుండా గడచింది

సుందరి గురించి ఆలోచనలు మళ్లాయి. 'ఆమె ఉత్తి ఆవేశపరురాలు. ఉధృతంగా పొంగి ప్రవహించే నదిలాంటిది. ఏ ఊళ్లను ఆ ప్రవాహం ముంచుతుందో తెలియదు. ఆనందంయొక్క స్వరూపం తెలియని అజ్ఞానురాలు. ఎండమావులవెంట భ్రమపడి పరుగెత్తి ఓడిపోయిన అభాగ్యురాలు. ఆమెపైన తనకెటువంటి కోపమూ లేదు. ఆమెవల్లనే తాను కష్టాలు, అవమానాలు పడ్డాననుకోడం కూడా అవివేకమే. గీతలో భగవంతుడన్నట్లు ఎవరికర్మకు ఎవరు కర్తలు? జరిగినది... జరుగుతున్నది... జరుగబోయేది... అంతా ఆ భగవంతుడి లీలే. మనమే వీటన్నింటికీ కారకులమనుకోవడం శుద్ధ మూర్ఖత్వం' ఎంత ప్రయత్నించినా తెగని ఆలోచనలు... అయనను ముసురుకొంటున్నాయి.

'స్వామీ! ఈ లౌకిక బంధాలనుండి కడతేర్చి విముక్తిని ప్రసాదించు తండ్రీ!' అని ఆర్తిగా భగవంతుని ధ్యానించుకొన్నారు. నిర్విరామంగా వస్తోన్న ఆలోచనలనుండి దృష్టిని భగవంతునిమీద లగ్నం చేయడానికి మనస్సుని తన స్వాధీనంలోనికి కూడతీనుకొన్నారు.



మిత్రుల విషయంలో రామారావుగారు అదృష్టవంతులు. ఆయనకు దొరికిన అపురూప వరాలు మిత్రులే! అటువంటి మిత్రులే లేకుంటే... ఆయన జీవితం ఏ అవస్థలపాలయ్యేదో!

మధుసూదనంగారి జీవితం... రామారావుగారి జీవితానికి సరిగ్గా వ్యతిరేకం. కుదురుగా, ప్రశాంతంగా ఉండే జీవితసరళి ఆయనది. అనుకూలవతి అయిన భార్య... ఆనందమయమైన జీవితం. ఒడిదుడుకులు లేని నావ లాంటి సంసార జీవితం వాళ్లది.

ఆయనకు భోగభాగ్యాలమీద ఆశలేదు. మగవాడి పేరు ప్రతిష్ఠలకు అదృశ్యహస్తం అర్థాంగి. భర్తలంటే కొందరి ఆడవాళ్లకు డబ్బు, నగలు, సంఘంలో పలుకుబడి సమకూర్చే సింబల్స్ మాత్రమే. కొందరు మాత్రం భర్తలనుండి ప్రేమానురాగాలను కాంక్షిస్తారు... వారితో మానసిక సాన్నిహిత్యాన్ని అభిలషిస్తారు. తద్వారా వారిరువురి అభిప్రాయాలూ, అభిరుచులూ ఒకటే అవుతాయి. సరస్వతమ్మ ఈ కోవకు చెందిన మనిషి కావడం మధుసూదనంగారి అదృష్టం.

ఏనాడూ నగలగూర్చి, చీరలగూర్చి ఆవిడ సాధించి ఎరుగదు. ఆయన ప్రేమగా వేటిని తెస్తే వాటినే స్వీకరించేది. చీకూ చింతా లేని జీవితం. ఆవిడ కూడా బాగా చదువుకొన్నది కావటంవల్ల సంస్కారవంతంగా ప్రవర్తించేది. ముత్యాల్లాంటి ఇద్దరే పిల్లలు.

సుధాకర్, దీప్తి వారిద్దరికీ కన్నులవంటలు. సరస్వతమ్మగారి పెంపకమే... ఒక మంచి తరహాగా ఉండేది. పిల్లలను కొట్టడం, తిట్టడంవంటి పనులు ఆమెకు చేతకావు. వాళ్లు తెలియనితనంతో ఏమైనా అల్లరి చేసినా... గొప్ప సహనంతో వాళ్లకు బోధపడేటట్లు నచ్చచెప్పేవారు. వాళ్ల తప్పులు వాళ్లు తెలిసికొనేటట్లు ప్రవర్తించేవారు.

ఆటల మోజులో గాజు వస్తువులవంటి సామాన్లు బద్దలు కొట్టినా... మొదట వారిని ఏమీ అనకుండా... వాళ్లు గిల్టీగా ఫీలవ్వకుండా మాట్లాడేవారు... వాళ్లు చేసిన పనులవల్ల వచ్చే లాభనష్టాలను బోధపరచేవారు. ఆవిధంగా పిల్లలు అనవసరమైన పనుల జోలికి వెళ్లేవారు కాదు. 'పిల్లలు అల్లరి చేయకపోతే అందం ఏమిటి?' అనేవారు. అలాగని హద్దులు దాటి ప్రవర్తించకుండా... సున్నితంగా ఉండేటట్లు వాళ్లను తీర్చిదిద్దేవారు.

క్లబ్బులో చేరమని మధుసూదనంగారు ఆమెను ఎంతో ప్రోత్సహించేవారు. భార్యని వంటింటి కుందేలుగా కట్టిపడేసే ఆలోచనలంటే ఆయనకు అసహ్యం. ఆవిడ సలహా...

సంప్రదింపులు లేకుండా ఏవనీ చేసేవారు కారు. ఇరుగుపొరుగువాళ్లకు వాళ్ల ఇల్లు ఒక పజిల్‌లాగ అనిపిస్తుంది. 'ఏం ఇల్లమ్మా? ఒక కేకలు వినిపించవు... ఒక తిట్లు వినిపించవు. అసలు వాళ్లు ఇంట్లో ఉన్నారా?' అని ఆశ్చర్య పోతుంటారు.

మధుసూదనంగారి ఆలోచనలు అన్నీ నవ తరానికి చెందినట్లుంటాయి. స్త్రీలను పురుషు లతో సమానంగా గౌరవించాలంటారు. 'సంసార రథానికి స్త్రీపురుషులు చక్రాలవంటి వారు, వాళ్ల అన్యోన్యత ఇరుసువంటిది... ఆ అన్యోన్యతతోనే సంసార రథం సాఫీగా నడు స్తుంద'ని ఆయన అభిప్రాయం. అందుకే భార్య అభిప్రాయాలంటే ఆయనకు గౌరవం. అవి ఎంతో సంస్కారవంతంగా ఉంటాయని ఆయన అభిప్రాయం.

పిల్లలకు సంబంధించిన విషయాలలో కూడా వీలైనంతవరకూ ఆవిడే నిర్ణయిస్తుంటా రు. ఏ విషయాన్నైనా 'యిలా చేస్తే బాగుంటుంది కదండీ?' అంటూ భర్తతో సంప్ర దించి అమలుజరుపుతారు. సుధాకర్, దీప్తి ఎంతో తెలివైన పిల్లలు. చదువులో ఎప్పుడూ ముందుంటారు. తల్లి అంటే విపరీతమైన భయభక్తులు ఉన్నాయి వాళ్లకు. తోటి స్నే హితుల ఇళ్లలో వాళ్లు తగాదాలు పడటం... లేకుంటే వాళ్ల తల్లిదండ్రులు.. ఆ పిల్లలను తిట్టడమో... కొట్టడమో చూడటం జరిగితే వాళ్లు అమితంగా విస్తుపోతారు. తమ ఇంటిలో అటువంటివి మచ్చుకు కూడా ఉండవు. వాళ్లకు తెలిసి నవ్వులు, కేరింతలు తప్ప తిట్లు, దెబ్బలాటలు లేవు.

సరస్వతమ్మగారు పిల్లలు చెప్పిన మాట వినకపోతే... అల్లరిచేస్తే వాళ్లకు సున్నితమైన శిక్ష విధిస్తారు. వాళ్లతో మాట్లాడటం మానేస్తా రు... అంతే దెబ్బకు కాళ్లబేరానికి వస్తారు.

ఒకసారి సుధాకర్ బడికి వెళ్తానని చెప్పి... వెళ్లకుండా స్నేహితుడి ఇంట్లో ఆడుకొంటూ ఉండిపోయాడు. అలా రెండు రోజులు గడిచి పోయాయి. స్నేహితుడి తల్లి ఊరుకెళ్లేసరికి వాళ్లకు చాలా ఆటలు గుర్తుకొచ్చాయి. తీసుకు వెళ్లిన కేరేజీ స్నేహితుడింట్లో పెట్టుకొని తినేవా డు. సాయంత్రం స్కూలు విడిచిపెట్టే టైముకు యింటికొచ్చేవాడు!

మూడోరోజు సరస్వతమ్మగారు షాపింగుకని బయలుదేరి వెళ్తోంటే సుధాకర్ మేడమ్ కని పించింది. "బాబుకు ఒంట్లో బాగాలేదాండీ రెండురోజులునుండి స్కూలుకు రావటంలే దు" అని అడిగేసరికి సరస్వతమ్మగారు అవా క్కయ్యారు.

ఇంటికి వచ్చాక సుధాకర్‌ను పిలిచి అడిగా రు. తల్లిదగ్గర నిజం దాచలేకపోయాడు సుధా కర్. తప్పు ఒప్పుకొన్నాడు.

"నాకు చాలా బాధగా ఉందిరా సుధా! నువ్వు నన్ను మోసం చేస్తున్నానని అనుకొంటు న్నావు. కానీ నిజానికి నిన్ను నీవే మోసం చేసుకొంటున్నావు. అబద్ధాలాడి స్కూలుకి వెళుతున్నట్లు నటించావు. ఎందుకలా చే శావు? నీకు అమ్మ మాటకన్నా నీ మిత్రుడి మాట ఎక్కువైందికదూ! సర్లే! తప్పు చేసినవా రు శిక్ష అనుభవించాలికదా! నేను నిన్ను సరిగా పెంచనందుకు నాకు నేను శిక్ష వేసుకొంటున్నా ను" అని ఆవిడ ఆరోజు భోజనం చేయలేదు. సుధాకర్ ఎంత బతిమాలినా ఆమె అన్నం తినలేదు. తను చేసిన తప్పు ఎలాంటిదో బోధపడింది సుధాకర్‌కి. పోనీ తండ్రిచేత చెప్పి ద్దామన్నా ఆయన ఆరోజు ఊళ్లో లేరు. ఆమె నిరాహారదీక్షకు తల్లడిల్లిపోయాడు. ఆ శిక్షను భరించలేక ఆరోజు రాత్రి నిద్రపట్టలేదు సుధా కర్‌కు. పోనీ! తల్లి తనకు స్వయంగా అన్నం పెట్టినప్పుడు తను కూడా తినకుండా మానేద్దా మంటే... ఆ తప్పుకు తల్లి యింకేవిధమైన శిక్ష విధిస్తుందోనన్న భయం అతనిని పెదవి విప్ప నీకుండా చేసింది.

మర్నాడు తండ్రి రాగానే ఏడ్చి తల్లి తన మూలంగా భోజనం చేయలేదని చెప్పి క్షమించమని అడిగాడు. అది మొదలు తల్లికి తెలియకుండా ఏవనీ చేయలేదు.

పిల్లలు పెద్దలు కలసి సాయంత్రం వేళల్లో కేరమ్స్‌గాని బ్యాట్‌మింటన్‌గాని ఆడుకోవడం చేసేవారు. సినిమాకు వెళ్లినా, షికారుకు వెళ్లినా నలుగురూ కలసి వెళ్లడమే.

సరస్వతమ్మగారిది ఒక కొత్త టెక్నిక్. పిల్ల లకు కొంత వయసు వచ్చేటప్పటికి ఇంటి

గురించి... తమ పరిస్థితుల గురించి వాళ్లకు పూర్తిగా అవగాహన ఏర్పడాలని ఆవిడ ఉద్దేశ్యం. అందుకే సుధాకర్ పదవ తరగతికి వచ్చేసరికి ఇంటి బాధ్యతలను కొన్నింటిని అప్పచెప్పడం మొదలుపెట్టారు. అంతేకాదు కుటుంబానికి సంబంధించిన ప్రతి విషయం పిల్లలతో కలిసి చర్చించేవారు. దానివలన తమ బాధ్యత ఏమిటో పిల్లలకు కూలంకషంగా తెలిసేది.

అక్కరలేని ఆడంబరాలు కావాలని వారు ఎన్నడూ పేచీలు పెట్టేవారు కాదు. డబ్బు విషయంలో జాగ్రత్త అలవడింది. బిడ్డలవల్ల తనకు ఏ సమస్య లేకపోవటంతో మధుసూదనంగారు సాహిత్యకార్యక్రమాల్లో తలమునకలయ్యేవారు.

'జీవించడం ఒక కళ' అని సరస్వతమ్మగారి ఉద్దేశ్యం. పరిస్థితులను అనుకూలంగా తీర్చిదిద్దుకొంటే, జీవితం సుఖశాంతులతో సాగుతుందని ఆవిడ నమ్మకం. విద్యారాహిత్యంవల్లే ఆడవాళ్లు కొంత స్వార్థపరులుగా తయారవడానికి... అవగాహన ఏర్పర్చుకోకపోవడానికి కారణమని ఆమె ఉద్దేశ్యం!

ఆవిడ చేసే పనులు కూడా చాలా ధార్మికంగా ఉంటాయి. ఇరుగు పొరుగులకు ఎవరికి అవసరమైనా తగిన సమయంలో వెళ్లి ఆదుకొంటారు. "భగవంతుడు మనకు ఇచ్చిన జన్మను పదిమందికి ఉపయోగించి ధన్యతమం చేసుకోవాలంటారు.

★ ★ ★

పిల్లలు పెద్ద చదువులకు వచ్చారు. దీప్తి బి.యస్.సి. మొదటి సంవత్సరం చదువుతోంది. సుధాకర్ ఇంజనీరింగు ఆఖరి ఏడాదిలో ఉన్నాడు. ఆడపడుచు సావిత్రికి దీప్తి అంటే ప్రాణం. తన మేనకోడలైన దీప్తిని తన కొడుకుకు యిచ్చి చేయాలని ఎప్పుడో అన్నావదినల దగ్గర మాట తీసుకొంది. అందులో వదినంటే ప్రాణం సావిత్రికి. ఆడువారిలో అటువంటి సమర్థులు అరుదని ఆమె నమ్మకం.

మధుసూదనంగారికి సరస్వతమ్మగారికి రామారావుగారంటే ఎంతో గౌరవం. ఆయన ఒక పుంభావ సరస్వతి అని వారి ఉద్దేశ్యం. ఆయన పాండిత్యం, వ్యక్తిత్వం వారికి ఆదర్శం. ఆయన జీవితంలో సంభవించిన ఒడిదుడుకులకు వారెంతో బాధ పడేవారు. "ఆయనకు స్వాంతన కలిగించడం ఎలాగ?" అని పరితపించేవారు.

సరస్వతమ్మగారికి ఏపనైనా చేసి చూపించడమే అలవాటు. మాటలతో కోటలు కట్టడం ఆవిడకు రుచించదు. రామారావుగారి కుటుంబంగురించి ఆలోచించినప్పుడు ఆమెకు పావనిని తమ కోడలుగా చేసుకొంటే బావుంటుందనిపించింది. పావని అందమైన పిల్ల. చదువు, ఉత్సాహం, పట్టుదల పావనిలో అధికమని ఆమెకు తెలుసును. లోకానికి భయపడక తాను నమ్మిన దారిలో నడిచేవారంటే ఆమెకు విపరీతమైన ఇష్టం. అందుకే పావని ఆమెని ఆకట్టుకుంది. పావనిని చేసుకొంటే తమకు అనుకూలమైన కోడలు వచ్చినట్లుంటుంది. రామారావుగారికి సహాయం చేసినట్లవుతుంది. తన తర్వాత పావని అయితే నిశ్చింతగా యింటి బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించగల పిల్ల అని అనిపించింది.

సరస్వతమ్మగారికి ఏ విషయమైనా దృష్టిలోకి వచ్చిందా... అది కార్యరూపం దిద్దుకోవలసిందే. ఆ రాత్రే భర్తతో తన ఆలోచన చెప్పి పావనిని కోడలుగా చేసుకొంటే ఉభయ తారకంగా ఉంటుందని తన మనసులోని మాటను విడమరిచి చెప్పింది.

పడక గదిలోనికి వస్తే మధుసూదనంగారు ఒక కుర్రవాడైపోతారు. సరస్వతమ్మగారిని చూస్తేనే ఆయనకు ఉత్సాహం తన్నుకొస్తుంది. బయట ఎంత పెద్దమనిషిగా ఉంటారో ఇంట్లో అంత చిలిపిగా ప్రవర్తిస్తారు. ప్రతీ విషయం నవ్వుతూ తీసుకొంటారు.

"అవునోయ్! నీకు అప్పుడే అత్తగారినైపోయి అధికారం చెలాయించాలని మనసు పుట్టిందా? నాకు మాత్రం అంత తొందరగా మామగారిని, తాతగారిని అవ్వాలనిలేదు" అంటూ వేళాకోళం మొదలు పెట్టారు.

"మీరిలా హాస్యాలాడితే నేనేం చెప్పలేను. మీరూ ఆలోచించండి... ఈ సంబంధం విషయంలో సాధక బాధకాల గురించి. రేపు శలవుల్లో సుధాకర్ వస్తాడు... వాడి ఇష్టాన్ని కూడా




అడుగుదాం'' అని ఆవిడ అనడంతో ఆయన హాస్యాలకు స్వస్తిచెప్పి... ఆలోచించడం మొదలుపెట్టారు.

''పావని బంగారంలాంటి పిల్ల, గుణవంతురాలు కష్టసుఖాలు అర్థంచేసుకోగల పిల్ల. తల్లి చెడ్డదైనంత మాత్రాన అమ్మాయిని చేసుకోవడంలో ఏమిటి అభ్యంతరం? ఈ అమ్మాయివ్యక్తిత్వం ఈ అమ్మాయిది. అయినా మనం చిన్ననాటి నుండి చూస్తున్నాం. నిప్పులాంటి పిల్ల. సుధకు ఈడు -జోడు బాగుంటుంది. అయితే నువ్వు మీ అమ్మలక్కల నోళ్లకు కొంచెం పని కల్పించిన దానవవుతావు... ఆపైన నీ యిష్టం. రామారావుగారికి మాత్రం దీనివలన ఎంతో మనశ్శాంతి కలుగుతుంది. భగవంతుడే నీకీ ఆలోచన కల్పించి ఉంటాడు'' అని ఆనందంగా అన్నారు.

''అమ్మలక్కలదేం ఉందిలెండి? నా దగ్గర వాళ్ల మాటలు చేతలు సాగవు. మనకుటుంబం మనయిష్టం. మనకు నచ్చిన, మనం మెచ్చిన పిల్లను ఆహ్వానిస్తాం. లోకంతో సంబంధం ప్రతిమనిషీ ఉంచుకోవాలి. కానీ లోకానికి భయపడి తన బ్రతుకు తను బ్రతకడం మానుకోకూడదు'' అన్నారావిడ.

''అలాగే ఏ రాత్రినీ వృధా చేయకూడదన్నది నా సిద్ధాంతం. అనుకూలమైన వాతావరణంలో అందమైన భార్య ఉండగా యిలా సంభాషణలతో . వృధా అయితే ఏం బావుంటుంది చెప్పు?'' అంటూ ఆమెను కౌగిలిలోనికి తీసుకొన్నారు. అనిర్వచనీయమైన తృప్తితో అతని సందిట గువ్వలాగ ఒదిగిపోయింది సరస్వతమ్మ. తన నిర్ణయాన్ని భర్త బలపరచడం మహదానందంగా ఉంది ఆమెకు. ఆయన ప్రేమ ఒక అమృతపుజల్లు. ఆ జల్లులో ఆపాద మస్తకం తడిసి పునీతమవుతారు ఆవిడ. అటువంటి సహృదయుడైన భర్త లభించినందుకు, భగవంతుడికి సదాకృతజ్ఞతలు చెప్పుకొంటారు.

అనుకొన్నట్లే సుధాకర్ శలవులకు వస్తే పావని విషయం కదిపారు సరస్వతమ్మగారు అన్ని విషయాలు కూలంకషంగా అతనికి వివరించారు.

''బాబూ! సుధా! నీవేదోత్యాగం చేసున్నానని అనుకొని మాత్రం... ఈ వివాహం వప్పుకోవద్దు. పెళ్లి అన్నది నూరేళ్ల పంట. దాన్ని త్యాగాలతో కృతజ్ఞతలతో ముడిపెట్టుకొని సాగనీరాదు. ఆ అమ్మాయి నీకు తగినది అర్హురాలు అని మేం నిర్ణయించుకొన్నాం. నీకూ ఆ నిర్ణయం ఆమోద యోగ్యమైనది అయితేనే చేసుకో.

జీవితమన్నది... ఒక వరం. దాన్ని ఆనందమయంగా తృప్తిగా గడపటం ఒక కళ. సుఖదుఃఖాలను సమానంగా స్వీకరించగలగాలి. కష్టసుఖాలు జీవితం అనే నాణానికి బొమ్మ బొరుసులాంటివి.

దాంపత్య జీవితంలో మొహమాటాలు పనికిరావు. నీవు చేసుకోబోయే పెళ్లి అమ్మకోసం... నాన్నకోసం కాదు కేవలం నీకోసం... నీ ఆనందంకోసం, నీ కష్టసుఖాలలో నీతో నడిచే నీ సహచరురాలికోసం అర్థమైందా?

భార్యంటే కేవలం ఒకదాసి కాదు. పిల్లల్ని కనేయంత్రమూ కాదు. నీకు ఆనందంలో... దుఃఖంలో తోడుగా, నీడగా ఉండవల్సిన మనసున్న మగువ అని గుర్తుపెట్టుకో.

అంతేకాదు పావనిని చేసుకొంటే కొంత లోకాన్ని కూడా ఎదుర్కోవాలి. ఎవరైనా ఎగతాళిగా... వెకిలిగా ఏమైనా అన్నా ధైర్యంగా జవాబు చెప్పగలగాలి. అంతేగాని అటువంటి మాటలకు బాధపడిపోయి... నీ జీవితం నరకం చేసుకొని... ఆ అమ్మాయి జీవితం నరకప్రాయం చేయకూడదు. అర్థమయ్యిందా? ఇందులోని సాధకబాధకాలను జాగ్రత్తగా బేరీజు వేసుకొని ఒక నిర్ణయానికి రా'' అని పలువిధాల సుధాకర్‌కు చెప్పారు సరస్వతమ్మగారు.

సుధాకర్‌కు తల్లి మనసు అర్థమైంది. పావని తెలివైనది. చురుకైనది... అందం, గుణం విషయంలో ఆమెకు వంకపెట్టడానికి లేదు. అందుకే తల్లి నిర్ణయాన్ని మనసారా అభినందించి... ఆమోదముద్ర వేశాడు.

రామారావుగారికి ఎందుకో ఆ రాత్రి పడుకొంటే నిద్రపట్టలేదు. గుండె అంతా బరువుగా అన్పించింది. తెల్లవారుఝామున ఎప్పుడో కలత నిద్ర పట్టింది. ఎదురుగా నవ్వుతూ పార్వతమ్మగారు కనిపించారు. తలనిండా

పూలుపెట్టుకొని... సంపెంగరంగు చీర కట్టు కొని కన్పించింది. భర్త అనారోగ్యానికి ఎంతో ఆవేదన చెందింది. "మీరు ఎవరికీ ద్రోహం చేయలేదు. మీకు ఎప్పుడూ మేలే కలుగు తుంది" అంటూ ప్రేమగా గుండెమీద నిమి రింది. ఆయనకు వెంటనే మెలకువ వచ్చే సింది. ఆయనకు ఆ కల ఎంతో గుర్తుండిపో యింది.

"ఎన్నాళ్ల తర్వాత పార్వతి కనిపించింది. నా పార్వతి నా అవస్థచూసి జాలిపడుతోంది కాబోలు. పిల్లలు లేచిన అలికిడి కాకుండా ఉంటే ఇంకాస్సేపు స్వప్నావస్థనైనా... పార్వతితో గడిపేవాడిని కదా!?" అనుకొన్నారు ఆయన విచారంగా.

ఒకరోజు మధుసూదనంగారు చక్రధరంగా రింటికి వచ్చారు. "మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి. ఒకసారి మాఇంటికి రండి" అంటూ చక్రధరంగారిని ఆహ్వానించి, వారింటికి తీసుకొని వెళ్లారు. మిత్రుడు తనతో చెప్పబోయే విషయం ఏమిటా అని ఆయనకు ఆసక్తిగా ఉన్నా తినబోతూ రుచి అడగడ మెందుకని మౌనంగా ఉండిపోయారు. టిఫిన్, కాఫీలయ్యాక ఉత్సుకతను ఆపుకోలేక, విషయ మేమిటని అడిగారు.

"ఏం లేదండీ! మన ముగ్గురం మంచి స్నేహితులం కదా! ఒకరి కష్టసుఖాలు ఒకరి విగా భావించి జీవిస్తున్నాం ఇంతవరకూ... కానీ రామారావుగారి కుటుంబ పరిస్థితి చాలా దయనీయంగా ఉంది. ఆయనకు మనం ఏవిధంగానూ ఉపయోగపడలేకపోతున్నాం. ఈ విషయం గురించి లోతుగా ఆలోచిస్తేగాని మాకీవిషయం తట్టలేదు. పోనీ! ఏదైనా ఆర్థి కంగా సహాయపడదామంటే అభిమానవంతు డైన రఘు మన సహాయాన్ని అప్పుగానే భావించి తీర్చేస్తున్నాడు" అంటూ అసలు విషయం చెప్పకుండా చక్రధరంగారిని మరింత ఆత్రుతకు గురిచేస్తూ, మాట్లాడారు మధుసూదనంగారు.

"ఆ తండ్రీ కొడుకులులాంటి మనుషులు ఈ రోజులలో ఉండటం చాలా అరుదు అన్న య్యగారూ! అలాంటి వారివల్ల మేం తీసుకొన్న ఈ నిర్ణయం మీకు ఎప్పుడో కలిగిఉంటే, ఎంత బాగుండేది" అంటూ వంతపాడారు మధుసూదనంగారి భార్య సరస్వతమ్మ.

"అబ్బా! నాకు పిచ్చెక్కిస్తున్నారు. నా మెద డుని నిర్దాక్షిణ్యంగా నమిలిమింగేస్తున్నారు మీ రిద్దరూ... అసలు విషయమేమిటో చెప్పండి... నేనీ సస్పెన్స్ భరించలేకపోతున్నాను" అంటూ తలపట్టుకొన్నారు చక్రధరంగారు హాస్యంగా.

"మరేంలేదండీ! రామారావుగారి పెద్ద మ్మాయి శాంతకు వాళ్ల బావతో సంబంధం నిశ్చయమయ్యింది. ఈ ఏడాదితో ఆ అబ్బాయి చదువు అయిపోతుంది. మనం ఏదైనా ఉద్యోగం చూసి వాళ్ల వివాహం జరిపించేద్దాం. ఇకపోతే రెండవ అమ్మాయి ఉందికదా! ఆదే నండీ! పావని, ఆ అమ్మాయి విషయమై మేమొక ఆలోచనచేశాం" అని ఆగారు.

"ఏమిటా ఆలోచన? ఆ పిల్లకు మీరేదైనా సంబంధం చూశారా?" అని అడిగారు చక్రధ రంగారు.

"అదేం కాదండీ మా అబ్బాయి సుధాకర్‌కి ఆ అమ్మాయిని చేసుకొందామని అంటోంది మా ఆవిడ. పిల్ల తెలివైనది, గుణవంతురాలు చక్కగా చదువుకొంటుంది. పెద్దలంటే భయ భక్తులున్నాయి. మనకు కట్నకానుకలు ము ఖ్యంకాదు. అందుకే మేమిద్దరం మా సుధాకర్ అభిప్రాయాన్ని అడిగాం.. వాడికి ఈ ఏడాదితో ఇంజనీరింగు పూర్తవుతుంది. వాడు మా కోరిక ను కాదనలేదు. వెంటనే ఒప్పుకొన్నాడు. అందుచేత మీతో సంప్రదించి మా నెయ్యం వారితో వియ్యంగా మార్చుకొందామని మిమ్మ ల్ని పిలిచాను" అని అసలు విషయం చెప్పా రు.

చక్రధరంగారు ఆనందంతో మాట్లాడలేకపో యారు. కాసేపాగి ఆయన చేతులు పుచ్చుకుని "ఇంతటి శుభవార్త నా జీవితంలో నేనెప్పుడూ వినలేదు. నిజమైన స్నేహితులంటే మీరే. స్నేహితుని ఆవేదనను అర్థంచేసుకొని... దాన్ని ఉపశమింపచేయటం మీ అంతట మీరే ముందుకి వచ్చారు" అంటూ సరస్వతమ్మగారి వైపు చూసి "స్త్రీజాతికే మీరు గర్వకారణమ మ్మా!" అన్నారు.

"మనదేముంది చక్రధరంగారూ! రామారావుగారి లాంటి మంచి వ్యక్తులు ఉండటం అరుదు. అటువంటి వ్యక్తికి మిత్రులమైనందుకు ఆపదలలోనున్న ఆయనకు ఈ మాత్రం చేయూతనివ్వడం మనధర్మం. పెద్దలు చేసిన తప్పిదాలకు పిల్లల జీవితాలు బలి అవ్వకూడదు. పావని, మంచి అర్హతలున్న అమ్మాయి. ఆ అమ్మాయిని కోడలుగా చేసుకోవడానికి నిర్ణయించుకున్నాం అంతే" అన్నారు మధుసూదనంగారు.

"మీ దంపతుల నిర్ణయం వలన నాకు చాలా ఆనందంగా ఉంది. మీకు యిప్పుడే చెప్తున్నాను. ఈ పెళ్లి నకల లాంఛనములతో వైభవోపేతంగా చేసేపూచీ నాది. ఈ విషయంలో మీరు నాకు అడ్డు చెప్పకూడదు. ఎంత కట్నకానుకలు లేకుండా మీరు చేసుకోవాలని అనుకొన్నా మీకు ఉన్నది ఒక్కగానొక్క కొడుకు. అందుచేత అతని పెళ్లి వైభవంగా జరగాలని నా కోరిక. మనం బయట లోకాన్ని ఉద్ధరించటంలేదు. ప్రాణస్నేహితులం ఒకరి కొకరు సహకారంగా ఉన్నట్లుంటుంది. ఈ రోజు చాలా సుదినం మనం సాయంత్రం ఈ విషయం రామారావుగారి చెవిని వేద్దాం. మీరు మా ఇంటికి రండి. యిద్దరం కలిసి వెళ్దాం" అన్నారు చక్రధరంగారు. తర్వాత వాళ్ల వద్ద శలవు తీసుకొని యింటికి ఆనందంగా బయలుదేరారు.

ఆయనకు మేఘాలలో తేలిపోతున్నట్లుంది. "నిజంగా మధుసూదనంగారు ఎంత మంచి మిత్రులు" అని అనుకొన్నారు. ఇంటికి రాగానే భార్యాపిల్లలను పిలిచి విషయం చెప్పారు. ఈ ఆనందాన్ని అందరితో పంచుకోవాలని ఉంది ఆయనకు.

"వాళ్లు చాలా మంచి నిర్ణయం తీసుకొన్నారు నాన్నా! ఈ రోజుల్లో వ్యక్తికి డబ్బును బట్టి హోదాను బట్టి గౌరవం లభిస్తుంది. కానీ అది సరియైన పద్ధతికాదు. మనిషి గుణానికి విలువ నివ్వాలి. పావని మంచి అమ్మాయి. చక్కటి రూపం. చదువు సంస్కారం ఉన్న మనిషి. అలాంటి అమ్మాయి పరిస్థితుల విషవలయంలో నలిగిపోకుండా మీ స్నేహితులు ఎంతో మంచి నిర్ణయాన్ని తీసుకొన్నారు. మీ స్నేహబంధం మా అందరికి ఎంతో గర్వకారణం" అంటూ ఆనందాతిశయంతో చెప్పింది ఝాన్సీ.

సాయంత్రం అనుకొన్న ప్రకారం మధుసూదనంగారు రావటంతో చక్రధరంగారు ఆయనతో కలిసి రామారావుగారింటికి వెళ్లారు. మిత్రద్వయాన్ని సాదరంగా ఆహ్వానించారు రామారావుగారు. స్నేహితులు ముగ్గురూ కుశల ప్రశ్నలు వేసుకొన్నారు. సుందరి ఆరోగ్యంగురించి కూడా వాళ్లు అడిగితెలుసుకొన్నారు.

"మీతో ఒక ఆనందదాయకమైన విషయం చెపుదామని వచ్చాం. మరి మీ కోడలితో చెప్పి మా నోరు తీపిచేయించండి" అన్నారు చక్రధరంగారు.

అప్పుడే లోనికి వచ్చిన రఘు నవ్వుతూ వాళ్లను పలుకరించాడు.

"రావోయ్ రఘూ! సమయానికి వచ్చావు... కూర్చో" అంటూ రఘుని కూర్చోపెట్టారు మధుసూదనంగారు. సుందరికి మందులిస్తూ వాళ్ల మాటలను ఆలకిస్తున్న సుమతి "విషయమేమిటా?" అని ఆసక్తిగా ఆగింది.

"మధుసూదనంగారూ... సరస్వతమ్మగారూ మీ రెండో అమ్మాయి పావనిని తమ కోడలిగా చేసుకోందామనుకొంటున్నారు. ఈ ఏడాదితో వారబ్బాయి చదువు పూర్తౌతుందికదా! వెంటనే పెళ్లిచేసేద్దాం. ఈ రోజే పిలిచివాళ్లు నాతో ఈ విషయం చెప్పారు. నానోటితో ఈ విషయం చెప్పడం నాకెంతో ఆనందంగా ఉంది. అంతేకాదు ఈ పెళ్లి ఘనంగా జరిపించే బాధ్యత పూర్తిగా నాది" అని చెప్పారు చక్రధరంగారు.

ఆనందోద్వేగంతో రామారావుగారి నోటి వెంట మాటరాలేదు. గొంతు మూగబోవటంతో... మధుసూదనంగారి చేతులు తన చేతితో తీసుకొని కళ్లకద్దుకున్నారు రామారావుగారు. ఆయన పొందుతున్న ఆనందం వాళ్లకు స్పష్టంగా తెలుస్తోంది.

ఇంత మంచి అవకాశం తనకిచ్చినందుకు భగవంతునికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నారు మధుసూదనంగారు.

నేను వింటున్న మాటలు నిజమేనా! భగ




వంతుడు నా ఆర్తి తీర్చడానికి మీ రూపంలో వచ్చి ఉంటాడు. నా మీద మీకు ఎంత కరుణ! ఎంత దయ! నేనేం చేస్తే మీ ఋణం తీర్చుకోగలను?'' అంటూ ఆనందంతో ఉక్కిరి బిక్కిరైపోతున్నారు రామారావుగారు.

''ఎంతమంచి స్నేహితులను భగవంతుడు తనకు ప్రసాదించాడు! నా బాధను అర్థంచేసుకొని స్పందించే మిత్రులను నాకు యిచ్చాడు. ఆ భగవంతునికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి అయినా...'' ఆయన భావపరంపరలకు అనకట్టపడింది. ఆయన మస్తిష్కం కాస్త లోతుగా ఆలోచించడం మొదలుపెట్టింది. కొంతతడవు కళ్ళుమూసుకొన్నారు.

''మీ మిత్రుడు పేదవాడు. అనారోగ్యంతో చావు కోసం ఎదురుచూస్తున్నవాడు. కీర్తిప్రతిష్ఠలు కలవాడుకాదు. పైపెచ్చు మా కుటుంబం మీద ఉన్న మచ్చ మీకు తెలును. అయినా సహృదయతతో మీరిలా ఆదుకోబూనుకొన్నారు. నా ఈ అదృష్టం నాకే నమ్మశక్యం కాకుంది. మిత్రునిగా ఈ స్నేహితుని మీద జాలి చూపించినా... మీ అబ్బాయితో మా చెల్లెలు సరస్వతమ్మతో అన్ని విషయాలు చెప్పండి. వాళ్ళు కూడా మనస్ఫూర్తిగా యిష్టపడితేనే ఈ నిర్ణయానికి రండి'' అని నిజాయితీగా అర్థించారు రామారావుగారు.

''మీరేవిషయంలోనూ సందేహించవద్దు... మేము అందరం కలిసి మాట్లాడుకొనే ఒక నిర్ణయానికి వచ్చాం. మీరు ప్రశాంతంగా ఉండండి. మీవంటి దయార్ద్ర హృదయులతో, సరస్వతీమూర్తులతో వియ్యమందడం మా అదృష్టంగా మేమంతా భావిస్తున్నాం. దయచేసి మిమ్మల్ని మీరు కించపరచుకోవద్దు. విధి ప్రేరణవల్ల ఏదో జరిగినంతమాత్రాన అది మీ జీవితానికేం మచ్చ కాదు. మీ స్నేహితులుగా మా ప్రగాఢ నమ్మకం అది'' అన్నారు మధుసూదనంగారు.

లోపలనుండి వీళ్ళ సంభాషణ వింటోన్న సుందరి ఉలిక్కిపడింది. అంతటి ఆనందనమయంలో తానొక అపశృతిలాగ వారికి దాపురించినందుకు దుఃఖపడింది. అయినా ఆదర్శవంతమైన వారి నిర్ణయాలను ఆలకించి కాస్త కుదుటపడింది.

''మీరే విషయం ఆలోచించకండి. అన్నీ భగవంతుని దయవల్ల సక్రమంగా జరుగుతాయి. మన స్నేహానికి ఈరోజుకి ఒక పరమార్థం లభించింది. ఆ తృప్తి మనకు చాలు. మీరు మీ ఆరోగ్యం కుదుటపరచుకోండి. బాబూ రఘూ! నాన్నగారిని జాగ్రత్తగా చూసుకో... మరి మేం వెళ్ళివస్తాం'' అని చెప్పి వాళ్ళవద్ద శలవు తీసుకొన్నారు చక్రధరంగారు, మధుసూదనంగారితోసహా.

రామారావుగారు ఎంతో ఆనందంగా ఉన్నారు. సుమతిని, శాంతను పిలిచారు. ''ఒక్కసారి నన్ను తోటలోనికి తీసుకెళ్ళండమ్మా!'' అని అడిగారు. ఆయనకు అనారోగ్యం వచ్చిన తరువాత తోటలోనికి వెళ్ళి ఎరగరు. రఘుని పిలిచి, సుమతి అతని సాయంతో ఆయనను తోటలోనికి తీసుకొని వెళ్ళింది.

శాంత తండ్రిని ఆశ్చర్యంగా చూస్తోంది. ఆయన ఇంత ఆనందంగా ఉండటం ఆమె ఏనాడూ చూడలేదు. తాము తండ్రికి ఎంత భారంగా ఉన్నారో... తమ విషయంమై ఆయన ఎంత వ్యధను అనుభవిస్తున్నారో ఆమెకు స్పష్టంగా బోధపడింది. 'తల్లిదండ్రులకు ఆడపిల్లల పెళ్ళిళ్ళ విషయమై ఇంత బెంగ, బరువు ఉంటుందా! అందుకేకాబోలు ఆడపిల్లలు ఎదిగాక గుండెలమీద కుంపటి... అంటారు పెద్దలు' అని తనలోతాను అనుకొంది.

రామారావుగారు సుమతిని, శాంతను పిలిచి పాయసం,పులిహోరచెయ్యమన్నారు. ''ఇప్పుడా మామయ్యా!'' అని ఆశ్చర్యపోయింది సుమతి. ''పోనీ! పాయసం అయినా చేయండమ్మా! బజారునుంచి ఏదైనా హాట్, అరటిపళ్ళు తెప్పించుకొండి'' అని చెప్పారు. వాళ్ళు ఆయన ఆనందాన్ని అర్థం చేసుకొన్నారు. అందుకే గబగబా పాయసం చేయడానికి వంటింట్లోకి వెళ్ళింది సుమతి.

రామారావుగారు శాంతను, పావనిని దగ్గరకు తీసుకొన్నారు. ''నేనెంత అదృష్టవంతుణ్ని! ఈ అనారోగ్యంతో జీవితం మీద ఆశ కోల్పోయిన నేను మీకు పెళ్ళిళ్ళు చేయగలనా? నా బాధ్యత నెరవేర్చగలనా? అని భయపడ్డాను. నా మొర భగవంతుడు ఆలకించాడు. అందుకే నా బిడ్డలకు మంచి సంబంధాలు



కుదిర్చాడు - అడక్కుండానే వరమిచ్చాడు.

"అమ్మా! మీరెప్పుడూ మీ భర్తలకు కష్టం కలిగించవద్దు మిమ్మల్ని ఉదార హృదయంతో చేపడుతున్నందుకు వారిపట్ల సదా కృతజ్ఞతతో మెలగండి. ఏనాడూ బాధ్యతలను విస్మరించ కండి. ఇదే నా కోరిక" అంటూ పిల్లల తలలు నిమిరాడు. సుమ కూడా నెమ్మదిగా ఆయనవ ద్దకు చేరింది. "అమ్మా! ఈరోజు మీరందరూ నా గదిలో భోంచెయ్యండి. మీ అందర్నీ తృప్తిగా కళ్లారా చూసుకొంటాను" అని అన్నారు కళ్లు చెమర్చగా.

"ఏమిటి నాన్నా! మీరు మరీను. ఎందు కంతగా ఆవేశపడుతున్నారు. డాక్టరు చెప్ప లేదా? మీరు ప్రశాంతంగా ఉండండి. కళ్యాణం వచ్చినా, కక్కొచ్చినా ఆగదని మీరె ప్పుడూ అంటుంటారుకదా!" అంటూ ఆయ న్ని మామూలు పరిస్థితికి తేవడానికి ప్రయ త్నించింది శాంత.

"మీకేం భయంలేదమ్మా! మీ నాన్నకు ఏమీ కాదు. ఈ రోజు నా మనస్సు దూదిపింజలా తేలిపోతోంది. ఈ ఆనందం బిడ్డలతోకాక మరె వరితో పంచుకోను!" అన్నారు ఆనందాతిరే కంతో.

పిల్లలందరూ ఆనందంగా తండ్రి గదిలోనే భోజనాలు పూర్తిచేశారు. రామారావుగారు రఘుని పిలిచి దగ్గర కూర్చోపెట్టుకొని పెళ్లికి ఎలా లాంఛనాలు జరపాలో... ఇంట్లో ఉంచిన డబ్బు, ఆయనకు ఇన్సూరెన్సునుండి వచ్చిన డబ్బు... ఏమేమి ఎలా చెయ్యాలో అన్ని విష యాలు ఉత్సాహంగా చర్చించారు.

"వాళ్లు కోరి చేసుకొంటున్నారని మనం తక్కువ చేయవద్దు. మనకి చేతనైనంత ఘనంగానే చెల్లెళ్ల వివాహాలు చేద్దాం" అన్నా రు.

ఝాన్సీ పావనిని అభినందించడానికి వచ్చింది. "చూశావా! నేనైతే కష్టపడి సంబంధం వెతుక్కొని మరీ మా నాన్నగారికి చెప్పవలసి వచ్చింది. అమ్మో... నువ్వు అలా కాదు, సుధాకర్‌ని బాగా మెత్తపరచి, వారి నుండే ఆహ్వానం అందుకున్నావు. ఏమైనా గడుసుపిల్లవి" అంటూ వేళాకోళం చేసింది.

"ఇదిగో ఝాన్సీ! ఆ ప్రేమేమిటో! ఆ కట్టుకో వడం ఏమిటో! నీకే తెలియాలి. ఒకే కాలేజీలో ఉన్నారుగనుక మీ పని హాయి. నేనా యిల్లు వదలని పిల్లని, నాకు అవేం తెలియవు" అంటూ వెక్కిరించింది పావని.

సుమతి, శాంత వాళ్ల కబుర్లకు నవ్వుకొన్నా రు.

కాంతమ్మగారివద్దకు వెళ్లి చెల్లెళ్ల పెళ్లి వార్త లు చెప్పేడు రఘు. ఆవిడ, శర్మగారు ఎంతో ఆనందించారు. మాటవరసకైనా వారు సుందరి గురించి అడగలేదు. రఘు మనసు లోనే నొచ్చుకొన్నాడు.

ఆరోజు సుందరి తోటలో కూర్చొంది. ఆమెకు ఒంట్లో కాస్త శక్తి వచ్చినట్లుంది. సు మని పిలిచి దగ్గరగా తీసుకొంది. నుదిటిమీద ముద్దు పెట్టుకొంది. "నన్నెప్పుడూ మరచిపోవు కదమ్మా!" అని అడిగింది.

"అదేమిటండీ మీరు ఇక్కడే ఉంటారు కదా! మా వదిన చెప్పింది. మిమ్మల్ని 'అమ్మా!' అని పిలవాలని కూడా చెప్పింది. మరి ఎందుకు మరచిపోతాను?" అంటూ కళ్లు చక్రా ల్లా తిప్పుతూ అడిగింది సుమ.

అక్కడే ఉన్న మాధవి వాళ్ల సంభాషణ ఆసక్తిగా వింటోంది.

"మీ పెద్దత్తయ్య చాలా మంచిదమ్మా! నేను ఆవేదన పడుతున్నానని నా బాధను అర్థంచే సుకొని నా సమస్యలను తీర్చింది. ఆమెపై నుండి దయచూపకపోతే యివన్నీ జరగవు" అని మాధవిని ఉద్దేశించి చెప్పింది సుందరి. మాధవికి ఏం మాట్లాడాలో అర్థంకాక మౌనంగా వింటోంది.

"నిజమమ్మా! మనుషులు చనిపోయినా వారి ఆత్మలు, మనల్ని చుట్టుముట్టే ఉంటాయి. మన సుఖదుఃఖాలను అవికూడా అనుభవిస్తాయి. స్వజనానికి కష్టాలు వస్తే అవి నివారణ చేస్తుంటాయి" అని ఆకాశంలోనికి చూస్తూ అంది. 'ఆమె అన్నట్లు తన తల్లి దండ్రులు కూడా తమని చల్లగా చూడకపోతే తాను, తమ్ముడు ఈరోజు సంతోషంగా ఉండలే రుకదా!' అని మాధవి మనసులోనే అనుకొంది.

సుందరికి ఎంత ఆలోచించినా తానలా ఆ యింట్లోనే ఉండిపోవటానికి అర్హత స్ఫురించలే దు. "వాళ్లంతా సున్నితహృదయులు, సంస్కా





రవంతులు. తనమూలంగా ఎన్ని అవస్థలు అనుభవించినా... తన తప్పులను క్షమించగలి గారు. స్వంత తల్లిదండ్రులు తనను చూడ నిరాకరించారు. తనను అసహ్యించుకొన్నారు. తను చనిపోయినట్లే నిర్ణయించుకున్నారు. మరి వీరో..? తనను సేదతీర్చారు. అనారోగ్యంతో వున్న తనకు సేవలు చేశారు. తమ జీవన స్రవంతిలో తనను చేర్చుకోవడానికే నిర్ణయించుకొన్నారు. ఎంతటి ఔన్నత్యం! వాళ్ల సంస్కారానికి తను చేతులెత్తి నమస్కరించవలసిందే. మాధవి, సుమతి నిజంగా దేవతలు. వారు చేసిన సేవలు మరువరానివి. సుమతి ఆ యింటికి వన్నెతెచ్చే కోడలు. నిర్దాక్షిణ్యంగా తాను వదిలి వెళ్లిన పిల్లలను వయసులో చిన్నదైనా, కన్నతల్లికన్న మిన్నగా సాకుతోంది. నిజంగా రఘు కి తగిన అర్ధాంగి. రఘు కూడా తండ్రిలాగ ఎంతో ఉదాత్తమైన గుణగణాలు కలవాడు. తాను యింకా అక్కడ ఉండి వారి సుఖసంతోషాలను కొల్లగొట్టకూడదు. మర్యాదగా వీరి మధ్యనుండి తప్పుకోవాలి'' అనుకొంటూ బల్మవంతంగా కళ్లు మూసుకొంది.

రెండురోజుల తరువాత చక్రధరంగారు, మధుసూదనంగారు వచ్చి, ఝాన్సీ పెళ్లితోబాటు శాంత, పావనిల పెళ్ళిళ్ళు కూడా జరిపిద్దామా అని సంప్రదించారు. శాంత పెళ్లి ప్రస్తుతం జరిపిద్దాం, ఆరు మాసాలు పోయిన తర్వాత పావని పెళ్లి చేద్దామని మాధవితో, సుమతితో చర్చించి నిర్ణయం చెప్పారు రామారావుగారు. మధుసూదనంగారికి కూడా ఈ ఆలోచన నచ్చింది. ఆ ప్రకారమే చేద్దామని నిర్ణయించుకొన్నారు మిత్రత్రయం.



ఒకనాడు మధ్యాహ్నం అందరూ నిద్రపోతుండగా సుందరి బయటకు బయలుదేరింది. ఆమెకు సరస్వతమ్మగారిని కలిసి కృతజ్ఞతలు చెప్పాలని గాఢంగా కోరిక కలిగింది. మాధవి తన భర్తకు చెల్లెలు కూతురు. అంతేకాకుండా తన భర్త ఆదరణతో యింతవారమయ్యామన్న కృతజ్ఞతతో... తన తమ్మునికి శాంతను చేసుకోవచ్చు. కానీ సరస్వతమ్మగారికి ఈ విధమైన నిర్ణయం తీసుకోవడంలో ప్రత్యేకమైన లాభమేమీ లేదు. కేవలం తన భర్త స్నేహాన్ని గౌరవించి, పావనిని తన కోడలుగా ఆహ్వానించడానికి నిర్ణయించుకొంది. ఎంతో దయతో ఒక కుటుంబాన్ని ఆదుకొంటోంది. అటువంటి ఆమెను కలిసి ఆమె పాదాల నంటి కృతజ్ఞత చెప్పుకోవాలని బయలుదేరింది.

మధుసూదనంగారింటికి చేరేసరికి ఆమెకు ఏదో తెలియని కంగారు ప్రారంభమయ్యింది. వారు తనను చూసి ఏమంటారోనన్న భయం ఒక్కసారి ఉప్పెనలా ముంచుకొచ్చింది. గుమ్మం చేరకముందే లోపల్నుంచి మాటలు వినిపిస్తుంటే పక్కకు జరిగి నిలబడింది. లోన నలుగురైదుగురు ఆడవాళ్లు మాట్లాడుకుంటున్నారు.

“మీరు వంద చెప్పండి... వెయ్యి చెప్పండి. మీరు ఆ రామారావుగారి అమ్మాయిని కోడలిగా చేసుకోవడం మాకెవ్వరికీ నచ్చలేదు'' అంటోందొక ఆడ గొంతుక.

“మీకు ఒక్కగానొక్క కొడుకు... మంచి సంబంధం చూసి చెయ్యవచ్చునుకదా! మీకు ఈ తల్లి లేచిపోయిన పిల్ల సంబంధమే దొరికిందా? మీ శ్రీవారికి మీరు బోధపరచండి'' మరొకామె సలహా.

“ఉండండి ముందుగా మీకు కాఫీలు తెస్తాను. తర్వాత మనం మాట్లాడుకోవచ్చు'' సరస్వతమ్మగారి కంఠం ధ్వనించింది. ఆమె కాఫీలు తేవడానికి, లోనికి వెళ్లినట్లుంది.

ఆవిడ లోనికి వెళ్లడమే తరువాయి మెల్లగా గుసగుసలు ప్రారంభమయ్యాయి. సుందరి ఓరగా నించొని... చెవులప్పగించి వింటోంది వాళ్ల మాటలు.

“ఆఁ... ఎవరికి తెలియని భాగోతం... ఏదో

త్యాగం చేశామని నలుగురిలో చాటుకోడానికి కాకపోతే ఎందుకండీ యిలాంటి వివాహాలు?'' అని ఒకామె బుగ్గలు నొక్కుకుంది.

''అంతేకాదండోయ్! ఏదో జాలి తలచి కోడలిని చేసుకొన్నామని చెప్పి ఆమెచేత బండెడు చాకిరీ చేయించుకోవచ్చు... వంట మనిషిని, పనిమనిషిని పెట్టుకోనవసరంలేదు'' మరొక మహిళామూర్తి వంతపాడింది.

''చదువుకొన్న పిల్లాయే... ఉద్యోగం చేయించి, ఆమె జీతంతో హాయిగా కాలుమీద కాలేసుకొని కులకొచ్చు'' మరొకరు వాళ్లు కట్నకానుకలు లేకుండా చేసుకోడానికిగల కారణాలు వివరించారు.

సరస్వతమ్మగారి స్వభావం తెలిసి, ఆవిడ మీద గౌరవంగల ఒకామెమాత్రం ''ప్రపంచంలో అందర్నీ మెప్పించడం ఎవరివల్లా కాదు. వాళ్లు ఎంతో ఆదర్శంతో, సంస్కారంతో, స్నేహధర్మంతో... తీసుకొన్న నిర్ణయంవల్ల మనం యిలా కామెంట్సు చేసుకోడం కుసంస్కారం అనిపిస్తుంది'' అని ఘాటుగా విమర్శించింది.

''ఏంచేస్తాం? మేము మామూలు సాదా గృహిణులం. మీలాగ బి.ఏ.లు, ఎం.ఏ.లు చదివినవాళ్లం కాము. మాకున్న సంస్కారం మాది. ఏదో స్నేహంకొద్దీ మాకు తోచిన సలహా చెప్పదలిచాం'' అంటూ సమాధానం చెప్తోంది యింకొక అతివ.

ఇంతలో చేతిలో ట్రేతో కాఫీలు, బిస్కట్లు పట్టుకొచ్చారు సరస్వతమ్మగారు. ''ఏమిటీ? చదువూ... సంస్కారం అంటూ హాట్‌హాట్ గా చర్చించేస్తున్నారు? ముందు వీటిని తీసుకోండి తర్వాత ఎన్ని చర్చలు జరిపినా నాకు అభ్యంతరం లేదు'' అంటూ అందరికీ అందించారు.

''మీ మాటలు, సందేహాలు నాకు పూర్తిగా వినిపిస్తున్నాయి. మావారు సహృదయులు. మేము ఒకరి అభిప్రాయాలను మరొకరం పరస్పరం గౌరవించుకొంటాం. ఎవరి మెప్పుకోసం... ఎవరి పొగడ్తలకోసం మేమీ నిర్ణయం తీసుకోలేదు. ఎవరేమనుకొన్నా కేవలం స్నేహధర్మంకోసం... లోకంతో పనిలేకుండా మేము త్రికరణశుద్ధిగా ఈ సంబంధం చేసుకోడానికి నిర్ణయించుకొన్నాం'' అని నవ్వుతూ చెప్పారు సరస్వతమ్మగారు.

''అది కాదండీ! మీరు దూరంగా ఆలోచించటంలేదు. ఆ పావని తండ్రి మంచివాడే కానీ ఆమె తల్లి సంగతి మీకు తెలిసిందే కదా! మీరీ సంబంధం చేసుకొంటే రేపు మీ అమ్మాయి సంబంధం కష్టమౌతుంది కదా?'' అని ప్రశ్నార్థకంగా చూచింది వారిలో ఒకామె.

''చూడండీ... తల్లిలాగే కూతురుంటుందని నమ్మకమేమిటి? ఆ అమ్మాయి ఎంత బుద్ధిమంతురాలో ఎంత తెలివైనదో మాకు తెలుసు. అన్నింటిలో ఎన్ని బహుమతులు పుచ్చుకొంటుందో మనం చూడటం లేదా? అయినా తల్లి చేసిన తప్పుకు పిల్లలు శిక్షింపబడాలా? పద్మం బురదలో పుట్టినంతమాత్రాన దాని వికాసం తగ్గుతుందా? ఇంక మా అమ్మాయి పెళ్లి విషయమంటారా... దానికి ఏనాడో మా అన్నయ్యగారి అబ్బాయితో సంబంధం నిశ్చయమయ్యింది. ఈ సంబంధం చేసుకోడానికి అడ్డుచెప్పే కుసంస్కారులు కాదు వాళ్లు. అందుచేత దయచేసి మరెవ్వరూ ఈ విషయం గూర్చి ప్రస్తావించవద్దు'' అని దృఢచిత్తంతో చెప్పారు సరస్వతమ్మగారు.

సుందరి భారమైన మనసుతో ఎవ్వరూ గమనించకుండా బయటకు వచ్చేసింది. ఆమె మనస్సంతా గందరగోళంగా ఉంది. వారి మాటలు విన్న తర్వాత . సరస్వతమ్మగారికి ఎదురుపడే ధైర్యం చాలలేదామెకు. తన వలన పిల్లల జీవితంలో ఇన్ని సమస్యలు వస్తాయని, వారిని సంఘం ఇంకా విమర్శిస్తోందని ఆమె గుర్తించలేకపోయింది. క్షణికావేశంలో చేసినపని ఎటువంటి ఫలితాలు ఇస్తుందో అవగతమయ్యింది. చివరికి ఎలాగో ఆమె ఇంటికి చేరింది.

అప్పటికే ఆమె కనపడకపోయేసరికి ఇంట్లో అంతా కంగారు పడుతున్నారు. పోనీ ఊరు వెళ్లిపోయిందా అనుకొంటే... చెప్పకుండా వెళ్లదు కదా! బట్టలు ఇక్కడే వదిలెయ్యదు కదా! అసలే జ్వరంతో నీరసించి పోయిఉన్న ఆమె ఒక్కర్తీ ఎలావెళ్లిందో అని భయపడ్డారు.

శాంత మాత్రం ''అమ్మమ్మగారింటికి





వెళ్లిందేమో?'' అని అనుమానం వ్యక్తం చేసింది. వెంటనే సుమ తాతగారింటికి బయలుదేరింది. మాధవి, సుమతులకు... ఆమె కన్నవారింటికి వెళుతుందన్న నమ్మకం లేదు. వాళ్లలో వాళ్లే తర్జన భర్జనలు పడ్డారు తప్ప, రామారావుగారికి ఈ వార్త తెలియనివ్వలేదు.

భారంగా అడుగులు వేస్తూ వస్తున్న సుందరిని చూచేటప్పటికి ఏదో జరిగిందన్న విషయం వారికి బోధపడింది'' మీరు ఎక్కడికి వెళ్లారా!? అని మేమంతా ఒకటే గాభరాపడుతున్నాం. మీకు ఏమైనా కావలసివస్తే తెచ్చి యిచ్చే వాళ్లంకదా! నీరసంతో మీరెందుకు బయటకు వెళ్లడం?'' అని ప్రేమగా మందలించింది సుమతి.

''ఏమిటత్తయ్యా! మీరెక్కడికైనా వెళ్లాలనుకొంటే మేం ఎవరో..ఒకళ్లం సాయం వచ్చేవారంకదా! ఒకవేళ మీ అమ్మగారింటికి వెళ్లేరేమోనని... చూసి రమ్మని సుమని పంపించాం'' అంటూ ఆవిడకు హార్లిక్స్ కలిపి ఇచ్చింది మాధవి.

''లేదమ్మా! మీకెవరికీ చెప్పకుండా వెళ్లడం తప్పే. పనుల్లో ఉన్నారు కదా అని ఒక్కదాన్నే వెళ్ళాను. గోదావరి గట్టు మీద కాస్సేపు గడిపి వచ్చాను. మీరు కంగారు పడతారని ఆలోచించలేదు. ఏమీ అనుకోకండేం'' అంటూ సర్దిచెప్పి గదిలోకి వెళ్లి పక్కమీద వాలింది నీరసంగా.

''ఏమిటే! అలాగ పగరుస్తూ వస్తున్నావు? నాన్నగారికి బాగుంది కదా?'' అని ఎదురొచ్చి సుమను కంగారుగా అడిగింది కాంతమ్మ.

''అమ్మ ఇంట్లోలేదు. ఎక్కడికి వెళ్లిందో తెలియలేదు. ఇక్కడకుగాని వచ్చిందేమో చూద్దామని వచ్చాను, అమ్మమ్మా!'' అంది సుమ.

''అయ్యయ్యో! మీకుగాని మతిపోయిందా ఏమిట్రా! ఆ దౌర్భాగ్యురాలికోసం వెతకడం కూడానా? ఎక్కడినుండి వచ్చిందో అక్కడికే పోయి ఉంటుంది. తగుదునమ్మా అని అది సిగ్గులేక రావడం మీరు దాన్ని ఆహ్వానించి సపర్యలు చేయడం! మీ నాన్నగారు దేముడి లాంటి మనిషి కాబట్టి దాన్ని క్షమించారు. నాకు మాత్రం అంత గొప్పబుద్ధిలేదమ్మా! అది ఇక్కడకు వచ్చినా నేను రానిచ్చేదిలేదు. నా కడుపున అది చెడబుట్టింది. దీనికంతకు కారకురాలను నేను. కుక్కను తీసుకెళ్లి సింహాసనం మీద కూర్చోబెట్టినట్లు చేసాను. అందుకే ఇన్ని పాట్లుపడుతున్నాం'' అంటూ తననుతాను తిట్టుకొంది కాంతమ్మ.

పెరట్లోనుండి. వచ్చిన శర్మగారు విషయం తెలుసుకొని తోక తొక్కిన తాచులాగయ్యారు. ''చూడమ్మా! అది మీ తల్లికాదు మీ పాలిట రాక్షసి... డబ్బు, నగల పిచ్చి ఉన్న పిశాచి, అది మీ నాన్నగారి అలుసు చూసుకొని విజృంభించింది. దానికి నా గుమ్మం ఎక్కే ధైర్యం కూడానా! అది వస్తే జుత్తు పట్టుకొని బయటకు ఈడ్చేస్తాను'' అని కోపంగా అన్నారు.

''చంటిపిల్ల... దానివద్ద ఎందుకు ప్రదర్శిస్తారు మీ కోపం? మీ కూతురు కనబడినప్పుడే అనండి'' అంటూ సుమను కూర్చోపెట్టి ఉప్మా కాఫీ ఇచ్చింది కాంతమ్మ.

''ఇంట్లో అంతా నా కోసం చూస్తారు. నేనిప్పుడివేమీ తీసుకోను. వెళ్తాను అమ్మమ్మా'' అంటూ తొందర పడింది సుమ. చివరకు వాళ్ల బలవంతంమీద కాఫీ మాత్రం తీసుకొంది.

''చూడమ్మా! సుమా! చిన్న పిల్లలుగా ఉన్న మిమ్మల్ని మీ అన్నయ్య ఎంతో కష్టపడి పెంచాడు. మీ అన్నయ్య చేసిన త్యాగానికి మీరంతా ఋణపడి ఉండాలి. స్వంత అన్నదమ్ములే బాధ్యత వహించని ఈ రోజుల్లో మిమ్మల్నందరినీ కంటికి రెప్పలాగ కాపాడాడు. రత్నంలాంటి మనిషి మీ అన్నయ్య. అతనికి ఎందులోనూ తీసిపోని ఉత్తమ ఇల్లాలు మీ వదిన. ఏనాడూ మీ అన్నావదినలను కష్టపెట్ట కూడదు మీరు. అక్కలకు కూడా ఈ విషయం చెప్పు'' అంటూ హితబోధ చేశారు శర్మగారు.

తాతగారింటి వద్దనుండి వచ్చి అక్కడ వారన్న మాటలను పూసగుచ్చినట్లు చెప్పింది సుమ. తన గదిలో నుండి ఆ మాటలను వింటున్న సుందరి మొహం మాడిపోయింది.

''ఛీ! ఏం బ్రతుకు తనది? ఏం జన్మ తనది? చివరకు కన్నవారే తన ఉనికిని కూడా అసహ్యించుకొంటున్నారు. ఈ నాటికీ తనను నెత్తిన పెట్టుకొని, తను చేసిన తప్పులను

క్షమించి ఆదరిస్తున్నారు వీళ్లు వీళ్ల మంచి తనాన్ని తను భరించలేకపోతోంది. వాళ్లఛీత్కా రాన్నీ సహించలేకపోతోంది. ఈ పరిస్థితుల్లో ఏంచేయాలి తను? ప్రశ్నార్థంకంగానే మిగిలి పోయింది తనకు బ్రతుకు.

"అదేమిటి? ఏది ఏమైనా కన్నతల్లిదండ్రు లుకదా! కనీసం కడుపు తీపిలేదా? ఆమెను ఆదరించడం మాట అటుంచి... తను చేసిన తప్పుకు కృంగిపోతున్న ఆమెను... పదేపదే ఆమె చేసిన తప్పును ఎత్తిచూపి నిందించటం ఆశ్చర్యంగా ఉంది" అంటూ వాళ్లాడిన మాట లకు రుసరుసలాడింది మాధవి.

"ఏంచేస్తాం? ఒక్కొక్కరి తీరు ఒక్కొక్కలాగ ఉంటుంది. అందరి తత్వం ఒకేలా ఉంటే ప్రపంచం ఎలాగ? ఎవరి ధోరణి వారిది. ఒక చెట్టుకు కాసిన కాయలు ఒక్కలాగే ఉండవు. మనం లోకంలో దేనికీ ఆశ్చర్యపోనక్కరలేదు. కొందరు పిల్లల కోసం పరువు ప్రతిష్ఠలు వదులు కొంటే మరికొందరు పరువు ప్రతిష్ఠల కోసం పిల్లలను వదులుకొంటారు. దానికి మన మేమీ చెయ్యలేం మధూ!" అంటూ చెప్పింది సుమతి.

అర్థరాత్రి పూట దాహం వేసి మెలకువ వచ్చింది సుందరికి. రఘు, సుమతి మెల్లగా మాట్లాడు కొంటున్నారు. సుందరి వాళ్ల మాట లను శ్రద్ధగా ఆలకిస్తోంది. మాధవి పెళ్లి చేసుకో ననడానికి గల కారణాన్ని సుమతి రఘులు చర్చించుకొంటున్నారు.

"ఇంత మంచి మనసుగల మాధవి జీవితం ... అలా మోడుగా ఉండిపోతే ఎంతైనా బాధని పిస్తోంది. మీరైనా ఆమెను వివాహానికి సుము ఖత చూపేటట్లు మార్చాలి" అని సుమతి చెప్తోంది.

"లేదు సుమతీ! నేనెన్నో విధాల ప్రయ త్నించాను. మా స్కూలులో తెలుగు మాష్టారి అన్నగారొకరు ఇంజనీరుగా పనిచేస్తున్నారు. అతను మాధవిని ఏదో సందర్భంలో చూశారు. వారు మాధవిని చేసుకొంటానని నన్నడిగారు. ఆ సందర్భంలో నేను మాధవిని కదిపాను. తను ప్రేమించిన మనిషికంటె తనను ప్రే మించిన మనిషిని చేసుకొంటే జీవితం సుఖ మయమౌతుందని చెప్పాను. కానీ మాధవి సున్నితంగా తిరస్కరించింది. "రఘూ! నాపై గల అభిమానానికి నేను కృతజ్ఞురాలిని. నా జీవిత నౌకకు చుక్కానిని ఏర్పాటు చేయాలన్న నీ కోరిక నాకు తెలుసు. కానీ! తెలిసో తెలియకో నా మనసు పరాధీనమయ్యింది. అది యుక్తమై నదికాదని తేలింది. విధి నిర్ణయం అలా గుంది. నా మనసులో వేరొకరికి స్థానంలేదు" అంది మాధవి కృతనిశ్చయంతో. తన నిర్ణయా న్ని మార్చుకోదని నాకు తెలుసు. అందుచేత ఆ విషయం విడిచిపెట్టి వేరేమైనా మాట్లాడు" అని రఘు చెప్తున్నాడు.

సుందరికి ఆ మాటలు కొరడాతో ఛెళ్‌మని కొట్టినట్లనిపించింది. కేవలం తెలియక మన సు పారేసుకొన్నంత మాత్రాన తను పవిత్రంగా పెళ్లిచేసుకోకుండా నిలబడిన మాధవి ముందు అంతరాలు మరచి కామంతో కళ్లుమూసుకు పోయి ప్రవర్తించిన తను ఎందుకూ పనికిరా దు. ఆమె కాలిగోటికి కూడా తను పోలదు.

సుమతి, రఘుల సంభాషణలో తన ప్రసక్తి రావటంతో ఆలోచనలను ఆపి ఆసక్తిగా వినడం ప్రారంభించింది సుందరి.

"శాంత పెళ్లి త్వరలో చేసేద్దామనుకొంటు న్నాం కదా! పిన్ని యిక్కడే మన దగ్గరే ఉంది. మనం అర్థంచేసుకొని ఆదరించినా... బంధువు లు, స్నేహితులు ఆక్షేపిస్తారేమో... అందుకని అంకుల్ వాళ్ల పెళ్లి అన్నవరంలో చేద్దామంటు న్నారు. ఇంటి దగ్గర వద్దంటున్నారు. మరి నీ ఉద్దేశ్యమేమిటి?" అని సుమతిని అడిగాడు రఘు.

"శాంత మన యింటికి ఈ తరంకి పెద్ద ఆడపడుచు. ఆమె పెళ్లి మనం ఘనంగా చేస్తేనే బాగుంటుంది. ఎక్కడో కోవెలలో మూడు ముళ్లువేయించేస్తే ఎలా? మామయ్యగారి అభి ప్రాయమెలాగుందో?" మెల్లగా అంది సుమతి.

"నీవన్నదీ నిజమేకానీ నాకు మాత్రం చెల్లి పెళ్లి ఘనంగా చెయ్యాలని ఉండదా! కానీ పరిస్థితులు యిలా మారుతాయని

ఊహించామా? పిన్ని యిలా వస్తుందని మనం కలలో కూడా ఊహించలేదు. మళ్లీ ఇలాంటి సందిగ్ధ పరిస్థితి ఏర్పడింది. భగవంతుడు మనయందు ఉండి పావనిని కోడలిగా చేసుకోవడానికి మధుసూదనంగారు ముందుకొచ్చారు. చాలామంది మన సంబంధం చేసుకోవద్దని మాష్టార్ని వెనక్కి లాగుతున్నారు. మంచి పనికి ఎవరూ సహాయం చెయ్యరు కానీ అడ్డుపుల్లలు వెయ్యడానికి అందరూ సిద్ధమే. ఈ పిల్లలిద్దరి పెళ్లిళ్లయ్యి వాళ్లు ఒక యింటి వాళ్లయ్యే వరకూ నా మనసుకి కుదురులేదు'' అన్నాడు రఘు.

''మీరు అనవసరంగా ఆదుర్దాపడకండి జరగవల్సింది జరగక మానదు. మనం ఎవరికీ తెలిసి ఎటువంటి ద్రోహం చేయలేదు. కనుక మనకు మంచే జరుగుతుంది. మీరు మనస్సు ప్రశాంతంగా ఉంచుకొని హాయిగా పడుకోండి'' అంటూ ధైర్యం చెప్పింది సుమతి.



సుందరికి ఇంక ఆ రాత్రి నిద్దురపట్టలేదు. ఎంత అనాలోచితంగా తను ఈ ఇంటికి వచ్చింది. వచ్చింది వచ్చినట్లు వెళ్లిపోయిందా? జ్వరంవల్ల ఎక్కువ రోజులుండిపోవడం తటస్థించి వారి ప్రవర్తనకు ముగ్ధురాలై, తనలో క్రొత్త ఆశలు చిగురింప చేసుకొంది. ఆయనకు సేవచేసుకుంటూ, తన పాపాన్ని ప్రక్షాళన చేసుకొందామనుకొంది. తన శేషజీవితాన్ని రఘు చేతిలో ముగించుకొందామనుకొంది. తన స్వార్థం తప్ప పర్యవసానాల్ని ఆలోచించలేదు. తన ఉనికివల్ల వాళ్లకు కలగబోయే నష్టాన్ని ఊహించలేదు. పిల్లలకు పెళ్లిళ్లు కుదిరాయని మురిసిపోయిందేగాని... ఆ పెళ్లిళ్లకు తనే ఒక అవరోధమౌతానని ఊహించలేదు. తన కారణంగా వాళ్లు లేనిపోని అవస్థలకు గురికాకూడదు. వాళ్లను ఇంకా ఆపదలపాలు చేయకూడదు. ఇక్కడనుండి వెళ్లిపోవాలి.

ఎక్కడకు వెళ్లగలదు? వెనక్కి రెహమాన్ దగ్గరకు వెళ్లడానికి మనస్కరించడంలేదు. అతడికి తనని చూస్తే శృంగార పరమైన భావాలు, అనుమానాలు తప్ప వేరేం అభిప్రాయాలు కలగవు, అతడి కామాన్ని చల్లార్చే సాధనంగా చూస్తాడు తనని. ఎంతసేపూ తనని పంజరంలో పక్షిలాగ ఉంచాలని చూస్తాడు. అతని హింసా ప్రవృత్తిని తన శరీరం ఓర్చుకోలేకపోతోంది. అయితే తనకి అతనేలోటూ చేయలేదు. కావలసినన్ని చీరలు, నగలు ఇచ్చాడు. ఒక ఇల్లు కూడా కట్టించడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. పోనీ ఏ పిల్లవాడైనా కలుగుతాడేమో వాడిని చూసి బతుకుదామంటే రెహమాన్ హేళనగా నవ్వేవాడు. ''నీకు పిల్లలమీద కోరికా? ఆశ్చర్యంగా ఉందే! ముగ్గురి పిల్లల్ని కని... గాలికి వదిలేసి వచ్చావే! ఇంకా పిల్లలు కావాలా? నేను ఏనాడో ఆపరేషను చేయించుకొన్నాను గాబట్టి సరిపోయింది. లేకపోతే నా పిల్లల్ని కూడా నీ మొగుణ్ణి, పిల్లల్ని వదిలేసి వచ్చినట్లు... వదిలేసి ఎవడితోనో ఉడాయించేదానివి. నీకు ఒక నీతి అంటూ ఉందా?'' అంటూ హేళన చేసి ఎత్తిపొడిచేవాడు.

నిజానికి తను రెహమాన్‌కి రుణపడి ఉంది. అతనేగాని అలా అవహేళనచేసి ఎత్తిపొడవకపోతే ఏనాటికీ తను చేసిన తప్పు గురించి తను ఆలోచించేదికాదు. పరోక్షంగా అతనివల్ల తను సంస్కరింపబడింది.

తన జీవితంలో అడుగుపెట్టిన పురుషులిద్దరూ మంచివారే. తన మంచి తనంతో ఔదార్యంతో రామారావుగారు తనను క్షమించి చేరదీశారు. ఈనాటికీ పన్నెత్తి ఒక్కమాట కూడా అనలేదు. రెహమాన్ తన దురుసుతనంతో నిజాయితీగా మాట్లాడి తనలో ఉన్న లోపాల్ని విమర్శించడంద్వారా తనని తాను విమ





ర్శించుకొనేలా చేశాడు. ఇప్పుడైనా మించిపో యిందిలేదు. తను ఒక మంచి నిర్ణయం తీసుకోవాలి.

తనకి తనవారికి ఆ నిర్ణయంవల్ల సంతృప్తి కలగాలి. మేలు జరగాలి. ఈ సారైనా తను అవివేకంగా తప్పటడుగు వేయరాదు. సుందరి ఒక దృఢనిశ్చయానికి వచ్చింది.

తెల్లవారగానే గబగబా తెమలడం మొద లుపెట్టింది. చన్నీళ్ల స్నానం చేసింది. సుమ తిని అడిగి పసుపు తీసుకొని ముఖానికి నిండుగా రానుకొంది. దేవుడి గదిలో ... నిర్వికా రంగా, నిశ్చలంగా కూర్చొని దీపాలు వెలిగించి పూజ చేసుకొంది. ఆమె ప్రవరకు అందరూ విస్తుపోయారు.

రామారావుగారి పాదాలు స్పృశించింది. ఆయన చిరుమందహాసంతో దీవించారు. "ఈ రోజు నా చేతులతో మీకు అన్నం పెట్టాలని ఉంది. దయచేసి ఆ అవకాశం ఇస్తారా?" అని ఆయనను అడిగింది. ఆయన చిరునవ్వే ఆమెకు సమాధానమయ్యింది.

ఆమె స్వయంగా పిల్లలకు జడలు వేసింది. తనివితీరా వాళ్లను చూస్తూ కూర్చొంది. ఆమెను చూసి రఘు జాలిపడ్డాడు. "పాపం! ఎంతైనా కన్నతల్లి కదా! ప్రేమ ఉండ కుండా ఉంటుందా? ప్రేగుతెంచుకొని పుట్టిన పిల్లలను ఏ స్త్రీ ప్రేమించదు?" అను కుంటుంటే ఇప్పటికైనా ఆమెలో పరివర్తన రావటం అతనికి ఆనందం కలిగించింది.

రామారావుగారికి స్వయంగా తన చేతులతో అన్నం తినిపించింది. ఆయన మూతి కడుగు తూ "మిమ్మల్ని ఒక విషయం అడగాలను కొంటున్నాను" మెల్లిగా అంది సుందరి.

"అడుగు సుందరీ! నీకు ఆ హక్కు ఎప్పు డూ ఉంది" అన్నారు రామారావుగారు శాంత స్వరంతో.

"నేను దేవాలయంలాంటి ఈ ఇంటిని... దేవుడిలాంటి మిమ్ములను వదిలి వెళ్లిపోయా ను, మీకు తీరని ద్రోహం చేశాను. మీ పరువుకు తీరని నష్టం కలిగించాను. మీరు నన్ను ఎలా క్షమించగలిగారు? నామీద కోపంలేదా??" అని అడిగింది.

"పిచ్చిదానా! నేనూ మనిషినే. ఉప్పు, కారం తింటున్న వాడినే! మొదట్లో కోపం కలిగినా... అదంతా నా తప్పుగానే నాకు తోచింది. ఏంచె య్యగలం? అలా జరగాలని విధిలిఖితం. నువ్వు మాత్రం ఏం చేయగలవు? ఈ తప్పుకి నా బాధ్యత కూడా ఉంది" అన్నారు.

"మీరా!? నేను చేసిన తప్పుకి మీరు ఎలాగ బాధ్యులు? నేను కామాంధకారంతో... ధనమో హంతో ముళ్ల తోవలో వెళ్లాను. నేను చేసిన అకృత్యాలకు మీరెలా కారకులు?" అని ఆశ్చ ర్యంగా అడిగింది.

"అవును! నేనే కారకుణ్ణి. యజమాని సమర్థ వంతంగా కుటుంబాన్ని నడిపిస్తే... ఆ కుటుంబ సభ్యులు తప్పు తోవలో నడుస్తారా? నేను నీ ఎడల చూపిన ప్రేమలో ఎక్కడో లోపం ఉండేఉంటుంది. అందుకే నీవు నాకు దూర మయ్యావు. తగినంత శ్రద్ధ, ఉత్సాహం నేను చూపి ఉంటే ఇది ఇలా జరిగేది కాదేమో!" అన్నారు ప్రేమపూరితంగా.

"లేదులేదు... మీరు నన్ను అలక్ష్యం చెయ్య లేదు. మానవ రూపంలో ఉన్న దైవం మీరు. మీ భార్యగా జన్మించడం ఏ జన్మలోనో నేను చేసుకొన్న పుణ్యం. మీ ఔదార్యానికి నేను చేతు లెత్తి మొక్కుతున్నాను. మీవంటి ఉన్నతులవ ద్ద కనీసం నిలబడటానికి కూడా అర్హత లేనిదా న్ని. ఈ ఇంట్లో మరి నాకు స్థానంలేదు. నేనే దాన్ని చేజేతులా పోగొట్టుకొన్నాను" అంటూ భోరున ఏడుస్తూ ఆయన కాళ్లపై పడిపో యింది సుందరి. ఆమె దుఃఖానికి అంతులే దు. ఇన్నాళ్లుగా గూడుకట్టుకొని ఆమెను వేధించిన దుఃఖము గట్టుతెంచుకొని పారు తున్న ఏరులాగా ప్రవహించింది. తన పాపాని కి నిష్కృతి లేదని" కుమిలి కుమిలి ఏడవసా గింది.

నెమ్మదిగా ఆమె తల నిమురుతూ ఒకచే తితో లేవనెత్తారు రామారావుగారు. "సుందరీ! నీ మీద నాకేం కోపంలేదు. ఈ ఇంట్లో నీ స్థానానికి తిరుగూ లేదు. నువ్వు ఈ ఇంటికి యజమానురాలివి. నా పిల్లలకు తల్లివి. నా వంశాన్ని నిలిపినదానివి. నిజానికి నేను నీకు రుణపడిఉన్నాను. భగవంతుడు కరుణామ యుడు. జరిగిన పొరపాట్లు చక్కదిద్దబడడాని



కే నిన్ను నాకు మళ్లీ చూపించాడు. నా అశ్రద్ధవలన నీవు బాధలుపడ్డావు. పార్వతిని కోల్పోయిన నేను అసలు వివాహం చేసుకోకూడదు. కాని తప్పని పరిస్థితులలో తలవంచి చేసుకొన్నాను. పార్వతి మరణంతో బతుకులో ఆశలు కోల్పోయిన మోడులా మిగిలిన నేను పూలతీగ లాంటి నిన్ను అందుకొన్నా... కాని, పందిరిలా నీ జీవితాన్ని సంరక్షించలేకపోయాను. ఎక్కడ స్త్రీ గౌరవింపబడుతుందో అక్కడ దేవతలు కొలువు తీరి ఉంటారు. నిన్ను నేను సరిగ్గా అర్థంచేసుకొని గౌరవించలేకపోయానేమో! భర్తగా నా ధర్మాన్ని నిర్వహించలేదేమో! అందుకే భగవంతుడు నాకీ శిక్ష వేశాడు. ఇంకా ఏమూలో ఆయన కరుణ నా పట్ల ఉండబట్టే... జీవితాన్ని సాకల్యం చేసుకొనే అవకాశాన్ని నాకు కల్పించాడు.

తప్పులు చేయడం మానవ సహజం. కానీ ఆ తప్పులు తెలుసుకొని పశ్చాత్తాపపడటంవల్ల వారు పునీతులౌతారు. 'బుద్ధి కర్మానుసారిణి' అన్నారు. మన కర్మలననుసరించే మన బుద్ధి పరిగెడుతుంది. యిందులో నీ తప్పులేదు. అందుచేత ఈ ఇంట్లో, ఈ పిల్లల మీద నాకెంత అధికారం ఉందో నీకూ అంతే ఉంది. గతాన్ని ఒక పీడకలలాగ మరచిపోయి హాయిగా నిశ్చింతగా ఉండు'' అంటూ ఓదార్చారు.

అంతులేని దుఃఖంతో మండిపోతున్న ఆమె గుండెల మీద ఆయన చల్లని మాటలు పన్నీరు చిలికించినట్లయ్యింది. ఆమె హృదయం సేదతీరినట్లయ్యింది. వర్ణింపనలవి కాని ఆయన క్షమాగుణానికి మనసులోనే జోహార్లర్పించింది.

"ఏ మొహం పెట్టుకొని నేను యిక్కడ జీవించగలను? అగ్నిసాక్షిగా మీకు నీడగా ఉంటానని ప్రమాణంచేసిన నేను సగంలోనే మీ చేతిని వదిలేశాను. మీ విలువను గుర్తించలేక పరుగెట్టి పాలు త్రాగుదామనుకొన్నాను. మిమ్మల్ని అవమానాల పాలు, అనారోగ్యం పాలు చేశాను. ఇంక పిల్లల్ని ఏ అధికారంతో దగ్గరకు తీసుకోగలను? వాళ్లను కన్నానేగాని వారిని పెంచానా? మమకారం పంచానా? తల్లిగా వారి పట్ల నా బాధ్యతలు నిర్వహించానా? కొండంత మనస్సుతో, ఔదార్యంతో మీరు నన్ను క్షమించగలిగారు. కానీ పిల్లలు నన్ను క్షమించరు. పిల్లల దగ్గర తలదించుకొనే దయనీయ పరిస్థితి ఏ తల్లికీ రాకూడదు'' అంటూ ఆమె రోదిస్తుంటే ఆయనకు ఏమీ తోచలేదు. శాంతను పిలిచి చెల్లెళ్లను తీసుకురమ్మన్నారు.

శాంత వెళ్లి పావని, సుమలను వెంటపెట్టుకొని వచ్చింది. "చూడండమ్మా! మీ అమ్మ ఎలాగ బాధపడుతుందో... మీరు దూరమైనందుకు ఆమె ఎంత పరితపిస్తుందో... అమ్మా! శాంతా! నీవు అన్నీ తెలిసిన దానివి. నీకు ఏమీ చెప్పనవసరంలేదు. ఏ తల్లీ తన పిల్లలకు తాను దూరమవ్వదు. ఏదో బలీయమైన పరిస్థితులవల్ల మన ఇంట్లో ఈ దుర్ఘటన జరిగింది. దానిని సరిదిద్దుకొనే అవకాశం భగవంతుడు మనకు కల్పించాడు. మీ అమ్మను ఓదార్చు. మీ వల్లనే ఆమె సాంత్వనము పొందాలి. నీవు చెల్లెళ్లు ఆమెను ఊరడించండి'' అంటూ సుందరిని వాళ్లకు అప్పగించారు.

"రా అమ్మా! మనందరం కలసి భోజనం చేద్దాం. అనవసరంగా బాధపడవద్దు. నీ ఆరోగ్యం అసలే బాగాలేదు'' అంటూ ఆమెను వంట ఇంటి వైపు నడిపించుకువెళ్లింది శాంత.

సుమ, పావనిలను ఆర్తిగా చూస్తూ - "ఒక్కసారి మీరు నన్ను 'అమ్మా!' అని పిలవండి తల్లీ! మీ నోటివెంట ఆ పిలుపు కోసం పరితపిస్తున్నాను. ఎండమావుల వెంట పరుగెత్తి అలసిపోయాను. మీ పిలుపు నాకు వెయ్యి ఏనుగుల బలాన్నిస్తుంది'' అంటూ చేతులు చాపింది... ఏడుస్తూ.

రఘు సుమని సుందరికి దగ్గరగా తీసుకొని వచ్చాడు. "పిన్నీ! ఏమిటీ బేలతనం. నాన్నగారికి అసలే ఒంట్లోబాగాలేదు. నీవు కంటతడిపెట్టడం ఈ యింటికి క్షేమమా? తెలిసో తెలియకో మనం తప్పులు చెయ్యడం సహజం. నీ తప్పును నీవు తెలుసుకొని సరిదిద్దుకొన్నావు. నాన్నగారే నిన్ను క్షమించినప్పుడు మేం ఏపాటి? నీవు నిశ్చింతగా ఉండు. మీ కోడలు, నేను నీకు సపర్యలు చేస్తాం. చెల్లెళ్లను చూసు




కొంటూ హాయిగా కాలం గడుపు" అంటూ సున్నితంగా మందలించాడు.

ఆ రోజు సాయంత్రం సుమతి, మాధవి ఎంత వద్దని వారించినా వినకుండా తనే స్వయంగా వంటచేసింది. రామారావుగారికి, పిల్లలకూ స్వయంగా తన చేతులతోనే వడ్డించింది. ఆరోజు ఆమెకు చెప్పలేనంత ఆనందంగా ఉంది. ఏవో ఉన్నత శిఖరాలను అధిరోహించినంత ఆనందంగా ఉంది. ఎంతో తృప్తిగా ఆరోజు గడిపింది. ఆ రాత్రి అందరూ ఆనందంగా కబుర్లు చెప్పుకొంటూ పడుకొన్నారు.

ఉదయం యధాప్రకారం సుమతి ముందుగా లేచి తన పనులు ప్రారంభించింది. మొహం కడుక్కొని వచ్చిన పావని కాఫీ తాగడానికి వంటింట్లోనికి వచ్చింది.

"నీవెళ్లి అమ్మను లేపిరా... కాఫీ తాగుదువు గాని" అంది సుమతి.

పావని తిరిగొచ్చి "వదినా! అమ్మ గదిలో లేదు. తోటలోనికిగాని వెళ్లిందేమో!" అంది.

యిద్దరూ తోటలోకి వెళ్ళారు. ఆమె జాడలేదు. ఇంట్లో అంతటా కంగారుగా వెదికారు. ఆమె కనుపించలేదు. సుమతికి ఏదో అనుమానం వచ్చి, నూతిదగ్గరకు పరిగెత్తింది. నూతి దగ్గర ఆమెకు ఎటువంటి అలికిడిగాని. గుర్తులుగాని లేకపోవడంతో... నిరాధారమైన తన అనుమానానికి లోలోనే బాధపడింది. ఈ హడావిడికి యింట్లో అందరూ లేచి... విషయం తెలుసుకొని మళ్లీ ఒకసారి యిల్లంతా అణువణువూ వెతికారు. సుందరి నంచిగాని, డైరీకాని వాళ్లకు కనిపించలేదు. ఆమె ఏమైందా అని కంగారుపడుతోంటే రామారావుగారికి కూడా మెలకువ వచ్చింది.

"ఏమిట్రా! ఎందుకలా గాబరా పడుతున్నారు? ఏం జరిగింది?" అంటూ ఆయన కంగారు పడుతుంటే విషయం చెప్పక తప్పిందికాదు వాళ్లకు. ఆయన మొహం కళావిహీనమయ్యింది.

"రాత్రి మీ అమ్మ మీదగ్గరే పడుకొందా? ఒంటరిగా పడుకొందా? ఏమైనా మాట్లాడిందా? ఎక్కడికైనా వెళతానని సూచనగా చెప్పిందా?" అంటూ ప్రశ్నలవర్షం కురిపిస్తున్నారు రామారావుగారు కంగారుగా.

అంతలో పావని పరిగెత్తుకుంటూ వచ్చి "అన్నయ్యా! నీ గదిలో టేబుల్‌మీద ఈ ఉత్తరం ఉంది. బహుశా అమ్మ రాసిందే అయిఉండాలి" అంటూ రఘుకి అందించింది. రఘు ఆ ఉత్తరాన్ని ఆత్రుతగా విప్పాడు. అది సుందరి వ్రాసిన ఉత్తరమే. ఆ ఉత్తరాన్ని గట్టిగా చదవడం ప్రారంభించాడు. అందరూ ఆతృతగా వినడం మొదలుపెట్టారు.

"బాబూ రఘూ!

నీకు ఆశీస్సులు-

పిన్ని ఇంత ప్రేమగా వ్రాస్తోందేమిటని ఆశ్చర్యపోతున్నావా? నిజమే బాబూ! నిన్ను ఎప్పుడూ మనస్ఫూర్తిగా పిలవలేదు. ప్రేమగా ఆదరించలేదు. నిన్ను అనేక విధాల బాధించాను. నీ చదువు కూడా సరిగ్గా సాగకుండా చేశాను. నా పాపానికి నిష్కృతిలేదు. తల్లి లేని నిన్ను ఏనాడూ ప్రేమగా అక్కున చేర్చుకోలేదు. నీ లోటు తీర్చడానికి ప్రయత్నించలేదు. నన్ను మనసారా క్షమించు బాబూ!

మన కుటుంబాన్ని నా పాపకృత్యంతో నవ్వులపాలు చేశాను. ఏ స్త్రీ చెయ్యరాని తప్పు చేశాను. మీ నాన్నగారిని అవమానాలపాలు చేశాను. ఆయన కట్టిన తాళిని ఎగతాళి చేశాను. దాని ఫలితాన్ని సమాజంలో అడుగడుగునా ఎదుర్కోవలసి వచ్చిందిమీరు. మీ పురోగతికి తీరని అవరోధం కలిగింది. అయినా సహృదయతతో మీరు నన్ను క్షమించారు. నేను చేసిన తప్పుకు మరొకరైతే నన్ను పిచ్చికుక్కను తరిమినట్లు తరిమేవారు.

నువ్వు మీ నాన్నగారిలా ఉన్నత హృదయుడివి. నా పిల్లలను... నీ పిల్లలుగా పెంచి పెద్దచేశావు. అనురాగంతో వాళ్ల కోరికలు తీర్చావు. మీ నాన్నగారి కష్టసుఖాలు పంచుకొన్నావు. మీ నాన్నగారి గుణాలను పుణికిపుచ్చుకొన్నావు.

పూలతోటలాంటి ఈ ఇంటిని చిందరవందరచేసి నాశనం చేసినదాన్ని నేను.

నేను ఎడారిలా మార్చిన గృహాన్ని నీవు

నందనవనంలా మార్చి కళకళలాడేలా చేశావు. నీవు నీ పుత్రధర్మాన్ని నూరుపాళ్లూ నెరవేర్చావు. నీవు చేసిన సుహోపకారానికి నీకు నేను ఏమి యివ్వగలను? నూరేళ్లూ చల్లగా బతకాలనీ, పిల్లాపాపలతో, అష్టైశ్వర్యాలతో వర్ధిల్లాలని మనసారా ఆశీర్వదిస్తున్నాను.

మీ నాన్నగారు క్షమాగుణ సంపన్నులు, సహృదయులు. అందువలననే నా తప్పుని మన్నించి నన్ను దగ్గరకు తీసుకోగలిగారు. ఆయన నా పాలిట దైవం. ఆయన దగ్గర నిలబడటానికిగాని, కనీసం ఆయన నీడను తాకడానికి కూడా అర్హతలేని కళంకినిని నేను. అందుకే వెళ్లిపోతున్నాను.

నేను చేసిన తప్పును మీరంతా మన్నించినా ఈ లోకం మన్నించదు. ఏనాడైనా సరే ఈ లోకం నన్ను పతితగానే చూస్తుంది. కడివెడు పాలకుండలాంటి కుటుంబానికి నేను విషబిందువు కారాదు. మీరు ఎంతో విశాలహృదయంతో నన్ను ఆదరించి, మీలో కలుపుకొన్నారు. మానసికంగా... శారీరకంగా కృంగిపోయిన నన్ను కరుణతో ఆదరించి నాకు పునర్జన్మను ప్రసాదించారు. సామాన్యులు ప్రదర్శించలేని ప్రేమ, సానుభూతి, దయ నాపై మీరు వర్షించారు. మీ నాన్నగారిని... కన్నపిల్లలను చూడాలి. వారిని అక్కు చేర్చుకోవాలన్న నా ప్రగాఢ కోరికను తీర్చారు. మీ మధ్య గడిపిన ఆ మధురమైన వెలకట్టలేని కొద్ది దినాలు... ఈ జీవితానికి చాలు.

నాన్నగారి గురించికాని, చెల్లెళ్ల గురించి కాని నాకు యిప్పుడు బెంగలేదు. నువ్వు వాళ్లను కంటికి రెప్పలాగ కాపాడతావు. నా ఉనికివల్ల మీ ప్రశాంత జీవితాలలో... రేగబోయే కల్లోలం... అపశృతి... నేను చాలా దూరంగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. వారి పెళ్లిళ్లు నిరాటంగా సాగాలంటే... నేను మీ జీవితాలనుండి నిష్క్రమింపక తప్పదు. మనసును రాయి చేసుకొని, వెళుతున్నాను. ఈ సంసారాన్ని విడిచిపోడానికి బాధగానే ఉంది... అమృత హృదయులైన నాన్నగారికి సేవచేసుకొనే భాగ్యం నాకిక లేదు. మళ్లీ జన్మంటూ ఉంటే కడదాకా, ఆయన సేవకు దూరం కాని, భార్యగా పుట్టే అవకాశం యివ్వమని భగవంతుని ప్రార్థిస్తున్నాను. ఆయన పాదపద్మాలకు నా హృదయపూర్వక నమస్కారాలు తెలియజెయ్యి.

నేను చావడానికి వెళ్లడంలేదు. కానీ పూర్వపు పాపభూయిష్టమైన జీవితానికి కూడా వెళ్లటం లేదు. మీ అందరి క్షమాగుణంతో... నా జీవన సరళి మారిపోయింది. మీకు దూరంగా... నా ఉనికి మీరు తెలుసుకోలేనంత దూరంగా వెళ్లిపోతున్నాను. ఇంతకాలం ఈ జీవితాన్ని వృధాగా గడిపాను. మీవలన నాకు జ్ఞానోదయం అయ్యింది. నా శేషజీవితాన్ని ఏ అనాధలకో, వికలాంగులకో సేవ చేయడానికి అంకితం చేస్తాను. నేను చేసిన పాపాన్ని ఆ విధంగానైనా ప్రక్షాళన చేసుకొంటాను.

నాది చివరిగా ఒక్క కోరిక. నీవు తప్పక తీర్చాలి. అధికారంతో ఈ కోరికను కోరే అర్హతను కోల్పోయాను. ఆర్తితో కోరుతున్నాను. నీవు ఆ కోరిక తప్పక తీరుస్తావన్న ఆశ నాలో జీవించే ఉంటుంది. అది ఏమిటంటే... నా చివరి శ్వాస నీ వడిలో వదలాలి. నీ స్వహస్తాలతో నన్ను అంతిమ యాత్రకు పంపాలి. నా చివరి రోజులలో నా ఉనికి నీకు తప్పక తెలియజేస్తాను. అంతవరకూ నీకు కనిపించను. నా చివరి కోరిక తప్పక తీరుస్తావు కదూ! అమ్మగా నేను నీకేమీ చేయలేకపోయినా... నా కొడుకుగా నీవు తప్పక నా కోరిక మన్నిస్తావని నా నమ్మకం. సుమతి నీకు తగిన ఉత్తమ ఇల్లాలు. ఆమె సహచర్యంలో నీ జీవితం నందనవనమౌతుంది. చి॥ మాధవికి నా ఆశీస్సులని చెప్పు. ఆమె ఉన్నత సంస్కారానికి నేను గర్వపడుతున్నాను. నా చిట్టి తల్లులందరికీ ఆశీస్సులని చెప్పు. మీ మధ్య అనురాగంతో కొన్ని రోజులు గడపనిచ్చినందుకు... నా తపనను చల్లార్చిన మీ క్షమాగుణానికి పదే... పదే కృతజ్ఞతలు తెలియజేయటంతప్ప మరేమీ చేయలేనిదానను. నన్ను మీరంతా మన్నించండి.

ప్రేమతో...
మీ అమ్మ... సుందరి

ఉత్తరం చదివిన రఘు కంఠం దుఃఖంతో మూగపోయింది. రామారావుగారు ఒక్కసారిగా కుప్పకూలిపోయారు.








# 'మనీషి'పై చతుర సమీక్షలు

> ఆగస్టు నెల 'చతుర'లో ప్రచురితమైన పి. చంద్రశేఖర అజాద్ నవల 'మనీషి'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## మనీషులెందరు...?

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

శ్రీచంద్రశేఖర్ అజాద్‌గారి నవల 'మనీషి' చాలాకాలం తరువాత మనస్సుకి తృప్తి కలిగించిన మంచి నవల.

అతి సాధారణ మానవుడిలోంచి, 'మనీషి'ని ఎత్తి చూపిన నవల. నిజంగానే మన చుట్టూవున్న మనుమల్లో 'మనీషి'లు ఎంతమంది వున్నారు. ఆలోచించటానికైనా సమయంలేనంత వేగంగా బ్రతుకుతున్నాడీనాటి మానవుడు. ప్రతి నిముషం సమస్యలతో, అనారోగ్యంతో, ఆర్థిక ఇబ్బందులతో పలురకాలుగా బాధింపబడుతున్న మనం మనశ్శాంతి కోసం, ఎక్కడికో పరుగెత్తుతున్నాము. ఏ బాబాలనో ఆశ్రయిస్తున్నాము. ఏ గుళ్లల్లోనో పూజలు చేస్తున్నాము తప్పితే, భూషయ్యలాగా తన వృత్తిని, తన సాటిమనిషిని ప్రేమించుదామన్న ఆలోచన గానీ, కనీసం, పక్కవాడి గురించి వాడి వివరాలు అడిగి తెలుసుకుందామన్న సంగతే పట్టించుకోవటంలేదు.

''మీలాగా మేం కూడా, మట్టి పినుక్కు బ్రతకాలా!'' అన్న ధోరణిలోనే చాలామంది పల్లెలు విడిచి పట్నాలు వచ్చేస్తున్నారు. సాంబయ్య చేసిన పనీ అదే అయినా అతడు తనుకోల్పోయిందేమిటో తన తండ్రి పొందే తృప్తేమిటో చివరికైనా గ్రహించాడు, కానీ తండ్రిని సుఖపెట్టాలని, ఆయన జీవితంలో మార్పు తేవాలన్న ఆరాటంతో, తండ్రిని బలవంతంగా హైదరాబాద్ రప్పించాడు.

అదే అతను చేసిన తప్పు. నిజానికది తప్పంటానిక్కూడా వీల్లేదు. అందరు కొడుకుల్లాగే తనూ, తండ్రి కూపస్తమండూకంగదా! పెద్దపట్నం చూపించి సంతోషపెడదామనుకున్నాడు. భూషయ్య ఒక మునీశ్వరుడులాగా, తన వృత్తే మహామంత్రంలాగా భావించే వ్యక్తి అవటం వల్ల, అతనికి హైదరాబాద్ సందర్శన సంతోషం కలిగించలేదు, పైగా విపరీతమైన వేదనకి గురిచేసింది. వేదనతో తనా ఊళ్లో చావకూడదనుకున్నాడు. అదీ తనకోసం కాదు. ''ఇక్కడ నేను సచ్చిపోతే తులసమ్మ లేదుగా? మా ఊళ్ళో మా అక్క, వదినలు ఉన్నారు. ఆల్లందరూ కడసారి చూసుకోవద్దూ'' అంటాడు. కంపు కొడుతున్న ఈనాటి సమాజానికి కావలసింది భూషయ్యలాంటివాళ్ళే. సొదితో పేజీలకి పేజీలు నింపుతున్న ఈనాటి సాహిత్యంలో, ఒక మంచి పరిశీలనగా, మానవుడికి కావలసిందేమిటీ? పోగొట్టుకుంటున్నది ఏమిటి? అన్న జిజ్ఞాస రేకెత్తిస్తూ, ఆజాద్‌గారు మంచి నవల వ్రాయగా దాన్ని ప్రచురించి 'చతుర' తన గొప్పదనాన్ని, సమాజం పట్ల ప్రచురణ కర్తలకుండవలసిన కనీస ధర్మాన్ని మరోసారి గుర్తుచేసింది. నవలలో వర్ణన కొంత

ఎక్కువగావున్నా కథా వస్తువు గొప్పతనం ముందు అదేమంత పట్టించుకోదగినదికాదు.

-దిట్టకవి శేషగిరిరావు,
ఈదుల మద్దాలి-521 148.

## ఉన్నత విలువల దర్పణం

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

'కృషివుంటే మనుషులు ఋషులవుతారు, మహాపురుషులవుతారు' అన్న మాట అక్షరాలా సత్యం. మనిషి మనీషి కావటానికి ఈ మానవతా కృషి తరతరాలుగా భారతదేశంలో కొనసాగి నేడది బుగ్గి అయిపోయింది. మనిషి 'మనీ+షి' అనే వాటికి దాసుడైపోయి సదా దానవతా కృషిలో సాగిపోతున్నాడు. రాక్షసులు కూడా సిగ్గుపడేలా జనమారణహోమాలు చేస్తూ కులమత మౌఢ్య జ్వాలల్లో దేశాన్ని భస్మీపటలం చేస్తున్నాడు. అతడికి నిష్కృతి యేమిటి? ఎక్కడ?

తలలంటూ వుండి ఆలోచించగలిగిన ప్రతివారికీ ఒక చక్కని ప్రశ్నార్థకంగా నిలచిన ఉత్తమోన్నత విలువల ప్రతీక ఆగష్టు 'చతుర' నవలా దర్పణం 'మనీషి'. 'చతుర' నవలా ప్రచురణలలో ఇదొక మకుటాయమానమైన మణిరత్నమని చెప్పవచ్చు.

ఇందులో పాత్రలన్నీ మన చుట్టూ తిరుగుతున్న సజీవ వ్యక్తులే. భూషయ్యవంటి ఉదాత్త నాయక పాత్ర మాత్రం నేటి భారతంలో కానరాదు. 'మహాత్ముడు మళ్లీపుడితే' అని కొందరు వేసుకునే ప్రశ్నకు భూషయ్య మానసిక మరణం చక్కని, చిక్కని జవాబు.

పల్లెటూర్లో కడుపులో చల్ల కదలకుండా మానవతకు ప్రతిరూపుగా నిరంతరం ప్రవర్తించే పేదరైతు భూషయ్య. జీవన ప్రస్థానంతో నవల ప్రారంభమై, వర్తమాన వికృత దానవ వ్యవస్థకు క్షోభించి తపనపొంది, తాళలేక మహాప్రస్థానంచేసిన ఆయన అంతంతో నవల పూర్తవుతుంది.

అన్నీ మంచి పాత్రలున్న ఈ నవలలో దుష్టశక్తులేమిటి? అన్న ప్రశ్నకు అజ్ఞాతంగావున్న నగర వికృత శక్తుల పైనలకమ్ముడుపోయిన పాశవిక ప్రవృత్తులే. గత సంవత్సరంలో హైదరాబాదు నగర జీవితాన్ని అతలాకుతలంచేసిన అమానుష మతకల్లోలాల విచ్చుకత్తుల తళతళలను రచయిత ప్రత్యక్ష దర్శనం చేయించారు. తండ్రిని గ్రామానికి తీసుకువెళ్లలేని సాంబయ్య నోటినుండి వెలువడిన "అప్పుడు బిడ్డను కోల్పోయిన తండ్రిని, ఇప్పుడు తండ్రిని కోల్పోయిన బిడ్డను" అని నిస్సహాయతను ప్రకటించటం, గంగాధర్ ఆదుకోవటం పాఠకులకు కళ్లు చెమ్మగిల్లేలా చేస్తుంది.

పటిష్టమైన భాష, పదునైన భావ సంపదతో గ్రామీణ, నగర జీవనాల వైమనస్యాలకు అద్దంపట్టిన 'మనీషి' నవల పాఠకుల మనోనేత్రానికి వసందయిన కమ్మని విందు అనేది నిస్సందేహం. సామాజిక స్పృహ సర్వేసర్వత్ర గలిగిన రచయిత చంద్రశేఖర్ అజాద్ సర్వదా అభినందనీయులు.

-ఎస్.జ్ఞానేశ్వరి,
ఖమ్మం -507003.

## మనీషి కొడుకూ మనీషే

*(మూడవ బహుమతి రు: 50/-పొందిన సమీక్ష)*

"అందులో ఘర్షణల గురించి లేదు. అది సస్పెన్స్ థ్రిల్లర్ కాదు. అయినా తన్ను ఆసాంతం చదివింపచేసింది. అందులో తనకు తెలిసిన జీవితమూ, తెలుసుకోవాల్సిన తత్వశాస్త్రమూ ఉందనిపించింది. పూర్తిగా చదివేంతవరకూ నన్నది విడిచిపెట్టలేదు... నిజంగా బాధపడి, తపించి చేసిన రచన అది."అని ఇంకేదో పుస్తకం గురించి రచయిత చంద్రశేఖర ఆజాద్ తన నవలలో ఒక పాత్ర ద్వారా చేసిన వ్యాఖ్య "మనీషి" నవలకి కూడా వర్తిస్తుంది.

కథావస్తువు చిన్నదే- కర్ఫ్యూ సమయంలో తండ్రి శవాన్ని కొడుకు నగరంనుంచి గ్రామానికి తరలించడం, అంత్యక్రియ జరిపించడం. దీని పూర్వాపరాల వివరణే ఈ నవలకు ఇతివృత్తం. అయితే ఇది కేవలం తండ్రీ కొడుకుల అనుబంధాన్ని సూచించే ముఖ్య





సంఘటనలతో కూడినదే కాదు. ఇందులో తరాలమధ్య అంతరం, నగరానికీ, గ్రామానికీ మధ్య అంతరం, పూర్వ సామాజిక సంస్కృతికీ, ఆధునిక జీవన సరళికీ మధ్య అంతరం-వంటి ముఖ్యసమస్యలతో కూడిన మానవజీవితాన్ని మానసిక, సామాజిక, రాజకీయ, ఆర్థిక కోణాల్లో పరిశీలించారు రచయిత.

విస్తృతమైన పరిశీలన, ప్రగాఢమైన అవగాహన, విపరీతమైన ఆవేదన, ఆత్రుత ఉండటంవల్ల రచయిత ఈ చిన్న నవలలో ఎన్నో జీవిత సత్యాలను విశ్లేషించారు. ఆ కారణంవల్లనూ, మధ్య మధ్య "ఫ్లాష్‌బాక్స్" ప్రవేశపెట్టినందువల్లనూ కథ చకచకా సాగినట్లనిపించదు. కానీ, రచయిత అభిప్రాయాలు ఆలోచనలు రేకెత్తించేవిగా ఉండటంవల్ల రచన ఆసక్తికరంగా ఉంది. ప్రయోజనదాయకంగా కూడా వుంది. ఇది ఇతరులచేత చదివింపజేయదగిన నవల.

-నాగమల్లీశ్వరరావు,
హైదరాబాద్-500 044

## ఉత్తమ వ్యక్తిత్వం

*(నాలుగవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

**తె**లుగు సాహిత్యంలో మొదట్నించీ కరువైన 'తెలుగుదనం' ఈ నవలలో పుష్కలంగా వుంది. స్వచ్ఛమైన తెలుగు నేలపై, మధ్యాంధ్ర మాండలికభాషలో సాగిన సహజమైన సంభాషణలతో, తెలుగువారి కుటుంబజీవనాన్ని చక్కగా చూపించారు. ముఖ్యంగా భూషయ్య తులసమ్మ దంపతులు తమ బిడ్డ నిద్రపోయాక తీరుబడిగా కుటుంబవిషయాలు చర్చించుకోవటం, అవి అప్పుడప్పుడు వాళ్ల కొడుకు వినటం- ఇది తెలుగువారి సంప్రదాయంలో కనిపించే ఓ ప్రత్యేకమైన అంశం. తెలుగుఊళ్లు, తెలుగువాళ్లు నిండి ఉన్న 'మనీషి' నగరాల హోరుతో వినుగెత్తిపోయిన పాఠకులకి ఉల్లాసాన్ని కలిగించగలదు. కుట్రలు, కుతంత్రాలు, రాజకీయాలు, వర్గ, వర్గవ్యత్యాసాలతో పెరిగే మారణహోమాలు ప్రజ్వరిల్లుతున్న నేటి పల్లెటూళ్లకి ఈ నవలలోని పల్లెటూరు ఆదర్శం కాగలదు.

"మనీషి" నవల రాయటానికి ప్రేరణ నా చిరకాల మిత్రుడు శ్రీ శశికాంత్ శాతకర్ణి కవిత "చిరిగిన లాల్చీ" ఆత్మీయ మిత్రుడైన ఈ కవికి నా నవల "మనీషి" ఓ జ్ఞాపికగా అంకితం చేస్తున్నాను.

**- పి.చంద్రశేఖర ఆజాద్**

భూషయ్య 'మనీషి' కావటానికి కారణం-మిగతా మనుషుల్లో వచ్చిన పెనుమార్పు. ఆయన కాలంతోపాటు మారాడుకాని చెడిపోలేదు. అందువల్లనే ఆయనలో గేదె పడే ప్రసవవేదనకి చలించిపోయే మృదులమనస్తత్వం-అడవుల్లో స్వేచ్ఛగా తిరిగే వన్యమృగాలు, నగరాల కలుషిత వాతావరణంలో ప్రజలకి వినోదవస్తువులుగా మారినందుకు జాలి కనిపిస్తుంది. వీటితోపాటు 'ప్రేమవివాహాల్ని' సమర్థించే విశాలదృక్పథం కూడా ఆ పాత్ర విశిష్టతని మరింత పెంచింది. పల్లెటూళ్లలో ఎప్పుడో, ఎక్కడో కనిపించే ఒక సజీవమైన మూర్తి 'భూషయ్య'లో గ్రామాలతో ఏ కాస్త పరిచయమున్న పాఠకుడికైనా కనిపిస్తుంది. భూషయ్య పాటించే క్రమశిక్షణ, ఉన్నత నైతిక విలువలు, లేనిపోని ఆర్భాటాలపట్లా,భేషజాల పట్లా నిరాసక్తత అందరికీ ఆదర్శం కావాలని, కర్మాగాల నీలినీడల్లో బిక్కుబిక్కుమంటూ బతికే దుస్థితి ప్రజలందరికీ పోవాలని ఒక ప్రత్యేక శైలిలో సున్నితంగా పాఠకుల్ని కదిలించిన చంద్రశేఖర ఆజాద్ తెలుగు నవలా సాహిత్యంలో ఉన్నత స్థానాన్ని ఆక్రమించగలరని, ప్రచురించిన 'చతుర' చిరంజీవి కాగలదని ఆశిద్దాం!

-సి.ఎ.బాబు,
తిరుపతి-517 502.

## మానవతా మహాయజ్ఞం

*(అయిదవ బహుమతి రూ.25/- పొందిన సమీక్ష)*

**మా**నవత్వపు విలువలు పూర్తిగా అడుగంటిన ప్రస్తుత సమాజానికి కిలెరిగి వాతపెట్టిన వైద్యు

లు 'మనీషి' రచయిత చంద్రశేఖర అజాద్‌గారు. మనుష్యార్థమైన తత్వాన్ని విశ్లేషించి పశువులకు సైతం మానవత్వాన్ని ఆపాదించగలిగిన తత్త్వజ్ఞానాన్ని అందించిన 'చతుర' ప్రయత్నం అభినందనీయం. భూషయ్య మొదలుకొని నవలలోని ప్రతిపాత్రా తమకంటూ ఒక ప్రయోజనాన్ని సంతరించుకున్నాయి. భూషయ్య జీవితంలోని ప్రతి క్షణమూ చివరికి మరణమూ, తర్వాతి సంఘటనలూ కూడా పాఠకుడికి నేర్పుకోదగిన పాఠాలే!

భూషయ్య నగరపు కలుషిత నాగరిక ప్రపంచానికి దూరంగా పల్లెలో పుట్టిపెరిగిన అతి సామాన్యుడైన భూమి పుత్రుడు. ఐనా ఆయనలోని వివేచన, భావాభ్యుదయం, విశాల దృక్పథం, విద్యాధికులైన నవనాగరికుల్లో సైతం అరుదు అన్నది నిస్సందేహం. నాగరికపు హిపోక్రసీతో కూడిన కృత్రిమ జీవనం కన్న మనిషి మనిషిగా బ్రతకడంలోని మాన్యతకు సజీవ దృష్టాంతం భూషయ్య జీవితం. ఆయన వేషభాషల ద్వారా మధ్యతరగతిని పీడిస్తున్న ఫాల్స్ ప్రిస్టేజిని సున్నితంగా విమర్శించారు రచయిత. మన చుట్టూ ఉన్న ప్రాణుల్ని సమదృష్టితో ప్రేమించడం వల్ల మనిషిపోగొట్టుకునే దానికన్నా పొందే తృప్తి ఆదరణ అమూల్యమైనవి. చిన్నతనంలో తండ్రిని వ్యతిరేకించిన సాంబయ్య, తాతను విమర్శించిన స్వప్న తర్వాత ఆయనపట్ల తమ వైఖరి మార్చుకోవడం రచయితలోని ఆశావాదాన్ని సంఘంలో వాంఛనీయమైన మౌలిక మార్పును సూచిస్తుంది.

చాలాకాలానికి బహుకాలం గుర్తుండే సాంఘిక, సాహిత్య ప్రయోజనం గల రచన చదివిన సంతృప్తిని మిగిల్చిన అజాద్‌గారికి, 'చతుర'కు ధన్యవాదాలు. ఈ రచన ద్వారా కొంతైనా స్పందించి ఆత్మ పరిశీలనతో తమలోని మనిషిని చైతన్యవంతం చేయగలిగిననాడు ప్రతి మనిషీ భూషయ్యకాగలడు. మహా మనీషి కాగలడు.

-భారతి,
రామగుండం-505215.

## మనీషి

**(ఆరవ బహుమతి రూ.25/- పొందిన సమీక్ష)**

పి.చంద్రశేఖర అజాద్‌గారి 'మనీషి' చదువుతున్నంతసేపు మరో 'మహాత్ముని' జీవితగాథ చదువుతున్న అనుభూతి కలిగింది. మోసం, కుళ్లుతో కలుషితమైపోయిన ఈ స్వార్థపూరిత సమాజంలో భూషయ్యలాంటి మహా మనీషి ఉనికి ఇంకా పూర్తిగా చచ్చిపోని మానవత్వానికి ప్రతీక. ప్రేమ, నిరాడంబరత, ఆప్యాయతలకి ఆలవాలమైన పల్లెటూరిలో పుట్టి పెరిగిన భూషయ్యని తాను కరిగిపోతూ లోకానికి వెలుగిచ్చే కొవ్వొత్తిలా, ప్రతి జీవి బాధలకి స్పందించే సున్నితమైన మనస్సున్న మంచి మనిషిలా అద్భుతంగా చిత్రించారు రచయిత.

పుట్టబోయేది ఆడపిల్లని తెలిస్తే గర్భవిచ్ఛిత్తి చేయించుకుంటున్న సమాజంలో ఓ గేదె ప్రసవవేదనను దానికి తోడుగా అనుభవించే వ్యక్తి మహాత్ముడు కాక మరేమవుతాడు! తను వేసుకోబోయే లాల్చీని నేసిన చేతుల కష్టాన్ని అంచనా వేసే భూషయ్యలాంటి నిరంతర శ్రామికుని మనస్తత్వం, ఉన్నతమైన ఆలోచనలు చిత్రించటం ద్వారా రచయిత నేటి యువతకి సరైన మార్గం నిర్దేశించారనిపిస్తుంది. ఈ నవల చదివేవారికి భూషయ్య తమకే సంబంధించిన వ్యక్తిలా కనుపించి అతని నిష్క్రమణకి హృదయాలు భారమయ్యేలా హృద్యంగా వర్ణించారు రచయిత. రాను రాను అగాధాల అంచుల్లోకి పయనిస్తున్న మన సమాజాన్ని రక్షించి సరైన దారిలో నడిపించడానికి మరి కొందరు భూషయ్యలు ఉద్భవిస్తే ఎంత బావుణ్ను అనిపించింది. మొత్తానికి ఇంత మంచి నవలను రాసిన రచయిత, ప్రచురించిన 'చతుర', చదివిన పాఠకులు ధన్యులు. ఈ నవల ద్వారా రచయిత ఆశించిన ప్రయోజనం నెరవేరి మనుమలంతా భూషయ్యలుగా మారితే అంతకన్నా సంతోషకరమైన విషయం మరోటుండదు.

-ఎ.రాధాశ్రీనివాస్,
కోదాడ-508206.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428 Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur-22977

CHATURA Telugu Monthly, Hyderabad-500 004 Regd No. H